# కుంతకుని
# వక్రోక్తిజీవితము

(బాలానందిని అను తెలుగు వ్యాఖ్యతో)


వ్యాఖ్యా రచయిత :

డా. పుల్లెల శ్రీరామచంద్రుడు





సాహిత్య అకాదెమీ

న్యూ ఢిల్లీ

VAKROKTI JIVITAMU—by Kuntaka, with 'Balanandini' a Telugu commentary by Dr. Pullela Sri Ramachandrudu, Sahitya Akademi, New Delhi, 1977. Price Rs. 30-00



*First edition : 1977*



Copies available from :
SAHITYA AKADEMI
Rabindra Bhavan, New Delhi-1
*Regional Offices*:
Madras-6, Calcutta-29, & Bombay-14.



వెల రూ.: 30-00

Printed at :

Dakshina Bharat Press, Khairatabad, Hyderabad-500 004.

श्रीः

श्रीमदल्लाडिवंशाब्धिरत्नाय न्यायमूर्तये ।
कुप्पुस्वाम्यार्यसुधिये कृतिरेषा समर्प्यते ॥

**DEDICATED**

*to*

*Justice Sri Alladi Kuppuswami*

*Who is a fine example for the Socratic dictum for a Judge*

"Hearing courteously, answering wisely, considering soberly and deciding impartially"

*and who is*

A great lover of Sanskrit.

సీ. అల్లాడి కృష్ణస్వామ్యార్యు సత్సుతుడవై
తద్యశః స్తంభతన్ దాల్చినావు
న్యాయశాస్త్రముతోడ నాంగ్లాంధ్ర గీర్వాణ
భాషల పాండితిన్ బడసినావు
ఎల్లరు ప్రతివాదు లల్లాడి పోవంగ
న్యాయవాదిత్వంబు నడపినావు
న్యాయైకమతి యంచు నయవిదుల్ మెచ్చంగ
న్యాయాధిపతి పదం బందినావు

అఖిల సుగుణాలవాల! ఓ! అమల కీర్తి!
కుప్పుస్వామ్యార్య నీకిదే యొప్పు మీర
అంకితము చేయుచున్నాడ-నాంధ్రభాష
నలరు వక్రోక్తిజీవితం బందికొనుము.

పుల్లెల శ్రీరామచంద్రుడు.
ఆంధ్రానువాద-వ్యాఖ్యా రచయిత

శ్రీః

# ప్రస్తావన

ఎందరో ఉత్తములైన ఆలంకారిక శేఖరుల కాకరమగు కాశ్మీరదేశమును అలంకరించిన సాహిత్యవిమర్శకాగ్రేసరు డగు కుంతకుడు రచించినది ఈ వక్రోక్తి జీవితము. కుంతకునకు కుంతలకుడు అను నామాంతరము గూడ కలదు. ఈతడు ప్రతిపాదించిన వక్రతా సిద్ధాంతమును బట్టి ఈతనికి 'కుంతలకుడు' లేదా 'కుంతకుడు' అను నామములు ప్రసిద్ధికి వచ్చియుండును. ఈతని అసలు పేరు వేరేదియో యై యుండవలెను. ఈతడు వక్రోక్తి జీవితమును రచించెననెడు విషయము తరువాతి వారి గ్రంథములద్వారా తెలియుటయే గాని చాల కాలము వరకు ఆ గ్రంథము లభ్యము కాలేదు. 1922 ప్రాంతములో మద్రాసు ప్రాచ్య పుస్తక భాండా గారమున లభించిన, అవపాఠ-పాఠలోపాది భూయిష్ఠ మగు ఒక లిఖిత ప్రతిని ఆధారముగ గాని శ్రీ S. K. దే వక్రోక్తి జీవితము మొదటి రెండు ఉన్మేషములు మాత్రము ప్రకటించిరి. పిమ్మట 1926 ప్రాంతమున జెసల్మెర్ జైన భాండాగారమున మరియొక ప్రతి గూడ లభించినది. ఇది గూడ లోపభూయిష్ఠమే యైనను దాని సాయముతో ప్రథమ ద్వితీయోన్మేషముల లోని కొన్ని స్థలములను పరిశోధించుటకు వీలుకల్గుటచే శ్రీ దే మరల ఒక గ్రంథమును సంపాదించినారు. ఇందులో తృతీయోన్మేషము మధ్య భాగము వరకు పాఠములు కొంతవరకు బాగుగ నున్నవి. తృతీయోన్మేషము మిగిలిన భాగము, చతుర్థోన్మేషము గూడ, ఈ ప్రతిలో గూడ త్రుటితములై యుండుటచే శ్రీ దే మద్రాసు ప్రతినుండియే లభ్య మగు గ్రంథ ఖండములను కూర్చి RESUME (iii UNMESA), RESUME (IV UNEMSA) అను పేర్లతోసంపాదించిరెండవ ముద్రణములో చేర్చినారు.

కుంతకుడు చెప్పదలచిన విషయము లన్నియు చతుర్థోన్మేషముతో పూర్తి యైనవి గాన ఈ గ్రంథములో మొత్తము నాలుగు ఉన్మేషములే ఉండి యుండ వలె ననియు, కొందరు భావించి నట్లు ఐదు ఉన్మేషము లుండెడి వని

తలంప పని లేదనియు, చతుర్థోన్మేషములోని చివరి రెండు మూడు పత్రములు మాత్రమే నష్టములైయుండు ననియు శ్రీ దే గారి అభిప్రాయము. ఇది యుక్తమే అని తోచుచున్నది.

వక్రోక్తి జీవితము కారికా-వృత్తి - ఉదాహరణరూపము. కారికావృత్తులు రెండును కుంతక విరచితములు. ఉదాహరణములు పూర్వప్రబంధముల నుండి సేకరించినవి. కారికా భాగమునకు కుంతకుడు కావ్యాలంకార మని నామధేయ మిడి నట్లు— 'కావ్యస్యాయ మలంకారః కోఽప్యపూర్వో విధీయతే' అను ప్రథమోన్మేష ద్వితీయ కారికవలన తెలియుచున్నది. మొత్తము గ్రంథమునకు నామధేయము వక్రోక్తి జీవిత మని అనంతరాలంకారికుల గ్రంథములనుండి తెలియుచున్నది. ప్రథమోన్మేషాంతమున— 'ఇతి రాజానక కుంతల(క) విరచితే వక్రోక్తి జీవితే కావ్యాలంకారే ప్రథమోన్మేషః' అనియు, ద్వితీయోన్మేషాంత మున-'ఇతి శ్రీ కున్తల విరచితే వక్రోక్తి జీవితే ద్వితీయ ఉన్మేషః' అనియు, పుష్పికలలో గూడ వక్రోక్తి జీవితాభి ధానమే కనబడుచున్నది.

కాలము:- కుంతకుడు తన గ్రంథమున ఆనందవర్ధన (ఈతని గ్రంథ రచనాకాలము 860-890) రాజశేఖరాదుల (గ్రం.ర.కా. 900-925) గ్రంథముల నుండి ఉదాహరణములను సేకరించి యున్నాడు. 12వ శతాబ్ది ప్రథమ పాదము నకు చెందిన మహిమ భట్టు ఈతని గ్రంథమును గూర్చి ముచ్చటించెను. దీనిని బట్టి కుంతకుడు క్రీ.శ. 950-1050 సంవత్సరముల నడుమ నుండి యుండవలె ననియు, అందుచే అభినవగుప్తునకితడు సమకాలికుడై యుండవలె ననియు, కుంతకుని మతమును అభినవగుప్తుడు గాని, అభినవగుప్తుని మతమును కుంతకుడు గాని ఉటంకించక పోవుటచే వారిరువురును కాశ్మీరదేశమువారే యైనను పరస్ప రము అజ్ఞాతులై యుండి యుందురనియు, బహుశః కుంతకుడు వయసున అభి నవగుప్తుని కంటె చాల చిన్నవాడై యుండుననియు దే మొదలగు వారి అభిప్రా యము. అభినవగుప్తుడు ఖండించిన వక్రోక్తి వాదము కుంతకునిదేయని మరి కొందరి యభిప్రాయము.

కుంతకునికి పూర్వము వక్రోక్తి:- వక్రోక్తి విషయమున ప్రాచీనాలంకా రికులలో అభిప్రాయభేదము కనబడుచున్నది. వీరిలో భామహ-దండి-వామనులు

వక్రోక్తికి ఉత్తరోత్తర హ్రాసము చెందిన విస్తృత రూపమును అంగీకరించిరి. రుద్రట మమ్మటాదులు దాని పరిధిని పూర్తిగ సంకుచితము చేసిరి.

భామహుని అభిప్రాయము ప్రకారము వక్రోక్తి యనునది గుణాలంకారముల కంటె భిన్నమైనది. గుణాలంకారముల పరిధి సంకుచితమై యుండ వక్రోక్తి పరిధి అతి విస్తృత మైనది. కావ్యాలంకార ప్రథమపరిచ్ఛేదమున, భామహుడు కొన్ని కావ్యభేదములను పేర్కొని; వీనికి కావ్యత్వము లభించ వలె నన్నచో వీనిలో వక్రోక్తి యుండి తీరవలె నని చెప్పియున్నాడు.

"యుక్తం వక్ర స్వభావోక్త్యా సర్వమేవైత దిష్యతే" (i.30)

కావ్యమునకు శోభ కూర్చ వలె నన్నచో వక్రోక్తి యుండ వలె ననెడు విషయమునే మరి రెండు మూడు స్థానములలో స్పష్టీకరించి యున్నాడు.

"న నితాంతాదిమాత్రేణ జాయతే చారుతా గిరామ్
వక్రాభిధేయ శబ్దోక్తి రిష్టా వాచా మలంకృతిః" (i.36)

(వాక్కులకు సౌందర్యము లభింప వలె నన్నచో వక్రశబ్దార్థోక్తి యుండ వలెను. అంతియే గాని "అహా! ఇది ఎంత బాగున్నది! ఇది ఎంతయు మధురముగా నున్నదిః" ఇత్యాది విధమున చెప్పినంత మాత్రమున లభింపదని దాని భావము).

"వాచాం వక్రార్థ శబ్దోక్తి రలంకారాయ కల్పతే" (V 66)

"వక్రవాచాం కవీనాం యే ప్రయోగం ప్రతి సాధవః
ప్రయోక్తుం యే న యుక్తాశ్చ తద్వివేకోఽయముచ్యతే" (Vi.23)

పై కారికలలో భామహుడు వక్రోక్తి నామనిర్దేశము మాత్రమే చేసినాడు. కాని దాని స్వరూప మేదియో వివరింపలేదు. ద్వితీయ పరిచ్ఛేదమున ఇతరాలంకారములతో పాటు అతిశయోక్త్యలంకారమును వివరించుచు, అతిశయోక్తియే వక్రోక్తియనియు, అది వాక్కులకు సౌందర్యమును కూర్చు ననియు అది లేనిచో అలంకారములు అలంకారత్వమును కోల్పోవు ననియు చెప్పియున్నాడు.

"ఇత్యేవమాదిరుదితా గుణాలంకారయోగతః
సర్వైవాతిశయోక్తిస్తు తర్కయేత్తాం యథాగమమ్.
సైషా సర్వైవ వక్రోక్తి రనయార్థో విభావ్యతే,
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽనయా వినా"

(ii.84 85)

ఇచట భామహుడు అతిశయోక్తియే వక్రోక్తి యని చెప్పుచున్నను ఇది ఒక అలంకారము మాత్రమే యని అతని అభిప్రాయము కాదు. కావ్యమున కంతకును శోభను కూర్చునది ఈ వక్రోక్తియే యనియు, దీని సంపర్కము లేని అలంకారము లేవియు ఉండవనియు, దీని సంపర్కము లేకుండుటచే హేతు-లేశ-సూక్ష్మములను అలంకారములుగ అంగీకరింప రాదనియు ఈతడు చెప్పుచున్నాడు. దీని బట్టి ఉపమయే శైలూషివలె రూపకాది వివిధరూపములను ధరించిన దని అప్పయదీక్షితాదులు చెప్పినట్లు, వక్రోక్తి యనునది సర్వాలంకారాను స్యూతమును, కావ్యశోభాధాయకమును అగు ఒక వైశిష్ట్య మని భామహుని యభిప్రాయమైనట్లు స్పష్ట మగు చున్నది. ఈ విషయమును విశదీకరించుటకే కుంతకు డీ గ్రంథము వ్రాసినాడు

వక్రోక్తి యన నేమియో భామహుడు స్పష్టీకరింపకున్నను సర్వాలంకారానుస్యూత మగు అతిశయోక్తియే వక్రోక్తి యనుటచే అతిశయోక్తి లక్షణ మగు లోకాతిక్రాన్త గోచరోక్తియే వక్రోక్తి యని సూచించినాడు. మరియు—

"గతోఽస్త మర్కో భాతీందు ర్యాన్తి వాసాయ పక్షిణః
ఇత్యేవమాది కిం కావ్యం వార్తామేనాం ప్రచక్షతే" (ii.87)

అను కారికలో "'సూర్యుడ స్తమించినాడు; చంద్రుడు ప్రకాశించుచున్నాడు; పక్షులు గూళ్ళు చేరుచున్నవి" ఈ విధముగ మామూలుగ చెప్పుకొను మాటలు కావ్యము కాజాలవు. అవి కేవలము కబుర్లు (వార్తా) మాత్రమే" అని చెప్పుటచే కావ్యోక్తులలో నొక విధమగు అలౌకికత్వ ముండవలె ననియు, అదియే వక్రోక్తి యనియు స్పష్టమగును.

కుంతకుడు స్వభావోక్తి అలంకారము కాజాలదని స్పష్టముగ చెప్పినను భామహునకు ఈ విషయమున (అలంకారత్వాంగీకారమున) పూర్తి వైముఖ్య మున్నట్లు చెప్పజాలము.

"యుక్తం వక్రస్వభావోక్త్యా సర్వమే వైతదిష్యతే" (i.30)

అను వాక్యమును బట్టియు,

"స్వభావోక్తి రలంకార ఇతి కేచిత్ప్రచక్షతే
అర్థస్య తదవస్థత్వం స్వభావోఽభిహితో యథా" (ii.93)

అను కారికచే స్వభావోక్తి గూడ కొందరి మతమున అలంకారమే యని చెప్పి, దానిని ఖండింపక, దానికి—

"ఆక్రోశన్నాహ్వయ న్నన్యా నాధావన్ మండలై రుదన్,
గా వారయతి దండేన డింభః సస్యావతారణీః (ii.94)

అను శ్లోకమును ఉదాహరణముగ చూపుటచేతను ఇట్టి స్థలములలో స్వభావోక్తికి అలంకారత్వమును భామహుడు కూడ అంగీకరించి నట్లు తోచును.

దండి కావ్యాదర్శమున వాఙ్మయము నంతను స్వభావోక్తి యనియు వక్రోక్తి యనియు రెండు తెగలుగ విభజింపవచ్చు ననియు, స్వభావోక్తి భిన్నాలంకారాలంకృతవాఙ్మయ మంతయు రెండవ తెగకు చెందిన దనియు చెప్పినాడు.

"శ్లేషః సర్వాసు పుష్ణాతి ప్రాయో వక్రోక్తిషు శ్రియమ్,
ద్విధా భిన్నం స్వభావోక్తిర్వ క్రోక్తిశ్చేతి వాఙ్మయమ్." (ii.62)

దీనిని బట్టి స్వభావోక్తి భిన్న స్థలము లన్నిటియందును వక్రోక్తియే ప్రాణప్రదమై యుండు ననియు అత డంగీకరించి నట్లు తేలినది. కాని వాఙ్మయమును ద్విధా విభజించి ఒక తెగకు చెందిన దానియందు మాత్రమే వక్రోక్తి యున్న దని చెప్పుటచే దండి వక్రోక్తి పరిధిని కొంతవరకు సంకుచితము చేసిన ట్లున్నది. భామహుడు స్వభావోక్తిని కేచిత్పక్షముగ చెప్పకున్నచో భామహదండు లిరువురును వక్రోక్తి విషయమును తుల్యాభిప్రాయపంతులే యనిచెప్పుటకు వీలుండెడిది. అతిశయోక్తి ప్రకరణమున దండి గూడ, భామహుని వలె, అతిశయోక్తి అలంకారాంతరములకు గూడ ఆధారభూతమని చెప్పుట(అలంకారాన్తరాణామప్యాహు రేకం పరాయణమ్ -i.220) గమనింపదగినది.

కావ్యాలంకారసూత్రమున వామనుడు "సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః" అను సూత్రముచే, సాదృశ్యమూలక లక్షణాస్థలములలో వక్రోక్తి యుండు నని చెప్పుచు దీని నొక అర్థాలంకారముగ అంగీకరించి, దీని పరిధిని ఇంకను సంకుచితము చేసినాడు.

రుద్రటుడు దీని నొక శబ్దాలంకారముగ మాత్రమే అంగీకరించి, భంగశ్లేష వక్రోక్తి యనియు, కాకు వక్రోక్తి యనియు రెండు విధముల విభజించినాడు (ii. 14. 16). తరువాతి అలంకారికులు చాలవరకు రుద్రటుని అనుసరించినారు.

కుంతకుడు, తన వక్రోక్తి జీవితమున, భామహ సూచిత మైన అతి విస్తృత మగు వక్రోక్తి స్వరూపము విశదీకరించి, అదియే కావ్యజీవిత మనియు, కావ్యజీవితముగ ఇతరాలంకారికాం గీకృతము లగు ధ్వన్యలంకారాదులు వక్రోక్త్యంతర్గతములే యనియు ప్రతిపాదించినాడు.

ఈ గ్రంథమున నాల్గు ఉన్మేషములు గలవు. ప్రథమోన్మేషమున కావ్య లక్షణమును, శబ్దార్థముల స్వరూపమును నిరూపించి, కుంతకుడు, కావ్యజీవిత మగు కవివ్యాపారవక్రతను — వర్ణవిన్యాసవక్రత, పదపూర్వార్ధవక్రత, ప్రత్యయ వక్రత, వాక్య వక్రత, ప్రకరణ వక్రత, ప్రబంధ వక్రత అని ఆరు విధములుగ విభజించి వాని స్వరూపోదాహరణములను సంక్షిప్తముగ దెలిపి యున్నాడు. ప్రసంగవశమున వామనోక్త రీతి త్రయతుల్యము లగు సుకుమార విచిత్ర- మధ్యమ మార్గములను, తత్సంబద్ధము లగు గుణములను గూడ నిరూపించినాడు. మిగిలిన గ్రంథ మంతయు షడ్విధ వక్రతా స్వరూపమును విస్తృతముగ నిరూపించుటకు ఉద్దిష్టమైనది. ద్వితీయోన్మేషమున వర్ణవిన్యాస వక్రతా-పదపూర్వార్ధవక్రతా ప్రత్యయ వక్రతలును, తృతీయోన్మేషమున వాక్య వక్రతయు, చతుర్థోన్మేషమున ప్రకరణ వక్రతా ప్రబంధ వక్రతలును, నిరూపింప బడినవి. ప్రసంగవశమున పూర్వాలంకారిక మత పరామర్శ పూర్వకముగ కొన్ని అలంకారముల స్వరూపము గూడ స్పష్టీకరింపబడినది.

కుంతకుడు ధ్వని సిద్ధాంతమును పూర్తిగ విరోధింపలేదు గాని, ధ్వనియే కావ్య జీవితము కా దనియు, ధ్వని భేదములన్నియు ఉపచార వక్రతా ప్రత్యయ వక్రతాదులలో నంతర్గతములు కావచ్చు ననియు ఈతని అభిప్రాయము. వాస్తవమున ఏతద్గ్రంథ రచనా పక్రియకు ధ్వన్యాలోకము పథిప్రదర్శక మని చెప్ప వచ్చును. ధ్వని వర్ణ-ప్రత్యయ-విభక్తి ప్రబంధాదిగతమై యుండు నని ధ్వనికారు డంగీకరించి నట్లు ఈతడు గూడ, వక్రత వర్ణాదిగత మని యంగీకరించెను. వర్ణ విన్యాస వక్రతకును వర్ణధ్వనికిని, పదవక్రతకును పదధ్వనికిని వాస్తవమున నామమాత్రభేదమే కాని స్వరూపభేదము లేదు. ఐనను కుంతకుడు వక్రోక్తి జీవితమున ఇదంప్రథమముగ చెప్పిన కొన్ని మౌలిక విషయములు లేకపోలేదు. అందలి వైశిష్ట్యమును ఎందరో అర్వాచీనాలంకారికులు గూడ గ్రహించి

యున్నారు. ఇట్టి విశేషము లన్నిటిని ఇచట చూపవలె నన్న మరి యొక గ్రంథ మగును.

ఈ ఆంధ్ర వక్రోక్తి జీవితమునకు, శ్రీ యస్. కే. దే గారు సంపాదించిన తృతీయముద్రణము ఆధారము. ఈ గంథ్రముపై ఆచార్య విశ్వేశ్వరులు హిందీలో వ్రాసిన వ్యాఖ్య గూడ నాకు కొంతవరకు ఉపయోగించినది. కొన్ని స్థలములలో దే గారు మూలములో నిచ్చిన పాఠముల కంటె అధః సూచికలో చూపిన పాఠములు బాగుండుటచే వానినే గ్రహించితిని. కొన్ని స్థలములలో ఆచార్య విశ్వేశ్వరుల వ్యాఖ్య అననుకూలముగ నున్నట్లు కనబడుటచేతను,కొన్ని యెడల ఆయన మూల పాఠ పరిశోధన విషయమున ఎక్కువ స్వాతంత్ర్యము వహించినట్లగపడుటచేతను నాకు నచ్చిన విధముగ వ్యాఖ్యానించితిని. దీనిపై రాధేశ్యామ మిశ్ర అను నాతడు హిందిలో వ్రాసిన వ్యాఖ్యాన మొకటి ఉన్నది గాని అది కేవలము విశ్వేశర వ్యాఖ్యలోని దోషాభాసములను చూపుటకు మాత్రమే ఉద్దిష్టమై, వైశిష్ట్యరహితమై యున్నది. తృతీయ చతుర్థోన్మేషములలో అనేక స్థలములందు అప పాఠ-పాఠలోపాదు లుండుటచే "స్థితస్య గతిశ్చిన్తనియా" అనునట్లు నా కర్థమైన రీతిని వ్యాఖ్యానించితిని.

నా కీ గ్రంథముపై వ్యాఖ్య వ్రాయు నవకాశ మిచ్చిన కేంద్ర సాహిత్య అకాడెమీ నిర్వాహకుల కెంతయు కృతజ్ఞుడను. ఎంత శ్రమ పడినను ఏవియో దోషము లుండియే యుండును. వానిని క్షమింతురు కావుత మని దోషజ్ఞులకు విన్నవించు కొనుచున్నాను.

మొదట మూలమును గూడ ఈ వ్యాఖ్యతో ప్రచురింప వలె నను ఉద్దేశముతో దానిని కూడ వ్రాతప్రతిలో చేర్చుట జరిగినది. కాని కారణాంతరము లచే కారికా-ఉదాహరణశ్లోకములను మాత్రము ఉంచి మిగిలిన మూలము తీసి వేయబడినది. 'కా' అనగా కారిక. 'వ్యా' అనగా వ్యాఖ్యానము. అది కుంతకుని వ్యాఖ్యానమునకు యథాతథముగ అనువాదము. 'వి' అనగా విశేషాంశములు. 'అవ' అనగా అవతారిక. నేను కూర్చినవి. కారికలకును, ఉదాహరణ శ్లోకముల కును వెంటనే అనువాదము కూడ కుండలిలో చేర్చబడినవి.

ఈ గ్రంథమును నాహితాభిలాషు లెవ్వరికైన అంకిత మీయ దలచినాను, అనుమతింపుడు అని కోరగా అందుల కనుమతించిన అకాడెమీ వారికిని నా ప్రార్థనను మన్నించి ఈ కృతిని స్వీకరించిన ఆంధ్రప్రదేశోన్నత న్యాయాలయ న్యాయ నిర్ణేతలును, సంస్కృతభాషానిష్ణాతులను, భాగ్యనగరీ విరాజమాన సురభారతీ సమిత్యధ్యక్షులును అగు శ్రీ అల్లాడి కుప్పుస్వామి గారికిని కృతజ్ఞుడను.

హైదరాబాదు.
30-5-1974.

పుల్లెల శ్రీరామచంద్రుడు

శ్రీ ర స్తు

# శ్రీమద్రాజానక కున్తక విరచితమగు

# వక్రోక్తి జీవితము

## (ఆంధ్రానువాదము)

## ప్రథమోన్మేషము

### మూలమునందలి వృత్తి ప్రారంభ ప్రార్థనాశ్లోకము

శ్లో॥ జగత్త్రితయ వైచిత్ర్య చిత్రకర్మ విధాయినమ్
శివం శక్తి పరిస్పన్ద మాత్రోపకరణం నుమః 1

శ్లో॥ యథాతత్త్వం వివేచ్యన్తే భావాస్త్రైలోక్య వర్తినః
యదితన్నాద్భుతం నామ దైవరక్తా హి కింశుకాః 2

శ్లో॥ స్వమనీషిక యైవాథ తత్త్వం తేషాం యథారుచి
స్థాప్యతే ప్రౌఢి మాత్రం తత్పర మార్థో న తాదృశః 3

శ్లో॥ ఇత్యసత్తర్క సన్దర్భే స్వతన్త్రేఽప్య కృతాదరః
సాహిత్యార్థ సుధాసిన్ధోః సారమున్మీలయామ్యహమ్ 4

శ్లో॥ యేన ద్వితయ మప్యేతత్తత్త్వ నిర్మితి లక్షణమ్
తద్విదా మద్భుతామోద చమత్కారం విధాస్యతి 5

ఆంధ్రానువాద-వ్యాఖ్యానములు :-

## ప్రథమోన్మేషము

### వ్యాఖ్యాతృ మంగళ శ్లోకము

శ్లో॥ నత్వా శ్రీతాత పాదాదీన్ శాస్త్ర మన్త్రాది సద్గురూన్
కుర్వే శ్రీరామ చన్ద్రోఽహ మాన్ధ్రార్థం "వక్రోక్తి జీవితమ్"

ఈ గ్రంథమును నాహితాభిలాషు లెవ్వరికైన అంకిత మీయ దలచినాను, అనుమతింపుడు అని కోరగా అందుల కనుమతించిన అకాడెమీ వారికిని నా ప్రార్థ నను మన్నించి ఈ కృతిని స్వీకరించిన ఆంధ్రప్రదేశోన్నత న్యాయాలయ న్యాయ నిర్ణేతలును, సంస్కృతభాషానిష్ణాతులను, భాగ్యనగరీ విరాజమాన సురభారతీ సమిత్యధ్యక్షులును అగు శ్రీ ఆల్లాడి కుప్పుస్వామి గారికిని కృతజ్ఞుడను.

హైదరాబాదు.
30-5-1974.

పుల్లెల శ్రీరామచంద్రుడు

శ్రీ ర స్తు

# శ్రీమద్రాజానక కున్తక విరచితమగు

# వక్రోక్తి జీవితము

## (ఆంధ్రానువాదము)

## ప్రథమోన్మేషము

### మూలమునందలి వృత్తి ప్రారంభ ప్రార్థనాశ్లోకము

శ్లో॥ జగత్త్రితయ వైచిత్ర్య చిత్రకర్మ విధాయినమ్
శివం శక్తి పరిస్పన్ద మాత్రోపకరణం నుమః 1

శ్లో॥ యథాతత్త్వం వివేచ్యన్తే భావాస్త్రైలోక్య వర్తినః
యదితన్నాద్భుతం నామ దైవరక్తా హి కింశుకాః 2

శ్లో॥ స్వమనీషిక యైవాథ తత్త్వం తేషాం యథారుచి
స్థాప్యతే ప్రౌఢి మాత్రం తత్పర మార్థో న తాదృశః 3

శ్లో॥ ఇత్యసత్తర్క సన్దర్భే స్వతన్త్రేఽప్య కృతాదరః
సాహిత్యార్థ సుధాసిన్ధోః సారమున్మీలయామ్యహమ్ 4

శ్లో॥ యేన ద్వితయ మప్యేతత్తత్త్వ నిర్మితి లక్షణమ్
తద్విదా మద్భుతామోద చమత్కారం విధాస్యతి 5

ఆంధ్రానువాద-వ్యాఖ్యానములు :-

## ప్రథమోన్మేషము

### వ్యాఖ్యాతృ మంగళ శ్లోకము

శ్లో॥ నత్వా శ్రీతాత పాదాదీన్ శాస్త్ర మన్త్రాది సద్గురూన్
కుర్వే శ్రీరామ చన్ద్రోఽహ మాన్ధ్రార్థం "వక్రోక్తి జీవితమ్"

అవతారిక : సహృదయధురీణు డగు రాజానక కుంతకుడు వక్రోక్తి జీవితాపరనామ ధేయ మగు 'కావ్యాలంకార గ్రంథమును రచించెను "కావ్యస్యా యమలంకారః కోఽప్యపూర్వో విధీయతే" అను ద్వితీయ కారికా వాక్యమును బట్టియు, "వక్రోక్తి జీవితే కావ్యాలంకారే ' ఇత్యాది పుష్పికావాక్యమును బట్టియు, దీని కా నామధేయ ద్వయ మున్నట్లు స్పష్ట మగుచున్నది

ప్రాచీనాలంకార గ్రంథములయందు వలె దీనియందు గూడ కారిక వృత్తి, ఉదాహరణములు అను మూడు విభాగము లున్నవి. కారికా వృత్తులు కుంతక విరచితములు. ఉదాహరణములు వివిధ కావ్యములనుండి గ్రహింప బడినవి.

కుంతకుడు మొదట, "వన్దే కవీన్ద్ర వక్త్రేన్దు" ఇత్యాది కారికలను రచియించి, వానిపై, వ్యాఖ్య వ్రాయ నుపక్రమించి ప్రారంభమున, ఇష్టదేవతా నమస్కారాదు లాచరించుచు గ్రంథప్రయోజనాదులను గూడ (ఈ శ్లోకములలో) సూచించుచున్నాడు.

(శక్తి పరిస్పంద మాత్రమునే సాధనముగ గొని, ముల్లోకముల వైచిత్ర్య మనెడు చిత్ర కర్మను రచించిన శివుని స్తుతింతుము)

విశేషాంశములు :- కాశ్మీరశైవము ప్రకారము-పరతత్త్వ మగు శివుడు ఈ ప్రపంచమున కంతకును మూలకారణ భూతుడు ఈతడు సృష్టిని శక్తి సాహాయ్యముతో చేయును. శక్తి శివునికంటె భిన్న మైన తత్త్వము కాదు. వాస్తవమున శివ శక్తి తత్త్వములు రెండును అభిన్నములే అగ్నికంటె వేరుగ దాహకత్వ శక్తి యనునది ఒకటి లేదు. అయినను "అగ్నియొక్క దాహకత్వ శక్తి" అని భేద వ్యవహారము కనబడుచున్నది. అట్లే శివశక్తుల భేదము గూడ వ్యావహారికమే కాని,యథార్థముకాదు శివునిలో నున్న ఈ శక్తి స్పందించగనే, కదలగనే—సృష్టి జరుగుచున్నది ఈ విధముగ శక్తి పరిస్పందమాత్ర సాహాయ్యముతో శివుడు విచిత్ర సృష్టిని జరుపుచున్నాడు. అట్టి శివుని స్తుతించు చున్నాము అని కుంతకుడు వృత్తి గ్రంథ ప్రారంభమున ఇష్టదేవతా నమస్కార రూప మగు మంగళము నాచరించినాడు.

కుంతకు డీ గ్రంథమునందు, ఉక్తి వైచిత్ర్యరూప మగు వక్రోక్తిని, కావ్యజీవితముగ ప్రతిపాదింప నున్నాడు కవి కూడ ప్రతిభారప

నామధేయ మగు శక్తియొక్క స్పందనమును మాత్రమే సాహాయ్యముగ గొని, ఉక్తి వైచిత్ర్యమును సాధింప గలుగుచున్నాడు— అనెడు విషయమును కూడ కుంతకుడు ఇచట సూచించుచున్నాడు. ధ్వన్యాలోక లోచన ప్రథమోద్యోతము నందు అభినవగుప్తుడు గూడ, ఇట్టి ప్రార్థనాశ్లోకమునే కూర్చెను.

"యదున్మీలన శక్త్యైవ విశ్వమున్మీలతి క్షణాత్
స్వాత్మాయతన విశ్రాన్తాం తాం వన్దే ప్రతిభాం శివామ్"

లోకములో వస్తుసౌందర్య విషయమున విభిన్నాభిప్రాయములు గోచరించుచున్నవి. కొందరికి స్వాభావిక సౌందర్య మన్న నిష్టము. కొందరికి కృత్రిమ సౌందర్య మన్న ఆదర మెక్కువ. కావ్య విషయమునందు గూడ, ఇట్టి విభిన్న రుచులు కనబడుచున్నవి. ఆ యా వస్తువులను ఉన్నవి ఉన్నట్లుగా వర్ణించినచో నట్టి స్వాభావిక వర్ణనమే మనోహర మని కొంద రందురు. ఉన్నది ఉన్నట్లుగా వర్ణించినచో విశేష మేమియును లేదు. అలంకారాది సమలంకృత మగు భాష నుపయోగించి, వర్ణించిననే కావ్యమునందు సౌందర్య ముండు నని మరికొంద రందురు. ఈ విధముగ అలంకార శాస్త్రకారులలో స్వభావోక్తి వాదులు, వక్రోక్తివాదులు, అను రెండు తెగల వారు కలరు.

ఈ విషయమును, 'దండి' తన కావ్యాదర్శమున—

"శ్లేషః సర్వాసు పుష్ణాతి ప్రాయో వక్రోక్తిషు శ్రియమ్
భిన్నం ద్విధా స్వభావోక్తి ర్వక్రోక్తి శ్చేతి వాఙ్మయమ్"
(II-363)

అను కారికలో చెప్పినాడు. వీరిలో 'కుంతకుడు' వక్రోక్తి సిద్ధాంతమునకు—అనగా, ఉక్తి వైచిత్ర్యమే కావ్యమున ప్రధానము- అను సిద్ధాంతమునకు చెందినవాడు.

దండి కంటె పూర్వమునందున్న భామహుడు కావ్యాలంకారమున—

"సైషా సర్వత్ర వక్రోక్తిరనయార్థో విభావ్యతే
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽనయా వినా (II 85)

అను కారికలో వక్రోక్తియే సర్వాలంకారమూల మని చెప్పినాడు. ఆ సిద్ధాంతమునే విస్తృత రూపమున నిరూపింప నున్న కుంతకుడు, తన సిద్ధాంత మునకు విరుద్ధ మైన స్వభావోక్తి సిద్ధాంతమునందలి దోషమును వృత్తి గ్రంథ ప్రారంభముననే స్పష్టీకరించుచున్నాడు.

స్వభావోక్తివాది యభిప్రాయ మేమనగా,- ["మూడు లోకములలో నున్న వస్తువులను ఉన్నవానిని ఉన్న విధముగనే వర్ణించినచో అందులో, (నీవు మొదటి శ్లోకమున చెప్పిన విధమున) క్రొత్త వైచిత్ర్య మేమున్నది. ఆ సౌంద ర్యము వానికి స్వాభావికమే! కింశుక పుష్పములు స్వభావసిద్ధముగనే రక్తవర్ణ ములు కదా!"] 2

అట్లు కాక (వక్రోక్తివాది చెప్పిన ప్రకారము) ("తన బుద్ధి బలముచే వాని తత్త్వమును తన కిష్టమైన విధముగ స్థాపింప యత్నించినచో అది కేవ లము ప్రౌఢివాదమే యగును; యథార్థము కాజాలదు") 3

అవ. స్వభావోక్తివాది చెప్పిన పై యభిప్రాయమును కుంతకుడు ఈ క్రింది విధముగ నిరాకరించుచున్నాడు.

("ఈ విధముగ స్వబుద్ధి మాత్ర కల్పిత మగు, స్వభావోక్తివాది చూపిన కుతర్కమును ఆదరించక నేను సాహిత్యార్థ సుధా సముద్రమునుండి సారమును వెలికి తీయుచున్నాను") 4

("దీనిచే వక్రోక్తి తత్వ నిరూపణము, తత్ప్రతిపాదక లక్షణ గ్రంథము, ఈ రెండును వానిని తెలిసికొను శక్తిగల వారికి ఆనందమును సమకూర్చును") 5

విశేషాంశములు :- వృత్తి ప్రారంభమునందలి ఈ నాలుగు శ్లోకములను స్వభావోక్తి వాదమును నిరసించి, వక్రోక్తిసిద్ధాంత ప్రాశస్త్యమును సూచించుటకై కుంతకుడు వ్రాసి యున్నట్లు సమన్వయము చూపబడినది. కాని, ఈ సమన్వ యము, అక్షరార్థమున కంతగా అనుకూలముగ నున్నట్లు లేదు. అందుచే ఈ క్రింది విధముగ అర్థము చెప్పినచో యుక్తముగ నుండునని, తోచుచున్నది.

లోకమునందు స్వభావోక్తి, ప్రౌఢోక్తి అను రెండు ఉక్తులు (వర్ణనా విధానములు) ఉండుటకు అవకాశమున్నది. ఈ రెండును స్వతంత్ర రూపమున కావ్యమునకు అంతగ అనుకూలముగ నుండవు. ఈ రెండిటిని తగు పాళ్ళతో

నుపయోగించి, చక్కగ మలచినచో, 'వక్రోక్తి' యేర్పడును. కాని, వక్రోక్తి స్వరూప మీ విధమున నుండును, అని సయుక్తికముగ ప్రతిపాదింప వలెను గాని, ఏదియో తర్కమును చూపి, 'స్వభావోక్తి' మంచిది కాదు, 'ప్రౌఢోక్తి' మంచిది కాదు, అని చెప్పినంత మాత్రమున వక్రోక్తిని, స్థాపించి నట్లు కాజాలదు. ఈ భావమును మనస్సులో నుంచుకొని, కుంతకు డీ శ్లోకములను వ్రాసె నని తోచును. అందు స్వభావోక్తికి ప్రతికూల మగు యుక్తి 'యథాతత్త్వం' ఇత్యాది శ్లోకమున చూపబడుచున్నది.—

"మూడు లోకములలో నున్న పదార్థములను ఉన్నవానిని ఉన్నట్లుగా వర్ణించినచో దానిలో అద్భుత మేదియును లేదు. కింశుకపుష్పములు స్వభావము చేతనే ఎఱ్ఱగా నుండును. అట్టిచో 'కింశుకములు ఎఱ్ఱగా నున్నవి' అని వాని స్వభావమును వర్ణించుటలో చమత్కార మేమి యున్నది?"

ప్రౌఢోక్తికి ప్రతికూలముగ యుక్తి 'స్వమనీషికయా' ఇత్యాదిశ్లోకము నందు చూపబడుచున్నది. (ఈ శ్లోకమున పూర్వశ్లోక ప్రతిపాదితభిన్నమగు విషయము (ప్రౌఢోక్తి విషయము) ప్రతి పాదింపబడుచున్నది. కావుననే 'అథ' శబ్దము ప్రయోగింపబడినది).

"అట్లు కాక వాని తత్త్వమును తమ కిష్టము వచ్చినట్లు, తమ బుద్ధి బలముచే (కింశుక పుష్పములు తెల్లగా నున్నవి ఇత్యాదివిధముగ) స్థాపించు టకై యత్నించినచో, అది ప్రౌఢి వాదము మాత్రమే యగును. యథార్థము కాజాలదు. అందుచే దానియందును చమత్కారము లేదు."

ఈ విధముగ యుక్తులచే స్వభావోక్తి వాద-ప్రౌఢోక్తి వాదములను నిరాక రించ వచ్చును. "అయినను, ఈ తర్కములు నా యధీనమునం దున్నను (స్వతంత్రే) వానిని ఆదరించక నేను సాహిత్యార్థసుధా సముద్రము నుండి సారమును వెలికి తీయుచున్నాను."

యుక్తులకొక అంతమనునది ఉండదు. కనుక "అసత్తర్క సన్దర్భే" అన్నాడు.

కాని, ఈ స్వభావోక్తి-ప్రౌఢోక్తులు అత్యంత నిరుపయుక్తములు కావు. వానిని వక్రోక్తి కనుగుణముగ మలచు కొన్నచో అవి కూడ చమత్కారజన కము లగు నని చెప్పుచున్నాడు.—

"నే నీ సాహిత్యార్థ సుధా సింధు సార మగు వక్రోక్తిని నిరూపించుటచే తత్త్వము (వస్తు సహజ స్వభావము) నిర్మితి, (ప్రౌఢోక్తిచే నూతన రూపత్వ నిర్మాణము) అను ఈ రెండును ఆ సారము నెరిగిన వారికి అద్భుతానంద చమత్కారమును కలిగించును." 5.

అవ. కుంత కీ విధముగ వృత్తి గ్రంథ ప్రారంభమున మంగళాచరణము చేసి తాను స్థాపించ నున్న వక్రోక్తి సిద్ధాంతమునకు గల వైశిష్ట్యమును సూచించి మూల గ్రంథములోని ప్రార్థనారూప మగు ప్రథమ కారికను వ్యాఖ్యానించుటకై అవతారిక వ్రాయుచున్నాడు—

(కారికా ప్రారంభ మంగళశ్లోకము)

వన్దే కవీన్ద్ర వక్త్రేన్దు లాస్య మన్దిర నర్తకీమ్
దేవీం సూక్తి పరిస్పన్ద సున్దరాభినయోజ్జ్వలామ్.

వ్యా. గ్రంథారంభమునందు ఇష్టదేవతా నమస్కారము చేయుట ఆచారము. అందుచే, ('వందే' ఇత్యాది శ్లోకమున) ఇష్ట దేవతా నమస్కారరూప మంగళా చరణమును ఉపక్రమించుచున్నాడు.

("కవీంద్రుల ముఖ చంద్రు డనెడు లాస్యమందిరమునందు లాస్యము చేయునదియు, సుమధురోక్తుల విలసితము లనెడు సుందరాభినయములచే ప్రకాశించు నదియు నగు (సరస్వతీ) దేవిని నమస్కరించు చున్నాను")

వ్యా. దేవీం వన్దే = దేవతను స్తుతించుచున్నాను. ఎట్టి దేవతననగా చెప్పుచున్నాడు. కవీన్ద్ర వక్త్రేన్దు లాస్య మన్దిర నర్తకీమ్. కవీన్ద్రాః = కవి శ్రేష్ఠులు. తేషాం=వారియొక్క, వక్త్రేన్దుః = ముఖచంద్రుడు; స ఏవ లాస్య మందిరం=ఆ ముఖ చంద్రుడే ఒక నాట్యగృహము. తత్ర=అక్కడ, నర్తకీం =నాట్యమాడునది. కింవిశిష్టామ్=దేనితో కూడినది? సూక్తి పరిస్పన్ద సున్దరాభినయోజ్జ్వలామ్ = సూక్తి పరిస్పన్దాః = సుమధుర వచో విలాసములు, తాన్యేవ సుందరా అభినయాః = అవియే సుకుమారమైన సాత్త్వికాద్యభినయములు, తైః= వానితో, ఉజ్జ్వలామ్= ప్రకాశించునట్టిది.

నాట్యమందిరమున సవిలా సాభినయములతో లాస్యము చేయు నర్తకి వలె, ఏ దేవి సత్కవిముఖమునందు నాట్య మాడుచు ప్రకాశించు చున్నదో అట్టి దేవిని స్తుతింతును అని వాక్యార్థము.

కావ్యశోభాదాయక మగు ఒకానొక అపూర్వ వస్తువు ప్రకృతము కదా దాని కధి దేవతయు, ఇట్టి చమత్కారముచే హృదయమును ఆకర్షించునదియు వాగ్రూపయు నగుసరస్వతీదేవిని స్తుతించుచున్నాను,అని తాత్పర్యము.

వ్యా. ఈ విధముగ నమస్కరించి వక్తవ్య వస్తువునకు సంబంధించిన విషయనామ ప్రయోజనములను (అనుబంధములను) (ఈ రెండవ కారికలో) చెప్పుచున్నాడు.

శ్లో. "వాచో విషయనైయత్య ముత్పాదయితు ముచ్యతే
ఆది వాక్యేఽ భిధానాది నిర్మితేర్మాన సూత్ర వత్"

వాక్కున (గ్రంథమున) ప్రతిపాద్య మగు విషయము నిశ్చితముగ తెలువుటకై గ్రంథారంభ వాక్యమునందు, నామధేయాదికము, గృహాది నిర్మాణ ప్రారంభమున మాన సూత్రము పట్టి నట్లుగా,చెప్పబడు చున్నది.'') ఇది అంతర శ్లోకము.

వి. ఏదైన ఒక గ్రంథమును వ్రాయ నుపక్రమించి నపుడు (1) ఆ గ్రంథము నందు ప్రతి పాద్యమగు విషయ మేది? 2. దాని ప్రయోజన మేమి? (3) దానిని తెలిసి కొనుటకు అధికారి ఎవ్వరు? (4) వీని పరస్పర సంబంధ మేమి? అను నాలుగు విషయములను స్పష్టీకరించినగాని పరికలకు తద్గ్రంథపఠనోన్ముఖత్వముకలుగదు. వీనికి అనుబంధ చతుష్టయ మని పేరు సాధారణ ముగ విషయ ప్రయోజనములను చెప్పినచో తద్విషయ జిజ్ఞాసువు అధికారి యనియు, విషయ గ్రంథాదులకు ప్రతిపాద్య ప్రతిపాదకత్వాది సంబంధ మనియు అర్థతః తెలియ వచ్చును.

ఏదైన భవనాదికమును నిర్మింప దలచినపుడు పునాదులు త్రవ్వువారికి స్పష్టముగ తెలియుటకై, మొదట సూత్రము పట్టి కొలిచి దాని ప్రకారము ముగ్గు మొదలగు వానితో భూమిపై రేఖలు గీయుదురు. దీనికి మాన సూత్రము పట్టుట అని పేరు గృహాది నిర్మాణమునకు మాన సూత్రము పట్టుట ఎట్టిదో గ్రంథరచనకు అనుబంధ చతుష్టయ ప్రతిపాదన మట్టిదని ఈ అంతర శ్లోకాభిప్రాయము.

వృత్తిలో భాగములై విశిష్టవిషయ ప్రతిపాదనమునకై ఉద్దిష్టము లగు శ్లోకములకు అంతరశ్లోకము లని పేరు వృత్తిలో మధ్య మధ్య ఈ విధము లగు శ్లోకములను కూర్చుట ప్రాచీన వ్యాఖ్యాతృసంప్రదాయము. అప్పుడప్పుడు సుప్రసిద్ధములైన ప్రాచీనులశ్లోకములను గూడ అంతరశ్లోకములుగ గూర్చుట కలదు.

కా. లోకోత్తర చమత్కార కారి వైచిత్ర్య సిద్ధయే
కావ్యస్యాయ మలఙ్కారః కోఽప్య పూర్వోఽభిధీయతే. 2

("లోకోత్తర చమత్కారమను కలిగించు వైచిత్ర్యము సిద్ధించుటకై అపూర్వమగు ఒకానొక కావ్యాలంకారము రచింపబడుచున్నది ")

వ్యా. అలంకారో విధీయతే = అలంకరణము చేయబడుచున్నది దేనియొక్క = కావ్యము యొక్క, కవియొక్క కర్మ కావ్యము; దానియొక్క. ప్రాచీనములైన కావ్యాలంకారము లున్నవి కదా; ఇది ఎందులకు-అను ప్రశ్నకు సమాధానముగ చెప్పుచున్నాడు-అపూర్వః = వాని అన్నింటికంటె భిన్నమైన అర్థమును చెప్పునది అపూర్వత్వ మనునది పూర్వకావ్యాలంకారములకంటె ఇది ఉత్కృష్టమైనను నికృష్ట మైనను గూడ సంభవింపవచ్చును నీవు చెప్పిన అపూర్వత్వమెట్టిది?- అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు. — కోఽపి = అలౌకికమైనది అత్యుత్కృష్టమైనది అదికూడ ఎందుకు అనగా—లోకోత్తర చమత్కార కారి వైచిత్ర్య సిద్ధయే = అసామాన్య మగు ఆహ్లాదమును కలిగించు వైచిత్ర్యము సంపన్న మగుటకు. వందలకొలది కావ్యాలంకారము లున్నను వానిలో, ఏ ఒక్క దానినుండియు ఇట్టి వైచిత్ర్యము లభింపదు

అలంకారశబ్దము ముఖ్యముగ (ముఖ్యవృత్తిచే) శరీరమునకు శోభాతిశయమును కూర్చు కటకకుండలాదులను బోధించును శోభాతిశయకారిత్వ సామ్యమును బట్టి ఆరోపముచే (గౌణవృత్తిచే) ఉపమాదులను గూడ బోధించును. అట్లే ఉపమాది సదృశము లగు గుణాదులను గూడ బోధించును అట్లే అలంకారాభిదాయక గ్రంథమును గూడ బోధించును. శబ్దార్థములు రెండింటికి, యోగక్షేమములు ఒకేవిధముగ నుండుటచే వానిని రెండింటిని, 'గోవు' అను శబ్దము గోవు' అననర్థము అన్నట్లు, అభిన్నముగ వ్యవహరింతురు

వివరణము. 'అలంకారము' అనగా శరీరమునకు అందమును గూర్చు కటకకుండలాదు లనియర్థము. కటకాదు లెట్లు శరీరమునకు అందమును

చేకూర్చుచున్నవో ఉపమాదులు కూడ అట్లే కావ్యశరీరమునకు శోభను కూర్చు చున్నవి కావున అలంకారశబ్దము గౌణవృత్తిచే (సాదృశ్యమూల లక్షణచే) ఉపమాదులను గుణములను గూడ బోధించును. ఉపమాది ప్రతిపాదకమును, శబ్ద రూపమును అగు గ్రంథమునకు కూడ అలంకార మని పేరు ఎందుచేత ననగా శబ్దార్థములు తుల్యయోగక్షేమములు. అనగా శబ్దమును విడిచి అర్థము, అర్థమును విడిచి శబ్దము ఉండ జాలవు గాన ఒకదాని మంచిచెడుగులు రెండవదానికి కూడ సంబంధించును. అందుచేతనే శబ్దమైనను 'గౌః' అనియే, అర్థమైనను 'గౌః' అనియే కావున వానికి ఒక విధ మగు అభేద వ్యవహారము కలదు. అందుచే అలంకార శబ్దము అర్థరూపము లగు ఉపమాద్యలంకారములను శబ్దరూప మగు తత్ప్రతిపాదక గ్రంథమును కూడ బోధించును.

వ్యా. ఈ కారికయొక్క సంపిండితార్థమిది:- ఈ గ్రంథమునకు 'అలంకారము' (లేదా కావ్యాలంకారము) అని పేరు. ఉపమాదివిషయములు ఏతద్గ్రంథ ప్రతిపాద్యములు. పైని చెప్పిన విధముగ వైచిత్ర్యము లభించుట ప్రయోజనము.

ఈ విధముగ ఈ కావ్యాలంకారమునకు ప్రయోజన మున్న దని స్థాపించినను ఈ అలంకారముచే అలంకార్య మగు కావ్యమునకు ప్రయోజనము లేనిచో కావ్యాలంకారమునకు ప్రయోజన మున్నను, అది నిరర్థకమేకదా— అని ఆశంకించుకొని, కావ్యమునకు కూడ ప్రయోజన మున్న దని (3 4 5 కారికలలో) చెప్పుచున్నాడు.-

కా ధర్మాది సాధనోపాయః సుకుమారక్రియోదితః
కావ్యబంధోఽభిజాతానాం హృదయాహ్లాదకారకః 3

("ధర్మాదులను సాధించుటకు ఉపాయమును, సుకుమారపద్ధతిలో నిబద్ధమును అగు కావ్యబంధము ఉత్తమ వంశ సంజాతు లగు రాజకుమారాదులకు ఆహ్లాదమును కలిగించును ") 3

వ్యా. కావ్యబంధ మనగా సర్గబంధరూప మగు మహాకావ్యము. 'సర్గబంధో మహాకావ్యమ్' అని దండి అట్టి సర్గబంధాదికము చిత్తమునకు ఆనందమును కలిగించునదగు నని అన్వయము. ఎవ్వరికి అనగా-అభిజాతులకు. ఉత్తమ వంశసంజాతు లగు రాజపుత్రాదులు ధర్మాద్యుపేయము లను పొందవలె నని

అభిలషింతురు జయేచ్ఛ కలవారై సర్వోన్నతులుగ నుండ వాంఛింతురు కాని వారు సుకుమారస్వభావు లగుటచే క్లేశమునుండి భయపడుదురు (కావ్యము అట్టి వారికి ఆహ్లాదజనకము లగు నని యర్థము). కావ్యము వారి కాహ్లాదము కలిగించి నను ఒక సామాన్య వినోద వస్తువువంటిది మాత్రమే యగును కదా యని శంకించి చెప్పుచున్నాడు-'ధర్మాదిసాధనోపాయః" ఇది ఉపేయమగు ధర్మాది చతుర్వర్గమును గూర్చి బోధించును గాన దానిని సంపాదించుటకు ఉపాయము, దానిని పొందుటకు నిమిత్తము.

ఐనను, అట్టి పురుషార్థముల నుపదేశించెడు శాస్త్రాంతరములు కూడ ఉన్నవి కదా! అవి ఏమి అపరాధము చేసినవి-వానిని కాదని ఈ కావ్యములు అభ్యసించుటకు?- అని ప్రశ్నించుకొని సమాధానము చెప్పుచున్నాడు - సుకుమార క్రమోదితః = సుందరమును సహృదయ హృదయాహ్లాదకారియు నగు రచనా క్రమముచే చెప్పబడినదై, కావ్యబంధము ఆహ్లాదమును కలిగించుచు ప్రవర్తింపచేయును గాన సద్యంశ ఫలితులకు ధర్మాదిప్రాప్తికి ఉపాయమగుచున్నది శాస్త్రము లన్ననో, కఠోర మగు క్రమము నవలంబించి ధర్మాద్యుపదేశమును చేయును గాన అవి దురవగాహ మైనవి అట్టి ధర్మోపదేశమున్నను రాజపుత్రాదుల విషయమున నిరుపయోగ మైనదే. రాజపుత్రాదులు వైభవాధికారాదులు లభించిన పిమ్మట రాజ్యపరిపాలనావ్యవస్థను చేయవలసి యుండును. అపుడు వారికి తగు ఉపదేశము లేకున్నచో వారు స్వేచ్ఛగా ప్రవర్తించుచు లోకమునందలి కట్టుబాట్ల నన్నింటిని ఉచ్ఛిన్నము చేయవచ్చును. కావున కవులు వారికి వ్యుత్పత్తి కలిగించుటకై ఉత్తమచరితు లగు పూర్వరాజుల సచ్చరిత మును వారి కాదర్శముగ నుండు విధమున తమ కావ్యగ్రంథములందు కూర్తురు. ఈ విధముగ కావ్యబంధమునకు శాస్త్రాతిరిక్త మైన అత్యుత్తమ మగు ప్రయోజన మున్నది.

పురుషార్థ సిద్ధిరూప మైన ముఖ్యప్రయోజనము మాట అటుండగా, ఈ కావ్యముచే లోకయాత్ర జరుగుటకు నిమిత్త మైన భృత్యులు, మిత్రులు, ప్రభువులు, మొదలగు వారిని తమ కనుకూలముగ చేసికొనుటకు కూడ వీలగును అని (నాల్గవకారికలో) చెప్పుచున్నాడు.

కా. వ్యవహార పరిస్పన్ద సౌన్దర్యం వ్యవహారిభిః
సత్కావ్యాధిగమాదేవ నూతనౌచిత్యమాప్యతే. 4

("సత్కావ్య పరిజ్ఞానమువలననే వ్యవహర్తలు నూతన మైన ఔచిత్యముతో కూడిన చక్కని లోకవ్యవహార నిర్వహణశక్తిని పొందగలుగుదురు") 4

వ్యా. వ్యవహారః = లోకవ్యవహారము. దానియొక్క పరిస్పన్ద మనగా క్రమబద్ధ నిర్వహణరూపమగు వ్యాపారము; దానిసౌందర్యము, వ్యవహారిభిః = వ్యవహర్తలచేత, సత్కావ్యాధి గమాదేవ = సుందర కావ్యపరిజ్ఞానము వలననే-ఇతరమువలన కాదు—ఆప్యతే = పొందబడును; అని అర్థము. ఆ సౌందర్యమెట్టిదనగా—నూతనౌచిత్యమ్-నూతనమ్ = క్రొత్తదైన-అలౌకికమైన, ఔచిత్యం = ఉచితత్వము. యస్య = దేనికో అది.

దీని పర్యవసితార్థమిది.— గొప్పవారైన మహారాజాదుల చరితమును వర్ణించునపుడు వారికి సహాయ భూతులగు ముఖ్యామాత్యుడు మొదలగువారందరును తమ తమ కర్తవ్యము లగు వ్యవహారములందు నిపుణులుగ చిత్రింపబడుదురు. కాన, వారు వ్యవహరించెడు ఇతరులెల్లరకును, సద్వృత్తోపదేశకులగుదురు. ఈ విధముగ ఉత్తమ కావ్యమునందు పరిశ్రమచేసిన యెల్లరును వ్యవహార నిర్వహణమునందలి సౌందర్యాతిశయమును తెలిసికొని ఉత్తమ లౌకిక ఫలమును పొందగలరు. 4

వ్యా. ధర్మాదిపురుషార్థ చతుర్వర్గమును ఎట్లు సంపాదింపవలెనో కావ్యము బోధించును గాన చతుర్వర్గప్రాప్తి కావ్యమునకు పారంపరిక (దూర) ప్రయోజన మని చెప్పబడినది. కాని ధర్మాది పురుషార్థప్రాప్తి కావ్యపఠన సమయమునందు కాక కాలాంతరమునందే జరుగును కావున దాని వలన కలుగు ఆనందము కూడ కాలాంతమునందే లభించును. అందుచే ఎపుడో, కాలాంతరమున లభింపనున్న ఆనందముకొరకై పఠితలకు కావ్యపఠన ప్రవృత్తి కలుగక పోవచ్చును. కావున చతుర్వర్గ భిన్నమును, తత్కాలా (పఠనకాలా) నందసంధాయకమును, సహృదయహృదయసంవాదముచే సుందరమును అగు ప్రయోజనాంతరమును (5వ కారికలో) చెప్పుచున్నాడు-

వి. 'హృదయసంవాదము' అనగా అనేకుల హృదయములు ఒకే విధమగు అనుభూతిని పొందుట.



సుభగము" అనగా-కావ్యము మనోహరముగ నున్న దను విషయము సహృదయుల హృదయ సంవాదముచే నిర్ణీత మని యర్థము.

కా. చతుర్వర్గ ఫలాస్వాదమప్యతిక్రమ తద్విదామ్
కావ్యామృత రసేనాన్తశ్చమత్కారో వితన్యతే 5

("కావ్యామృత రసము తదభిజ్ఞుల అంతఃకరణమునందు చతుర్వర్గ ఫలాస్వాదమును మించిన చమత్కారమును ప్రసరింపచేయును"). 5

వ్యా చమత్కారః వితన్యతే = చమత్కారము విస్తరింప చేయబడుచున్నది. ఆనందము మాటి మాటికి కలిగింప బడుచున్నది, అని యర్థము. దేనిచేత? కావ్యామృత రసేన-కావ్యమే అమృతము. దాని యొక్క రసము అనగా ఆస్వాదము లేక అనుభవము కావ్యామృత రసము. దానిచేత. ఎక్కడ అనగా చెప్పుచున్నాడు. అన్తః = అంతఃకరణము నందు ఎవరికి? తద్విదామ్. తం = దానిని; విదన్తి = తెలిసికొనుచున్నవారు కావున తద్విదః వారికి. ఎట్లు? చతుర్వర్గ ఫలాస్వాదమప్యతి క్రమ్య చతుర్వర్గస్య = ధర్మాదిచతుర్వర్గముయొక్క, ఫలం = ఉపభోగము, తస్య = దానియొక్క, ఆస్వాదః = అనుభవము; అత్యుత్కృష్ట మని ప్రసిద్ధ మగు దానిని కూడ, అతిక్రమ్య = జయించి దానిని క్షుద్రముగ చేసి. (పస్పశ' శబ్దమునకు గ్రంథోపోద్ఘాతమని యర్థము ఇచట ప్రకరణము ననుసరించి 'పస్పశప్రాయము' అనగా క్షుద్రము, అప్రధానము అను అర్థము చెప్పబడినది).

దీని అభిప్రాయ మిది-చతుర్వర్గ ఫలాస్వాదము పరమపురుషార్థ మనియు, సర్వశాస్త్ర ప్రయోజన మనియు, ప్రసిద్ధి చెందినది. అది కూడ కావ్యామృతాస్వాదముచే కలిగిన్న చమత్కారలేశముతో నైనను పోల్చుట కేమాత్రము తగినది కాదు.

వినుటకు కటువుగనుండుట, ఉచ్చరించుటకు కష్టముగ నుండుట అర్థము కాకుండుట మొదలగు దోషములతో దుష్టమగు శాస్త్ర సందర్భము, అధ్యయన సమయమునందె అపూర్వ చమత్కారమును కలిగించు కావ్యముతో, ఏమాత్రము కూడ పోటి చేయజాలదు—అను విషయము కూడ ఇచట స్పష్టముగ చెప్పినట్లే;

శ్లో. "కటు కౌషధ వచ్ఛాస్త్ర మవిద్యావ్యాధి నాశనమ్
ఆహ్లాద్యమృత వత్కావ్య మవివేక గదాపహమ్"

("శాస్త్రము చేదుమందు వలె అవిద్య అనెడు వ్యాధిని నశింపచేయును. కావ్యము ఆనందదాయకమగు అమృతము వలె అవివేక మనెడు రోగమును తొల గించును").

శ్లో. "ఆయత్యాంచ తదాత్వే చ రసనిఃస్యన్ద సుందరమ్
యేన సమ్పద్యతే కావ్యం తదిదానీం విచార్యతే."

("కావ్యము దేని సహాయముచే రాబోవు కాలమునందును తత్కాలము— పఠన కాలము నందును రస ప్రవాహముచే సుందర మైనది అగునో, అది (ఆ అలంకార స్వరూపము) ఇప్పుడు విచారింపబడుచున్నది").

—ఇవి అంతర శ్లోకములు.

వి. కుంతకుడు పై మూడుకారికలలో రాజ పుత్రులకు ధర్మాద్యు పదే శము, పఠితలకు లోక వ్యవహారజ్ఞానము, లోకోత్తరానందము అను మూడు కావ్యప్రయోజనములను చెప్పి యున్నాడు. ఈ మూడు ప్రయోజనములును కావ్య పాఠకునకు మాత్రమే సంబంధించినవి రచయితకు సంబంధించినవి కావు. కుంతకుని కంటె పూర్వమునందున్న భామహుడు కావ్యరచనకు ధర్మాది వై చక్ష ణ్యము, కలా కౌశలము, కీర్తి, ప్రీతి, అను నాలుగు ప్రయోజనములను చెప్పెను.—

"ధర్మార్థ కామ మోక్షేషు వైచక్షణ్యం కలాసు చ
కరోతి కీర్తిం ప్రీతిం చ సాధుకావ్య నిబంధనమ్" (1 2)

"సాధు కావ్య నిబంధనమ్" అను పాఠమును, "సాధుకావ్య నిషేవణమ్" అని మార్చి ఈ ప్రయోజనములు రచయితకే కాక, పఠితకు కూడ లభింపవచ్చు నని సూచించినారు.

వామనుడు కావ్యము దృష్టఫలమగు ఆనందమును, అదృష్టఫలమగు కీర్తిని ఇచ్చునని చెప్పినాడు.

"కావ్యం సద్ దృష్టా దృష్టార్థమ్; ప్రీతి కీర్తి హేతుత్వాత్" (1. 1 5)

ఈ రెండును రచయితకును పాఠకునకును కూడ లభించవచ్చును. రచించి నందులకు కవికి కీర్తి వచ్చునట్లు దానిని బాగుగ చదివిన వారికి గూడ కొంత వరకు బహుకావ్య పరిత యను కీర్తి రావచ్చును. కదా! అట్లే కాలాంతర మున ఆ కావ్యమునే చదువుకొనినపుడు కవికి కూడ ఆనందము కలుగ వచ్చును.

మమ్మటుడు చెప్పిన—

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహార విదే శివేతరక్షతయే।
సద్యః పరనిర్వృతయే కాన్తా సంమితతయోప దేశయుజే॥
(1.2)

అను ఆరు ప్రయోజనములలో కీర్తి, ధనము, అమంగళనివృత్తి అను నవి ప్రధానముగ కావ్య రచయితకు చెందునవి. వ్యవహారజ్ఞానము, పరమానం దము, ఉపదేశజ్ఞానము అనునవి ప్రధానముగ పరితకు సంబంధించినవి పైని చూపిన విధముగ అన్నియు ఉభయులకును, సమన్వయించవచ్చును గాని, స్వారస్యము ననుసరించి, ఇట్లు విభాగముచేయ బడినది.

అభినవగుప్తుని అభిప్రాయము ననుసరించి ఆనందమే కావ్యపరమ ప్రయోజనము. (చూ. లోచన ప్రథమోన్మేషము).

కుంతకుడు మాత్రము కేవలము పాఠకులకు సంబంధించిన ప్రయోజనము లనే పేర్కొనెను. రచయితకు కీర్తి ధనాదులు లభించు నని ప్రత్యేకముగ చెప్పపని లే దని యాతడు (కుంతకుడు) తలచి యుండ వచ్చును.

కా. అలంకృతి రలం కార్య మపోద్ధృత్య వివేచ్యతే
తదు పాయతయా తత్త్వం సాలంకారస్య కావ్యతా. 6

("అలంకార మగు ఉపమాదికము అలంకార్య మగు శబ్దముకంటెను అర్థము కంటెను వేరుచేసి,కావ్యస్వరూప జ్ఞానమునకు ఉపాయముగా చూపబడుచున్నది సాలంకారము (శబ్దార్థరూప అలంకార్యము) కావ్యమనునది మాత్రము తత్త్వము")

వి అలంకార్యము లగు శబ్దార్థములు, అలంకారములు ఈ మూడును కలిసిన సమష్టి రూపమే కావ్యము. ఐనను కావ్యస్వరూపము స్పష్ట

ముగ తెలియుటకై పీటిని వేరు వేరు విషయములుగ చూపుట అలంకారశాస్త్రము నందలి పరిపాటి.

వ్యా. "అలంక్రియతే యయా"-'దేనిచేత అలంకరింపబడునో అది' అని విగ్రహముచే "అలంకృతిః" అను పదమునకు 'అలంకారము' అని యర్థము. అది, వివేచ్యతే=వివరింపబడుచున్నది వాచక మగు శబ్దము, వాచ్యమగు అర్థము ఏతదుభయరూప మగు అలంకార్యము (అలంకరింపతగినది) కూడ వివేచింపబడుచున్నది. అనగా- సామాన్యలక్షణములను, విశేషలక్షణములను, చెప్పి వాటి స్వరూపము నిర్ణయింపబడుచున్నది. ఎట్లుః అపోద్ధృత్య = విడదీసి; వేరు వేరుగా చేసి. సముదాయ రూప మగు ఏకావ్యమునందు ఆ అలంకార్యా లంకారములు రెండును కలసి యున్నవో దానినుండి వాటిని విడదీసి. ఎందు నిమిత్తము? 'తదుపాయతయా'— తచ్ఛబ్దము కావ్యమును పరామర్శించును. తస్య=(ఆ కావ్యమునకు) ఉపాయః = ఉపాయము – తదుపాయము. తదు పాయము యొక్క ధర్మము తదుపాయత. హేతువైన తదుపాయతచేత. కావున ఇట్టి వివేకము కావ్యవ్యుత్పత్తికి ఉపాయ మగును. ఒక సముదాయములో కలిసి ఉన్న వాటికి ప్రత్యేక వ్యక్తిత్వము (స్వతంత్రత్వము) ఉండదు. అవి అసత్య ములు. ఐనను వ్యుత్పత్తి కొరకై- అనగా వాని స్వరూపము స్పష్టముగ తెలి యుటకొరకై వాటిని వేరు వేరుగా విడదీసి వివేచించుట కలదు. ఉదాహర ణకు– ప్రకృతి ప్రత్యయములు ఒక పదములో అంతర్భూతములు; అట్టే పద ములు వాక్యములో అంతర్భూతములు. అయినను పదములనుండి వేరుచేసి ప్రకృతి ప్రత్యయములను, వాక్యమునుండి వేరు చేసి పదము-ను, వైయాకరణులు వివేకించుట కలదు. దీనికి కేవలము వ్యుత్పత్తియే ప్రయోజనము.

వి. భాష అననది భావాభివ్యక్తికై ఉద్దిష్టమైనది. భావమును అభి వ్యక్తము చేయ వలయు నన్న సంపూర్ణ వాక్యమును ప్రయోగించవలెను. కావున భాషలో వాక్యమే యథార్థమైనది. వాక్యములో పదము లున్నవనియు, 'రామః' ఇత్యాది పదములలో "రామ+స్" ఇత్యాది ప్రకృతిప్రత్యయములున్న వనియు విభజించుట కేవలము బాలుర వ్యుత్పత్తికై వైయా కరణు లవలంబించిన ఉపా యము. వాస్తవమున ప్రకృతి, ప్రత్యయ, పదాది విభాగము సత్యము కాదని వైయాకరణుల సిద్ధాంతము.

పదే న వర్ణా విద్యన్తే వర్ణే ష్వవయవా న చ
వాక్యాత్ప దానామత్యన్తం ప్రవివేకో న విద్యతే॥
(వాక్యపదీయము. బ్రహ్మకాండ 73)

అను భర్తృహరి వాక్యము పై విషయమును ప్రతిపాదించుచున్నది. నవీన భాషాశాస్త్రజ్ఞులు కూడ ఈ విషయమునే అంగీకరించుట గమనార్హము.

వ్యా. అసత్యభూత మైనను అలంకారాలం కార్యాది పృథక్కరణము కావ్య వ్యుత్పత్త్యుపాయ మైనచో సత్య మైనది ఏది ? చెప్పుచున్నాడు — "తత్త్వం సాలంకారస్య కావ్యతా" = అలంకారములతో కూడిన శబ్దార్థ సముదాయమే కావ్య మనుట తత్త్వము.

ఇచ్చట పరమార్థ మిది.— సాలంకారస్య = అలంకారములతో కూడిన అవయవరహిత మగు సముదాయమునకే, కావ్యతా - కావ్యత్వము. అందుచే అలంకృత మైనదే కావ్యమనుట యథార్థ స్థితి. అంతియే కాని కావ్యమునందు అలంకారములు కూర్చుట అనునది కాదు. 6

"సాలంకారస్య కావ్యతా" అను వాక్యమున స్థూలముగ కావ్యస్వరూపము నిర్దిష్ట మైనది. అంతియే కాని నిశ్చిత రూపమున నిర్దిష్టము కాలేదు కావున ఇపుడు —కావ్య మని పేర్కొనదగినది ఏది? అను విషయమును చెప్పుచున్నాడు

కా. శబ్దార్థౌ సహితౌ వక్ర కవి వ్యాపార శాలిని
బన్ధే వ్యవస్థితౌ కావ్యం తద్విదాహ్లాద కారిణి. 7

("కావ్య తత్త్వజ్ఞుల కానందమును కలిగించునట్టిదియు, వక్రమైనదియు,కవి వ్యాపారముచే ప్రకాశించుచున్నదియు నగు, బంధమునందు, వ్యవస్థితములును, సహితములును అగు శబ్దార్థములు కావ్యము".)

వ్యా. శబ్దార్థౌకావ్యమ్. వాచక మగు శబ్దము వాచ్య మగు అర్థము, ఈ రెండును కలిసి కావ్య మగును. ఈ రెండును ఒకటి అనుటలో కూడ ఒక వైచిత్ర్య మున్నది.

వి. ఇది వక్రోక్తి జీవితము గాన దీని ప్రారంభమునందు చెప్పిన (శబ్దార్థములు) రెండును ఒకటి (ఒక కావ్యము) అనుటలో గూడ వక్రోక్తి యున్నది.

వ్యా. దీని చేత—కవి కౌశలముచే కల్పిత మగు సౌందర్యాతిశయము గల కేవల శబ్దమే కావ్యమనెడు వారి మతము,రచనా వైచిత్ర్యముచే చమత్కారమును కలిగించు అర్థమే కావ్య మనెడు వారి మతము, ఈ రెండు మతములును నిరాకృతము లైనవి. ఒక్కొక్క నువ్వు గింజలోను తైలము ఉన్నట్లు శబ్దార్థములు రెండిటిలోను కావ్యతత్త్వజ్ఞుల కాహ్లాదమును కలిగించు శక్తి కలదు. ఒక్కదానిలోనే కాదు.

వి. అనగా — ఒక్క శబ్దము గాని, అర్థము గాని కావ్యము కాజాలదు. రెండును కలిసిననే కావ్య మగును. కొన్ని నువ్వుగింజలను కలిపి పిండగా నూనె వచ్చుచున్నది. ఆ నూనె కొన్ని నువ్వులలో నుండి కొన్నిటిలో లేకపోవుట అనునది లేదు. అది అన్ని గింజలలోను ఉన్నది. అదే విధముగ ఆహ్లాదకారిత్వము శబ్దార్థములు రెండిటియందును ఉన్నది.

ఉదాహరణమునకు:-

"భణతరుణి రమణ మన్దిర మానందస్యన్దిసున్దరేన్దు ముఖి
యది సల్లీలోల్లాసిని గచ్ఛసి తత్కిం త్వదీయం మే"
"అనణురణన్మణి మేఖల మవిరత శింజానమంజు మంజీరమ్
పరిసరణ మరుణచరణే రణరణక మకారణం కురుతే"

(ఆనందమును స్యదించు సుంది రేందుని వంటి ముఖము కలదానవును, సలీలముగా సల్లాపములు చేయుదానవును, అరుణచరణవును అగు ఓ తరుణీ! నీవు నీ రమణుని మందిరమునకు పోవుచుండగా, ఒడ్డాణము నందలి మణులు అత్యధికముగ ధ్వనిచేయ, మంజీరములు మంజుశింజాన రణితము చేయ, నీ నడక నిష్కారణముగా నా కెందులకు ఉద్వేగము కలిగించు చున్నది!)

వ్యా ఈ శ్లోకద్వయమునందు ప్రతిభా దారిద్ర్యదైన్యముచే అతిస్వల్ప మగు సుభాషితము గల (మంచి వర్ణనీయ విషయము లేని) కవి సమానరూప ము.లగు వర్ణముల నుపయోగించి, తద్వారా కొంచెము శబ్దరమ్యత్వమును సంపాదింప గలిగెను. అంతియే కాని ఇందులో అర్థవైచిత్ర్య లేశము కూడ లేదు. (అందుచే ఇందు కావ్యత్వములేదు గాన ఇది వ్యతిరేకోదాహరణము.)

నూతన మగు తారుణ్యముచే తొణికిసలాడుచున్న లావణ్యముచే సుందర మైన కాంతి గల కాంతను ప్రేమించుచున్న ఒకానొకడు అనుచున్న— "ఓ

తరుణీ! నీవు రమణ మందిరమునకు వెళ్ళునప్పుడు, నీ గమనము నాకెందులకు అకారణముగ దుఃఖమును కలిగించుచున్నది?"—అను వాక్యము చాల గ్రామ్య ముగ (సౌందర్య విహీనముగ) నున్నది. అకారణముగ అని చెప్పుటకు కూడ వీలు లేదు ఆమెయం దనురక్తుడగు తనను అనాదరము చేసి ఆమె వెడలిపోవు నపుడు తన కామె విరహము భరింప శక్యము కాదనెడు శంకయే ఈ దుఃఖము నకు కారణము కదా!

లేదా- "నీ వట్లు వెడలిపోవుటకు నే నేమి అపరాధము చేసితిని'?—అను అభిప్రాయముతో గమనము అకారణము అని చెప్పుట ఇంకను గ్రామ్యముగ నున్నది. మునులు రచించిన దేవతాస్తోత్రములం లోని ఆమంత్రణముల (సంబో ధనల) వలె నున్న ఇన్ని సంబోధనలతో కావ్యతత్త్వజ్ఞుల యాహ్లాదమున కే మాత్రము పుష్టి చేకూరుటలేదు కావున ఇది నిరర్థకము; నిఃసారము.

శోభాతిశయము లేని కేవల వస్తువు కావ్య మని చెప్పుటకు యోగ్యము గాదు. ఎట్లనగా:-

"ప్రకాశస్వాభావ్యం విదధతి న భావా స్తమసియత్
తథా నైతే తే స్యుర్యది కిల తథా తత్ర న కథమ్.
గుణాధ్యాసాభ్యా సవ్యసన దృఢదీక్షా గురుగుణో
రవివ్యాపారోఽయం కిమథ సదృశం తస్యమ హసః"

("పదార్థములకు ప్రకాశము సహజ సిద్ధముకాదు. ఈ పదార్థములు చీక టిలో ఆ విధముగ (ప్రకాశ స్వభావముగ) లేవు గదా! అవి ప్రకాశ స్వభావము లైనచో తమస్సులో కూడ అట్లే ఏల ఉండవు. ఇది (పదార్థములపై నీల పీతాది) గుణముల అధ్యాసమును చేయుటయొక్క అభ్యాసమనెడు వ్యసనము నందు దృఢదీక్ష యనెడు గొప్ప గుణము గల సూర్యవ్యాపారము ఆ సూర్య తేజస్సుతో సమాన మైనది ఏమి ఉన్నది?)

ఈ శ్లోకము నందు శుష్కము లైన తర్కవాక్యముల వాసనతో నిండిన చిత్తము గల కవి కేవలము ప్రతిభచే కల్పిత మగు వస్తువును మాత్రమే నీరస తర్కాభ్యాస వ్యసనముచేత కూర్చినాడు. అంతియే కాని, శబ్దవక్రతకు సంబం ధించిన సౌందర్యము కొంచె మైనను కనబడుట లేదు. అందుచే ఈ శ్లోకరచన

తర్కవాక్య పద్ధతిలో నడచినది. 'ధర్మలు అగు తమో వ్యతిరిక్తపదార్థములు ప్రకాశ స్వభావములు కావు'— అనునది సాధ్యము. 'తమస్సులో అవినముగ లేవు కనుక' అని హేతువు ఈ విధముగ ఈ శ్లోకవాక్యార్థము అనుమాన వాక్యము వలె నీరసముగ నున్నది.

వి. దేనియందు సాధ్యమున్నట్లు సాధింపబడునో దానికి ధర్మి అని పేరు. దీనిని పక్షమనికూడ అందురు. 'పర్వతో వహ్నిమాన్; ధూమాత్' ఇత్యాద్యను మానములయందు ధూమమను హేతువు (సాధనము) చే వహ్నియను సాధ్యము పర్వతముపై నున్నట్లు సాధింపబడుచున్నది. కావున పర్వతము ధర్మి లేక పక్షము.

వ్యా (ప్రశ్న) ఈ శ్లోకమునందు అనుమానము చూపబడిన దని అను చున్నావు కదా—అటులైన అనుమాన వాక్యమున కావశ్యకమగు దృష్టాంతము నేల చూపలేదు? (సమా.) మనస్సులో తర్కన్యాయమే ప్రతిభాసించుచుండుటచే ఇచట దృష్టాంతము చూపబడలేదు. (అనగా బౌద్ధనైయాయికాదులు అనుమాన మున దృష్టాంత ప్రదర్శన మంత ప్రధానము కాదని యంగీకరించి యున్నారు. అందుచే దృష్టాంతమును చూపకున్నను ఇది అనుమాన వాక్యమనుటలో దోషము లేదు). కావుననే బౌద్ధాది నైయాయికులు ఈ విధముగ చెప్పుచున్నారు.—

"తద్భావహేతుభావౌహి దృష్టాన్తే తదవేదినః
స్థాప్యేతే విదుషాం వాచ్యో హేతురేవహి కేవలః"

"సాధ్యసాధన భావము స్పష్టముగ తెలియని వానికొరకై ఒక దృష్టాంత మును చూపి, దానియందు హేతు హేతు మద్భావము లున్నట్లు స్థాపింతురు. కాని హేతు హేతు మద్భావమును సులభముగ తెలిసి కొనగలిగిన పండితులకు కేవలము హేతువు మాత్రమే చూపబడును."

వి. స్వార్థానుమాన మనియు. పరార్థానుమాన మనియు అనుమానము రెండు విధములు. తనకు అనుమితిజ్ఞానము కలుగుటకు హేతువగు అనుమానము స్వార్థానుమానము తాను ముందుగ ధూమమును బట్టి అగ్నిని ఊహించి ఇతరుల జ్ఞానముకొరకై పంచావయవ వాక్యమును ప్రయోగించునపుడు అది పరార్థాను మానము. ఈ పరార్థానుమాన ప్రయోగమున పంచావయవ వాక్యములు తప్పక ఉండవలె నని నైయాయికుల అభిప్రాయము.

'పర్వతో వహ్నిమాన్' (పర్వతముపై అగ్ని ఉన్నది.) ఇది ప్రతిజ్ఞ. "ధూమ వత్త్వాత్" (ధూమ మన్నది గనుక). ఇది హేతువు. "యోయో ధూమ వాన్ స సోఽగ్ని మాన్; యథా మహానసః" (ఎక్కడెక్కడ ధూమ ముండునో అక్కడక్కడ అగ్ని యుండును. మహానసమునందు వలె) ఇది ఉదాహరణము. 'తథా చాయమ్' (ఇది కూడ అట్టిదియే) ఉపనయము. 'తస్మాత్తథా' (అందుచే ఇది ఇట్లు) నిగమనము.

కొన్ని శాస్త్రములలో(సాంఖ్యశాస్త్రాదులలో) ప్రతిజ్ఞా హేతూదాహరణము లను మూడు అవయవము లున్నచాలు నని ప్రతిపాదింపబడినది. హేమ చంద్రుడు, అనన్తవీర్యుడు మొదలగు జైనాచార్యులు నాలుగు అవయవముల నంగీకరించిరి.కొందరు జైనతార్కికులు, బౌద్ధ తార్కికులును, హేతూదాహరణ ములు రెండు మాత్ర మున్న చాలు నని అంగీకరించిరి ఇచట కుంతకు డుదాహ రించిన శ్లోకమును బట్టి హేతు వొక్కటియే . యున్న చాలు నని అంగీకరించి నట్లున్నది. కాని ఇది ఎవరిమతమో స్పష్టముగ తెలియదు.

వ్యా. "విదధతి" అను నపుడు వి పూర్వక ధా ధాతువునకు చేయుట అని యర్థము. ఇచట 'ప్రకాశ స్వాభావ్యమును చేయుట లేదు' అను అర్థము పొస గదు. "ప్రకాశ స్వాభావ్య" శబ్ద ప్రయోగము కూడ చింత్యమే ప్రకాశః స్వభావః యస్య సః ప్రకాశ స్వభావః = ప్రకాశము స్వభావముగా గలది. ప్రకాశ స్వాభావస్య భావః ప్రకాశ స్వాభావ్యమ్ = ప్రకాశ స్వభావము కలదాని ధర్మము ప్రకాశ స్వాభావ్యమ్ అను వ్యుత్పత్తి చెప్పుపక్షమున['ప్రకాశ స్వభావ' శబ్దముకంటె, "గుణ వచన బ్రాహ్మణాదిభ్యః కర్మణి చ" అను సూత్రముచే (5-1-124) ష్యఞ్ (య) ప్రత్యయము చేసినచో 'తద్ధి తేష్వచా మాదేః' అను సూత్రముచే (7-2-117)] ఆదివృద్ధి వచ్చి 'ప్రాకాశ స్వభావ్యమ్' అను రూపమగును గాని 'ప్రకాశ స్వాభావ్యమ్' అను రూపముకాదు. అట్లుకాక, ముందుగాస్వభావ శబ్దము కలదె 'స్వభావస్య భావః' అను భావార్థమున ష్యఞ్ ప్రత్యయముచేసి 'స్వాభావ్యమ్' అను పదము నిష్పన్నమైన పిదప 'ప్రకాశశ్చాసౌ స్వాభావ్యం చ' అను కర్మధారయ సమాసముచే ప్రకాశ స్వాభావ్యమ్ అను రూపమును సాధించుట కూడ యుక్తము కాదు. స్వభావ శబ్దములోని 'భావ' శబ్దము భూధాతువునకు 'భావే' అను సూత్రముచే (3-3-18) భావార్థక

మగు ష్యఞ్ ప్రత్యయమును చేర్చగా నేర్పడినది. కావున ఒక భావ ప్రత్యయమును చేర్చగా నిష్పన్నమైన భావ ప్రత్యయాంతములకు మరల భావప్రత్యయమును చేర్చుట "మూర్ఖత్వతా" ఇత్యాదులందు వలె అంత సమంజసము కాదు ప్రకాశ శబ్దము స్వాభావ్య శబ్దములో విశేషణము కాదు గాన ఆ రెండు పదములకు, 'ప్రకాశశ్చాసౌ స్వాభావ్య శ్చ' అను కర్మధారయసమాసము కూడ అంత బాగుగ లేదు

తృతీయ పాదమున 'గుణాఢ్యాసాభ్యాస వ్యసన దృఢదీక్షా గురు గుణః' అను దీర్ఘ సమాసము స్పష్టార్థ ప్రతీతికి ప్రతిబంధకముగా నున్నది కావున దీర్ఘ సమాస ప్రయోగ మనెడు ఈ క్రౌర్యము కావ్యతత్త్వజ్ఞులకు ఆనందమును కలిగింపజాలదు. ఇచట రవి అన్ని వస్తువులకు ప్రకాశమును చేకూర్చుచున్నాడు గాన రవికి ప్రాధాన్యము చూపవలెనని యన్నది కాని, 'రవి' శబ్దమును 'రవి వ్యాపారః' అను సమాసమున అప్రధానార్థముగ చేయుట అయుక్తము. తత్పురుషము ఉత్తర పదార్థ ప్రధానము గాన, వ్యాపారమునకే ప్రాధాన్య మిచ్చి నట్లైనది కాని రవికి కాదు 'రవి వ్యాపారః' అనుటకు బదులు 'రవేః' 'వ్యాపారః' అను వ్యస్తపదములను ప్రయోగించి నచో రవికి వివక్షిత మగు ప్రాధాన్యము లభించి యుండెడిది కదా?

వస్తు మాత్రము కూడ అలంకార శూన్యము కావున అది కావ్యమర్మజ్ఞుల కానంద మెట్లు కలిగించును?—అని శంకించరాదు

వి. ఈ వాక్యమునకు— "శోభాతిశయము లేని వస్తుమాత్రమును కావ్యమని చెప్పుటకు వీలు లేదన్నచో అప్రస్తుత ప్రశంసాది స్థలములలో అలంకారమేదియు లేని వస్తుమాత్రము సహృదయ హృదయాహ్లాదము నెట్లు కలిగించును?" అను నర్థమును హిందీ వ్యాఖ్యానములలో వ్రాసియున్నారు. అది పూర్వాపర సంగతముగ నున్నట్లు లేదు. కవి కౌశల కల్పిత కమనీయాతిశయ మగు శబ్దమే కావ్య మను పక్షము గాని, రచనా వైచిత్ర్యచమత్కారకారి యగు వాచ్యమే కావ్య మను పక్షముగాని యుక్తము కాదు—అని ప్రతిపాదించు సందర్భమున మొదట, మొదటి పక్షమును సోదాహరణ ప్రదర్శనముగ ఖండించి పిమ్మట ద్వితీయ పక్షమును గూడ 'ప్రకాశ స్వాభావ్యం' ఇత్యాది శ్లోకమును చూపి ఖండించి యున్నాడు. ఈ శ్లోకములో అర్థము బాగున్నను వాక్య విన్యాసరీతి

బాగులేదు- గాన కావ్యత్వము చేకూరదు అని చెప్పెను. కావున ఇపుడు 'నను వస్తు మాత్రస్య' ఇత్యాది ప్రశ్నను ద్వితీయ పక్షఖండన పర మగు గ్రంథ భాగమునకు సంబంధించిన దానినిగా వ్యాఖ్యానింపవలెను కదా?

"వస్తువు బాగున్నది కాని వాక్యరచనా విధానము అసుందర మగుటచే పై శ్లోకములో కావ్యత్వము లేదని కదా చెప్పుచున్నావు? ఈ వస్తువును మంచి వాక్యమునందే కూర్చెద రనుకొన్నను ఇందు అలంకార మేదియు లేదు. గాన అపుడు మాత్రము దీనికి కావ్యత్వ మెట్లు లభించును?" అని ఈ ప్రశ్నకు అభి ప్రాయము. దీనికి ప్రత్యుత్తర మేమనగా-

వ్యా పై శ్లోకమునం దైనను అలంకారము లేక పోలేదు. ఇది అన్యాప దేశ శ్లోకము గాన దీనిలో అప్రస్తుత ప్రశంసాలంకార ముండనే యున్నది. ఆ అలంకారము మనమున స్ఫురించియే కవి ఈశ్లోకమును వ్రాసినాడు. (కాని దానిని అందమైన వాక్యములో చక్కగా అమర్చలేక పోయినాడు) కవి ప్రతిభలో మొట్టమొదట మెదిలిన వస్తువు బంగారములో పొదుగుటకు పూర్వము సాన పట్టక జాతిముక్క వలె నుండు మణి వంటిది ఆ వస్తువే నేర్పరి యగు కవి రచించిన వక్రవాక్యమునందు సంధృబ్ధమై సాన పట్టిన మణి వలె కావ్యమర్మజ్ఞుల కానందమును కూర్చు కావ్యత్వమును సంపాదించుకొనును ఉదాహరణమునకు వస్తువు ఒక్కటియే యైనను అవహిత చిత్తుడును అనవహిత చిత్తుడును అగు ఇద్దరు కవులు రచించిన ఈ రెండు వాక్యములలో ఎంతయో (చమత్కార) భేద మున్నది.—

"మానినీ జనవిలోచన పాతా
    నుష్ణ బాష్ప కలుషా న భిగృహ్ణాన్.
మన్ద మన్దముదితః ప్రయయౌఖం
    భీత భీత ఇవ శీత మయూఖః॥" కి. అ. 9 26. -13

"క్రమాదేకద్విత్రి ప్రభృతి పరిపాటీః ప్రకటయన్
కలాః స్వైరం స్వైరం నవకమల కన్దాఙ్కుర రుచః।
పురన్ధ్రీణాం ప్రేయో విరహదహనోద్దీపిత దృశాం
కటాక్షేభ్యోబిభ్యన్ని భృతమివ చన్ద్రో భ్యుదయతే॥" 14

"వేడి కన్నీళ్ళతో కలుషము లగు మానవతుల నేత్ర ప్రసారములను గైకొనుచు మెల్ల మెల్లగా ఉదయించిన చంద్రుడు భయపడుచు భయపడుచు వలె (భయముతో నక్కుచు) ఆకాశములోనికి ప్రవేశించెను."

"చంద్రుడు వరుసగ ఒకటి, రెండు మూడు, చొప్పున క్రొత్త తామర తూడుల వంటి కాంతి గల కళలను స్వేచ్ఛగ ప్రకటించుచు, ప్రియవిరహాగ్ని ప్రదీపితము లగు నేత్రములు గల స్త్రీలకటాక్షములకు భయపడుచు, నక్కుచున్నవాడు వలె ఉదయించుచున్నాడు" 14

వ్యా. ఈ వాక్యములలోని భేదము సహృదయ హృదయైక వేద్యము గాన వారే దీనిని గూర్చి తెలిసి కొనవలసి యున్నది మొదటిది సావధాన కవి వాక్య మనియు, రెండవది అసావధాన కవివాక్యమనియు వాక్యనిర్మాణ శిల్పమును బట్టియే సుస్పష్టమగుచున్న దని అభిప్రాయము.

కావున రమణీయతావిశిష్ట మగు కేవల శబ్దము గాని, కేవల అర్థము గాని, కావ్యము కాదనుట నిర్ధారితము. ఈ విషయమునే (భామహుడు) ఇట్లు చెప్పి యున్నాడు.

''రూపకాదిరలం కార స్తథా న్యైర్బహు ధోదితః
న కాంత మపి నిర్భూషం విభాతి వనితాననమ్॥'' 15
' రూపకాది మలం కారం బాహ్యామాచక్షతే పరే
సుపాం తిజాం చ వ్యుత్ప త్తిం వాచాం వాంఛంత్యలం
క్రృతిమ్"॥ 16

"తదేత దాహుః సౌశబ్ద్యం నార్థ వ్యుత్ప త్తిరీదృశీ
శబ్దాభిధేయాలఙ్కార భేదాదిష్టం ద్వయస్తు నః''
(కావ్యాలఙ్కార I.13 to 15) 17

"కొందరిచే రూపకము మొదలగు అలంకారములు అనేక విధములుగ ప్రతిపాదింప బడినవి. అందమైనదైనను స్త్రీ ముఖము అలంకార రహిత మైనచో ప్రకాశింపదు".

"మరికొందరు రూపకాద్యలంకారము బాహ్యమైనది— (వాక్కునకు సంబంధించినది గాన అంత ప్రధానమైనది కానిది)— అని చెప్పుచున్నారు. సుబంత

తిజంత పదముల ("రామః 'బాలః' మొదలగునవి సుబంతములు; 'గచ్ఛతి' 'పఠతి' ఇత్యాదులు తిజంతములు) సాధుప్రయోగమే (శబ్దములకు సంబంధించినది గాన) వాక్కునకు ప్రధానాలంకార మని (వీరు) చెప్పుచున్నారు" 16

"దీనినే శబ్ద సౌన్దర్య మని అనుచున్నారు. అర్థవ్యుత్పత్తి అనగా అర్థ సంనివేశ విశేషరూప మగు అర్థాలంకారము ఇట్టిది కాదు. (అని వీరను చున్నారు) కాని శబ్దాలంకారార్థాలంకారము లనెడు భేదముచే రెండును మాకు సమ్మతములే". 17

వి. "సుపాం తిఙాం చ వ్యుత్పత్తిమ్" అనుదానికి శబ్దముల మనోహర సన్నివేశ మని యభిప్రాయము. దానికే కదా శబ్దాలఙ్కార మని పేరు.

వ్యా॥ అందుచే శబ్దార్థములు రెండును కలిసి కావ్య మని నిర్ణీతమైనది.

ఈ విధముగ శబ్దార్థములు రెండింటికిని కావ్యత్వము స్థాపితమై యుండ, ఒకప్పుడు ఆ రెండింటిలో ఏదైన ఒకదానికి కొంచెము న్యూనత్వ మున్నను (ఏ మైనను శబ్దార్థములు రెండును అచ్చట నున్నవి గాన) కావ్య మని వ్యవహరింపవచ్చును— అనెడు ఆశంక కలుగ వచ్చును. తదాశంకానివృత్తికై "సహితౌ" అని చెప్పబడినది "సహితౌ" అనగా సహభావముతో కలయికతో ఉన్నవి అని యర్థము.

వి. ఇట్టి సహభావము లేనిచో కేవలము శబ్దార్థములు రెండును ఏదియో విధమున నున్నంత మాత్రమున కావ్యము కాదని యభిప్రాయము

వి. ఇచట మూలములో "సహితౌ సహితభావేన సాహిత్యేన......" అను పాఠముకంటె "సహితౌ సహభావేన......" అనుపాఠము బాగున్నది.

వ్యా॥ వాచ్యవాచక సంబంధము (నిత్యముగ) ఉండును. గాన ఈ వాచ్యవాచకములకు ఎన్నడును సాహిత్యము లేకపోవుట అనునది ఉండదుకదా? ఇది సత్యమే కాని ఇచట విశిష్ట మగు సాహిత్యము వివక్షిత మైనది. ఎట్టిది? వక్రతతో విచిత్రము లగు గుణాలంకారసంపదలు పరస్పరమునందు – అనగా శబ్దార్థములు రెంటి యందును స్పర్ధతో సంబంధించి యుండుట, కావుననే:-

శ్లో॥ సమసర్వగుణౌ సన్తౌ సుహృదావివ సంగతౌ
పరస్పరస్య శోభాయై శబ్దార్థౌ భవతో యథా'

"సర్వగుణములును సమముగా నంది మిత్రుల వలె కలసియున్న శబ్దార్థములు ఒకదాని కొకటి శోభను చేకూర్చును" ఎట్లనగా,

"తతోఽరుణ పరిస్పన్ద మన్దీకృతవపుః శశీ
దధ్రేకామ పరిక్షామకామినీగండపాండుతామ్"

"ఇంతలో అరుణోదయముచే మందీభూత మగు శరీరము (కాంతి) గల చంద్రుడు కామముచే (విరహముచే) కృశించిన కామినీ గండ స్థలము నందలి పాండుత్వమును ధరించెను" 19

వ్యా॥ ఈ శ్లోకమున అరుణ పరిస్పన్ద మన్దీకృత శరీరుడు అగు చంద్రుని యందును కామముచే కృశించిన కామినీగండ మండలమందును ఉన్న పాండుత్వపు సామ్యమును సమర్థించుటచే (నిదర్శనారూప) అర్థాలంకార పరిపోషణము శోభాతిశయమును కూర్చుచున్నది ముందు వివరింప నున్న వర్ణవిన్యాస వక్రతా రూపమగు శబ్దాలంకారము గూడ మిగుల రమణీయముగ నున్నది. వర్ణవిన్యాస సౌందర్యముచే సంపాదిత మగు (సర్వశ్లోక వ్యాప్తమైన) లావణ్య గుణ సంపద కూడ ఉండనే ఉన్నది.

మరియు—

లీలాఇ కువలఅం కువలఅం వ ఓసే ముమ్వహంతేణ
సేసేణ సేస పురిసాణ పురుసఆరో సముమ్వసిఓ 20
(లీలయా కువలయం కువలయమివశీర్షే సముద్వహతా
శేషేణ శేషపురుషాణాం పురుషకారః సముద్వాసితః

"భూవలయము నంతను కలువను వలె అనాయాసముగ శిరస్సుపై మోయుచున్న ఆదిశేషుడు ఇతర పురుషుల పురుషకారమును దూరముగ తొలగించినాడు"

వ్యా. ఈ శ్లోకమున అప్రస్తుత ప్రశంస ఉపమ అనెడు రెండు అర్థాలంకారముల వైచిత్ర్యముచే సంపాదితమై, అప్రయత్న సంపాదితము లగు

తిజంత పదముల ("రామః' 'బాలః' మొదలగునవి సుబంతములు; 'గచ్ఛతి', 'పఠతి' ఇత్యాదులు తిజంతములు) సాధుప్రయోగమే (శబ్దములకు సంబంధించినది గాన) వాక్కునకు ప్రధానాలంకార మని (వీరు) చెప్పు చున్నారు". 16

"దీనినే శబ్ద సౌన్దర్య మని అనుచున్నారు అర్థవ్యుత్పత్తి అనగా అర్థ సంనివేశ విశేషరూప మగు అర్థాలంకారము ఇట్టిది కాదు. (అని వీరను చున్నారు) కాని శబ్దాలంకారార్థాలంకారము లనెడు భేదముచే రెండును మాకు సమ్మతములే". 17

వి. "సుపాం తిఙాం చ వ్యుత్పత్తిమ్" అనుదానికి శబ్దముల మనోహర సన్నివేశ మని యభిప్రాయము. దానికే కదా శబ్దాలఙ్కార మని పేరు?

వ్యా. అందుచే శబ్దార్థములు రెండును కలిసి కావ్య మని నిర్ణీతమైనది.

ఈ విధముగ శబ్దార్థములు రెండింటికిని కావ్యత్వము స్థాపితమై యుండ, ఒకప్పుడు ఆ రెండింటిలో ఏదైన ఒకదానికి కొంచెము న్యూనత్వ మున్నను (ఏ మైనను శబ్దార్థములు రెండును అచ్చట నున్నవి గాన) కావ్య మని వ్యవహరింపవచ్చును— అనెడు ఆశంక కలుగ వచ్చును. తదాశంకానివృత్తికై "సహితౌ" అని చెప్పబడినది "సహితౌ" అనగా సహభావముతో కలయికతో ఉన్నవి అని యర్థము.

వి. ఇట్టి సహభావము లేనిచో కేవలము శబ్దార్థములు రెండును ఏదియో విధమున నున్నంత మాత్రమున కావ్యము కాదని యభిప్రాయము

వి. ఇచట మూలములో "సహితౌ సహితభావేన సాహిత్యేన......" అను పాఠముకంటె "సహితౌ సహభావేన......." అనుపాఠము బాగున్నది.

వ్యా వాచ్యవాచక సంబంధము (నిత్యముగ) ఉండును. గాన ఈ వాచ్య వాచకములకు ఎన్నడును సాహిత్యము లేకపోవుట అనునది ఉండదుకదా? ఇది సత్యమే కాని ఇచట విశిష్ట మగు సాహిత్యము వివక్షిత మైనది. ఎట్టిది? వక్రతతో విచిత్రము లగు గుణాలంకారసంపదలు పరస్పరమునందు – అనగా శబ్దార్థములు రెంటి యందును స్పర్ధతో సంబంధించి యుండుట, కావుననే:-

శ్లో॥ సమసర్వగుణౌ సన్తౌ సుహృదావివ సంగతౌ
పరస్పరస్య శోభాయై శబ్దార్థౌ భవతోయథా'

"సర్వగుణములును సమముగా నంది మిత్రుల వలె కలసియున్న శబ్దార్థములు ఒకదాని కొకటి శోభను చేకూర్చును" ఎట్లనగా,

"తతోఽరుణ పరిస్పన్ద మన్దీకృతవపుః శశీ
దధ్రేకామ పరిక్షామకామినీగండపాండుతామ్"

'ఇంతలో అరుణోదయముచే మందీభూత మగు శరీరము (కాంతి) గల చంద్రుడు కామముచే (విరహముచే) కృశించిన కామినీ గండ స్థలము నందలి పాండుత్వమును ధరించెను" 19

వ్యా॥ ఈ శ్లోకమున అరుణ పరిస్పన్ద మన్దీకృత శరీరుడు అగు చంద్రుని యందును, కామముచే కృశించిన కామినీగండ మండలమందును ఉన్న పాండుత్వపు సామ్యమును సమర్థించుటచే (నిదర్శనారూప) అర్థాలంకార పరిపోషణము శోభాతిశయమును కూర్చుచున్నది. ముచ్ముందు వివరింప నున్న వర్ణవిన్యాస వక్రతా రూపమగు శబ్దాలంకారము గూడ మిగుల రమణీయముగ నున్నది. వర్ణ విన్యాస సౌందర్యముచే సంపాదిత మగు (సర్వశ్లోక వ్యాప్తమైన) లావణ్య గుణ సంపద కూడ ఉండనే ఉన్నది.

మరియు—

లీలాఇ కువలఅం కువలఅం వ ఓసే సమువ్వహంతేణ
సేసేణ సేస పురిసాణ పురుసఆరో సముప్వసిఓ 20
(లీలయా కువలయం కువలయమివశీర్షే సముద్వహతా
శేషేణ శేషపురుషాణాం పురుషకారః సముద్వసితః

"భూవలయము నంతను కలువను వలె అనాయాసముగ శిరస్సుపై మోయుచున్న ఆదిశేషుడు ఇతర పురుషుల పురుషకారమును దూరముగ తొలగించినాడు"

వ్యా. ఈ శ్లోకమున అప్రస్తుత ప్రశంస, ఉపమ అనెడు రెండు అర్థాలంకారముల వైచిత్ర్యముచే సంపాదితమై, అప్రయత్న సంపాదితము లగు

యమకాను ప్రాస రూప శబ్దాలంకారములచే మనోహరముగా నున్న, అనిర్వాచ్యమగు కావ్యశోభ అనాయాసముగ అర్థమును గ్రహించుటకు వీలుగ నుండుటచే ఇంకనూ సుందరమై సహృదయుల హృదయముల కానందము కలిగించు చున్నది.

వి. అప్రస్తుత శేషవర్ణన ద్వారా ప్రస్తుత రాజాది వర్ణనము చేయుటచే ఇచట అప్రస్తుత ప్రశంసాలంకారము "కువలమివ" అనునపుడు ఉపమా శబ్దాలంకరములు స్పష్టవేద్యములు

వి. వాచక మగు శబ్దమునకును వాచ్య మగు అర్థమునకును సంబంధము నిత్యముగ ("ఔత్పత్తి కస్తు శబ్దస్యార్థేన సమ్బన్ధః" ఇత్యాది మీమాంసకాదుల మతము ననుసరించి గూడ) ఉండును గాన సహితము లగు శబ్దార్థములు అని చెప్పుటతో విశేష మేమి యున్న దని ప్రశ్నకు అభిప్రాయము. శబ్దమునకును అర్థమునకును లోకములో నున్న సామాన్య సంబంధమువంటి సంబంధము కావ్యములలో నున్న అది పర్యాప్తము కాదు. ఏ శబ్దార్థములు వక్రతా విచిత్రము లగు స్వస్వ గుణాలంకారాదులతో కూడి యుండునో అట్టి శబ్దార్థముల సాహిత్య ముండవలెను. "తతో ఒరుణ ......" ఇత్యాది శ్లోకమున అర్థాలంకారములతో గూడిన అర్థమునకును శబ్దాలంకారములతో గూడిన శబ్దమునకును సాహిత్యమున్నది. లావణ్యగుణము శ్లోకమునం దంతటను వ్యాప్తమై యున్నది. కావున కావ్యములలో ఇట్టి శబ్దార్థముల సాహిత్య ముండవలె నని సిద్ధాంతి అభిప్రాయము

వ్యా. ఇచట ద్వివచనముచే వాచ్యవాచక జాతుల ద్విత్వము చెప్పబడు చున్నది. వ్యక్తిద్విత్వమును బోధించినచో ఒకే పదమునం దున్న వాటికి కూడ కావ్యత్వము వచ్చి యుండెడిది. కావున 'బన్ధేవ్యవస్థితౌ' అని చెప్పుచున్నారు. బన్ధ మనగా వాక్య విన్యాసము దానియందు వ్యవస్థితములై యున్నవి. (విశేషేణ అవస్థితౌ వ్యవస్థితౌ) విశేషేణ = లావణ్యాది గుణములతోడను అలంకారములతోడను శోభించుచున్న సన్నివేశముతో, (అవస్థితౌ) = చేయబడిన స్థితి కలవి. ఉన్నవి

వి 'శబ్దార్థౌ' అను చోట ద్వివచన ముండుటచే ఒక శబ్దము, ఒక అర్థము అని గ్రహింపరాదు అట్లైనచో 'లభా' అను ఒక్క పదమునందే శబ్దార్థములు

రెండును ఉన్నవి గాన ఇది కావ్యము కావలసి వచ్చును. కావున ఇది జాతి వాచకము శబ్దత్వజాతి గల కొన్ని శబ్దములు, అర్థత్వ జాతిగల కొన్ని అర్థములు అని యర్థము. ఈ విషయమును సూచించుటకే బంధమునందు, వాక్యవిన్యాసమునందు "అలంకారాది శోభిత సన్నివేశములతో ఉన్నవి" అని చెప్పినా దని భావము.

వ్యా. 'సహితౌ' అను నపుడు గూడ యుక్త్యనుసారముగా శబ్దమునకు శబ్దాంతరము తోడను, అర్థమునకు అర్థాంతరముతోడను, స్వజాతీయాపేక్షాకృత మగు పరస్పర స్పర్ధిత్వ లక్షణమైన సాహిత్యము అంగీకార్యము అట్లు కానిచో ఆ కావ్యము కావ్యవిదుల హృదయముల కాహ్లాదికారి కాజాలదు ఎట్లనగా —

వి. "సహితౌ"అను దానికి విజాతీయముల సాహిత్యమును అంగీకరించి, 'అర్థముతో కూడిన శబ్దము, శబ్దముతో కూడిన అర్థము' అను నర్థము వెనుక చెప్పబడినది ఇచట సహితము లగు శబ్దార్థములు పరస్పర విజాతీయములు. కాని ఇపుడు సజాతీయముల సాహిత్యము — అనగా శబ్దమునకు శబ్దాంతరతోడను, అర్థమునకు అర్థాంతరము తోడను, సాహిత్యము అను నర్థమునకు చెప్పబడుచున్నది కావ్య సౌందర్యము నినుమడింపు చేయుటకు శబ్దము లన్నియు ఒకదానితో నొకటి పోటీ పడవలెను. అర్థములు కూడ ఒకదానితో నొకటి పోటీ పడవలయును. ఇది మరియొక విధమగు "సాహిత్య" నిర్వచనము ఇట్టి సాహిత్యము లేనిచో సహృదయ హృదయాహ్లాద కారిత్వ ముండదు.

"అసారం సంసారం పరిముషితరత్నం త్రిభువనం
నిరాలోకం లోకం మరణశరణం బాన్ధవ జనమ్
అదర్పం కందర్పం జననయన నిర్మాణమఫలం
జగజ్జీర్ణారణ్యం కథమసి విధాతుం వ్యవసితః" 21

(మాలతీ మాధవమ్. 5.30)

'ఏమిది నీ వీ సంసారమును అసారముగను, త్రిభువనములను దొంగిలింపబడిన రత్నము కలవానినిగను లోకమును తేజోహీనముగను బాంధవ జనమును మరణమే శరణము కలదానినిగను, మన్మథుని గర్వరహితునిగను

యమకాను ప్రాస రూప శబ్దాలంకారములచే మనోహరముగా నున్న, అనిర్వాచ్య మగు కావ్యశోభ అనాయాసముగ అర్థమును గ్రహించుటకు వీలుగ నుండుటచే ఇంకనూ సుందరమై సహృదయుల హృదయముల కానందము కలిగించు చున్నది.

వి. అప్రస్తుత శేషవర్ణన ద్వారా ప్రస్తుత రాజాది వర్ణనము చేయుటచే ఇచట అప్రస్తుత ప్రశంసాలంకారము "కువలమివ" అనునపుడు ఉపమా శబ్దా లంకరములు స్పష్టవేద్యములు.

వి. వాచక మగు శబ్దమునకును వాచ్య మగు అర్థమునకును సంబంధము నిత్యముగ ("ఔత్పత్తి కస్తు శబ్దస్యార్థేన సమ్బన్ధః" ఇత్యాది మీమాంస కాదుల మతము ననుసరించి గూడ) ఉండును గాన, సహితము లగు శబ్దార్థ ములు అని చెప్పుటతో విశేష మేమి యున్న దని ప్రశ్నకు అభిప్రాయము. శబ్దమునకును అర్థమునకును లోకములో నున్న సామాన్య సంబంధమువంటి సంబంధము కావ్యములలో నున్న అది పర్యాప్తము కాదు. ఏ శబ్దార్థములు వక్రతా విచిత్రము లగు స్వస్వ గుణాలంకారాదులతో కూడి యుండునో అట్టి శబ్దార్థముల సాహిత్య ముండవలెను. "తతోఽరుణ ·· ......" ఇత్యాది శ్లోక మున అర్థాలంకారములతో గూడిన అర్థమునకును శబ్దాలంకారములతో గూడిన శబ్దమునకును సాహిత్యమున్నది. లావణ్యగుణము శ్లోకమునం దంతటను వ్యాప్తమై యున్నది. కావున కావ్యములలో ఇట్టి శబ్దార్థముల సాహిత్య ముండవలె నని సిద్ధాంతి అభిప్రాయము.

వ్యా. ఇచట ద్వివచనముచే వాచ్యవాచక జాతుల ద్విత్వము చెప్పబడు చున్నది. వ్యక్తిద్విత్వమును బోధించినచో ఒకే పదమునం దున్న వాటికి కూడ కావ్యత్వము వచ్చి యుండెడిది. కావున 'బన్ధేవ్యవస్థితౌ' అని చెప్పుచున్నాడు. బన్ధ మనగా వాక్య విన్యాసము దానియందు వ్యవస్థితములై యున్నవి. (విశే షేణ అవస్థితౌ వ్యవస్థితౌ) విశేషేణ = లావణ్యాది గుణములతోడను అలంకార ములతోడను శోభించుచున్న సన్నివేశముతో, (అవస్థితౌ) = చేయబడిన స్థితి కలవి; ఉన్నవి.

వి "శబ్దార్థౌ" అను చోట ద్వివచన ముండుటచే ఒక శబ్దము, ఒక అర్థము అని గ్రహింపరాదు అట్లైనచో 'లతా' అను ఒక్క పదమునందే శబ్దార్థములు

రెండును ఉన్నవి గాన ఇది కావ్యము కావలసి వచ్చును. కావున ఇది జాతి వాచకము శబ్దత్వజాతి గల కొన్ని శబ్దములు, అర్థత్వ జాతిగల కొన్ని అర్థములు అని యర్థము. ఈ విషయమును సూచించుటకే ఐంథమునందు, వాక్యవిన్యాసము నందు "అలంకారాది శోభిత సన్నివేశములతో ఉన్నవి" అని చెప్పినా దని భావము.

వ్యా. 'సహితౌ' అను నపుడు గూడ యుక్త్యనుసారముగా శబ్దమునకు శబ్దాంతరము తోడను, అర్థమునకు అర్థాంతరముతోడను, స్వజాతీయాపేక్షాకృత మగు పరస్పర స్పర్ధిత్వ లక్షణమైన సాహిత్యము అంగీకార్యము అట్లు కానిచో ఆ కావ్యము కావ్యవిదుల హృదయముల కాహ్లాదికారి కాజాలదు ఎట్లనగా—

వి. "సహితౌ"అను దానికి విజాతీయముల సాహిత్యమును అంగీకరించి, 'అర్థముతో కూడిన శబ్దము, శబ్దముతో కూడిన అర్థము' అను నర్థము వెనుక చెప్పబడినది ఇచట సహితము లగు శబ్దార్థములు పరస్పర విజాతీయములు. కాని ఇపుడు సజాతీయముల సాహిత్యము — అనగా శబ్దమునకు శబ్దాంత తోడను, అర్థమునకు అర్థాంతరము తోడను, సాహిత్యము అను నర్థమునకు చెప్పబడుచున్నది. కావ్య సౌందర్యము నినుమడింపు చేయుటకు శబ్దము లన్నియు ఒకదానితో నొకటి పోటీ పడవలెను. అర్థములు కూడ ఒకదానితో నొకటి పోటీ పడవలయును. ఇది మరియొక విధమగు "సాహిత్య" నిర్వచనము. ఇట్టి సాహిత్యము లేనిచో సహృదయ హృదయాహ్లాద కారిత్వ ముండదు.

"అసారం సంసారం పరిముషితరత్నం త్రిభువనం
నిరాలోకం లోకం మరణశరణం బాన్ధవ జనమ్
అదర్పం కందర్పం జననయన నిర్మాణమఫలం
జగజ్జీర్ణారణ్యం కథమసి విధాతుం వ్యవసితః" 21

(మాలతీ మాధవమ్. 5.30)

'ఏమిది నీ వీ సంసారమును అసారముగను, త్రిభువనములను దొంగిలింపబడిన రత్నము కలవానినిగను లోకమును తేజోహీనముగను బాంధవ జనమును మరణమే శరణము కలదానినిగను, మన్మథుని గర్వరహితునిగను

జనుల నయన నిర్మాణమును వ్యర్థమైన దానినిగను, జగత్తును జీర్ణారణ్యము గను చేయ నమకట్టినావా"? 21

ఇచట నొక ప్రబంధములో ఒక కాంతను చంప నుంకించుచున్న ఒక కాపాలికునితో - ఈమె లేనిచో సంసారము నిస్సారమగును, త్రైలోక్యము హృత సర్వస్వ మగును జీవలోకము దర్శనీయవస్తు శూన్య మగును. లోక లోచన నిర్మాణము వ్యర్థ మగును, మన్మథుని-మూడు లోకములను జయింప గల ననెడు గర్వము తొలగి పోవును. జగత్తు పాడు పడిన అడవి వలె యగును. ఇట్టి అకార్యమును చేయసమకట్టితివేమి? అని పల్కుచున్నాడు. (మాధవుడు).

ఈ శ్లోక మొక మహావాక్యము (అనేక వాక్యసముదాయము) వలెనున్నది. ఇందులోని అవాంతర వాక్యముల వలె నున్న ఇతర వాక్యములు ఒకదానితో నొకటి పోటీ పడుచు సకల లోకాకర్షక మగు ఆమె సౌందర్యాతిశయమును ప్రతిపాదించునట్లు నిర్మితములై అపూర్వ మగు కావ్యశోభాతిశయమును పోషించుచున్నవి కాని "మరణశరణం బాన్ధవజనమ్" అనునది మాత్రము పై ఇతర వాక్యములతో నేమాత్రమును స్పర్ధ చేయజాలకున్నది కావున ఇది కావ్యతత్త్వజ్ఞుల కాహ్లాదమును కూర్ప జాలదు.

వి. ఈమె మరణించినచో బంధుపులు మరణింతురని చెప్పుటచే వారి ప్రేమాతిశయము సూచిత మగు చున్నది గాని, ఆమె సౌందర్యాతిశయము సూచిత మగుట లేదు.

ఒక ప్రధాన విషయము బోధించుటకై కొన్ని చిన్న వాక్యములను ప్రయోగించినచో వాటి సముదాయముచే నేర్పడిన మొత్తము వాక్యమునకు మహావాక్య మని పేరు. ఛిన్న వాక్యములు అవాంతర వాక్యములు. ఇచట "అసారం సంసారం" ఇత్యాదులు పూర్ణ వాక్యములు కావు. "సంసారః అసారః భవిష్యతి" ఇత్యాది విధముగ ప్రయోగించినచో పూర్ణవాక్యములై యుండెడివి. కావున ఇవి అవాంతర (పూర్ణ) వాక్యములు కావు, తత్సముదాయము మహావాక్యము కాదు కాని అట్లు భాసించుచున్నది. కావుననే "మహా వాక్యకల్పే" "అవాంతర వాక్య సదృశాని" అని చెప్పియున్నాడు.

వ్యా. ఏకవాక్యమునకు ఉపయోగించు అనేక రమణీయ విషయములు ఒక్క మారుగ స్ఫురించిన పిమ్మట ఘటియొక విషయమును అట్టిదానినే వాక్యార్థ

పూరణమునకై సంపాదింపవలని వచ్చినపుడు ప్రయత్నముచే ప్రతిభ ప్రసన్నము చేయబడును. ఈ శ్లోకమునందు కూడ అట్లే ప్రస్తుత మగు వస్తువుతో సమాన మగు "విధి మపి విపన్నాద్భుత విధిమ్" (బ్రహ్మను కూడ నశించిన అద్భుత సృష్టి కలవానినిగా) అని వస్త్వంతరము సులభమే

వి. ప్రయత్నించి ప్రతిభను ఉపయోగించినచో ఇట్టి విషయ మేదైన లభించి యుండెడిది. కాని ఈ కవి అట్టి ప్రయత్నము చేయక ఇతర వాక్యము లతో సరిగా పొసగని "మరణశరణం బాన్ధవజనమ్" అను వాక్యమును చేర్చి నా డని తాత్పర్యము.

వ్యా. మొదట స్ఫురించిన పదార్థములతో సమానములగు పదార్థాంతర ములు లభింపనపుడు కవులు సుకుమార తర మగు ఒక అపూర్వ విషయమును గూర్చి చెప్పనలవి కాని ఒకానొకకావ్య సౌందర్యమును వికసింప చేయుచుందురు.

ఉదాహరణమునకు :-

"రుద్రాద్రేస్తులనం స్వకంఠవిపినచ్ఛేదో హరే ర్వాసనం
కారావేశ్మని పుష్పకాపహరణమ్...''22 (బాలరామాయణము 1 51)

"కైలాసాద్రిని కదుపుట, తన కంఠ సముదాయమును ఛేదించుకొనుట, దేవేంద్రుని కారాగార బద్ధునిచేయుట పుష్పకమును లాగికొని పోవుట"

అని వర్ణించి, మొదట కూర్చిన పదార్థములకు అనురూప మగు మరియొక వస్తువేదియును లభించకపోవుటచే "యస్యేదృశాః కేలయః" (ఎవ్వడు ఇట్టి క్రీడలు చేయుచుండునో) అను ఒక అపూర్వ విషయము ఉంచబడినది. దీనితో మిగిలిన వాటికి కూడ ఒక విధమగు సౌందర్యము లభించినది. ఇంకను ఎట్లనగా—

"తద్వక్త్రేన్దు విలోకనేన దివసో నీతః ప్రదోష స్తథా
తద్గోష్ఠ్యైవ నిశాపి మన్మథకృతోత్సాహై స్తదఙ్గార్పణైః
తాం సంప్రత్యపి మార్గదత్తనయనాం ద్రష్టుం ప్రవృత్తస్య మే
బద్ధోత్కంఠమిదం మనః కిమ్...' 23 [తాపసవత్సరాజచ. 1 68]

"ఆమె ముఖచంద్రుని చూచుటలో పగలు గడచినది ఆమెతో సంభాషణలు చేయుటలో సంధ్యాకాలము గడిచినది. మన్మథునిచే చేయబడిన ఉత్సాహము గల ఆమె యొక్క అవయవ సమర్పణములచే రాత్రి కూడ గడిచినది. ఇపుడుకూడ నా రాకకై ఎదురు చూచుచున్న ఆమెను చూచుటకై ప్రవర్తించుచున్న నా మనసు ఎందుచేత ఉత్కంఠితమై యున్నదో''?

వ్యా. ఇచట "ఇపుడు కూడ ఈ విధముగా నున్న ఆమెను చూచుటకై ప్రవర్తించుచున్న నా మనస్సు ఏల ఉత్కంఠ పొందుచున్నదో?" అనుటతోడనే వాక్యము సమాప్తమైనను, "అథవా ప్రేమాస మాప్తోత్సవమ్'' (లేదా ప్రేమకు ఉత్సవ సమాప్తి యనునది లేదు) అను అపూర్వ వస్తువిన్యాసము చేయబడినది. దీనితో వెనుక నున్న వాక్యములకు జీవిత మిచ్చినట్లయినది.

వి. అనగా ఈ చివరి వాక్యము లేకపోయినను ప్రధాన వాక్యార్థము పూర్ణమైనది; అయినను ఈ వాక్యమును గూడ చేర్చుటతో వెనుక చెప్పిన అర్థమునందు చమత్కారాతిశయము గోచరించుచున్న దని భావము.

వ్యా. పై రెండు ఉదాహరణములందును శబ్దార్థసాహిత్యమునకే ప్రాధాన్యము నిచ్చి వాక్య నిర్మాణము చేయబడినది. అయినను (వాటి చమత్కార తారతమ్యమున) కవి ప్రతిభా ప్రౌఢియే ప్రాధాన్యమును వహించుచున్నది.

వి. అనగా, 'అసారం సంసారం' ఇత్యాది శ్లోకమున కవి ప్రయత్న పూర్వకముగ తన ప్రతిభ నుపయోగించక పోవుటచే ''మరణశరణం బాన్ధవ జనమ్'' అను వాక్యమును ప్రయోగించినాడు. అందుచే అర్థముల నడుమ పరస్పర స్పర్థిత్వరూప సాహిత్యము కొరతపడినది. కాని 'రుద్రాద్రేః' 'తద్వ త్త్రైస్తు' అను శ్లోకములలో కవి ప్రతిభా ప్రౌఢిచే అర్థములకు పరస్పర సాహిత్యము బాగుగ కుదిరినది అని అభిప్రాయము.

వ్యా. శబ్దమునకు మరి యొక శబ్దముతో సాహిత్యము లేకపోవుటకు ఉదాహరణము ఎట్లనగా:-

చారుతా వపు రభూషయ దాసాం
తామనూన నవయౌవనయోగః
తం పునర్మకర కేతన లక్ష్మీ
స్తాంమదోదయిత సంగమభూషః॥ 24

(శిశుపాలవధ-10-18)

"సౌందర్యము ఈ స్త్రీల శరీరమును అలంకరించెను. పరిపూర్ణ మగు నూతన యౌవన సంబంధము దానిని (అలంకరించెను) మన్మథలక్ష్మి దానిని (అలంకరించెను). ప్రియ సంగమమే భూషణముగా గల మదము దానిని అలంకరించెను."

వ్యా "దయితసంగమము దానిని అలంకరించెను" అని చెప్పవలసి యుండగా ఎట్టి మదము? దయిత సంగమము దేనికి అలంకారమో అట్టిది; అని చెప్పు నపుడు ప్రధానముగ వివక్షిత మగు 'దయిత సంగమ' శబ్దము సమాస వృత్తిలో అంతర్భూత మగుటచే అప్రధాన మగుట కావ్యజ్ఞుల కాహ్లాదము కలిగింపదు. కావ్యమునకు శోభను కూర్చుటకై కూర్చిన దీపకాలంకారము చివరకు తెగిపోవుటచే ప్రక్రమభంగముచే గలిగిన సరస హృదయవైరస్యము అనివార్యము. "దయిత సఙ్గతిరేనమ్" అను పాఠాంతరము సులభమేకదా!

వి. అనగా 'చారుత' మొదలగు అనేకములకు 'అభూషయత్' అను ఒక క్రియతో అన్వయ ముండుటచే దీపకాలంకారము ప్రారంభింపబడినది. 'దయిత సఙ్గమభూషః' అనునపుడు ప్రధానముగా చెప్పవలసిన దయితసంగమమునకు అప్రాధాన్యము కలుగుటయే కాక, ఆ దీపకనిర్వాహమునకు భంగము కూడ వచ్చుచున్నది. ఈ రెండు దోషములను నివారించుటకు "దయిత సఙ్గతి భూషః" అను పాఠమునకు బదులు 'దయిత సఙ్గతి రేనమ్' అను పాఠమును కూర్చినచో దయిత సంగమమునకు అభీప్సిత మగు ప్రాధాన్యమును బాగుగ నిర్వహించినట్లు అగును అని భావము. ఈ విధముగ నిది శబ్దమునకు అనుకూల మగు శబ్దాంతరముతో సాహిత్యము లేకపోవుటకు ఉదాహరణము.

మమ్మటాదులు ఒక క్రియతో గాని, కారకముతో గాని అనేకములు అన్వయించునపుడు దీపక మని యంగీకరించినను ఆ విధముగ అన్వయించు వాటిలో కొన్ని ప్రస్తుతములు మరికొన్ని అప్రస్తుతములు నై యుండవలె ననియు, వాటి నడుమ ఉపమానోపమేయ భావము కూడ ఉండవలె ననియు చెప్పియున్నారు. కావున ఆ దీపక లక్షణము ఈ శ్లోకమున కుదురదు. అయినను కుంతకుడు భామహసూచిత మగు లక్షణము ననుసరించి ఒకదానికి అనేకములతో సంబంధ మున్న దీపక మని లక్షణమును చెప్పుకొన్నాడు. ఆ లక్షణము ప్రకారమే ఇచట దీపకాలంకార మని చెప్పుట కుదురును. మమ్మటాదుల లక్షణము ప్రకారము

ఇచట దీపకము కాదు కావుననే మల్లినాథు డీ శ్లోకమున ఏకావల్యలంకారము నంగీకరించెను (కుంతకుడు మమ్మటునికంటె ప్రాచీనుడు)

వ్యా. పై రెండు ఉదాహరణములలో (అసారం సంసారం; చారుతావపుః, అను శ్లోకములలో) ప్రాధాన్యమును పురస్కరించుకొని ఒక్కొక్క దానితో ఒక్కొక్క దాని సాహిత్య విరహము (మొదటి దానిలో అర్థ సాహిత్యాభావము; రెండవదానిలో శబ్ద సాహిత్యాభావము) ప్రతిపాదింప బడినది. వాస్తవమున-శబ్దార్థములు రెండింటిలో నొకదానికి సాహిత్యము లేకపోయినచో రెండవదానికి కూడ సాహిత్య ముండదని, చెప్పకున్నను పర్యవసించును, ఒక అర్థము తాను స్ఫురించుచున్నను స్వబోధన సమర్థ మగు వాచకము (శబ్దము) లేకున్నచో నిర్జీవము వలె నుండును. అట్లే శబ్దము కూడ వాక్యమునకు ఉపయుక్త మగు వాచ్యము సంభవించనపుడు అర్థాన్తర బోధక మగుచు ఈ వాక్యమునకు వ్యాధి వలె కనబడును. ఇక ప్రసక్తాను ప్రసక్త మగు ఈ విచారము చాలును

వి. అర్థమునకు అర్థాంతరసాహిత్యము లేదన్నచో శబ్ద సాహిత్యము కూడ లేదనియే అర్థము అసారం అను శ్లోకమున "మరణ శరణం బాన్ధవ జనమ్" అను దాని కేదియో విధముగ నాయికా సౌందర్యాతిశయ ద్యోతకత్వ మును ప్రతిపాదించినను అచట ప్రయోగించిన పదములకు ఆ అర్థమును బోధించు శక్తి లేకపోవుటచే శబ్ద సాహిత్యము లేదు. అట్లే, శబ్దమునకు శబ్దాంతర సాహిత్యము లేదన్నచో అర్థసాహిత్యము కూడ లేదనియే అర్థము 'చారుతా వపుః' అను శ్లోకమున 'దయిత సజ్జమ భూషః' అను చోట శబ్ద సాహిత్యము లేదు. కాని ఈ పదము బోధింప వలసిన అర్థమును బోధింపజాలక అర్థాంతర మును బోధించుచున్నది. అందుచే ఇచట అర్థసాహిత్యము కూడ లేదు. ఈ విధముగ శబ్దార్థ సాహిత్యములలో నొకటి లేదన్నచో రెండవది కూడ ఉండ దను విషయము అర్థాత్సిద్ధమని యభిప్రాయము.

వ్యా. ప్రకృతమైతే-ఎట్టి బంధమునందు: "వక్రకవి వ్యాపారశాలిని", వక్రః = శాస్త్రాదులలో ప్రసిద్ధములగు శబ్దార్థముల కూర్పుకంటె భిన్న మగు నట్టిదియు, ఆరు విధము లగు వక్రత్వములతో కూడిన, కవి వ్యాపారః = కవి యొక్క క్రియావిధానము ఏదికలదో, దానిచే, శాలతే = శ్లాఘించునది. అనగా ప్రకాశించునది అగు బంధమునందు. కష్ట కల్పనలచే పాడుచేయబడిన బంధము

కూడ ప్రసిద్ధ బంధముకంటె వ్యతిరిక్తముగనే ఉండును కదా యని ఆశంకించ కొని చెప్పుచున్నాడు- 'తద్విదాహ్లాదకారిణి. తచ్ఛబ్దము కావ్యమును పరామర్శించును తత్ = ఆ కావ్యములను, విదన్తీతి = తెలిసికొనువారు కాగా, తద్విదః = కావ్యజ్ఞులు. వారికి ఏది ఆహ్లాదము కల్గించునో అట్టి బంధము నందు వ్యవస్థితము లైనవి. వక్రత్వము, వక్రతా భేదములు, తద్విహ్లాదకారిత్వము, ఇవి వేరు వేరుగ ఆయాస్థానములలో సోదాహరణముగ నిరూపింపబడ గలవు 7

అవ. ఈ విధముగ కావ్యమునకు సామాన్య లక్షణమును చెప్పి ఇపుడు విశేషణ లక్షణము నుపక్రమించు చున్నాడు. ముందుగ శబ్దార్థముల స్వరూపమును నిరూపించుచున్నాడు.

కా. వాచ్యోర్థోఽ వాచకః శబ్దః ప్రసిద్ధమితి యద్యపి
తథాపి కావ్యమార్గేఽస్మిన్ పరమార్థోయ మేతయోః 8

"బోధింపబడునది అర్థమనియు బోధించునది శబ్దమనియు ప్రసిద్ధమే యైనను ఈ కావ్యమున వీని పరమార్థము ఇది" 8

ఇతి = ఈ విధమైన వస్తువు. ప్రసిద్ధమ్ = ప్రసిద్ధమైనది, యః = ఏది, వాచకః = వాచకమో అది, శబ్దః = శబ్దము; ఏది. వాచ్యః = బోధింపతగినదో అది అర్థము అని (ప్రశ్న) శబ్దములు ద్యోతకములుగను వ్యంజకములగను గూడ ఉండవచ్చును కదా? (సమాధానము) వాటిని సంగ్రహింపక పోవుట వలన అవ్యాప్తిలేదు ఏఽయన అర్థప్రతీతిని కలిగించుట అను సాదృశ్యముచే ఆరోపణముచే అవి గూడ వాచకములే. ఇట్లే ద్యోత్య వ్యంగము లగు అర్థములు గూడ, ప్రమేయములే (బోధ్యములే) యనెడు సామ్యముచే, ఆరోపణము వలన వాచ్యములే కావున అర్థమును బోధించుట శబ్దముచే బోధింపబడుట అనెడు శబ్దార్థముల లక్షణము లోకమునందు నుప్రసిద్ధ మైనను ఈ అలౌకికమగు, కావ్యమార్గే = కావ్యమార్గమునందు ఏతయోః = ఈ రెండిటి యొక్క; అయం = చెప్పబడబోవు లక్షణముగల, పరమార్థః = ఒకానొక అపూర్వ మగు తత్త్వము అని యర్థము.

వి. సింహమునందున్న శౌర్యాది గుణములు రాజునందు కూడ ఉండు టచే ఆ సాదృశ్యమును బట్టి 'ఈ రాజు సింహము' అని ప్రయోగింతురు. సాదృశ్యమును బట్టి సింహత్వారోపమునకు ఉపచార మని పేరు. ఇట్టి ప్రయో గములకు ఔపచారిక ప్రయోగము లనియు గౌణ ప్రయోగము లనియు పేర్లు అట్లే-కొన్ని శబ్దములు ద్యోతకములు కావచ్చును. కొన్ని వ్యంజకములు కావచ్చును. ఏమైనను ఆ శబ్దములు అర్థవిశేషములను బోధించుచున్నవి గాన వానిని బోధకత్వ సామ్యముచే వాచకము లనుటలో తప్పులేదు. 8

వ్యా. అది (శబ్దార్థముల అపూర్వ తత్త్వము) ఎట్టి దనగా చెప్పు చున్నాడు —

కా. శబ్దో వివక్షితార్థైకవాచకోఽన్యేషు సత్స్వపి
అర్థః సహృదయాహ్లాదకారి స్వస్పంద సుందరః 9

"ఇతర శబ్దము లున్నను వివక్షితమగు-అర్థమునకు ఏకైక వాచక మగు నది శబ్దము. సహృదయులకు ఆహ్లాదమును కలిగించెడు స్వభావముచే సుందర మగునది అర్థము". 9

వ్యా. ఏది కావ్యమునకు తగిన సమస్త సామగ్రి కలదో అదియే కావ్యమునందు శబ్దము. ఎటువంటిది? 'వివక్షి తార్థైక వాచకః' వివక్షితః చెప్పు టకు ఇష్ట మైన ఏ అర్థము కలదో, తదేక వాచకః = తస్య=దానికి, ఏకః = ఇది యొక్కటియే, వాచకః =వాచకముగా నున్నది. ఎట్లు? అన్యేషు సత్స్వపి=తద్వాచకము లైన ఇతరము లైన అనేక పదములున్నను.

వి. ఒక అర్థమును బోధించుట కెన్నియో- శబ్దము లున్నను కవి చెప్ప దలచిన విషయమును బోధించు శక్తి ఒక్క- శబ్దమునకు మాత్రమే యుండును. కావ్యమున అట్టి శబ్దమే శబ్దము.

వ్యా. కావుననే సామాన్య రూపమున చెప్పదలచిన అర్థమును విశేష వాచక మగు శబ్దము బాగుగా బోధింప జాలదు ఎట్లనగా—

కల్లోల వేల్లిత దృషత్పరుష ప్రహారై
రత్నాన్యమూని మకరాకర మావమంస్థాః.

కిం కౌస్తుభేన భవతో విహితో న నామ,
యాచ్ఞా ప్రసారిత కరః పురుషోత్త మోఽపి. 25
(భల్లటశతకము 62)

"ఓ సముద్రమా! తరంగములలో చుట్టితెచ్చిన రాళ్ళయొక్క పరుషము లగు ప్రహారములచేత ఈ రత్నములను అవమానింపకుము. కౌస్తుభమణిచేత పురుషోత్తముడు గూడ నీ ఎదుట యాచించుటకై చాపబడిన హస్తములు కలవాడుగా చేయబడలేదా?"

వ్యా. ఇచట సామాన్యరూపమున అన్నిరత్నముల ఉత్కర్షవర్ణనము ప్రారంభింప బడినది. రత్నవిశేషాభిధాయక మగు 'కౌస్తుభేన' అను పదము రత్నములలో నొకదాని ఉత్కర్షను చెప్పుటతో ఉపసంహరించుచున్నది. ఈ విధముగ ఉపక్రమోప సంహారముల వైషమ్యము శోభాతిశయజనకముగ లేదు.

విశేషమునందు ఏ గుణసముదాయ గౌరవ ముండునో అది యంతయు సామాన్యమునందు గూడ సంభావ్యమే కదా యని చెప్పుటకు వీలులేదు. ఏలయన

"వాజి వారణలోహానాం కాష్ఠపాషాణ వాససామ్।
నారీపురుషతోయానామన్తరం మహదన్తరమ్॥" 26

"అశ్వములు, గజములు-లోహములు కాష్ఠములు, రాళ్ల (రత్నములు) వస్త్రములు, స్త్రీలు, పురుషులు, ఉదకములు, వీటికి [తమ స్వజాతీయములతో] భేదము-చాల భేద ముండును." 26. అని చెప్పుదురు

వ్యా. కావున ఇట్టి విషయములందు సామాన్య వాచక మగు శబ్దమే సహృదయహృదయ హారిగ నుండును. ప్రకృతమునందు అట్టి- "ఏకేన కిం న విహితో భవతః స నామ" (ఒక్క రత్నముచే చేయబడలేదా మొన) అను పాఠాంతరమును తేలికగ కూర్చ వచ్చును.

విశేషరూపమున ఒక వస్తువును ప్రతిపాదింపవలె నని అనుకొనునప్పుడు కవులు విశేష వాచకమగు ఒక శబ్దమును కూర్తురు. ఎట్లనగా-

"ద్వయం గతం సంప్రతి శోచనీయతాం
సమాగమప్రార్థనయా కపాలినః।

కలా చ సా కాన్తిమతీ కలావత
స్త్వమస్య లోకస్య చ నేత్రకౌముదీ'' 27

"కపాలియొక్క సమాగమమును ప్రార్థించుటచే, ఆ కాంతిమంత మగు చంద్రుని కలయు, లోకపు నేత్రములకు వెన్నెల వైన నీవును, ఈ ద్వయమును ఇప్పుడు దయనీయ దశనుపొందినది." 27

ఇచట పరమేశ్వర వాచకము లగు వేలకొలది శబ్దము లున్నను బీభత్స రసమునకు ఆలంబన విభావ మగుదానిని బోధించు కపాలినః అను శబ్దము జుగుప్సాజనకమగు విధమున ప్రయోగింపబడినదై ఒక విధమగు వాచక వక్రతను కల్పించుచున్నది. 'సంప్రతి' 'ద్వయం' అనునవి ఇంకను రమణీయములు. ఏలయన-పూర్వ మా చంద్రుని కల యొక్కటియే దుర్వ్యసన దూషిత మగుటచే జాలిపడవలసిన యవస్థలో నుండెను. ఇప్పుడు నీవు కూడ ఆ చంద్రకళ చేసిన (కపాలాశ్రయ రూప) దుష్టనిశ్చయమున సాహాయ్యమును చేయుట కుపక్రమించినట్లున్నావు; అని ఉపహాసము చేయబడుచున్నది. 'ప్రార్థనా' శబ్దము కూడ మిగుల రమణీయ మైనది ఏలయన- కాకతాలీయముగ ఆ కపాలితో సమాగమ మేర్పడినచో అంత నింద్యార్థము కాకపోవచ్చును. (ఆ సమాగమమును) ప్రార్థించుట యనునది మాత్రము ఎంతయు అపవాద కలంకమునకు కారణభూతము. ఇరువురును (చంద్రకలాపార్వతులు) ఒండొరులతో స్పర్ధ చేయతగిన లావణ్యాతిశయము కలవారు అను నర్థమును ప్రతిపాదించుటకై 'సాచ త్వంచ' అని ప్రయోగింపబడినది. "కలావతః కాన్తిమతీ' అనునపుడు మతుప్ ప్రత్యయమును చేర్చుటచే ఇరువురును ప్రశంసనీయులే అను విషయము ప్రతీయమానమగుచున్నది. ఈ విధముగ ఈ పదములలో ఒక్కొక్క పదము బోధించు అరమును మరి యే ఇతర శబ్దము బోధింపజాలదు.

వి "భూమనిందాప్రశంసాసు నిత్యయోగేఽతిశాయనే
సంసర్గేఽస్తి వివక్షాయాం భవన్తి మతుబాదయః"

అను వార్తికము ననుసరించి మతుబాది ప్రత్యయములకు, బాహుల్యము, నింద, ప్రశంస, నిత్యసంబంధము అతిశయించుట. కలిసియుండుట, ఉండుట అను అర్థములుండును.

ఇచట 'కలావతః', 'కాన్తిమతీ' అనునవుడు ప్రశంసార్థక మగు మతుప్ ప్రత్యయ మని యభిప్రాయము.

వ్యా. కవి చెప్పదలచిన విశేషమును బోధింపగలిగి యుండుటయే వాచకత్వమునకు లక్షణము. ఏలయన— ప్రతిభలో కావ్యనిర్మాణ సమయమునందు నాటుకొనిన ఒకానొక స్వభావ విశేషముతో స్ఫురించుచున్న పదార్థములు (ఆ స్వభావ విశేష విశిష్టములుగ గాని) లేదా ప్రకృత ప్రస్తావమునకు అనుగుణ మగు ఒకానొక ఉత్కర్షచేత అచ్ఛాదిత స్వరూపములుగ గాని, (కవి) వివక్షా విషయములై అభిధేయములై యుండును. అట్టి విశేషమును ప్రతిపాదింప సమర్థము లగుశబ్దములచే బోధింపబడినవై అవి చిత్తమున చమత్కారమును కలిగించును.

వి. అనగా కావ్యరచనా సమయమున కవి ప్రతిభలో ఒక విశిష్టరూపముతో స్ఫురించిన విషయములను అట్టి విశిష్టరూపములో ప్రతిపాదింప సమర్థము లగు శబ్దముల ద్వారా బోధించిననే చమత్కారము కలుగు నని భావము.

ఎట్లనగా—

"సంరమ్భః కరికీటమేఘ శకలోద్దేశేన సింహస్య యః
సర్వస్యైవ స జాతిమాత్రవిహితో హేవాకలేశః కిల।
ఇత్యాశాద్విరదక్షయామ్బుదఘటా బన్ధేఽప్యసంరబ్ధవాన్
యోఽసౌ కుత్ర చమత్కృతే రతిశయం యాత్వమ్బికా
కేసరీ. 28

"గజ కీటకములను గూర్చియు, మేఘఖండములను గూర్చియు సింహము చేయు క్రోధాది సంరంభము ఆ జాతికి చెందిన మాత్రముననే ప్రతిఒక్క సింహమునందు గానవచ్చు స్వభావలేశమే కదా యని భావించి దిగ్గజముల విషయమునను, ప్రళయకాల మేఘ సమూహముల విషయములందును గూడ, సంరంభము లేని ఈ అంబికా వాహన మగు సింహము వే రెక్కడ చమత్కారాతిశయమును (తన పరాక్రమమును చూపుటకు తగు ఆనందకర మగు అవకాశమును) పొంద కలుగును?"

వ్యా. ఇచట కరులను కీటములనుటచే వాటి విషయమున తిరస్కారభావము. మేఘములను శకలములు (తునకలు) అనుటచే వాటి విషయమున అనాదరము. "సర్వస్య" (ప్రతి ఒక్కదానికిని) అనుటచే అతితుచ్ఛ మగు దేని కైనను అని చిన్న చూపు. (జాతి మాత్ర అననపుడు) జాతిశబ్దముతో మాత్రశబ్దమును చేర్చుటచే గర్వము. పావక శబ్దముతో 'లేశ' శబ్దమును చేర్చుటచే అత్యల్పత్వ జ్ఞానము. ఈ విధముగ ఈ పదము లన్నియు వివక్షితార్థమునకు ఏకైక వాచక ములుగ [వివక్షితార్థమును బోధించుటలో ఏ ఇతర పదములకును లేని సామర్థ్యము కలవిగ] ఉన్నవి. ఘటాబ్ధశబ్దము కూడ ప్రస్తుతమగు అంబికా కేసరికి గల గొప్పతనమును ప్రతిపాదించుటకై ఉపాత్తమైనదై దాని మహత్త్వమును బోధించుచున్నది.

కాని విశేష ప్రతిపాదనమును ఆక్షేపించు పదార్థ స్వరూపమునకు ఆ విశేషమును ప్రతిపాదించు విశేషణమును కూర్చకున్నచో శోభకు లోపము కలుగును. ఎట్లనగా—

"యాత్రానుల్లిఖితాఖ్యమేవ నిఖిలం నిర్మాణమేతద్విధే
రుత్కర్షప్రతియోగి కల్పనమపి న్యక్కారకోటిః పరా.
యాతాః ప్రాణభృతాం మనోరథగతీరుల్లంఘ్య యత్సంపదః
తస్యాభాసమణీకృతాశ్మసు మణేరశ్మత్వమేవోచితమ్. 28

"ఏది ఉన్నప్పుడు బ్రహ్మయొక్క ఈ సృష్టి యంతయు పేరెత్తి పిలుచుటకు కూడ అయోగ్యమైనదో, (ఈ చింతామణి దానికంటె గొప్పది అని భావము.) ఉత్కర్షమునకు అవధిని కల్పించుట కూడ దేనికి గొప్ప అవమానమో, దేని సంపదలు ప్రాణుల మనోరథముల ప్రసారమును గూడ దాటి యున్నవో, అట్టి చింతామణి, పైపై మెరుగులను బట్టి మణులుగా చెప్పబడు రాళ్ళ నడుమ (మణియని చెప్పుకొనుట కంటె) రాయిగా ఉండుటయే ఉచితము"

వి. అనగా పైపై మెరుగును బట్టి ప్రతి ఒకదానికి గూడ మణి యను పేరు 29
పెట్టి చింతామణిని గూడ వాటిలో చేర్చినపుడు చింతామణి మణియను పేరు వదలుకొని ఒక రాయిగానే ఉండిపోవుట మంచి దని యభిప్రాయము. గుణ

వంతులను, తద్విహీనులను గూడ తారతమ్య పరీక్ష యేమియు లేక ఒకే విధ ముగ చూచుట అయుక్తమని ఈ అన్యోక్తి అభిప్రాయము.

వ్యా. ఇచట "అభ్యాస" శబ్దము (చెప్పవలసిన అర్థమును చెప్పవలె నన్నచో) సహజముగ 'మాత్ర' మొదలగు శబ్దముల సాహాయ్యమును అపేక్షించు చున్నది. "ఛాయామాత్ర మణీకృతాశ్మసు మణేస్తస్యాశ్మ తైవోచితా" అను (మాత్రశబ్ద ఘటితమగు) పాఠాంతరము యుక్తము. ఈ విషయము వాచక వక్రతా ప్రకార స్వరూపమును నిరూపించు ఘట్టమున తత్తత్పద ప్రాధాన్యాను సారముగ స్పష్టము కాగలదు గాన ఇచట అతిప్రసంగము చాలును.

అవ. ఇంత వరకును కావ్యమార్గోపయుక్త మగు శబ్దస్వరూపమును బోధించి ఇపుడు అర్థ స్వరూపమును విశదీకరించుచున్నాడు.

వ్యా. వాచ్యలక్షణ మగు అర్థము కూడ ఎట్టిది ? ఏది కావ్యమునందు సహృదయాహ్లాదకారి స్వస్పన్దసున్దరమో. సహృదయాః = కావ్యార్థమును తెలిసి కొన గలిగినవారు; వారికి, ఆహ్లాదం = ఆనందమును, ఏది, కరోతి = చేయునో, అట్టి, స్వస్పన్దేన = తనయొక్క స్వభావముచేత సున్దరః = సుకుమారమైనది. తాత్పర్యమేమనగా - ఒక పదార్థమునందు అనేకధర్మము లుండవచ్చును. ఐనను ఏది సహృదయుల హృదయమునకు ఆనందమును కలిగింప సమర్థమో అట్టి ధర్మముతోటి సంబంధము (కావ్యమునందు) వర్ణింపబడును. ఏ ధర్మముచే అపూర్వమగు స్వభావమహత్త్వముగాని, రసపరిపోషకాంగత్వముగాని అభివ్యక్త మగునో అట్టి ధర్మమునకే సహృదయాహ్లాదకారిత్వసామర్థ్యము సంభావ్యము.

ఎట్లనగా—

దంష్ట్రాపిష్టేషు సద్యః శిఖరిషు న కృతః స్కన్ధకండూవినోదః
సింధుష్వంగావగాహః ఖురకుహరగలత్తుచ్ఛతోయేషు నాప్తః.
లబ్ధాః పాతాలపంకే న లుఠనరతయః పోత్రమాత్రోపయుక్తే
యేనోద్ధారే ధరిత్ర్యాః స జయతి విభుతా విఘ్నితేచ్ఛో వరాహః. 30

(ఇది వరాహమిహిరుని శ్లోక మని సదుక్తి కర్ణామృతము)

"భూమిని ఉద్ధరించు సమయమున ఏ వరాహముచే వెంటనే కోరలచే పిండి యైపోయిన కొండలపై వీపును రాచి దురదను తొలగించుకొనుట చేయబడ

హ్య. ఇచట కరులను కీటములనుటచే వాటి విషయమున తిరస్కారభావము. మేఘములను శకలములు (తునకలు) అనుటచే వాటి విషయమున అనాదరము. "సర్వస్య" (ప్రతి ఒక్కదానికని) అనుటచే అతితుచ్ఛమగు దేని కైనను అని చిన్న చూపు. (జాతి మాత్ర అనునపుడు) జాతిశబ్దముతో మాత్రశబ్దమును చేర్చుటచే గర్వము. హేవాక శబ్దముతో 'లేశ' శబ్దమును చేర్చుటచే అత్యల్పత్వ జ్ఞానము. ఈ విధముగ ఈ పదము లన్నియు వివక్షితార్థమునకు ఏకైక వాచక ములుగ [వివక్షితార్థమును బోధించుటలో ఏ ఇతర పదములకును లేని సామర్థ్యము కలవిగ] ఉన్నవి. ఘటాబన్ధశబ్దము కూడ ప్రస్తుతమగు అంబికా కేసరికి గల గొప్పతనమును ప్రతిపాదించుటకై ఉపాత్త మైనదై దాని మహత్త్వమును బోధించుచున్నది.

కాని విశేష ప్రతిపాదనమును ఆక్షేపించు పదార్థ స్వరూపమునకు ఆ విశేషమును ప్రతిపాదించు విశేషణమును కూర్చుతున్నచో శోభకు లోపము కలుగును. ఎట్లనగా—

"యాం ప్రాప్య త్రిజగత్యమేవ నిఖిలం నిర్మాణమేతద్విధే
రుత్కర్ష ప్రతియోగి కల్పనమపి న్యక్కారకోటిః పరా.
యాతాః ప్రాణభృతాం మనోరథగతీరుల్లంఘ్య యత్సంపదః
తస్యాభాసమణీ కృతాశ్మసు మణేరశ్మత్వమేవోచితమ్. 28

"ఏది ఉన్నప్పుడు బ్రహ్మయొక్క ఈ సృష్టి యంతయు పేరెత్తి పిలుచుటకు కూడ అయోగ్యమైనదో, (ఈ చింతామణి దానికంటె గొప్పది అని భావము.) ఉత్కర్షమునకు అవధిని కల్పించుట కూడ దేనికి గొప్ప అవమానమో, దేని సంపదలు ప్రాణుల మనోరథముల ప్రసారమును గూడ దాటి యున్నవో, అట్టి చింతామణి, పైపై మెరుగులను బట్టి మణులుగా చెప్పబడు రాళ్ళ నడుమ (మణియని చెప్పుకొనుట కంటె) రాయిగా ఉండుటయే ఉచితము"

29

వి. అనగా పైపై మెరుగును బట్టి ప్రతి ఒకదానికి గూడ మణి యను పేరు పెట్టి చింతామణిని గూడ వాటిలో చేర్చునపుడు చింతామణి మణియను పేరు వదలుకొని ఒక రాయిగానే ఉండిపోవుట మంచి దని యభిప్రాయము. గుణ

వంతులను, తద్విహీనులను గూడ తారతమ్య పరీక్ష యేమియు లేక ఒకే విధముగ చూచుట అయుక్తమని ఈ అన్యోక్తి అభిప్రాయము.

వ్యా. ఇచట "అభ్యాస" శబ్దము (చెప్పవలసిన అర్థమును చెప్పవలెనన్నచో) సహజముగ 'మాత్ర' మొదలగు శబ్దముల సాహాయ్యమును అపేక్షించుచున్నది. "ఛాయామాత్ర మణీకృతాశ్మసు మణేస్తస్యాశ్మతైవోచితా" అను (మాత్రశబ్ద ఘటితమగు) పాఠాంతరము యుక్తము. ఈ విషయము వాచక వక్రతా ప్రకార స్వరూపమును నిరూపించు ఘట్టమున తత్తత్పద ప్రాధాన్యానుసారముగ స్పష్టము కాగలదు గాన ఇచట అతిప్రసంగము చాలును.

అవ. ఇంత వరకును కావ్యమార్గోపయుక్త మగు శబ్దస్వరూపమును బోధించి ఇపుడు అర్థ స్వరూపమును విశదీకరించుచున్నాడు.

వ్యా. వాచ్యలక్షణ మగు అర్థము కూడ ఎట్టిది? ఏది కావ్యమునందు సహృదయాహ్లాదకారి స్వస్పన్దసున్దరమో. సహృదయాః = కావ్యార్థమును తెలిసికొన గలిగినవారు; వారికి, అహ్లాదం = ఆనందమును, ఏది, కరోతి = చేయునో, అట్టి, స్వస్పన్దేన = తనయొక్క స్వభావముచేత సున్దరః = సుకుమారమైనది. తాత్పర్యమేమనగా - ఒక పదార్థమునందు అనేకధర్మము లుండవచ్చును. ఐనను ఏది సహృదయుల హృదయమునకు ఆనందమును కలిగింప సమర్థమో అట్టి ధర్మముతోడి సంబంధము (కావ్యమునందు) వర్ణింపబడును. ఏ ధర్మముచే అపూర్వమగు స్వభావమహత్త్వముగాని, రసపరిపోషకాంగత్వముగాని అభివ్యక్తమగునో అట్టి ధర్మమునకే సహృదయాహ్లాదకారిత్వసామర్థ్యము సంభావ్యము.

ఎట్లనగా—

దంష్ట్రాపిష్టేషు సద్యః శిఖరిషు న కృతః స్కన్దకండూవినోదః
సిన్ధుష్వంగావగాహః ఖురకుహరగలత్తుచ్ఛతోయేషు నాప్తః.
లబ్ధాః పాతాలపంకే న లుఠనరతయః పోత్రమాత్రోపయుక్తే
యేనోద్ధారే ధరిత్ర్యాః స జయతి విభుతా విఘ్నితేచ్ఛో వరాహః.౨౦

(ఇది వరాహమిహిరుని శ్లోక మని సదుక్తి కర్ణామృతము)

"భూమిని ఉద్ధరించు సమయమున ఏ వరాహముచే వెంటనే కోరలచే పిండి యైపోయిన కొండలపై వీపును రాచి దురదను తొలగించుకొనుట చేయబడ

లేదో, డెక్కల రంధ్రములనుండి జారిపోయిన స్వల్పజలములు గల సముద్రములలో దేహమును ముంచుటయు చేయబడలేదో, ముట్టెకు మాత్రమే సరిపడిన పాతాళపంకమునందు దొరలుటవలన కలుగు ఆనందములు పొందబడలేదో, అట్టి, విశ్వవ్యాప్తత్వముచే విఘ్నము కలిగింపబడిన ఇచ్ఛ గల ఆదివరాహమూర్తి సర్వోత్కర్షగా నున్నాడు."

వ్యా. ఇచట (ఆదివరాహమూర్తి రూప మగు) పదార్థముయొక్క స్వభావమహిమ వర్ణింపబడినది. ఇది సహజసంభావ్యములగు (కండూవికోదనాది) ఇతరస్వభావములను నిరోధించుట ద్వారా ఆదివరాహస్వభావమహత్తను ప్రకటించుచు సహృదయాహ్లాదమును కలిగించుచున్నది.

అవ. ఇది స్వభావమహత్త్వాప్యం జనమునకు ఉదాహరణము. ఇక రసపరిపోషాంగత్వాభి వ్యక్తికి, ఉదాహరణమును చూపుచున్నాడు.

ఇంకను ఎట్లనగా :-

తామభ్యగచ్ఛ ద్రుదితానుసారీ
మునిః కుశేధ్మాహరణాయ యాతః.
నిషాద విద్ధాండజ దర్శనోత్థః
శ్లోకత్వ మాపద్యత యస్య శోకః. 31

[రఘువంశము 14-70]

"నిషాదుడు కొట్టిన పక్షిని చూచుటచే కలిగిన ఎవని శోకము శ్లోకముగా అయినదో, సమిత్కుశములను తీసికొనివచ్చుటకై వెళ్లిన అట్టి ముని, రోదన ధ్వనిని అనుసరించుచు ఆమెకు ఎదురుగా వెళ్ళెను".

వి. లక్ష్మణుడు రామాజ్ఞానుసారము వనమున పరిత్యజింపగా నిస్సహాయయై ఏడ్చుచున్న సీత ఏడుపు విని వాల్మీకి ఆమె వద్దకు వెళ్ళిన ఘట్టములోనిదీ శ్లోకము.

వ్యా. ఇచట ఆ ముని యెవ రనగా 'వాల్మీకి'అని పర్యాయపదమును మాత్రము చెప్పవలసి యుండగా - "నిషాదుడు కొట్టిన పక్షిని చూచినంతనే కలిగిన ఏ పరమకారుణికుని శోకము శ్లోకముగ నైనదో అట్టివాడు" అని చెప్పి అట్టి

అవస్థలో నున్న జనకరాజ కుమారిని చూచుటచే చెదరిన మనస్సు గల అతని అంతఃకరణ స్వభావము కరుణరసపరిపోషణమున కంగమై సహృదయ హృదయాహ్లాదకారి కావలె నని కవి యభిప్రేతము.

వి. ఒకనాడు వాల్మీకి స్నానార్థమై తమసానదికి వెళ్ళగా అచట ఒక వ్యాధుడు క్రౌంచపక్షుల జంటలోనుండి మొగపక్షిని చంపివేసెను. క్రౌంచి ఏడుపు విని ఆ ముని శోకాకులమానసుడై యుండ అతని నోటినుండి అప్రయత్నముగ—

మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీః సమాః
యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితమ్. 32

అను శ్లోకము బయల్వెడలెను; అనెడు రామాయణ గాథ నిచట అనుసంధించుకొనవలెను.

ఇంకను ఎట్లనగా:—

భర్తుర్మిత్రం ప్రియమవిధవే విద్ధి మామమ్బువాహం
తత్సన్దేశాద్ధృదయనిహితాదాగతం త్వత్సమీపమ్.
యో వృన్దాని త్వరయతి పథి శ్రామ్యతాం ప్రోషితానాం
మన్ద్రస్నిగ్ధైః ధ్వనిభిరబలా వేణిమోక్షోత్సుకాని. 33

(మేఘదూతము - 96)

"ఓ సౌభాగ్యవతీ! శ్రమపడుచున్న ప్రోషితుల సమూహములను గంభీరములును మధురములును అగు గర్జితములచే తమ అబలల జడలను విడిపించుటకు ఆతురత చెందునట్లు మార్గమునందు తొందరపెట్టువాడును, నీ భర్త యొక్క ప్రియమిత్రుడును, హృదయమునందుంచబడిన అతని సందేశముతో నీ దగ్గరకువచ్చినవాడును అగు అంబువాహునిగా (మేఘునిగా) నన్ను తెలిసికొనుము."

వ్యా. ఇచట మొదట ('అవిధవే' అను) సంబోధన పదార్థము ఆమెకు ఊరడింపును కలిగించెడు స్వభావము కారణముగా కలది. (నీ భర్త జీవించి ఉన్నాడు' అని సూచించుటచే ఈ పదము యక్షిణికి ఆశ్వాసనము కలిగించెడు స్వభావము కల దని యర్థము.) "నన్ను నీ భర్తకు మిత్రునిగా తెలిసికొనుము" అనునది తాను దగ్గరకు రానీయ తగనివాడు అను విషయమును స్పష్టీకరించుచున్నది. ఆ మిత్రుడు కూడ సామాన్యమైన "మిత్రుడు" కాదు; ప్రియుడు అని చెప్పుటచే విశ్వాసపూర్ణమైన సంభాషణము చేయు[illegible]చున్నది.

ఈ విధముగ ఆమెను ఓదార్చి, ఉన్ముఖురాలిగ చేసి, అతని సన్దేశమే నీవద్దకు నా రాకకు కారణ మని ప్రకృత విషయమును ప్రస్తావించుచున్నాడు. "హృదయ నిహితాత్" అనుటచే తన హృదయము నందుంచబడిన సావధాన త్వము సూచిత మగుచున్నది.

వి. ఇచట S. K. De సంపాదించిన ప్రతిలో 'స్వహృదయనిహితమ్' అను పాఠ మున్నది గాని అది అచ్చు పొరపాటై యుండును. దీనిని 'స్వహృద యనిహితాత్' అని శోధించి 'తన హృదయమున నున్న సావధానత్వము' లేదా ఇది హృదయమునందే ఉన్నది గాని పత్రాదిరూపమున లేదు గాన సావధా నత్వము అను అర్థమును విశ్వేశ్వరుడు చెప్పియున్నాడు. కాని దే ప్రతిలో అధః సూచికతో చూపిన "సుహృత్త్వనిహితమ్" అను పాఠము యుక్తముగ నున్నట్లు తోచుచున్నది. నేను నీ భర్తకు సుహృత్తు నగుటచే అంతటి సావధానత్వముతో (శ్రద్ధతో) ఆ సందేశమును హృదయములో నుంచుకొని తీసికొని వచ్చితి నని భావము.

వ్యా. ఇట్టి వ్యవహారములలో నేర్పు గల బుద్ధి గలవాడు మరెవ్వడైన (ఈ కార్యము నందు) ఏల నియుక్తుడు కాలేదు అని ఆశంకించుకొని "ఈ కార్య మును నిర్వహించుటలో నాకే ఒక విధమగు నేర్పు అధికముగ నున్నది" అని చెప్పుచున్నాడు. 'అమ్బువాహమ్' అను పదముచే తాను ఆ పనిని (వాహన మును) చేయు స్వభావమును కలిగియుండుటను చెప్పుట వై విషయమును (తత్కార్యాచరణ కౌశలమును) సూచించుచున్నది. యః = ఎవడు ప్రవాసముతో నున్నవారియొక్క బృందములను, త్వరయతి = పుట్టిన తొందర కలవారినిగ చేయునో. కీదృశానామ్ = ఎట్టివారు ? శ్రామ్యతామ్ = అలసినవారు. అందుచే తొందరపడుటలో సామర్థ్యము లేనివారైనను. 'వృన్దాని' అని బహువచనము చే ఆ పని చేయు అలవాటును చెప్పుచున్నాడు. దేనిచేత? మన్ద్రస్నిగ్ధైః ధ్వనిభిః = నేర్పరి యైన దూతయొక్క ప్రరోచనావచనములతో (మంచిమాటలతో) సమాన మైన మాధుర్యరమణీయము లగు శబ్దములచేత ఎక్కడ? పథి = మార్గమునందు. [దారిలో] యాదృచ్ఛికముగ [అట్టివారు కనబడినపుడు] గూడ ఏదియో విధముగ నే నా పని చేయుచుందున్కదా, మిత్రుని ప్రేమకై ప్రయత్నపూర్వకముగ అత్రముతో కూడిన బుద్ధి కలవాడను కాకుందునా? [యని భావము.] ఎట్టి

బృందములు; అబలా వేణులను విడిపించుటకు ఉత్సుకము లైనవి. అబలా శబ్దముచే నిచట వారి (ఆ పాంథుల) ప్రేయసులు విరహబాధను సహింపజాల కుండుట చెప్పబడుచున్నది. వారి (అట్టి అబలల) వేణులను విడిపించుటయందు ఉత్సుకములు అని చెప్పుటచే ఆ పాంథబృందముల చిత్తములు వారియందు (ప్రేయసులయందు) అను రక్తము లై యుండుట చెప్పబడుచున్నది. కావున 'విధివశముచే వియోగముతో బాధపడుచున్న పరస్పరానురక్తచిత్తులగు కామి జనుల కెవ్వరి కైనను సమాగమసౌఖ్యమును కలిగించుట యనెడు సుహృత్కార్యము చేయుటకై నేను ఎల్లవేళలను ప్రతిపత్తి యున్నాను; అని ఇచట వాక్యార్థము. ఇచట కవి ఏ (మేఘరూప) పదార్థస్వభావమును కూర్చి యున్నాడో అదియే వాస్తవమున ఈ ప్రబంధము మేఘదూతమగుటకు జీవితము కావున ఇది మిక్కిలి సహృదయాహ్లాదకారిగ నున్నది,

వ్యా. (పదార్థ పరిస్పన్ద నిబంధనము పైన చూపిన విధముగా నుండ వలెను) కాని ఇట్లుండరాదు.

ఎట్లనగా—

సద్యః పురీపరేఽపి శిరీషమృద్వీ
సీతా జవాత్ త్రిచతురాణి పదాని గత్వా.
గన్తవ్యమద్య కియదిత్య సకృద్ బ్రువాణా
రామాశ్రుణః కృతవతీ ప్రథమావతారమ్. 34

(బాలరా. 4. 34)

"శిరీషసుకుమారి యగు సీత పట్టణపు పొలిమేరయందే తొందరగ రెండు నాలుగు అడుగులువేసి "ఇప్పుడు ఇంకను ఎంత (దూరము) వెళ్ళవలసి యున్నది?" అని మాటి మాటికిని పలుకుచు, ప్రప్రథమముగ రాముని కను లందు కన్నీరు దొరలునట్లు చేసెను."

వ్యా. ఇచట మాటి మాటికిని "ఇవుడు ఇంకను ఎంత దూరము వెళ్ళ వలెను" అని అడుగుట యనెడు స్వభావము (వ్యాపారము) స్వభావమహత్తను ప్రకటింపచేయుటలేదు. రసపరిపోషణాంగత్వమును గూడ పొందుటలేదు. ఏల యన — సహజ మగు ఒక ఔచిత్యముచే (పాతివ్రత్యాద్యౌచిత్యముచే) (రామునితో

కూడ) వెళ్ళుటకు నిశ్చయించుకొనిన సీతకు, సౌకుమార్యమువలన మనస్సులో ఇట్టి అభిప్రాయము కలిగినను అది మాటలలోనికి కూడ వచ్చునని (మాటల ద్వారా పైకి అభివ్యక్తము చేయబడునని) సహృదయు లెవ్వరును ఊహింప జాలరు మరియు మాటి మాటికి చెప్పబడినను రాఘవుని ప్రథమాశ్రుపాతమునకు [కారణ మైన దనుటతో] సరి యగు సంగతిని పొందుట లేదు. (ఉచితముగ లేదు). ఒక్కమారు వినగనే కనుల నీరు రావచ్చును కదా? ఇది యంతయు చాల రమణీయముగనేయున్నను కవి అవధానము కొంచెము సడలిపోవుటచే చెడిపోయినది. అందుచే 'అవశం' అనుపాఠము కూర్చవలెను.

వి. అనగా సౌకుమార్యాతిశయముచే ఆమెకు తెలియకుండగనే ఈ మాటలు పైకి వచ్చి రాముని అశ్రు పాతమునకు కారణములైన వను భావము యుక్తముగానుండును.

వ్యా. కావున ఈ విధముగ శబ్దార్థముల లక్షణమును విశిష్ట మగుదానినే గ్రహింపవలెను. దీనిచే 'నేయార్థము, అపార్థము' మొదలగు కావ్యదోషములు దూరముగ తొలగిపోవును గాన (అవి యున్నది కావ్యమే కాజాలదు గాన) వాటిని గూర్చి వేరుగా చెప్ప నక్కరలేదు.

వి. కావ్యదృష్టితో చూచినచో అట్టి దోషములు గల శబ్దార్థములు శబ్దార్థములే కావు కదా యని భావము.

వి. ఒక పదమునకు ప్రయత్నపూర్వకముగ ఒక అర్థమును కల్పింపవలసి యున్నచో అట్టి పదము నేయార్థము. నేయార్థత్వము పదదోషము. సముదాయార్థశూన్య మగునది అపార్థము. వాటి ఉదాహరణములు భామహ కావ్యాలంకార, కావ్యప్రకాశాదులలో చూపబడినవి.

వ్యా. ఈ విధముగ ప్రసిద్ధ మగు స్వరూపముకంటె భిన్న మగు శబ్దార్థ ౯
ముల రూపాంతరమును నిరూపించి, కావ్యమునకు ఇంత మాత్రమే (శబ్దార్థములు మాత్రమే) యున్న చాలదు. మరి యొక వైచిత్ర్యముతో గూడిన శబ్దార్థములు కావలెను అని చెప్పుచున్నాడు.—

కా. ఉభావేతావలంకార్యౌ తయోః పున రలంకృతిః
వక్రోక్తిరేవ వైదగ్ధ్య భంగీభణితి రుచ్యతే.

10

"ఈ రెండును అలంకార్యములు. వాటికి అలంకారము కవికి కల నేర్పునందలి సౌందర్యముచే సిద్ధించిన ఉక్తివిశేషరూప మగు వక్రోక్తియే యని చెప్పబడుచున్నది". 10

వ్యా. ఉభౌ = రెండును, ఏతౌ = ఈ శబ్దార్థములు, అలంకార్యౌ = అలంకరింపతగినవి, శోభాతిశయమును ఏదైన అలంకరణముతో కూర్చదగినవి. వాటి అలంకరణ మేది అనగా చెప్పబడుచున్నది— తయోః పునరలంకృతిః, తయోః = ద్విత్వసంఖ్యతో కూడిన వైనను వాటియొక్క, అలంకృతిః పునః = అలంకార మైతే, ఒక్కటే. దానిచే ఆ రెండును అలంకరింపబడుచున్నవి. అది ఏది ? వక్రోక్తిరేవ = ప్రసిద్ధ మగు అభిధానము (బోధించెడు విధానము) కంటె భిన్నమైన విచిత్ర మగు అభిధయే వక్రోక్తి. ఎట్టిది ? 'వైదగ్ధ్యభంగీభణితిః'- వైదగ్ధ్యమ్ = విదగ్ధత్వము = కవి కర్మయందు (కావ్యనిర్మాణమునందు) నేర్పు, దానియొక్క భంగీ = సౌన్దర్య విశేషము, దానిచే భణితిః = చెప్పుట, విచిత్ర మగు అభిధయే (ప్రతిపాదన పద్ధతియే) వక్రోక్తి యని చెప్పబడుచున్నది.

ఇచట తాత్పర్య మిది- (అలంకారముకంటె) వేరుగా నున్న శబ్దార్థములు స్వభిన్న మగు ఏ అలంకారముతోడను కూర్పబడుటలేదు. ఇక నేమనగా— వక్రతచే లభించిన వైచిత్ర్యముతో సంబంధించిన విధముగ చెప్పుటయే వాటికి అలంకారము. అదియే శోభాతిశయమును కలిగించును కదా ! ఇది వక్రతను వ్యాఖ్యానించు సమయమున ఉదాహరింపబడగలదు. 10

వి. ఇచట 'నకేనాపి వ్యతిరిక్తే నాలంకరణేన యోజ్యేతే అను 'నఞ్' సహిత మగు పాఠ మున్నచో యుక్త మగు నని తోచుచున్నది. అట్లు కానిచో అలంకారములకంటె అలంకార్యము లగు శబ్దార్థములు భిన్నము లని చెప్పుటలో ఏమి విశేష మున్నది? తరువాత వాక్యములో 'కిన్తు' అను పదముతో ప్రారంభించి వక్రతావైచిత్ర్య ముండువిధమున చెప్పుటయే అలంకారము అని చెప్పుటచే అలంకారము కూడ శబ్దార్థస్వరూపమైనదే యనియు, ఆరవ కారికలో చెప్పిన విధమున అలంకార్యాలంకారముల భేదము కాల్పనిక మనియు మరల సూచించినట్లున్నది. అట్లు కానిచో 'కిన్తు' పదఘటితవాక్యనిర్మాణము అంతగ పొసగ దేమో యనిపించుచున్నది.

వ్యా. వక్రోక్తియే అలంకారము. మరియొకటి ఏదియును లేదు అనచు ప్రసిద్ధవిషయమునకు విరుద్ధముగ చెప్పుచున్నా వేమి ? ప్రాచీనులు (దండ్యు

దృటాద్యాలంకారికులు) స్వభావోక్తి యనెడు అలంకారమును గూడ చెప్పి యున్నారు కదా। అది కూడ చాల సుందర మైనదే— అని ఆశంకింప దానిని సహింపనివాడై దానినే (స్వభావోక్తినే) నిరాకరించుటకు చెప్పుచున్నాడు.

కా. "అలంకారకృతాం యేషాం స్వభావోక్తిరలంకృతిః
అలంకార్యతయా తేషాం కిమన్యదవశిష్యతే". 11

"ఏ అలంకారికులకు స్వభావోక్తి కూడ అలంకారమో వారికి అలంకార్యముగ మరి ఏ మున్నది''?

వ్యా. యేషాం = ఏ, అలఙ్కారకృతాం = అలంకారకారులకు, 'స్వభావోక్తిః అలఙ్కృతిః', ఏ, స్వభావస్య = పదార్థ ధర్మరూపమగు పరిస్పన్దము యొక్క, ఉక్తిః = చెప్పుట, అదియే- అలంకృతిః = అలంకారముగా తోచుచున్నదో, వారు సుకుమారమనస్కులగుటచే వివేకమును చూపుట యను కష్టమును ద్వేషించుచున్నారు. ఏలయన— స్వభావోక్తి యనగా అర్థ మేమి? చెప్పబడు చున్న స్వభావము. అదియే అలంకార మైనచో దానికంటె భిన్నమును కావ్య శరీరముతో సమాన మైనదియు నగు మరి యొక వస్తువు ఏది ఉన్నది? ఏది, తేషాం = ఆ అలంకారికులకు (వారి మతమున) అలఙ్కార్యతయా = అలంకార్యముగా, అవశిష్యతే = వేరుగా స్థితిని పొందుచున్నదో (అట్టి దేది) ఏదియును లేదని యర్థము.

వి. భామహుని వలెనే కుంతకుడు కూడ స్వభావోక్తికి అలంకారత్వమును అంగీకరింపడు.

వ్యా. సాలంకారమును విభాగరహితమును అగు వాక్యమే కావ్య మని వెనుకనే స్థాపించబడినది కదా? ఇపు డిట్లేల చెప్పుచున్నావు. ?

వి. కావ్యమునకు అలంకారములను కూర్చుట అనునది వాస్తవము కాదు. సాలంకారము అగు శబ్దార్థములే కావ్యము. కావున అలంకార్యాలంకారవిభాగము లేదని చెప్పితివి కదా?— (6 వ కారికలో). ఇపుడు స్వభావోక్తియే అలంకార మైనచో ఇంక అలంకార్య మేది అని ఈ విధముగ చెప్పుచున్నావేమి? యని పూర్వపక్షాశయము.

నిజమే కాని పదములో వర్ణములను విభజించి నట్లును, వాక్యములో పదములను విభజించి నట్లును అపోద్ధారబుద్ధిచే (భేదవివక్షచే) అసత్య మైనను విభాగమును చేయవచ్చు నని కూడ చెప్పియున్నాముకదా ; (కావున స్వభావోక్తి అలంకారమనుట అయుక్తము). 11

ఈ విషయమునే మరియొక ప్రకారమున వికల్పించుటకై చెప్పుచున్నాడు.

కా. "స్వభావవ్యతిరేకేణ వక్తుమేవ న యుజ్యతే
వస్తు తద్రహితం యస్మాన్నిరుపాఖ్యం ప్రసజ్యతే". 12

"స్వభావము లేకుండగా చెప్పుటకే సాధ్యము కాదు. ఎందుచేత ననగా అది (స్వభావము) లేని వస్తువు శబ్దమునకు గోచరము కాకుండుట ప్రసక్తించును". 12

వి. స్వభావము లేని వస్తువును గూర్చి శబ్దముచే చెప్పుటయే శక్యము కాదని యర్థము.

వ్యా స్వభావ వ్యతిరేకేణ = స్వభావము లేకుండగా; స్వభావరహిత మగుదానిని, చెప్పుటకే, న యుజ్యతే = శక్యముకాదు. వస్తు = వాచ్యరూప మగు నది. ఎందువలన ? తద్రహితం = ఆ స్వభావముతో శూన్య మైనది, ఏ కారణమువలన నిరుపాఖ్య మగునో; ఉపాఖ్యనుండి నిష్క్రమించినది నిరుపాఖ్యము, ఉపాఖ్య అనగా శబ్దము. దానికి గోచరము కానిదై, వర్ణించుటకు వీలు కానిదై - అగును. 'స్వభావ' శబ్దవ్యుత్పత్తియే ఈ విధముగ నున్నది కదా ? "భవతః అస్మాత్ అభిధానప్రత్యయౌ ఇతి భావః" దేనిని, (ఏ ధర్మమును) నిమిత్తముగా చేసి కొని శబ్దముచే అభిధానమును జ్ఞానమును కలుగునో అదిభావము. "ధర్మము" అని యర్థము. స్వస్య = తనయొక్క, భావము = స్వభావము. కావున ఆ స్వభావమే ఏదైన ఒక పదార్థముయొక్క ప్రఖ్యోపాఖ్యలు, అనగా జ్ఞానమును శబ్దవ్యవహారమును, కలుగుటకు కారణము. అది లేని వస్తువు లేనిదానితో సమాన మై కుందేటికొమ్మువంటిదై శబ్దమునకు గాని, జ్ఞానమునకు గాని గోచరము కాజాలదు. స్వభావముతో కూడినది మాత్రమే సర్వవిధముల అభిధేయ మగుటకు వీలు న్నది గాన (స్వభావోక్తి కలది కావ్య మన్నచో) బండి తోలుకొనేవాళ్ళ మాటలు కూడ స్వభావోక్తియుక్తములే గాన, కావ్యములనవలసి వచ్చును. 12

ఈ విషయమునే మరియొక యుక్తితో మరల చెప్పుచున్నారు—

కా. "శరీరంచే దలంకారః కి మలం కురుతేఽపరమ్
ఆత్మైవ నాత్మనః స్కన్ధం క్వచిదప్యధిరోహతి". 13

"శరీరమే అలంకార మైనచో మరి అన్యమును దేని నలంకరించును? ఎచ్చటను శరీరము ఆశరీరముయొక్క భుజమునే ఎక్కజాలదు కదా!" 13

(ఇచట 'ఆత్మ' శబ్దమునకు శరీరమని యర్థము)

వ్యా. ఏదైన ఒక వస్తువు వర్ణింపబడునపుడు, వర్ణింపబడునది దాని స్వభావమే కాన అదియే వర్ణ్యమునకు శరీరము. అదియే, అలంకారశ్చేత్ = అలంకారమైనచో, అది దేనిని అలంకరించునో అట్టి తద్భిన్న మగు మరి యొకటి ఏమి యున్నది? తన్నే అలంకరించును అన్నచో అది అనుపపన్నము గాన యుక్తముకాదు. ఏలయన ఆత్మయే ఆత్మయొక్క స్కంధమును ఎచ్చటను అధిరోహింప జాలదు. శరీరమే శరీరముయొక్క భుజము ఎక్కడను ఎక్క జాల దని యర్థము. తన ఆరోహణాది క్రియ తనపైననే ప్రవర్తించుట విరుద్ధము కదా?

మరి యొక విషయము:– మీ మతమును అంగీకరించి యైనను చెప్పు చున్నాము:

భూషణత్వే స్వభావస్య విహితే భూషణాన్తరే,
భేదావబోధః ప్రకట స్తయోర ప్రకటోఽథవా॥ 14

స్పష్టే సర్వత్ర సంసృష్టిరస్పష్టే సంకర స్తథా।
అలంకారాన్తరాణాంచ విషయో నావశిష్యతే॥ 15

"స్వభావము అలంకార మైన పక్షమున, మరి యొక అలంకారమును మార్చి నపుడు, ఆ రెండింటికిని భేదము స్పష్టముగ తెలియునా; లేక తెలియదా?" 14

"స్పష్ట మన్నచో అన్నిటను సంసృష్టియే యుండును. అస్పష్ట మైనచో అంతటను సంకరమే యుండును. (ఈ విధముగ) ఇతరాలంకారములకు అవకాశమే లేకపోవును. 15

వ్యా. భూషణత్వే స్వభావస్య = స్వభావము అలంకార మైనపుడు, ఎప్పుడు, భూషణాన్తరం = మరి యొక అలంకారము కూర్చబడునో, అప్పుడు రెండు విధము లగు పద్ధతి (గతి) ఉండవచ్చును. అది ఏది? తయోః = ఆ స్వభావోక్త్యలంకారాంతరములయొక్క, భేదావబోధః = భిన్నత్వజ్ఞానము, ప్రకటః = (ఒకప్పుడు) సుస్పష్టముగా నుండునా; అప్రకటశ్చ = (లేక) అస్పష్టముగా నుండునా? స్పష్టే = అది ప్రకట మన్నచో, సర్వత్ర = సమస్త మగు కావ్యములందును సంసృష్టి యొక్కటియే అలంకార మని చెప్పవలసి వచ్చును. అది స్పష్టము కాదన్నచో అంతటను సంకరాలంకార మొక్కటియే ఉండవలసి వచ్చును. దానివలన దోష మేమి అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.— "అలంకారాన్తరాణాం చ విషయో నావశిష్యతే"- ఇతరము లైన ఉపమాద్యలంకారములకు, విషయః = గోచర మైనది- లక్ష్యమైనది- ఏదియును మిగులదు, వాటికి లక్ష్యములే లేకుండ పోవు నని యర్థము. అపుడు వాటికి లక్షణములు చెప్పుట వ్యర్థము కావలసి వచ్చును. ఆ సంసృష్టిసంకరములే ఉపమాదులకు విషయము లని చెప్పినగూడ ఏమియు ప్రయోజనము లేదు. ఆ అలంకారకారులే ఆ విషయమును అంగీకరింప లేదు కదా? కావున ఆకాశమును నములుటతో సమాన మగు ఈ అసత్యస్వభావోక్త్యలంకారవిషయకవాదోపవాదములు చాలును.

వి. ఉపమాదిలక్షణనిర్మాణము వ్యర్థము కాకుండ చేయుటకై- "సంసృష్టి సంకరము లున్న లక్ష్యములే ఉపమాదులకు కూడ లక్ష్యములు: అంతకు మించిన స్వతంత్రస్థానములు లేవు అని అంగీకరింతుము" అని పూర్వపక్షి అభిప్రాయము. స్వభావోక్తి అలంకారమును అంగీకరించిన ఆలంకారికులు ఉపమాదులకు కూడ లక్ష్యలక్షణములను చూపి యున్నారు. ఉపమాదులకు స్వతంత్రస్థానము లున్నవనియే వారి యభిప్రాయము గాని సంసృష్టిసంకరముల చోటనే ఉపమాదు లుండు నని వారు చెప్ప లేదు కదా. కావున పూర్వపక్షయుక్తి అసంగత మని యభిప్రాయము.

వి. ఒకటి కంటె అధికము లగు అలంకారములు ఒక స్థానమున కలసినపుడు అవి ఒకదానిపై నొకటి ఆధారపడక స్వతంత్రముగ నున్నచో వాటి కలయికచే సంసృష్టి అను అలంకారాంతర మేర్పడును. అవి ఒక దానిపై మరి యొకటాధార పడి యున్నను, లేదా వాటి భేద మంతగా స్పష్టముగా లేకున్నను అపు డా కలయికకు సంకర మని పేరు.

వ్యా. ఇక ప్రకృతవిషయము ననుసరింతము కవి వ్యాపారమునకు విషయ మగుటచే వర్ణనాపదవిని పొందిన (వర్ణింపబడుచున్న) ఏ యొక్క పదార్థజాతము నకు సంబంధించిన దైనను సహృదయహృదయాహ్లాదకారి యగు స్వభావమే కావ్యశరీర మగుటచే అన్ని విధములచేతను వర్ణనీయత్వమును పొందును. ఆ స్వభావమునకే అవకాశమును బట్టి, శోభాతిశయమును కల్పించు ఏదైన అలం కారమును కూర్చవలెను. ఇదియే "అర్థః సహృదయాహ్లాదకారిస్వస్పన్ద సున్దరః" (1-9) 'ఉభావేతావలఙ్కార్యౌ' (1-10) అని చెప్పుటలో అభిప్రాయము. 15

వ్యా. ఈ విధముగ శబ్దార్థముల పరమార్థమును చెప్పి, 'శబ్దార్థౌ' ఇత్యాది కావ్యలక్షణవాక్యమునందలి ఒక పదము వ్యాఖ్యానింపబడినది. ఇపుడు 'సహితౌ' అను పదమును వ్యాఖ్యానించుటకు పీఠి సాహిత్యమును గూర్చి విచారణము చేయబడుచున్నది.-

కా. శబ్దార్థౌ సహితావేవ ప్రతీతౌ స్ఫురతః సదా
సహితావితి తావేవ కిమపూర్వం విధీయతే॥ 16

"శబ్దార్థము లెల్లప్పుడును సహితములుగనే జ్ఞానమునందు స్ఫురించు చున్నవి. కావున 'సహితము లగు శబ్దార్థములు' అనుచు క్రొత్తగ ఇపుడు చెప్పున దేమి?" 16

వ్యా. శబ్దార్థౌ = అభిధానాభిధేయములు, సహితౌ = అవియుక్తములుగనే, సదా = సర్వకాలములందును, ప్రతీతౌ = జ్ఞానమునందు, స్ఫురతః = ప్రతి భాసించుచున్నవి. ఆకారణమువలన, అవియే, సహితౌ = అవియుక్తము లు అని అపూర్వవిషయము ఏమి చెప్పబడుచున్నది? క్రొత్తవిషయ మేదియు సాధింప బడుట లేదు; సిద్ధ మగు విషయమే సాధింపబడుచున్నదని యర్థము. ఈ విధముగ శబ్దార్థములకు సాహిత్యము సహజసిద్ధము. మరల దానినే చెప్పుచు బుద్ధికలవా డెవ్వడు నిష్ప్రయోజనముగ తనను ఆయాసపెట్టుకొనును? (ఇది పూర్వపక్షము)

ఇది సత్యమే; కాని, వాస్తవమున వాచ్యవాచకరూప మగు (వాచ్య మనగా బోధించబడుఅర్థము; వాచక మనగా బోధించు శబ్దము) నిత్యసంబంధమును పురస్కరించుకొని సాహిత్య మని చెప్పబడుట లేదు. ఏలయన—సాహిత్య

శబ్దముచే దానినే చెప్పినచో కష్టకల్పనచే రచితము లగు 'గాఙ్కుటాదిభ్యోఽఞ్ణిన్ జిత్' ఇత్యాది (పాణిన్యాదిప్రోక్త) వాక్యములును, అసంబద్ధము లగు బండితోలు వాళ్లు మొదలగువారి వాక్యములును, అన్నియు సాహిత్య మనుశబ్దముచే చెప్పబడవలసియుండును. అపుడు వ్యాకరణ-మీమాంసా-న్యాయవ్యతిరిక్త మగు ఒకానొక అపూర్వతత్త్వము సాహిత్య మనెడు విభాగము లేకుండ పోవును.

వ్యాకరణాదిభిన్న మగు ఏ సాహిత్య మనునది కలదో, అది గూడ సుప్రసిద్ధమే మరల దానిని గూర్చి చెప్పినచో పునరుక్తిదోషప్రసఙ్గము లేకుండ ఎట్లుండును? (అది పూర్వపక్షి ప్రశ్న) కావుననే ఇపుడీ విషయము చెప్పుచున్నాము.

సాహిత్య మనునది ఏది కలదో అది నేటివరకును అనంతదీర్ఘకాలమున 'సాహిత్య' శబ్దమాత్రముచేతనే ప్రసిద్ధము. అంతియే కాని కవివ్యాపారకౌశలముయొక్క పరాకాష్ఠను అధిరోహించుటచే రమణీయ మగు ఈ 'సాహిత్యము' యొక్క పరమార్థము ఇది అని నేటివరకును గూడ ఏ విద్వాంసుఁడును కొంచెమైనను విచారించలేదు కావున ఇపుడు సరస్వతీహృదయారవిందమునందలి మకరన్దబిన్దుసముదాయము వలె మనోహరము లగు సత్కవివాక్కులకోపలం సువాసన వలె మనోహరముగా స్ఫురించుచున్న ఇది (సాహిత్యశబ్దపరమార్థము) సహృదయభ్రమరములకు గోచర మగునట్లు చేయబడుచున్నది.

వి. చాలకాలము నుండి సాహిత్యశబ్దమును కావ్య మను నర్థమున ఎందరో ప్రయోగించుచున్నారు గాని నేటివరకు దానితత్త్వమును గూర్చి విచారించిన పండితు డొక్కడును లేడు ఇపుడు 'సాహిత్య' స్వరూపమును విశదీకరించుచున్నాను అనియభిప్రాయము. 16

కా. సాహిత్యమనయోః శోభా శాలితాం ప్రతి కాప్యసౌ
అన్యూనానతిరిక్తత్వ మనోహారిణ్యవస్థితిః. 17

"(కావ్యముయొక్క) శోభాశాలిత్వమును గూర్చి (సంపాదించుటకు) ఈ శబ్దార్థములు, అన్యూనతిరిక్తములుగ నుండుటచే మనోహర మగు లోకోత్తర మగు స్థితి (ఉనికి) సాహిత్యము" 17

వ్యా. సహితము లైనవానియొక్క ధర్మము సాహిత్యము. అనయోః = ఈ శబ్దార్థములయొక్క. ఏ, కావి = అలౌకికమైన, సహృదయచమత్కార జననమునకుకారణభూతమైన, అవస్థితిః = విచిత్ర మైన విన్యాసభంగి యున్నదో (అదియే సాహిత్యము). ఎట్టిది ? అన్యూనానతిరిక్తత్వమనోహారిణీ = పరస్పర స్పర్ధిత్వముచే రమణీయ మైనది. ఏ విన్యాసభంగియందు శబ్దార్థములు రెండిం టిలో ఒకదానికి గూడ, న్యూనత్వం = నికృష్టత్వము, న = లేదో, అతిరిక్తత్వం = ఉత్కర్షము కూడ లేదో అట్టిది అని అర్థము.

దుష్టము లగు శబ్దార్థములకు గూడ ఇట్టి సామ్యము సంభవించును గదా అని ఆశంకించు కొని చెప్పుచున్నాడు— 'శోభాశాలితాం ప్రతి'. శోభ అనగా సౌందర్యము. దానిచే, శాలతే = సర్వోత్కృష్టముగ నున్నది గాన శోభాశాలి. దాని యొక్క ధర్మము శోభాశాలిత. దానిని గూర్చి, సౌందర్యశ్లాఘిత్వమును గూర్చి యని యర్థము. సహృదయాహ్లాదకారిత్వ మనగా నదియే ఆశోభాశాలితవిషయ మున పోటీపడుచు ఏ ఉనికి గలదో- పరస్పరసామ్యముచే సుందర మగు ఏ స్థితి గలదో. అది సాహిత్య మని చెప్పబడుచున్నది. ఆసాహిత్యమునందుగూడ ఒక శబ్దమునకు శబ్దాంతరముతోడను, అర్థమునకు అర్థాంతరముతోడను సాహిత్యము అభీష్టము. ఏలయన కావ్యలక్షణము (అనేకపదరూప) వాక్యము నందే పరిసమాప్త మగును కదా। ఈ విషయమును గూడ ప్రతిపాదించి యున్నాము.

వి. అనగా- అనేకశబ్దార్థముల సముదాయరూప మగు వాక్యమే కావ్య మగును గాని ఒక్క శబ్దమును, ఒక అర్థమును కావ్యము కాజాలదు. కావున వాక్యమునందలి సమస్తశబ్దములకు పరస్పరసంబంధ ముండవలెను. అర్థములకు గూడ పరస్పరసంబంధ ముండవలెను. అదియే సాహిత్య మని యభిప్రాయము.

వ్యా. శబ్దమునకు అర్థాంతరముతోడను, అర్థమునకు శబ్దాంతరముతోడను సాహిత్య ముండవలె నని ఏల చెప్పరాదు అని ఆశంకింపరాదు. (వాచకమునకు వాచకాంతరముతోడను వాచ్యమునకు వాచ్యాన్తరము తోడను సాహిత్యము అనెడు) పూర్వోక్తక్రమమును మార్చి, వాచకమునకు వాచ్యాన్తరముతోడను వాచ్యమునకు వాచకాన్తరముతోడను సాహిత్యము అని

చెప్పుటలో ప్రయోజన మేదియును లేదు. అట్టి సమన్వయము కూడ కుదరదు. కావున ఈ శబ్దార్థముల (అన్యూనానతిరిక్త మగు) స్వసామగ్రీసంపద యథా యోగ్యముగ ఏ రచనయందు సహృదయాహ్లాదమును కలిగించుచు, పరస్పర స్పర్ధతో స్ఫురించునో అట్టి అపూర్వ మగు సుందరవాక్యరచనావిశేషమునకు మాత్రమే సాహిత్యమని చెప్పుటకు అర్హత కలదు.

పూర్వోక్తవిషయమునే అంతరశ్లోకములచే విశదీకరించుచున్నాడు.

శ్లో॥ మార్గానుగుణ్యసుభగో మాధుర్యాదిగుణోదయః ।
అలంకరణవిన్యాసో వక్రతాతిశయాన్వితః॥ 34

"మార్గముల (రీతుల) యొక్క అనుకూలత్వముచే సుందర మైనదియును, మాధుర్యాదిగుణోపేతమును, వక్రతాతిశయముతో కూడినదియును, అగు అలంకారవిన్యాసమును". 34

శ్లో॥ వృత్త్యౌచిత్యమనోహారి రసానాం పరిపోషణమ్ ।
స్పర్ధయా విద్యతే యత్ర యథాస్వముభయోరపి॥ 35

"వృత్తుల ఔచిత్యముచే మనోహర మగు రసముల పరిపోషణమును (శబ్దార్థములు) రెండింటియందును యథోచితముగ ఎచట స్పర్ధతో ఉండునో" 35

శ్లో॥ సా కాప్యవస్థితి స్తద్విదానన్దస్పన్దసున్దరా ।
పదాదివాక్పరిస్పన్దసారః సాహిత్య ముచ్యతే॥ 36

"అట్టి కావ్యజ్ఞులకు ఆనందమును కలిగించు స్వభావముచే సుందర మైన, ఒకానొక (అనిర్వచనీయ మైన) (శబ్దార్థముల) స్థితి వ్యాకరణాదిసకలవాఙ్మయ సార మగు సాహిత్య మని చెప్పబడుచున్నది" 36

వ్యా. వ్యాకరణ—మీమాంసా—న్యాయ—సాహిత్యము లనెడు ఈ నాల్గింటికిని ప్రతి ఒక్క వాక్యమునందును ఉపయోగ ముండును. ఎట్లనగా- ఈ (గౌః) శబ్దస్వరూప మిట్టిది- ఇది గకార, ఔకారవిసర్గాత్మక మైనది. ఈ సుబంతపదము ప్రాతిపదికార్థపంచకములోని ఈ అర్థమును బోధించును; (స్వార్థము -అనగా ప్రాతిపదికము ఉచ్చరింపగనే ఏ అర్థము బోధింపబడునో ఆ అర్థము, ద్రవ్యము (లేక వ్యక్తి), లింగము, వచనము, కారకము, అను

ఐదును ప్రాతిపదికార్థములు). ఈ తిజంతపదము అఖ్యాతార్థషట్కమునకు చెందిన(వ్యాపారాశ్రయమగు కర్త, ఫలాశ్రయ మగు కర్మ, కాలము, పురుషము, వచనము, భావము అనగా క్రియ, అను ఆరును అఖ్యాతార్థములు) ఈ అర్థమును బోధించును; అని బోధించుట పదసంస్కార (వ్యాకరణ) శాస్త్రము చేయు వ్యాపారము. పదములకు గల పరస్పరాన్వయరూప మగు సంబంధమును పురస్కరించుకొని ఈ వాక్యార్థతాత్పర్య మిది అని నిర్ణయించుటలో వాక్యవిచార (మీమాంసా) శాస్త్రము ఉపయోగించును. ప్రత్యక్షానుమానాదిప్రమాణముల సాహాయ్యముచే, ఇది యుక్తిసంగతముగ నున్నది, అని నిర్ణయించుట ప్రమాణ (న్యాయ)శాస్త్రప్రయోజనము. స్వభావమాహాత్మ్యముచే ఇదియే సహృదయాహ్లాదక ముగ నున్నదిఅని నిర్ణయించుటలో సాహిత్య (శాస్త్ర)ము ఉపయోగించును.

వ్యా. ఈ వ్యాకరణాదులలో ఒక్కొక్కదానికి, దానిక్షేత్రమునప్రాధాన్య ముండును. ఇతరములు అప్రధానములుగ నుండును. అయినను వాస్తవమున సకలవాఙ్మయమునకును జీవితమువంటి దగు ఈ సాహిత్యరూప మైన కవి వ్యాపారమే అన్నింటికంటెను ఉత్కృష్ట మైనది. ఏ యన— (వ్యాకరణాది ప్రధానములగు భట్టివాక్యాదులవంటి) ఇతరవాక్యసన్దర్భములలో కూడ అప్రధాన ముగ నున్నను ఇది (సాహిత్యము) తన పరిమళమాత్రముచేతనే ఒక విధ మగు సంస్కారమును కలిగించుచున్నదికదా? అట్టిచో వానికి దీని పరిమళము లేనంత మాత్రముననే రామణీయకము లేకుండ పోవుచున్న దని తెలుచున్నది. రామ ణీయకము లేకపోవుటచే ఆ వాక్సందర్భమునకు గల ఉపాదేయత్వము తగ్గిపోవు చున్నది. ఈ విధముగ గుణీభూతకావ్యరచనాప్రవృత్తి వ్యర్థ మగును.

వి. ఇతర వాక్సందర్భములకంటె సాహిత్యసందర్భము శ్రేష్ఠ మని చెప్పుటకు కారణమేమనగా — వ్యాకరణాయుర్వేదాదిప్రధానము లగు భట్టికావ్య సుశ్రుతాదిగ్రంథములలో నచ్చటచ్చట నీ సాహిత్యచ్ఛాయ యుండుటచే నొకవిధ మగు సంస్కారము కనబడుచున్నది. దీనిని బట్టి- అనగా కావ్యపరిమళము కొంచెముగ నున్నను వానికి అందమును గూర్చుచున్నది గాన— సాహిత్యము ఆనందసంధాయక మగుటలో అన్నిటికంటె మిన్న యని తెలియుచున్నది. కాని ఆ భట్టికావ్యాదులలో సాహిత్యపరిమళము మాత్రమే ఉన్నది గాని, అధివాసము- అధికసుగంధము- లేకపోవుటచే వాటిలో కొంత రామణీయకము లోపించి వాటి

ఉపాదేయత్వము (స్వీకారార్హత) గూడ తగ్గుచున్నది దానితో సాహిత్యము గౌణముగా నున్న అట్టి వాక్సందర్భములను రచించుట (ఆహ్లాదకరత్వదృష్టితో చూచినచో) వ్యర్థము కావలసి వచ్చుచున్నది; అని తాత్పర్యము.

ఈ సాహిత్యమునకు శాస్త్రాతిరిక్త మగు ప్రయోజన మున్నదనియు, శాస్త్రాభిధేయము లగు చతుర్వర్గరూపఫలములకంటె అధిక మగు ఫల మున్నదనియు వెనుకనే (1-3-5) చెప్పియున్నాము.

అవ. ఉత్తరకారికలలో ప్రతిపాదింప నున్న వక్రోక్తియే కావ్యజీవిత మని అంతరశ్లోకములతో ప్రతిపాదించుచున్నాడు—

శ్లో. అపర్యాలోచితేఽప్యర్థే బంధసౌన్దర్య సమ్పదా
గీత వద్ధృదయాహ్లాదం తద్విదాం విదధాతి యత్ 37

"అర్థ పర్యాలోచనము చేయ కున్నను రచనా విధానమునందలి సౌన్దర్య సంపదచే ఏది సంగీతము వలె కావ్యజ్ఞులకు హృదయాహ్లాదమును కలిగించుచున్నదో"—

శ్లో. వాచ్యావబోధ నిష్పత్తౌ పద వాక్యార్థ వర్జితమ్
యత్కిమప్యర్ప యత్యన్తః పాన కాస్వాద వత్సతామ్ 38

"వాచ్యార్థజ్ఞానము కలిగిన పిమ్మట, ఏది, పదార్థవాక్యార్థ భేద విహీనమును, పానకాస్వాదము వలె సమూహాత్మకమును, అగు ఒకానొక అనిర్వచనీయ మగు ఆస్వాదవిశేషమును సత్పురుషుల, సహృదయుల, హృదయములందు కలిగించునో"— 38

శ్లో. శరీరం జీవితేనేవ స్ఫురితేనేవ జీవితమ్
వినా నిర్జీవతాం యేన వాక్యం యాతి విపశ్చితామ్ 39

"ఏది లేనిచో జీవితము (ప్రాణము) లేని శరీరము వలె, స్ఫూర్తి లేని జీవితము వలె, విద్వాంసుల (శాస్త్ర పండితుల) వాక్యము నిర్జీవముగ నుండునో"- 39

శ్లో. యస్మాత్ కిమపి సౌభాగ్యం తద్విదామేవ గోచరమ్
సరస్వతీ సమభ్యేతి తదిదానీం విచార్యతే 40

౯. "సహృదయైకసంవేద్యమును అనిర్వచనీయమును అగు సౌభాగ్యమును దేనివలన సరస్వతి (వాక్కు) పొందుచున్నదో అది (అట్టి వక్రోక్తిరూపకవి వ్యాపారము) ఇపుడు విచారింపబడుచున్నది." 40

ఇవి అంతరశ్లోకములు 17

ఈ విధముగ 'సహితౌ' శబ్ద వ్యాఖ్యానమును గావించి, కవి వ్యాపార వక్రత్వమును చెప్పుచున్నాడు.

కా. కవివ్యాపారవక్రత్వప్రకారాః సమ్భవన్తి షట్
ప్రత్యేకం బహవో భేదాస్తేషాం విచ్ఛిత్తిశోభినః 18

"కవి వ్యాపార వక్రత్వ పద్ధతులు (ప్రధానముగ) ఆరు ఉండవచ్చును. వాటిలో ఒక్కొక్కదానికి వైచిత్ర్యశోభితము లగు అనేకభేదములు ఉండును."

వ్యా. కవీనాం = కవులయొక్క, వ్యాపారః = వ్యాపారము = కవివ్యాపారము. కావ్యరచనారూప మగునది. దానియొక్క, వక్రత్వం = వక్రభావము. అనగా ప్రసిద్ధ మగు (గుణాలంకారాది) ప్రస్థానముకంటె భిన్న మగు కావ్య వైచిత్ర్యము. దీనియొక్క, ప్రకారాః = భేదములు ఆరు సంభవించును. ప్రధానముగ ఆరు భేదములు మాత్రమే సంభవించు నని యర్థము. వాటిలో ప్రతియొక్క ప్రకారమునకును అనేక మైన, భేదాః = విశేషములు; ఎట్టివి, విచ్ఛిత్తిశోభినః = వైచిత్ర్యపు మెరుపులతో ప్రకాశించునవి; 'సమ్భవన్తి' అను దానితో సంబంధము. (సంభవించును) 18

ఆ విషయమునే (షడ్విధవక్రతా ప్రకారములనే) చూపుచున్నాడు —

కా. వర్ణవిన్యాస వక్రత్వం పద పూర్వార్ధ వక్రతా
వక్రతాయాః పరోఽప్యస్తి ప్రకారః ప్రత్యయాశ్రయః 19

"వర్ణవిన్యాసము యొక్క వక్రత్వము, పద పూర్వార్ధముయొక్క వక్రత్వము, ప్రత్యయమును ఆశ్రయించియున్న వక్రతయొక్క మరి యొక ప్రకారమును ఉన్నది". (ఈ కారికలో మూడు వక్రత్వభేదములు చెప్పబడినవి. మిగిలిన మూడు భేదములు 20, 21 కారికలలో ప్రతిపాదింపబడును)

వ్యా. వర్ణానాం = వర్ణములయొక్క, విన్యాసః = విన్యాసము, వర్ణ విన్యాసము. అనగా అక్షరములయొక్క విశిష్ట మగు కూర్పు; దానియొక్క, వక్రత్వం = వక్రముగా నుండుట, అనగా ప్రసిద్ధముగా నుండు పద్ధతికంటె భిన్నముగా నుండెడి వైచిత్ర్యముతో కూర్చుట. (వర్ణముల) సన్నివేశ విశేషముచే ఏర్పడినదియు కావ్యజ్ఞుల కానందమును కూర్చునదియు నగు శబ్దశోభాతిశయ మని భావము.

ఎట్లనగా—

ప్రథమ మరుణచ్ఛాయస్తావత్ తతః కనకప్రభః
తదను విరహోత్తామ్యత్తన్వీకపోల తలద్యుతిః.
ప్రసరతి తతో ధ్వాన్తక్షోదక్షమః క్షణదాముఖే
సరస బిసినీ కన్దచ్ఛేద చ్ఛవిర్మృగ లాంఛనః. 41

"రాత్రి ప్రారంభమున మొదట ఎర్రని కాంతి కలవాడును, పిమ్మట బంగారు కాంతి కలవాడును, అటు పిమ్మట విరహముతో బాధపడుచున్న కృశాంగియొక్క కపోలతలము వంటి కాంతి కలవాడును, ఆ పిమ్మట సరసము లగు తామరతూడు ముక్కలవంటి కాంతి కలిగి, చీకటిని తొలగించుటకు సమర్థుడును అగు చంద్రుడు ప్రసరించుచున్నాడు." 41

ఇచట వర్ణవిన్యాసమునందలి వక్రతామాత్రముచే లభించిన శోభాతిశయము ఎంతయు స్పష్టముగ చూపబడినది. ఈ వర్ణవిన్యాస వక్రత్వమే ప్రాచీనాలంకార గ్రంథములయందు అనుప్రాస మని ప్రసిద్ధి గాంచినది. ఇందలి భేదములను లక్షణ నిరూపణ సమయమున (2-1) చూపగలము.

వ్యా. పదస్య = సుబంతముయొక్క గాని, తిఙంతముయొక్క గాని, ఏ పూర్వార్ధం = ప్రాతిపదికరూప మైనది గాని, ధాతురూప మైనది గాని యగు పూర్వార్ధము కలదో, దానియొక్క, వక్రతా = వక్రభావము, అనగా విన్యాసమునందలి వైచిత్ర్యము. (దానికి పద పూర్వార్ధవక్రత యని పేరు.)

వి. సుప్ ప్రత్యయములను చేర్చుటచే ఏర్పడిన 'రామః' 'బాలః,' ఇత్యాదులు సుబంతములు. (నామవాచకములు) తిఙ్ ప్రత్యయములను చేర్చుటచే

ఏర్పడిన 'భవతి గచ్ఛతి' ఇత్యాదులు తిఙంతములు. క్రియా పదములు. ఈ రెండింటికిని (సుబంత తిఙంతములకు) పద మని పేరు. సుబంతమైనచో దాని పూర్వార్ధము ప్రాతిపదిక మై యుండును. తిఙంతమైనచో దాని పూర్వార్ధము ధాతు వై యుండును. వీటి వక్రత పద పూర్వార్ధవక్రత యని యర్థము.

వ్యా. ఈ పదపూర్వార్ధవక్రత్వమున అనేకభేదము లుండవచ్చును.

(1) రూఢి శబ్దమునే ప్రస్తావమునకు అనుకూలముగ నుండునట్లు వాచ్యముగా ప్రసిద్ధ మగు ధర్మముకంటె భిన్న మగు ధర్మము (వాచ్యము నందు ప్రసిద్ధ మగు మరి యొక (రామత్వాద భిన్న) ధర్మ మని చెప్పుట అతరార్థ సంగతము) యొక్క ఆరోపము గర్భము నందుండు నటుల నిబంధిం చుట పదపూర్వార్ధవక్రతయొక్క మొదటి భేదము. ఎట్లనగా— "రామోఽస్మి సర్వం సహే". నేను రాముడను కదా అంతయు సహింపగలను (అనుచోట రామ శబ్దమునందు.)

వి. ఈ వాక్యము మహా నాటకములోని—

స్నిగ్ధశ్యామల కాన్తిలిప్తవియతో వేల్లద్బలాకా ఘనా
వాతాః శీకరిణః పయోద సుహృదా మానన్దకేకాః కలాః,
కామం సన్తు దృఢం కఠోర హృదయో రామోఽస్మి సర్వం సహే
వైదేహీ తు కథం భవిష్యతి హాహా హా దేవి! ధీరాభవ॥

అను శ్లోకములోనిది.

"స్నిగ్ధ మగు శ్యామల కాంతితో ఆకాశమును పూయుచున్న వియును, పరిసరమునందు ఎగురుచున్న కొంగలు కలవియును అగు మేఘములును, తుంపురులతో నిండిన గాలులును, మధురము లగు మయూర కేకాధ్వనులును, అవన్నియు తీరిన తీరుగాక. మిక్కిలి కఠిన మైన హృదయము గల రాముడనై యున్నాను. అన్నిటిని సహింతును, కాని వైదేహి ఎట్లుండునో కదా! హా. దేవి! ధైర్యముతో నుండుము."

ఇచట 'రామ' పదము కేవలము దశరథ పుత్రు డగు రాము డను అర్థమునకు కాక "ఎన్నియో కష్టముల ననుభవించుట కలవాటు పడినవాడు" అను

నరమున ప్రయోగింప బడినది. 'రామః'లో 'రామ' అనునది ప్రాతిపదికము. (సు) అనునది ప్రత్యయము. 'రామ' అనునది పదపూర్వార్థము కాన ఇది తద్వక్రతకు ఉదాహరణము.

వ్యా. 2. ఎచ్చట వాచ్యమునందు ప్రసిద్ధ మగు ధర్మముయొక్క లోకోత్తరాతిశయారోపమును గర్భమునం దుంచి సంజ్ఞాశబ్దము కూర్చబడునో అది రెండవ (పదపూర్వార్థ) వక్రతాభేదము.

ఎట్లనగా—

రామోఽసౌ భువనేషు విక్రమగుణైః ప్రాప్తః ప్రసిద్ధిం పరా-
మస్మద్భాగ్య విపర్యయాద్యది పరం దేవో న జానాతి తమ్.
వన్దీవైష యశాంసి గాయతి మరుద్యస్యైక బాణాహతి
శ్రేణీభూత విశాలతాల వివరోద్గీర్ణైః స్వరైః సప్తభిః.

(రాఘవానంద నాటకము) 48

"ఈ రాముడు పరాక్రమముచేతను, గుణములచేతను లోకములలో గొప్ప ప్రసిద్ధిని పొంది యున్నాడు. అతనిని గూర్చి ప్రభువుగారికి తెలియ దన్నచో అందులకు మా (లంకావాసుల) దురదృష్టమే కారణము. ఒక్క బాణ ప్రహారముచే పంక్తిగా నేర్పబడిన (ఏడు) విశాల తాల వృక్షముల రంధ్రముల నుండి బయల్వెడలిన ఏడు స్వరములతో వాయువు స్తోత్ర పాఠకుడు వలె ఏ రాముని కీర్తిని గానము చేయుచున్నదో."

ఇచట లోకోత్తరము లగు శౌర్యౌదార్యాది ధర్మముల అతిశయముయొక్క అధ్యారోపమును బోధించునదిగ ప్రయుక్త మగు 'రామ' శబ్దము వక్రత్వమును ప్రకటించుచున్నది.

వి. పదపూర్వార్ధవక్రతకు చూపబడిన ఈ రెండు ఉదాహరణములందును 'రామ' శబ్దమునందే ఈ వక్రత చూపబడినది. ఈ వక్రత్వమునందలి భేద మేమనగా,- పూర్వశ్లోకమున 'రామ'పద వాచ్యుడగు రామునియందు ప్రసిద్ధము లగు దశరథపుత్రత్వాది ధర్మములకంటె భిన్న మగు దుఃఖైక భాజనత్వాది రూపధర్మాంతరముల ఆరోప మున్నది. కాని రెండవ ఉదాహరణము నందలి

రామపదవాచ్య డగు రామునియందు ప్రసిద్ధము లగు శౌర్యాది గుణములయందే లోకోత్తరత్వ రూపాతిశయము యొక్క ఆరోప మున్నది.

వ్యా. ౮. ఒక వస్తువును అనేకశబ్దములచే బోధించుటకు అవకాశమున్నను ప్రకృతమునకు అనుగుణ మగుటచే ఒకానొక శబ్దమే, ఎచట ప్రయోగింప బడునో, అచట పదపూర్వార్ధ వక్రత్వముండును. ఎట్లనగా—

వామం కజ్జలవద్విలోచనమురో రోహద్విసారిస్తనం
మధ్యం క్షామమకాండ ఏవ విపులాభోగా నితంబస్థలీ,
సద్యః ప్రోద్గతవిస్మయైరితి గణై రాలోక్యమానం ముహుః
పాయాద్వః ప్రథమం వపుః స్మరరిపోర్మిశ్రీభవత్
కాన్తయా. 44

“ఎడమ కన్ను కాటుక కలదైనది. వక్షస్థలపు ఎడమభాగము బయల్వెడలు చున్న విశాలస్తనము గలది. నడుము హఠాత్తుగా సన్నమైనది; నితంబము విశాల మైనది; ఈ విధముగ వెంటనే బయల్వెడలిన ఆశ్చర్యము గల ప్రమథ గణములచే మాటిమాటికిని చూడబడుచున్న, కాంతతో ప్రప్రథమముగా కలసి పోవుచున్న స్మరరిపుని యొక్క (అర్ధనారీశ్వరరూపమగు) శరీరము మిమ్ము లను రక్షించుగాక.” 44

వ్యా. ఇచట స్మరరిపోః అనెడు శివ పర్యాయ పదము అపూర్వమగు వక్రత్వమును ఆవిష్కరించుచున్నది; ఏలయన— మన్మథ శత్రువు శరీరము కాంతతో కలిసిపోవుట ఏ విధమునను సంభావ్యము కాదు గాన గణములకు (అది చూచిన) వెంటనే ఎక్కువ ఆశ్చర్యము కలుగుట యుక్తముగా నున్నది. ఆ కలసిపోవుట కూడ మరల మరల పరిశీలించిన పిదప ఆశ్చర్యమును కలిగింప జాలదు గాన ‘ప్రథమ’ పదముయొక్క జీవితము.

వి. అనగా— తొలిసారి చూచినప్పుడు మాత్రమే అట్టి ఆశ్చర్యము కలుగును గాని, మాటిమాటికి చూచిన విస్మయము కలుగదు అను విషయమును బోధించుటకే శ్లోకమున ‘ప్రథమ’ పదము ప్రయుక్తమైనది. అదియే ‘ప్రథమ’ పద ప్రయోజనము.

వ్యా. వాచ్యమునందు సంభావ్యములు కాని ధర్మాంతరములను గర్భితములు చేయుటచేత గూడ ఈ పర్యాయ వక్రత్వము చూడబడుచున్నది.

ఎట్లనగా—"అంగరాజ! సేనాపతే! రాజవల్లభ! రక్షైనం భీమాద్దుఃశాసనమ్"॥ (వేణీసంహారము 3-47).

"ఓ అంగరాజా! ఓ సేనాపతీ! ఓ రాజప్రియుడా! ఈ దుశ్శాసనుని భీముని నుండి రక్షింపుము".

వి. భీమసేనుడు దుశ్శాసనుని వక్షము చీల్చి రక్తము త్రాగనున్నప్పుడు అశ్వత్థామ అంతవరకును బీరములు పలికిన కర్ణునితో సోల్లుంఠనముగ పలికిన మాటలివి.

ఇచట ('అంగరాజా!' మొదలగు) మూడు పర్యాయ పదములందును అతనిని రక్షింపగల్గుట అసంభావ్య మనెడు (కర్ణుని) అశక్తత్వమును గర్భితము చేసి "వీనిని రక్షింపుము!" అని ఉపహాసము చేయబడుచున్నది.

వ్యా. 4. పద పూర్వార్ధ వక్రత్వమునందు ఉపచార వక్రత్వ మనెడు మరియొక (నాల్గవ) భేదమున్నది. ఇందు మూర్త ద్రవ్యమును బోధించు శబ్దము ఉపచారము (ఆరోపము) చే అమూర్త ద్రవ్యమును బోధించును. ఎట్లనగా—

"నిష్కారణం నికారకణికాపి మనస్వినాం, మానస మాయాసయతి."

"నిష్కారణముగ చేయబడిన అవమాన కణమైనను మానవంతుల మనస్సుకు బాధ కలిగించును." మరియొకటి ఎట్లనగా—

"హస్తాపచేయం యశః"

"చేతితో కోయతగిన కీర్తి" చిన్నిమూర్త శబ్దమును బోధించు కణికా శబ్దము సామాన్యరూపమున అల్పత్వమును ఆరోపించుటచే ఇచట అమూర్త మగు అవమానము యొక్క అల్పత్వమును బోధించుటకై ప్రయుక్త మైనదై సహృదయాహ్లాదకారి యగుటచే వక్రత్వమును పోషించుచున్నది 'హస్తాప చేయమ్' అనుచోట కూడ మూర్తము లగు పుష్పాది వస్తువులలో ఉండుటకు అవకాశము కల సంహతత్వమును (ఒక ముద్దగ నుండుటను) ఆరోపించి అమూర్త మగు

యశస్సును గూడ 'హస్తాప చేయమ్' అని చెప్పుట వక్రత్వమును కూర్చు చున్నది.

వ్యా. తరంగితత్వము (అలలు అలలుగా లేచుట) మొదలగు ధర్మముల సాధారణముగ చేసికొని, ద్రవరూప మగు వస్తువును బోధించు శబ్దము, ఏదియో యొక సాదృశ్య మాత్రమును పురస్కరించుకొని, ఘనపదార్థవాచకముగ గూడ ప్రయోగింపబడుచు కవి ప్రవాహమునందు ప్రసిద్ధిలోనున్నది. ఎట్లనగా—

"శ్వాసోత్కమ్ప తరఙ్గిణి స్తనతటే" 46

'శ్వాస జన్యకంపముచే తరంగిత మగు స్తనతటమునందు.'

ఇచట కఠిన మగు స్తనతటమున జలమునందు వలె తరంగములు వచ్చి నట్లు ఆరోపించుటచే ఇది పద పూర్వార్ధ వక్రత్వమునకు చెందిన ఉపచార వక్రత్వమనెడు నాల్గవ భేదమున కుదాహరణము.

(ఈ పూర్తి శ్లోకము ముందు, మూలమునందే ఉదాహరింపబడగలదు).

వ్యా. కొన్ని యెడం ద్రవరూపార్థమును బోధించునది అమూర్తవాచకముగ గూడ ప్రయోగింపబడును. ఎట్లనగా—

ఏకాం కామపి కాల విప్రుషమమీ శౌర్యోష్మ కణ్డూవ్యయ
వ్యగ్రాః స్యుశ్చిర విస్మృతా మరచమూడిమ్బా హవా బాహవః. 47

* ఈ శ్లోకమెవరిదో తెలియదు. తృతీయోన్మేషములో పూర్తిశ్లోక మీ విధముగ చూపబడినది.

లోకో యాదృశ మాహ సాహస ధనం తం క్షత్రియా పుత్రకం
స్యాత్ సత్యేన స తాదృగేవ న భవేత్ వార్తా విసంవాదినీ.
ఏకాం కామపి కాల విప్రుషమమీ శౌర్యోష్మ కణ్డూవ్యయ
వ్యగ్రాః స్యుశ్చిరవిస్మృతా మరచమూడిమ్బా హవా బాహవః॥

'లోకులు ఆ క్షత్రియా పుత్రకుని గూర్చి ఏ విధముగ, సాహసమే ధనముగ కలవానినిగా చెప్పుచున్నారో, అతడు సత్యముగ అట్టివాడే కావచ్చును. ఈ లోకవార్త యథార్థదూరము కాకపోవచ్చును. సురసేనలతో జరిగిన చిన్ని

చిన్ని యుద్ధములను చాలకాలము క్రితమే మరచిన నా బాహువులు ఒక్క కాల బిందువు పాటు శౌర్యము వలన కలిగిన దురదను పోగొట్టు కొనుటయందు వ్యగ్రములై అగుగాక'

వి. ఇది పూర్తిశ్లోకమునకు అనువాదము. 'క్షత్రియా' అను స్త్రీలింగ శబ్దమును, 'పుత్రకం' అను అల్పార్థకప్ ప్రత్యయాంతమును ప్రయోగించుటచే రాముని విషయమున రావణునికి గల అవజ్ఞసూచిత మగుచున్నది. డిమ్బాహవ మనగా చిన్న దెబ్బలాట. లేదా వినోదముకొరకు చేయు యుద్ధము. (MOCK FIGHT) ఇచట జలాది ద్రవపదార్థములను బోధించు విప్రుట్ఛబ్దము అమూర్త కాలాంశ వాచకముగ ప్రయోగింపబడినది.

వి. ఈ రెండింటిలో 'శ్వాసోత్కమ్ప' 'ఏతాం కామవి కాలవిప్రుషం' అను పద్యములలో 'తరంగిణి' 'విప్రుషం' అనునవి వక్రత్వమును సంపాదించుచున్నవి.

5. విశేషణ వక్రత్వ మనెడు పదపూర్వార్ధ వక్రతాభేదము (అయిదవది) ఉన్నది. అందు విశేషణ మాహాత్మ్యము చేతనే సహృదయాహ్లాద కారిత్వరూప మగు వక్రత్వము వ్యక్తమగును. ఎట్లనగా—

దాహోఽమ్భః ప్రసృతిం పచః ప్రచయవాన్ బాష్పః ప్రణాలోచితః
శ్వాసాః ప్రేంఖిత దీప్ర దీపలతికాః పాణ్డిమ్ని మగ్నంవపుః।
కించాన్యత్కథయామి రాత్రిమఖిలాం త్వన్మార్గ వాతాయన
హస్తచ్ఛత్ర నిరుద్ధచన్ద్రి మహస్తస్యాః స్థితిర్వర్తతే॥
(విద్ధశాలభంజిక II-21) 48

'తాపము దోసిళ్ళ కొలది నీళ్ళను కాచివేయ గలదిగ నున్నది. అత్యధిక మగు బాష్పము గొట్టములలో ప్రవహింపచేయుటకు సరిపడునది ఉన్నది. శ్వాస ములు ప్రజ్వలించుచున్న దీపలతికను కదల్చి వేయుచున్నవి. శరీరము తెలు పులో మునిగిపోయినది. ఇంకొక విషయమును చెప్పెదను.— ఆమె రాత్రి యంతయు హస్త మనెడు ఛత్రమును చంద్రకాంతికి అడ్డముగ పెట్టికొని నీవు వచ్చెడు మార్గము వైపున నున్న వాతాయనమునందు కూర్చొని యున్నది'.

ఇచట 'దాహః, 'బాష్పః, శ్వాసాః, వపుః' అని చెప్పుటలో వైచిత్ర్య మేమియు చూపబడలేదు. కాని ఒక్కొక్క దానికి చేర్చిన "అంభః ప్రసృతిం

పచః" ఇత్యాది విశేషణముల మాహాత్మ్యముచేత మాత్రము ఒకానొక వక్రత ప్రతీత మగుచున్నది. (కావున ఇది విశేషణ వక్రత్వమున కుదాహరణము)

ఇంకను ఎట్లనగా—

వ్రీడా యోగాన్నత వదనయా సన్నిధానేగురూణాం
బద్ధోత్కమ్పస్తన కలశయా మన్యు మన్తర్నిగృహ్య.
తిష్ఠేత్యుక్తం కి మివ న తయా యత్సముత్సృజ్య బాష్పం
మయ్యా సక్తశ్చకిత హరిణీహారి నేత్రత్రిభాగః॥ 49

శార్ఙ్గ ధర పద్ధతి 3464:

"పెద్దల సమీపమున సిగ్గుచే తల వంచుకొన్నదియు, (తీవ్ర శ్వాసము చే) కదలుచున్న స్తన కలశములు కలదియు నగు ఆమె కోపమును లోన దిగమ్రింగి, కన్నీరు రాల్చి, నేత్రాంతము భయపడుచున్న లేడి (చూపు) వలె మనోహర మగునట్లుగా నాపై లగ్నమగునట్లు చేసిన దనగా (ప్రసరింప చేసిన దనగా) తన్మాత్రము చేతనే ఆగిపొమ్ము అని చెప్పలేదా ।

వి. గ్రామాంతరమునకు వెళ్ళెదనంటివే వెళ్ళలే దేమి? అని మిత్రు డడుగగా, అందులకు కారణమును తెలుపుచు పలికినదీ వాక్యము.

వ్యా. ఇచట 'భయపడుచున్న లేడిచూపు-వలె మనోహరముగా' అనెడు క్రియా విశేషణము గురు సన్నిధిచే గలిగిన అప్రగల్భత్వముచే రమణీయ మగు నేత్రాంత సంగమమునకు భయపడుచున్న లేడి యొక్క నేత్రములతో సామ్యమును చూపుటద్వారా ఒకానొక సౌందర్యమును కలిగించుచున్నది.

వ్యా. 6. ప్రస్తావానుగుణ మగు ఏదియో ఒక నికర్షముతో గాని, ఉత్కర్షముతో గాని కూడిన పదార్థస్వరూపమును ప్రత్యక్షముగను, స్పష్టముగను చెప్పుటకు వీలు కానపుడు కప్పిపుచ్చుటకు సామర్థ్యము కలదగుటచే ఉపయుక్త మగు శబ్దముచే అది బోధింపబడును. ఇది 'సంవృతివక్రత్వము' అనెడు పద పూర్వార్ధవక్రత యందలి మరియొక (ఆరవ) భేదము.

ఎట్లనగా—

(ఈ శ్లోకము తాపసవత్సరాజచరితములోని చతుర్థాంకములోనిది). పూర్తిశ్లోక మిది—

చక్షుర్యస్య తవాననాదపగతం నాభూత్ క్వచిన్నిర్వృతం
యేనైషా సతతం త్వదేకశయనం వక్షఃస్థలీ కల్పితా.
యేనోక్తాసి వినా త్వయా బత జగచ్ఛూన్యం క్షణాజ్జాయతే
సోఽయం దమ్భధృతవ్రతః ప్రియతమే కర్తుం కిమప్యుద్యతః॥ 50

''నీ ముఖమునుండి తొలగింపబడిన ఎవనియొక్క దృష్టి మరి యెచటను ఆనందముకలది కాలేదో, ఎవనిచే ఈ వక్షస్థలము నీ యొక్క తెకు మాత్రమే శయనముగా కల్పింపబడినదో, ''నీవు లేకున్నచో ఈ జగత్తు క్షణకాలములో శూన్యప్రాయ మై యగును'' అని ఎవనిచే నీవు పలుకబడితివో, దంభమునకై గ్రహింపబడిన (ఏకపత్నీ) వ్రతము గల ఆ ఈతడు (అట్టి ఈ వత్సరాజు) ఓ ప్రియతమురాలా! ఏదియో చేయుటకు ఉద్యమించుచున్నాడు''.

వ్యా. ఇచట, వాసవదత్తకు కలిగిన విపత్తిచే వ్యాకులుడగు వత్సరాజు, (''నీవు పద్మావతిని వివాహమాడినచో పోయిన వాసవదత్త మరల లభించును'' అనెడు కొందరి జ్యోతిష్కుల మాటలను బట్టి) ఆమెను మరల పొందవలె ననెడు ఆశచే పద్మావతిని వివాహ మాడ నిశ్చయించి, తాను చేయు పని (పద్మావతీవివాహము) అకార్య మని భావించుచు ఆ అర్థమును కప్పిపుచ్చుటకు సమర్థ మగు 'కేనాపి' అనెడు సర్వనామపదముచే, మహాపాతకమును వలె ఆ పనిని నోటితో ఉచ్చరించుట కూడ తగ దని సూచించుచున్నాడు. (కావున ఇది సంవృతివక్రతకు ఉదాహరణము).

ఇంకను ఎట్లనగా-

నిద్రానిమీలితదృశో మదమన్థరాయా
నాప్యర్థవన్తి న చ యాని నిరర్థకాని.
అద్యాపి మే వరతనోర్మధురాణి తస్యా
స్తాన్యక్షరాణి హృదయే కిమపి ధ్వనన్తి॥ 51

''నిద్రచే మూయబడిన నేత్రములుకలదియు, మదముచే మందయు నగు ఆ సుందరి యొక్క, అర్థము కలవి కానివియు, అర్థములేనివి కూడ కానివియు,

అగు మధురము లగు ఆ అక్షరములు హృదయమునందు ఏమేమో ధ్వనించుచునే యున్నవి''.

ఇచట 'కిమపి' అనుటచే ఆ అక్షరములను వినుటచే కలిగిన చిత్తచమత్కారము కేవలము అనుభవైకగోచర మగుటచేత ఇది ఇట్లని చెప్పుటకు శక్యము కాదని ప్రతిపాదింపబడుచున్నది. 'తాని' అనగా 'అట్టి అనిర్వచనీయానుభవ గోచరముగ స్మరింపబడుచున్నవి' అని యర్థము.

'నాప్యర్థవన్తి' అనుటచే తనకు మాత్రమే సంవేద్య మగుటచే వర్ణించుటకు శక్యము కాకుండుట ప్రకాశింపబడుచున్నది. అవి అలౌకికచమత్కారజనకములు గాన, 'న చ యాని నిరర్థకాని' అనుటచే, వాటికి అపార్థకత్వము నివారింపబడు చున్నది. ఈ మూడు విశేషణములందును, విశేషణవక్రత్వముగోచరించుచున్నది. (కిమపి అనునపుడు సంవృతివక్రత్వ మున్నది).

వ్యా. 7. కవులు సమాసాదివృత్తులలో విచిత్రము లగు కొన్ని వృత్తులను మాత్రమే పరిగ్రహింతురు. అట్టి చోట్ల వృత్తివైచిత్ర్యవక్రత్వ మనెడు మరి యొక (ఏడవ) పదపూర్వార్ధవక్రతాభేదము సంభవించును. ఎట్లనగా-

"మధ్యేఽఙ్కురం పల్లవాః" వి. శా. భ. (1-28) 52

"అంకురమధ్యమమునందు (మధ్యేంకురము) పల్లవములు"

వి. ఇచట 'అంకురమధ్యే' అని తత్పురుషసమాసమును ప్రయోగింపక "పారేమధ్యేషష్ఠ్యావా" అనసూత్రముచే (2-1-18) విహిత మగు అవ్యయీభావ సమాసమును (మధ్యేంకురం) ప్రయోగించుటచే సమాసరూపవృత్తివక్రత్వ మున్నది.

వ్యా. ఇంకను ఎట్లనగా-

"పాణ్డిమ్ని మగ్నం వపుః'' 53. (చూ. 48వ శ్లో)

"శరీరము పాండిమయందు మునిగిపోయినది"

వి. ఇచట 'పాండుతాయామ్' 'పాండుత్వే' మొదలగు ప్రసిద్ధతద్ధితాంతములను ప్రయోగింపక, ఇమనిచ్ప్రత్యయాంత మగు (వర్ణదృఢాదిభ్యఃష్యఞ్చ 5-1-123 అను సూత్రముచే) 'పాణ్డిమ్ని' అను పదమును ప్రయోగించుటచే

వక్రతావిశేషము అనుభవగోచర మగుచున్నది. ఇది తద్ధితవృత్తివక్రతకు ఉదాహరణము.

ఇంకను ఎట్లనగా—

"సుధావిసరనిష్యన్ద సముల్లాస విధాయిని
హిమధామని ఖండేఽపి న జనో నోన్మనాయతే''

"ఖండరూపు డైనను హిమాంశువు అమృతధారాప్రవాహప్రసారమును చేయుచుండగా, జనుడు ఉత్కంఠితుడు కాడనునది లేదు". (తప్పక ఉత్కంఠితు డగును)

వి. ఇచట 'ఉత్కంఠితో భవతి' ఇత్యాదివాక్యములను ప్రయోగింపక "భృశాదిభ్యో భువ్యచ్వేర్లోపశ్చ హలః" అను సూత్రముచే (3-1-12) 'ఉన్మనస్' శబ్దమునకు క్యఙ్ ప్రత్యయమును చేర్చుటచే నిష్పన్న మగు 'ఉన్మనాయతే' అను నామధాతువును ప్రయోగించుటచే నొక విధ మగు చమత్కారము పోషింపబడుచున్నది.కావున ఇది సనాద్యన్తధాతు (నామధాతు, రూపవృత్తి వక్రతకు ఉదాహరణము. కృత్— తద్ధిత— సమాస, ఏకశేష-సనాద్యన్తధాతువు లను పేర్లతోవృత్తులు ఐదువిధములు. "సన్, క్యచ్, కామ్యచ్, క్యఙ్, క్యష్, ఆచారక్విప్, ణిచ్, యఙ్, యక్, ఆయ, ఈయఙ్, ణిఙ్ అను ప్రత్యయములను చేర్చుటచే నిష్పన్నములగు ధాతువులు సనాద్యన్తధాతువృత్త్యంతర్గతములు. ఇచట 'ఉన్మనాయతే' అనునది క్యఙ్ ప్రత్యయాంతము. ఈ ఐదు వృత్తులలో ఇచట చమత్కారకారి యగు వృత్తినిస్వీకరించుట వృత్తివక్రత యని భావము. ఇచట వరుసగ సమాసవృత్తి- తద్ధితవృత్తి = సనాద్యంతధాతువృత్తి—వక్రతల కుదాహరణములు చూపబడినవి.

ఇచట 'సమాసాదితవృత్తీనామ్' అనుపాఠము, దానిపై విశ్వేశ్వరుని వ్యాఖ్యానమును అసంగతముగ నున్నవి.

వ్యా. 8. వైచిత్ర్యముకొరకై భిన్నలింగపదములను సమానాధికరణములనుగ (అనగా ఏకవస్తుబోధకములనుగ) ప్రయోగించినచో అచట "లింగవైచిత్ర్యము" అనెడు మరి యొక (ఎనిమిదవ) భేదము గూడ కనబడుచున్నది.

ఎట్లనగా—

ఇత్థం జడే జగతి కో ను బృహత్ప్రమాణ
కర్ణః కరీ నను భవేద్ధ్వనితస్య పాత్రమ్.
ఇత్యాగతం ఝటితి యోఽలినమున్మమాథ
మాతఙ్గ ఏవ కిమతః పరముచ్యతేఽసౌ॥

"ఈ విధముగ జడ మగు ఈ ప్రపంచమున పెద్ద చెవులుగల ఈకరి, (పెద్ద చేయి కలది- అనగా ఈవి కలది, తొండము కలది అని అర్థద్వయము) ఎవరోకదా! నా ధ్వనితమునకు (ప్రార్థనకు) అర్హత కలది కావచ్చును. ఇట్లు భావించి వచ్చిన తుమ్మెదను ఏది వెంటనే చంపివేసెనో అది మాతంగమే. (మాతంగుడే—చండాలుడే అని రెండవ యర్థము) దానిని ఇంక నేమని పిలువ వలెను?"

వి. ఇచట "బృహత్ప్రమాణకర్ణః, 'కః', 'పాత్రమ్'"అను భిన్నలింగములగు (మొదటి రెండును పుంలింగములు, మూడవది నపుంసకము) పదములు సమానాధికరణములుగ (ఏకగజవ్యక్తిసంబద్ధములుగ ప్రయోగింపబడినవి గాన) ఇది లింగవక్రత కుదాహరణము.

ఇంకను ఎట్లనగా-

"మైథిలీతస్యదారాః" (బాలరా 3-27)

"(మైథిలి అతని దారలు)"

వి. ఇచట స్త్రీలింగ, పుంలింగశబ్దము లగు 'మైథిలీ' 'దార' శబ్దములు సమానాధికరణములుగ ఉపయోగింపబడినవి గాన లింగవక్రతకుదాహరణము.

వ్యా. స్త్రీ అను పేరే సుందరము గావున (నామ్నైవ స్త్రీతి పేశలమ్) కవులు (ఒక శబ్దమునకు) అనేకలింగము లున్నను సౌకుమార్య మనెడు కారణముచే స్త్రీలింగశబ్దమునే ప్రయోగించుచుందురు. అట్టి స్థలములో మరి యొక లింగవైచిత్ర్యవక్రత్వభేదము కూడ ఉన్నది.

ఎట్లనగా-

"ఏతాం పశ్య పురస్తటీమ్" 57

"ఎదుట ఈ తటిని (ఒడ్డును) చూడుము".

వి. తటశబ్దమును మూడు లింగములందును ప్రయోగింపవచ్చును. ఇచట కవి సౌకుమార్యాతిశయమును పురస్కరించుకొని 'తటీమ్' అను స్త్రీలింగశబ్దమునే ప్రయోగించినాడు.

అవ. ఇంతవరకును సుబంతపదపూర్వార్ధ (ప్రాతిపదిక) వక్రతకు ఉదాహరణములను చూపి, ఇపుడు తిఙంతపదపూర్వార్ధవక్రతను, అనగా ధాతువక్రతను, చూపుచున్నాడు.

9. క్రియావైచిత్ర్య ప్రతిపాదనముకొరకై కవులు ఒకవిధ మగు నేర్పుతో గూడిన పలుకులచే రమణీయము లగు ప్రయోగములను చేయుచుందురు. అట్టి స్థలములలో "క్రియావైచిత్ర్యవక్రత్వము" అనెడు, పదపూర్వార్ధ మగు ధాతువునకు సంబంధించిన మరి యొక వక్రత్వభేదమున్నది. అందు సౌన్దర్యవ్యాప్త మగు వ్యవహారము గల బహువిధము లగు క్రియావైచిత్ర్యము కనబడుచున్నది.

ఎట్లనగా-

"రతికేళిహృతనివసనకరకిసలయరుద్ధనయనయుగలస్య
రుద్రస్య తృతీయనయనం పార్వతీపరిచుంబితం జయతి". 58

"రతికేళియందు తొలగింపబడిన (పార్వతీ) వస్త్రము కలవాడును, (ఆమె యొక్క) కరకిసలయములచే మూయబడిన నేత్రద్వయము కలవాడును అగు రుద్రునియొక్క పార్వతీచుమ్బిత మగు మూడవ నేత్రము సర్వోత్కృష్టముగ నున్నది". 58

ఇచట సాధింప తగిన కప్పుట అనెడు ప్రయోజనము (అన్ని నేత్రముల విషయమునందును) సమానమే యైనను లోచనత్వము (ఆ మూడింటికిని) సమానమే యైనను, దేవి చుమ్బనముచే ఏ కన్నును మూయుచున్నదో, భగవంతుని ఆ మూడవ కన్ను సర్వోత్కృష్టముగ నున్నది- అని వాక్యార్థము. ఇచట (మిగిలిన రెండు కన్నులకును లేని గొప్పదనమును సూచించు) 'జయతి' అను క్రియాపదమునకు గల సహృదయసంవేద్య మగు వైచిత్ర్యము స్ఫురించుచున్నది.

ఇంకను ఎట్లనగా—

స్వేచ్ఛాకేసరిణః స్వచ్ఛస్వచ్ఛాయాయాసితేన్దవః ।
త్రాయన్తాం వో మధురిపోః ప్రపన్నార్తిచ్ఛిదో నఖాః॥ 59

(ధ్వన్యాలోక మంగళాచరణ శ్లోకము)

"స్వచ్ఛ మగు తమ కాంతిచే జయింపబడిన చంద్రుడు కలిగినట్టియు, శరణు జొచ్చినవారి ఆర్తిని ఛేదించు నవియు అగు, స్వేచ్ఛావశముచే సింహముగ అవతరించిన మధుసూదనుని నఖములు మిమ్ములను రక్షించుగాక".

ఇచట సకలలోక ప్రసిద్ధ మగు ఛేదనవ్యాపారముకంటె భిన్న మగు ఒకా నొక అపూర్వ మగు ప్రపన్నార్తిచ్ఛేదనరూప మగు క్రియావైచిత్ర్యము నఖము లకు వర్ణింపబడినది.

వి. అనగా నఖములు తృణాదులను ఛేదించినట్లు నృసింహుని నఖములు ప్రపన్నుల ఆర్తుల నన్నిటిని ఛేదించునని చెప్పుటలో ఒక వైచిత్ర్య మున్నది గాన ఇది క్రియావక్రతకు ఉదాహరణము.

ఇంకను ఎట్లనగా—

క్షిప్తో హస్తావలగ్నః ప్రసభమభిహతోఽప్యాదదానోంశుకాన్తం
గృహ్ణన్ కేశేష్వపాస్తశ్చరణనిపతితో నేక్షితః సమ్భ్రమేణ.
ఆలిఙ్గన్ యోఽవధూతస్త్రిపురయువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః
కామీ వార్ద్రాపరాధః స దహతు దురితం శామ్భవో వః శరాగ్నిః॥
(అమరుకము) 60

"క్రొత్తగ అన్యకాంతాసంగమాద్యపరాధము చేసిన కాముకుడు వలె హస్తమందు లగ్న మైనపుడు కన్నీళ్ళతో నిండిన నేత్రోత్పలములు గల త్రిపుర యువతులచే విసిరివేయబడినట్టియు, గట్టిగ కొట్టబడినను వస్త్రాంతమును పట్టు కొనుచున్నట్టియు, కేశములను గ్రహించు నపుడు దూరముగ తొలగింపబడి నట్టియు, పాదములపై పడినను సమ్భ్రమముచే చూడబడ నట్టియు, కౌగిలించు కొనునపుడు (తిరస్కరింపబడిన) దులిపివేసికొనబడి నట్టి శంభుసంబంధ మగు బాణాగ్ని మీ పాపమును దహించుగాక".

(అగ్నికి దహించుటస్వాభావికము గాన) ఇచట పూర్వమునందు వలె క్రియావైచిత్ర్యము ప్రతీయమాన మగుచున్నది.

ఇంకను ఎట్లనగా-

కర్ణోత్పల దళమిళితలోచనై ర్హేలాలోలనమానితనయనాభిః
లీలయా లీలావతీభిర్నిరుద్ధః శిథిలీకృతచాపో జయతి మకరధ్వజః॥ 61

"విలాసపూర్వకము లగు చలనములచే మానితము లగు నయనములు గల లీలావతులచే, లీలతో కర్ణములందలి ఉత్పలముల దళములతో కలసిన నేత్రముల సైగచే, తన పనినుండి నిరోధింపబడినట్టియు, శిథిలముచేయబడిన ధనస్సు కలిగిన మకరధ్వజుడు సర్వోత్కృష్టముగ నున్నాడు".

ఇచట-లీలావతులచే, లీలతో, లోచనములచే (సైగచేసి) నిరుద్ధుడై- తన వ్యాపారమునుండి పరాఙ్ముఖుడుగ చేయబడినవాడై, శిథిలము చేయబడిన ధనస్సుగల కందర్పుడు సర్వోత్కర్షముతో నున్నాడు- అని చెప్పుటలో విశేష మేమి ఉన్నది? ఏలయన- అట్టి జయము కలిగినపుడు ఆ లీలావతులు సర్వోత్కర్షముతో నున్నారు అని చెప్పవలెను.

దీని అభిప్రాయమేమనగా-

వారి లోచనవిలాసముల కట్టి విజయశీల మగు ప్రౌఢిమ ఉన్న దని తెలిసి కాని మన్మథుడు బుద్ధిమంతు డగుటచే తన ధనస్సును ఉపయోగించుట అనెడు శ్రమను ఉపసంహరించుకొనెను. లీలావతీలోచనవిలాసముచేతనే నాకు త్రిభువన విజయము సంపూర్ణముగ లభించుచున్నది అని భావించుచున్న ఆతనికి సహాయభూతము లగు లీలావతీనేత్రవిలాసముల ఉత్కర్షాతిశయము, 'జయతి' అను క్రియాపదముచే, కర్తృత్వమునకు (సర్వోత్కృష్టముగనుండుటలో కర్తగా నుండుటకు) కారణముగ కవిమానసమందు స్ఫురించుచున్నది. దానిచే ఇచట కావ్యవిదాహ్లాదకారి యగు ఒకానొక క్రియావైచిత్ర్యము ప్రతీత మగు చున్నది.

ఇంకను ఎట్లనగా—

"తాన్యక్షరాణి హృదయే కిమపి స్ఫురన్తి" 62

(ఆ అక్షరములు హృదయమునందు ఏమియో ధ్వనించుచున్నవి)

ఇచట (పూర్వోదాహృత మగు "నిద్రా నిమీలిత దృశః" ఇత్యాది శ్లోకమున) 'జల్పన్తి', 'వదన్తి' ఇత్యాదికము ప్రయోగింపబడలేదు. ఏలయన అవి

(అక్షరములు) ఒకానొక విచ్ఛిత్తివిశేషముచేత అనిర్వచనీయ మగు ఏదియో ఒక దానిని సమర్పించుచున్నవి, అని చెప్పుట కవికి అభీష్టము.

వి. ఈ వైశిష్ట్యమును సూచించు శక్తి 'ధ్వనన్తి' అను పదమునకే ఉన్నది గాని, 'జల్పన్తి' 'వదన్తి' ఇత్యాదిపదములకులేదు. గాన ఇది క్రియా వైచిత్ర్యమునకు మూడవ ఉదాహరణ మని యభిప్రాయము.

వ్యా. ఇపుడు "వక్రతాయాః పరోప్యన్తి ప్రకారః ప్రత్యయాశ్రయః" అనెడు కారికాంశమును వ్యాఖ్యానించుచున్నాడు-

వక్రభావముయొక్క మరి యొక భేదము కూడ ఉన్నది. ఎట్టిది ? ప్రత్యయము నాశ్రయించినది. ప్రత్యయః = సుప్ప్రత్యయమును, తిజ్ప్రత్యయమును, దేనికి, ఆశ్రయః = స్థానమో, అట్టిది. ఆ ప్రత్యయాశ్రయవక్రతకు గూడ సంఖ్యావైచిత్ర్యముచే లభించునది, కారకవైనిత్యముచేలభించునది, పురుష వైచిత్ర్యముచే లభించునది- అని అనేక ప్రకారములు సంభవించును. కావ్య బంధమునందు శోభను సంపాదించుటకై ఎచట విచిత్ర మగు వచనము నిబంధింపబడునో అచట సంఖ్యావైచిత్ర్యవిహిత మగు వక్రత్వ ముండును.

ఎట్లన గా-

"మైథిలీ యస్య దారాః"

"మైథిలి ఎవ్వని దారలో"

వి ఇచట 'మైథిలీ యస్య భార్యా' అనుటకు బదులు "దారాః" అను బహువచనాంతపదమును ప్రయోగించుటలో నొక విధ మగు చమత్కార మున్నది గాన ఇది సంఖ్యావైచిత్ర్యవిహిత మగు వక్రతకు ఉదాహరణ మని యభిప్రాయము.

ఇంకను ఎట్లనగా-

"ఫుల్లేన్దీవరకాననాని నయనే పాణీ సరోజాకరాః" 64

"ఆమె (రెండు) నేత్రములు వికసించిన పద్మవనములు (రెండు) హస్తములు పద్మనిధానములు"

(తాపసవత్సరాజ చరితము) 1-68

ఇచట ద్వివచన బహువచనములకు (నయనే అను ద్వివచనాంతమునకు 'ఫుల్లేందీవరకాననాని' అను బహువచనాంతరముతోడను, 'పాణీ' అను ద్వివచ నాంతమునకు, 'సరోజాకరాః' అను బహువచనాంతముతోడను) సామానాధి కరణ్యము ఎంతయు చక్కగ నున్నది.

అచేతన మగు పదార్థమునందు గూడ చేతనత్వము నారోపించి క్రియతో సంబంధించుట యను లక్షణము గల కర్తృత్వాదికారకత్వము, చేతనమునకు వలె, రసాదిపోషణమునిమిత్తమై, ఎచట నిబంధింపబడునో అచట కారక వైచిత్ర్యకృత మగు వక్రత్వ ముండును.

వి. కర్త, కర్మ, కరణము, హేతువు, సంప్రదానము, అపాదానము, అధికరణము అని కారకములు ఏడు విధములు. క్రియతో అన్వయించుదానికి కారకము అని పేరు. "రామేణ ఫలం భక్ష్యతే" అనునపుడు రాముడు కర్త, ఫలము కర్మ, ఈ రెండును భక్షించుట అనెడు క్రియతో అన్వయించు చున్నవి గాన కారకములు.

అచేతనపదార్థము కూడ చేతనము వలె ఏదైన ఒక పనిని స్వతంత్రముగ చేయుచున్నట్లు (by Personification) వర్ణించి దానియందు కర్తృత్వాదిక మును ఆరోపించినచో కారకవైచిత్ర్యవిహిత మగు వక్రత్వమని యభిప్రాయము.

ఎట్లనగా —

"స్తనద్వంద్వం మన్దం స్నపయతి బలాద్బాష్పనివహో
హఠాదన్తఃకణ్ఠం లుఠతి స రసః పఞ్చమరవః।
శరజ్జ్యోత్స్నాపాండుః పతతి చ కపోలః కరతలే
న జానీమస్తస్యాః క ఇవ హి వికారవ్యతికరః" 65

"బాష్పసముదాయము, స్తనద్వంద్వమును మెల్లమెల్లగ బలాత్కారముగ స్నానము చేయించుచున్నది. హఠాత్తుగ సరస మగు పంచమధ్వని కంఠము లోపల దొరలుచున్నది. శరత్కాలమునందలి వెన్నెల వలె తెల్ల నైన చెక్కిలి అరచేతిలో పడుచున్నది. ఆమెకు కలిగిన వికారసంబంధము ఎట్టిదో తెలియ జాలము".

ఇచట బాష్పనివహాదులు అచేతనము లైనను కవి వాటికి చేతనత్వమును ఆరోపించి కర్తృత్వమును కూర్చినాడు. ఆమె వివశురాలై యుండగా బాష్ప నిశ్వాసాదులు వివిధముగ వ్యవహరించుచున్నవి. ఆమె మాత్రము ఏమియు చేయ జాలకున్నదని (ఈ కర్తృత్వారోపణమునందలి) అభిప్రాయము. మరియొక విశేషమేమనగా– కపోలాదికము లగు ఆమె అవయవములకు కలిగిన ఈ అవస్థ అస్మదాదులకు ప్రత్యక్షముగ గోచర మగుచున్నది. ఆమె లోపల నున్న వికార వ్యతికరము అనుభవైకగోచర మగుటచే అది ఎట్టిదో తెలియజాలము.

ఇంకను ఎట్లనగా–

చాపాచార్యస్త్రిపురవిజయీ కార్తికేయో విజేయః
శస్త్రవ్యస్తః సదన ముదధిర్భూరియం హన్తకారః ।
అస్త్యేవైతత్ కిము కృతవతా రేణుకాకణ్ఠబాధాం
బద్ధస్పర్ధస్తవ పరశునా లజ్జతే చన్ద్రహాసః॥ 66

[బాలరామాయణము II-37]

"త్రిపురవిజేత యగు శివుడు ధనుర్విద్యాచార్యుడు; కుమారస్వామి జయింపబడినవాడు (జయింపదగినవాడు). ఆయుధముచే దూరముగా తొలగింప బడిన సముద్రము నివాసస్థానము; ఈ భూమి హంతకారము; ఇది యంతయు ఉండనే ఉన్నది; కాని రేణుకకు కంఠబాధను కలిగించిన నీ గండ్రగొడ్డలితో స్పర్ధకు దిగిన నా చంద్రహాసము (రావణుని కత్తికి పేరు) సిగ్గు పడుచున్నది".

వ్యా. ఇచట చంద్రహాసము సిగ్గు పడుచున్నది అని చెప్పుటలో (అచేతన మగు ఖడ్గమున చేతనధర్మ మగు సిగ్గుపడుట యనునది ఆరోపింపబడినది గాన) పూర్వమునందు వలె కారకవైచిత్ర్యము ప్రతీత మగుచున్నది.

టిప్పణి

వి. పై శ్లోకము బాలరామాయణము ద్వితీయాంకములోనిది. పరశు రామునితో రావణుడు అన్న మాట లివి. 'హన్తకార' మనగా అతిథిబలి యని కొందరు వ్యాఖ్యాతలు.

"గ్రాసప్రమాణా భిక్షా స్యాత్ అగ్రం గ్రాసచతుష్టయం
అగ్రం చతుర్గుణం ప్రాహుర్హన్తకారం ద్విజోత్తమాః".

అను మార్కండేయపురాణవాక్యము ననుసరించి పదహారు గ్రాసముల భిక్షకు హంతకార మని పేరు. పరశురాముడు భూమి నంతను జయించి దానిని కశ్యపునకు భిక్షగా నిచ్చినా డని యభిప్రాయము.

వ్యా. కవులు ఎచట ప్రత్యక్షకును అనగా స్వత్వమునకు, (తాను లేదా నేను అనుటకును), పరత్వమునకును విపర్యాసమును ప్రయోగింతురో అచట పురుషవైచిత్ర్యకృత మగు వక్రత్వ ముండును.

వి. తాను లేదా నేను అని చెప్పు నపుడు ఉత్తమపురుషము ను, పరులను గూర్చి చెప్పునపుడు ప్రథమమధ్యమపురుషములును రావలసి యుండ తద్విప ర్యాసమును చేయుదురని భావము.

వ్యా. యుష్మచ్ఛబ్దము గాని, అస్మచ్ఛబ్దము గాని ప్రయోగింపవలసి యున్నపుడు కావ్యమ నందు వైచిత్ర్యముకొరకై ప్రాతిపదికమాత్రమును నిబం ధింతురు. ఎట్లనగా-

"అస్మద్భాగ్యవిపర్యయాద్యది పరం దేవో న జానాతి తమ్" 67

(ఇది వెనుక 48 వ శ్లోకముగ ఉదాహరింపబడినది)

"ప్రభువుగారు ఆతనిని గూర్చి ఎరుగక పోయినచో నది మా దుర దృష్టమువలననే".

వ్యా ఇచట 'త్వం న జానాసి' (నీవు ఎరుగవు) అని చెప్పుటకు బదులు "దేవో న జానాతి" (ప్రభువు ఎరుగడు) అని చెప్పబడినది. కావున ఇచట మధ్యమపురుషమునకు బదులు ప్రథమపురుషము ప్రయుక్తము కాన ఇది పురుషవక్రతారూప మగు ప్రత్యయవక్రతయందలి తృతీయ భేదము.

అవ. పై ఉదాహరణమున ప్రాతిపదికమును క్రియాపదమునుగూడ ప్రథమపురుషవాచకములై యున్నవి. కొన్ని యెడల ప్రాతిపదికము మాత్రమే ఉండవచ్చు నని చెప్పుచున్నాడు:

వ్యా. ఈ విధముగ యుష్మదాదిశబ్దముల మార్పు క్రియాపదము లేకుండగ ప్రాతిపదికమాత్రప్రయోగమునందు గూడ కానవచ్చుచున్నది.

ఉదా :-

"అయం జనః ప్రష్టుమనాస్తపోధనే
న చేద్రహస్యం ప్రతివక్తుమర్హసి" (కుమా. 5-40) 68

"ఓ తపోధనురాలా ! ఈ జనుడు (నేను) ప్రశ్నించుటకు అభిలషించు చున్నాడు; రహస్యము కానిచో ప్రతివచన మిమ్ము".

వి. ఇవి పార్వతి తపస్సు చేయుచుండగా శివుడు బ్రహ్మచారివేషమున వచ్చి పలుకుమాటలు.

ఇచట 'అహం ప్రష్టుకామః' "నేను అడుగ దలచుచున్నాను" అని చెప్పవలసి యుండగా, తా నా విషయమున తటస్థు డని సూచించుటకై 'అయం జనః' అని చెప్పబడినది. ఇంకను ఎట్లనగా :-

"సోఽయం దంభధృతవ్రతః" 68

(ఇది వెనుక సంవృతి వక్రతకు ఉదాహరణముగ చూపబడినది)

వ్యా. ఇచట 'సోఽహం' అని చెప్పవలసి యుండ వెనుకటి ఉదాహరణము నందువలె (తాటస్థ్య నిర్దాక్షిణ్యాది ప్రతీతికొరకై) 'అయం' అని ప్రయోగించుటచే వైచిత్ర్యప్రతీతి కలుగుచున్నది.

ఈ వక్రతాభేదములు కొన్ని ముఖ్యము లగుటచే ఉదాహరణార్థమై చూప బడినవి. ఇంకను మిగిలినవి కొన్ని వేలకొలది సంభవించును కావున మహాకవి ప్రవాహమున సహృదయులచే స్వయముగ ఊహించుకొనదగినవి. 19

ఈ విధముగ వాక్యమునకు అవయవము లగు పదములకు, అవయవము లగు వర్ణాదుల ద్వారా సంభావ్యము లగు వక్రత్వమును వ్యాఖ్యానించి ఇపుడు పదసముదాయరూప మగు వాక్యముయొక్క వక్రత్వము వ్యాఖ్యానింపబడు చున్నది.

కా. వాక్యస్య వక్రభావోఽన్యో భిద్యతే యః సహస్రధా
యత్రాలంకారవర్గోఽసౌ సర్వోఽప్యన్త ర్భవిష్యతి. 20

"సహస్రభేదభిన్న మగు వాక్యవక్రత్వ మనునది మరి యొకటి కలదు. ఈ ఉపమాద్యలంకారవర్గ మంతయు దీనియందు [వాక్యవక్రత్వమునందు] అంతర్భూత మగును".

"వాక్యస్య వక్రభావోన్యః"— వాక్యస్య = పదసముదాయభూత మైన వాక్యముయొక్క, "అవ్యయవములతోడను, కారకములతోడను విశేషణముల తోడను, కూడినక్రియ వాక్యము" అని ఏది ప్రసిద్ధమో అట్టి శ్లోకాదివాక్యము యొక్క, వక్రభావః = వర్ణన శైలియందలి వైచిత్ర్యము, అన్యః = పూర్వము నందుచెప్పబడిన (వర్ణవిన్యాసవక్రత, పదపూర్వార్ధవక్రత, ప్రత్యయాశ్రితవక్రత అనెడు) వక్రతలకంటె భిన్న మైన, పదసముదాయవైచిత్ర్యముపై ఆధారపడి యుండు ఒకానొక వైచిత్ర్యము సంభవించును.

ఎట్లనగా :-

ఉపస్థితాం పూర్వమపాస్య లక్ష్మీం
వనం మయా సార్ధమసి ప్రపన్నః ।
త్వామాశ్రయం ప్రాప్యతయా ను కోపాత్
సోఢాస్మి న త్వద్భవనే వసన్తీ॥ 70

[రఘువంశము 14-60]

(అరణ్యమున పరిత్యక్త యగు సీత లక్ష్మణుని ద్వారా రామునకు పంపిన సందేశములోని దీ వాక్యము)

"పూర్వము. నిన్ను చేరిన లక్ష్మిని విడచి, నాతో కూడ వనమును, చేరినావు. (ఇపుడు) నిన్ను ఆశ్రయించుకొని, ఆ లక్ష్మి కోపముచే నేను నీ గృహమునందు నివసించుటను సహింపజాలక పోయినది కాబోలు". 70

వ్యా. ఇది ఆ విధముగ అతి కరుణాక్రాంతాంతఃకరణ యగు సీతాదేవి, భర్తకు సందేశముగ పంపిన వాక్యము. నీ సేవకై దగ్గిరకు చేరిన లక్ష్మిని విడచి పూర్వము నాతో అరణ్యమునకు వెళ్ళిన నీవిషయమున ఇది (నా పరిత్యాగము) స్వప్నమునం దైనను సంభావ్యము కాదు. ఆ లక్ష్మి యైతే ఆ కోపమువలననే, అనగా స్త్రీ సహజ మగు సపత్నీద్వేషమువలననే, నీ గృహము నందు నివసించుచున్న నన్ను సహింప (చూడ) జాలకపోయినది". దీని యభిప్రాయమేమనగా— "ఆ నాడు అట్టి దుఃఖమయ మగు అవస్థదేత ఎగుడు దిగుడుగా నున్న సమయమునందు కూడ నన్ను ఆ విధమగు అనుగ్రహమునకు పాత్ర మైన దానినిగ చేసి, ఇవుడు సామ్రాజ్యము లభించిన పిమ్మట నిష్కారణ

ముగ పరిత్యజించి అవమానపాత్ర మైన దానినిగ చేసినావు. ఇది యుక్తమా అయుక్తమా అను విషయమును వ్యవహారపరంపర బాగుగ తెలిసిన నీవే స్వయముగ ఆలోచించుకొనుము.

ఆ వక్రభావముకూడ అవిధమైనది. ఏది, సహస్రధాభిద్యతే = అనేక విధము లగు భేదమును పొందుచున్నదో. ఇచట సహస్రశబ్దము, 'సహస్రదలమ్' (చాల దళములు గల పద్మము) అను పదము వలె ఎక్కువ సంఖ్యను మాత్రమే బోధించును; కాని వెయ్యి అను నియత మగు అర్థమును బోధించునది కాదు. ఏలయన కవి ప్రతిభ అనంతము గాన (కవి ప్రతిభాజన్యవాక్యవక్రతకు కూడ) నియతసంఖ్యాకత్వము కుదరదు.

బహుప్రకార మగు ఈ వాక్యవక్రత్వ మెట్టిదో మాకు తెలియుట లేదు– అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు– "యత్రాలంకారవర్గోసౌ సర్వోప్యన్తర్భవిష్యతి". యత్ర = దేనియందు, అసౌ = ఈ, అలంకారవర్గః = కవి ప్రవాహమునందు ప్రసిద్ధ మగు ప్రతీతి గల ఉపమాద్యలంకారసముదాయము, సర్వః = అంతయు, అన్తర్భవిష్యతి = అంతర్భావమను పొందగలదో, అది వేరుగ నుండ జాలదు. ఆ వాక్యవక్రతాప్రకారములలోని భేదముగమాత్రమే చెప్పబడునని యర్థము. వాటి లక్షణములను చెప్పినపుడు ఆ అలంకారముల ఉదాహరణములను వేరు వేరుగ చూపగలము. 20

ఈ విధముగ వాక్యవక్రతను నిరూపించిన పిమ్మట వాక్యసమూహరూప మగు ప్రకరణముయొక్క వక్రతయు, ప్రకరణసముదాయాత్మక మగు ప్రబంధముయొక్క వక్రతయు, నిరూపింపబడుచున్నది.

కా. వక్రభావః ప్రకరణే ప్రబన్ధే వాస్తి యాదృశః ।
ఉచ్యతే సహజాహార్య సౌకుమార్యమనోహరః॥ 21

"ప్రకరణమునందును ప్రబంధమునందును ఎట్టి వక్రత్వ మున్నదో స్వాభావికమును ఆహార్యమును అగు సౌకుమార్యముచే మనోహర మగు అట్టి వక్రత్వము చెప్పబడుచున్నది. 21

వక్రభావః = విన్యాసమునందలి వైచిత్ర్యము, ప్రబంధములో ఒకభాగ మగు ప్రకరణమునందు, యాదృశః అస్తి, ఏవిధమైనది ఉన్నదో, ప్రబంధే వా నాటకాది ప్రబంధమునందు కూడ ఎట్టి వక్రత్వ మున్నదో అది కూడ, ఉచ్యతే = చెప్పబడుచున్నది. ఎట్టిది? సహజాహార్య సౌకుమార్య మనోహరః. సహజం = స్వాభావికమును, ఆహార్యం = వ్యుత్పత్తిచే సంపాదింపబడినదియు నగు, ఏ, సౌకుమార్యం = రమణీయత్వము గలదో, దానిచే, ఏది, మనోహరః = మనోహర మైనదో, అట్టిది.

అందు ప్రకరణమున వక్రభావ మెట్లనగా:- రామాయణమునందు మారీచ మాయా మయ మగు మాణిక్య మృగమును అనుసరించి వెళ్ళిన రాముని కరుణాక్రన్దనముచే దిగులుచెందిన హృదయము గల జానకి తన జీవితరక్షణ మును గూడ లెక్కజేయక, ఆతని ప్రాణములను రక్షించుటకై లక్ష్మణుని భయపెట్టి (దూషించి) పంపినది. ఇది చాల అనుచితము. ఏలయన అనుచరుని సన్నిధానమున ప్రధాన పురుషుడు అట్టి వ్యాపారమును చేయుట (ఆ విధముగ మృగము నిమిత్తమై వెళ్లుట లేదా కరుణాక్రన్దనము చేయుట) సంభావ్యముకాదు. అందరికంటెను ఉత్తమ మగు చరితము కలవాడుగా వర్ణింప బడుచున్న అతని ప్రాణములను చిన్నవాడు రక్షించుట యనుదాని సంభావన కూడ మిగుల అసమీ చీనము అని ఆలోచించి 'ఉదాత్త రాఘవము' (అను నాటకము) నందు, కవి మారీచమృగమును చంపుటకై వెళ్ళిన లక్ష్మణుని రక్షించుటకై రాముడు భయ స్వభావము గల సీతచే పంపబడినా డని నేర్పుగా వర్ణించినాడు. ఇచట కావ్య మర్మజ్ఞులకు ఆహ్లాదమును కలిగించుటయే వక్రత్వము.

ఇంకను ఎట్లనగా :—

కిరాతార్జునీయమునందు కిరాత పురుషుని వాక్యములలో తమ బాణము యొక్క అన్వేషణము మాత్రమే వాచ్యరూపమున ప్రారంభింపబడినది. కాని వాస్తవమున తాత్పర్యార్థ పర్యాలోచనము చేయగా, అర్జునునితో విరోధమే వాక్యార్థముగ చూపబడినది.

వి. అర్జునుడు శివు నుద్దేశించి తపస్సు చేయు చుండగా మూకుడు అను రాక్షసుడు అతనిని చంపుటకై వరాహరూపమున వచ్చుచుండెను. ఆ వరాహము బారినుండి అర్జునుని రక్షించుటకును, అతనిని పరీక్షించుటకును, శివుడు కిరాత

వేషధారియై, ప్రమథగణములు కిరాత సైన్యవేషముతో అనుసరింప, అర్జునుని ఆశ్రమమును చేరి ఆ వరాహముపై బాణము వేసెను. అదే సమయమున అర్జునుడు కూడ ఆ వరాహముపై బాణమును ప్రయోగించెను. అర్జునుని బాణము తగిలి వరాహము మరణించెను. అప్పుడు అర్జునుడు తన బాణమును వరాహ శరీరము నుండి తీసికొనబోవుచుండ శివభృత్యు డొకడు కిరాతవేషమున వచ్చి ఆ బాణము తన అధిపతిదనియు, అర్జునునిది కాద నియు చెప్పుచు, సామదాన భేదదండోపాయ పూర్వకముగ అర్జునునితో వాగ్వాదమునకు తల పడెను. ఆ బాణమును తన ప్రభువుకు ఇమ్మని చెప్పెను. కిరాతార్జునీయ మందలి పండ్రెండవ సర్గలోని ఈ ప్రకరణమున కిరాతోక్తికి పరమతాత్పర్యము అర్జునునితో ఏదో విధముగ యుద్ధము తెచ్చుకొనవలయు ననియే కాని తన బాణమును తీసికొని వెళ్లుట కాదు. ఈ విషయము అర్జున ప్రత్యుత్తరము నందలి ఈ క్రింది శ్లోకమువలన గూడ స్పష్ట మగుచున్నది—

వ్యా. ఆ విధముగ అచటనే చెప్పబడినది గూడ—

ప్రయుజ్య సామాచరితం విలోభనం
భయం విభేదాయ ధియః ప్రదర్శితమ్
తథాభియుక్తం చ శిలీముఖార్థినా
యథేతరన్న్యాయ్యమి వావభాసతే. 71

"సామమును ప్రయోగించి, పిదప (మా ప్రభువుతో మైత్రి కలుగును అనెడు) ప్రలోభనము కూడ చూపబడినది. నా మనస్సును మార్చుటకై భయము కూడ చూపబడినది. బాణమును కోరుచున్న నీచే, అన్యాయ్యము కూడ న్యాయ్యము వలె భాసించు నట్లు చిత్రింపబడినది" 71

(ఈ విధముగ కిరాతార్జునీయ మందలి ఈ కిరాత వచన ప్రకరణము ప్రకరణ వక్రతకు ఉదాహరణము.)

వ్యా. ప్రబన్ధమునందు వక్రత్వము ఎట్లనగా—

మహా కవి రచించిన, రామ కథతో కూర్చిన కొన్ని నాటకాది ప్రబన్ధము లందు ప్రారంభమున (వర్ణ విన్యాస వక్రత, పద పూర్వార్ధ వక్రత, ప్రత్యయాశ్రిత వక్రత, వాక్యవక్రత, ప్రకరణ వక్రత అను) పంచవిధ వక్రతా

సామగ్రి యొక్క సముదాయముచే సుందరమును, సహృదయ హృదయహారియు నగు మహాపురుష వర్ణనము భాసించును. వాస్తవమునందైతే—"రాముని వలె ప్రవర్తిపవలెను; రావణుని వలె కాదు" అని విధి నిషేధాత్మక మగు ధర్మము యొక్క ఉపదేశము పర్యవసించును.

ఇంకను ఎట్లనగా—

తాపస వత్సరాజమునందు కుసుమము వలె సుకుమారము అగు మనస్సు కలవాడును. కేవలము సరస వినోదములందు మాత్రమే ఆసక్తి కలవాడును, అగు నాయకుని చరిత్రము యొక్క వర్ణనము ప్రారంభింపబడినది. కాని వాస్తవమున-అట్టి రాజనీతిని నిర్వహించుటలో చతురు లగు అమాత్యులు వ్యసన సముద్రమునందు మునిగిపోవుచున్న తమ రాజును ఆయా ఉపాయము లచే ఉద్ధరింప వలె నని ఉపదేశింపబడినది. ఈ విషయము నాటకాదుల లక్షణములను వ్యాఖ్యానించు సమయమున స్పష్టము కాగలదు.

ఈ విధముగ కవి వ్యాపార వక్రతలు ఆరును ఉద్దేశ మాత్రముచే వ్యాఖ్యానింపబడినవి. వాటి లక్షణములను తెలుపు సందర్భమున సవిస్తరముగ వ్యాఖ్యానింపబడగలవు.

వి "నామ మాత్రేణ వస్తుసంకీర్తనం ఉద్దేశః"-అనగా, లక్షణాదులను వివరింపక, కేవలము నామములను మాత్రము చెప్పుటకు ఉద్దేశ మని పేరు. ఇచట వర్ణ విన్యాస వక్రత మొదలగు ఆరు విధము లగు కవివ్యాపార వక్రతల నామధేయములు మాత్రమే పేర్కొనుట జరిగినది. వాటి లక్షణ స్వరూపాలు మున్ముందు స్పష్టము కాగల వని యభిప్రాయము.

అవ. 'శబ్దార్థౌ సహితౌ' ఇత్యాది కావ్యలక్షణ నిరూపక మగు కారికలోని 'శబ్దార్థౌ', 'సహితౌ', 'వక్రకవి వ్యాపారశాలిని' అను పదముల అర్థము ఇంత వరకును వివరింపబడినది. ఇప్పుడు 'బంధ' శబ్దార్థమును వివరింపవలసి యున్నది.

వ్యా. క్రమ ప్రాప్త మగుటచే ఇపుడు 'బంధ' శబ్దము వ్యాఖ్యానింప బడును—

కా. వాచ్య వాచక సౌభాగ్య లావణ్య పరిపోషకః
వ్యాపారశాలీ వాక్యస్య విన్యాసో బన్ధ ఉచ్యతే. 22

"వ్యాపారముతో ఒప్పునదియు, వాచ్య వాచకముల సౌభాగ్యలావణ్యము లను పోషించు నదియు, నగు వాక్య విన్యాసము బన్ధ మని చెప్పబడు చున్నది." 22

వ్యా. విన్యాసః = విశిష్ట మగు కూర్పు. ఆ సన్నివేశమే వ్యాపారశాలి యగు నపుడు బన్ధ మని చెప్పబడును. ఇచట వ్యాపార మనగా ప్రస్తుత కావ్య రచనారూప మైనది. ఆ వ్యాపారముచే, ఏది, శాలతే = ఉత్తమముగ నుండునో అట్టిది. దేనియొక్క? శ్లోకాది రూప మగు వాక్యము యొక్క. ఎట్టిది? 'వాచ్య వాచక లావణ్య పరిపోషకః' = వాచ్య వాచకముల రెండింటి యొక్కయు, -వాచ్యస్య = అర్థము యొక్కయు, వాచకస్యచ = శబ్దము యొక్కయు, చెప్పబడనున్న సౌభాగ్య లావణ్యరూప మగు ఏ గుణద్వయము గలదో దానికి, పరిపోషకః = పుష్ట్యతిశయమును కలిగించునది. ప్రతిభా ప్రవృత్తికి ఫలభూత మైన సహృదయ చమత్కార కారిత్వము సౌభాగ్యము. కూర్పులోని సౌందర్యము లావణ్యము. ఆ రెండింటిని పోషించునది.

ఎట్లనగా—

దత్త్వా వామకరం నితమ్బఫలకే లీలావలన్మధ్యయా
ప్రోత్తుంగ స్తన మంసచుమ్బి చుబుకం కృత్వా తయా మాం ప్రతి.
ప్రాన్త ప్రోతనవేన్ద్రనీల మణి మన్ముక్తావళీ విభ్రమాః
సోసూయం ప్రహితాః స్మరజ్వరముచో ద్విత్రాః కటాక్షచ్ఛటాః. 78

(ఇది కవీంద్ర వచనములో 213 వ శ్లోకము)

"విలాసముతో కొంచెము తిరిగిన నడుముగల ఆమె, ఎడమ చేతిని నితంబ ఫలకముపై నుంచి, ఎత్తైన స్తనములు కలుగునట్లుగా, గడ్డమును బుజమును స్పృశించునట్లు చేసి, చివర గ్రుచ్చబడిన నూతన మైన ఇంద్రనీల మాణిక్యములు గల ముత్యముల సరముల వంటి విలాస కలిగినట్టియు, మన్మథ జ్వరమును హరించునవియు నగు రెండు మూడు కటాక్ష పంక్తులు కోపముతో నా వైపు విసరెను."

వ్యా. ఇచట సమగ్ర మగు కవి చాతుర్యముచే సంపాదింప తగిన సహృదయ చమత్కార కారిత్వరూప మగు సౌభాగ్యమునకును, కొన్ని వర్ణముల విన్యాసమునందలి శోభచే నేర్పడినదియు, పదముల కూర్పు నందలి సొగసుచే సంపాదింపబడినదియు నగు లావణ్యమునకును, గొప్ప పోషణము ఉన్నది. 22

బన్ధ స్వరూపమును వివరించి, పిదప తద్విదాహ్లాద కారిత్వమును వివరించు చున్నాడు —

కా. వాచ్య వాచక వక్రోక్తి త్రితయాతి శయోత్తరమ్
తద్విదా హ్లాద కారిత్వం కి మప్యా మోద సున్దరమ్ 23

"తద్వి దాహ్లాద కారిత్వ మనునది వాచ్యము, వాచకము, వక్రోక్తి, అనెడు త్రితయము యొక్క అతిశయము కంటె భిన్న మైనది. వర్ణింప శక్యము కాని రంజకత్వముచే రమణీయ మైనది."

వ్యా. తద్విదాహ్లాద కారిత్వమ్ = కావ్యవేత్తలకు ఆనందమును కలిగించుట. ఎట్టిది? "వాచ్యవాచక వక్రోక్తి త్రితయాతిశయోత్తరమ్" వాచ్యమ్ = అర్థము, వాచకమ్ = శబ్దము, వక్రోక్తిః = అలంకారము, ఈ మూడింటి యొక్క ఏ అతిశయము కలదో-అనగా ఏ ఉత్కర్షము కలదో, దానికంటె స్వరూపము చేతను, అతిశయము చేతను గూడ, ఉత్తరమ్ = అతిరిక్త మైనది. స్వరూపముచే ఇది (తద్విదాహ్లాద కారిత్వము) వాచ్యాదిత్రితయము కంటె భిన్న మగు ఒకానొక విశిష్టతత్త్వము. అతిశయము చేత గూడ ఇది ఈ మూడింటి కంటెను భిన్న మగు లోకోత్తర తత్త్వము అని యర్థము.

వి. వాచ్య వాచక వక్రోక్తుల స్వరూపము వేరు; తద్విదాహ్లాద కారిత్వ స్వరూపము వేరు. వాటి అతిశయము వేరు దాని అతిశయము వేరు. ఇది లోకోత్తర మగుటచే ఆ మూడింటి కంటె అత్యుత్కృష్టమైనది. అందుచే లోకోత్తర మైనది అని అభిప్రాయము.

ఇంకను ఎట్టిది? కిమప్యామోద సున్దరమ్. కి మపి = వర్ణింప శక్యము కానిది; సహృదయుల హృదయములకు మాత్రమే వేద్య మైనది. ఆమోదః = రంజకత్వ మను పేరు గల సుకుమార వస్తు ధర్మము. దానిచే సున్దర మైనది (అనగా) రంజకత్వముచే రమణీయ మైనది.

ఎట్లనగా—

హంసానాం నినదేషు యైః కవలితై రాసజ్యతే కూజతా
మన్యః కోఽపి కషాయకంఠ లుఠనా దాఘర్ఘరో విభ్రమః।
తే సంప్రత్యకఠోరవారణ వధూదన్తాంకురస్పర్ధినో
నిర్యాతాః కమలాకరేషు బిసినీకన్దాగ్రిమ గ్రన్థయః. 78

'కబళింపబడిన వేటిచే, కూయుచున్న హంసల ధ్వనులలో వగరెక్కిన కంఠములో దొరలుటచే అపూర్వ మగు ఒకానొక ఘర్ఘర శబ్దమాధుర్యము కూర్చబడుచున్నదో, అట్టి ఆడ ఏనుగ లేత దంతములతో పోటీ చేయజాలిన, తామరతూడుల మొదటి అంకురములు ఇపుడు పద్మ సరస్సులలో బయల్వెడలినవి.'

ఇచట వాచ్యము, వాచకము, వక్రోక్తి యనెడు త్రితయమునందును గూడ ప్రధానముగ కవికి ఆసక్తి యేదియు ఉన్నట్లు కనబడుటలేదు. కాని ప్రతిభా వైచిత్ర్యముచే ఒకానొక (అనిర్వచనీయ మగు) తద్విదాహ్లాదకారిత్వము వికసింపచేయబడినది.

వాచ్యవక్రతా-వాచక వక్రతా-శబ్దార్థ సాహిత్యాదులకు పైన చూపిన ఉదాహరణము లన్నిటియందును కావ్యలక్షణము లన్నియు అవికలముగ కాననగును. (అందుచే ఆ యుదాహరణములలో కొన్ని యంశములు మాత్రమే యున్న వని చెప్పుట యుక్తము కాదు.) అయినను దీనిలో ఈ అంశము ప్రధానముగ నున్నది అని చూపిన ఉదాహరణములలో ఆ అంశమే ప్రధానముగ, ప్రత్యేకముగ ఇతరాంశము లన్నిటికంటెను అత్యధికముగ స్ఫురించు చున్నది అను విషయమును సహృదయులు స్వయముగ నూహించుకొనవలెను.

ఈ విధముగ కావ్యసామాన్య లక్షణమును చెప్పి దాని విశేషలక్షణమును చెప్పుటకై మార్గభేదమును బట్టి వచ్చిన త్రివిధత్వమును చెప్పుచున్నాడు—

కా. సంప్రతి తత్ర యో మార్గాః కవి ప్రస్థాన హేతవః
సుకుమారో విచిత్రశ్చ మధ్య మశ్చోభయాత్మకః॥ 24

"సుకుమారము, విచిత్రము, ఉభయాత్మక మగు మధ్యమము అనెడు

కవి ప్రవృత్తి హేతుభూతము లగు మూడు మార్గములు కావ్యము నందున్నవి." 24

వ్యా. తత్ర=ఆ కావ్యమునందు, మార్గాః = మార్గములు; మూడు సంభవించును. రెండు కావు; నాలుగు కావు. ఏలయన, వాటి తత్త్వముల నెరింగినవారు షడ్జాది స్వరములు మొదలగువాటి (నిర్ణీత) సంఖ్యను వలె అన్ని మార్గములను మాత్రమే వాస్తవమున కనుగొని యున్నారు. అవి ఎట్టివి? కవి ప్రస్థాన హేతవః=కవుల ప్రవృత్తికి హేతువులు. అనగా కావ్యరచనకు కారణభూతములు. ఏమి నామధేయములు కలవి? సుకుమారము, విచిత్రము, మధ్యమము అనునవి. మధ్యమము ఎట్టిది-? ఉభయాత్మకము. ఉభయమ్= పూర్వోక్త మగు మార్గద్వయము, ఆత్మా=స్వరూపము, యస్య=దేనికో అది అని విగ్రహము. ఈ రెండింటి ఛాయపై ఆధారపడి యున్నదని యర్థము. వాటి స్వరూపమును, వాటి లక్షణములు చెప్పు సమయమున చెప్పగలము.

ఇచట అనేకము లగు అభిప్రాయభేదము లుండుటకు అవకాశ మున్నది. (వామనాదులగు కొందరు) ప్రాచీనులు విదర్భాదిదేశ విశేషములను బట్టి వైదర్భి మొదలగు మూడు (వైదర్భి, గౌడి, పాంచాలి అను) రీతులను చెప్పియున్నారు. ఉత్తమము, అధమము, మధ్యమము అను వైచిత్ర్యముచే ఆ మూడును మూడు విధము లని కూడ చెప్పి యున్నారు. మరి కొందరు (దండ్యాదులు) వైదర్భము, గౌడీయము అను మార్గద్వయమును (మాత్రమే) చెప్పి యున్నారు. ఈ రెండు మతములును యుక్తి యుక్తములు కావు. ఏలయన-దేశముల భేదమును బట్టి రీతులు కూడ భేదించును అని యంగీకరించినచో దేశము లనంత సంఖ్యాకము లగుటచే రీతులు కూడ అసంఖ్యాకములు అని చెప్పవలసి వచ్చును. విశిష్టరీతితో కూడిన కావ్యమును నిర్మించుట యనునది మాతులసుతా వివాహము వలె దేశధర్మ మని స్థాపించుట కూడ శక్యము కాదు.

వి. అనగా మాతుల సుతా పరిణయనము ఉత్తర దేశాదులలో నిషిద్ధము. కాని ఆంధ్ర దేశాదులలో నిది దేశాచారముగ అంగీకరింపబడినది. అట్లే కొన్ని దేశములలో కొన్ని రీతులతో కూడిన కవిత్వమును రచించుట దేశధర్మమువంటి దని చెప్పుటకు వీలు లేదు అని భావము.

వ్యా. ఏలయన దేశధర్మ మనునది సంప్రదాయ సిద్ధముగ వచ్చు పెద్దల ఆచారముపై ఆధారపడి యుండుటచే దానిని అనుష్ఠించుట అశక్యము కాదు. కాని అట్టి కావ్యమును నిర్మించుటకు (ఆ దేశములో జన్మించినంత మాత్రమున చాలదు) శక్తి (వ్యుత్పత్త్యభ్యాసములు) మొదలగు కారణసామగ్రి ఎంతయో ఆవశ్యకముగాన, ఏదియో విధముగ అనుష్ఠించుటకు (రచించుటకు) శక్యము కాదు. దాక్షిణాత్యులకు గీతమునకు సంబంధించిన సుస్వరత్వము మొద లగు మధురధ్వని స్వాభావికముగ లభించి నట్లు (తత్తద్దేశ జనితులకు) అది (తత్త ద్రీతి యుక్త కవితా నిర్మాణము) స్వాభావిక మని చెప్ప వీలు కాదు. అట్లైనచో (ఆయా దేశములందు జనించిన) ప్రతి ఒక్కడును అట్టి కావ్యమును రచింప సమర్థుడు కావలసి వచ్చును.

మరియు, శక్తి యున్నను (అనగా తత్తద్దేశ వాసులకు తత్తద్విధ మగు శక్తి సహజముగ ఉండును అని అంగీకరించినను) వ్యుత్పత్తి మొద లగు ఆహార్య కారణ సమ్పద (అనగా, కావ్యరచనకు కారణభూతమును, ప్రయత్న పూర్వకముగ సంపాదించుకొన దగినదియు నగు వ్యుత్పత్త్యా దికము) ఈ దేశమున ఈ విధ మగు వ్యుత్పత్త్యాదిక ముండ నను నిర్ణీత రూపమున ఉండదు. ఏలయన-అట్టి నియమమును చేయుటకు ఆధార మేదియును లేదు; అచట (ఏ దేశములో నది ఉండు నని చెప్పుదుమో అచట) అది కానరాకపోవచ్చును మఱి యొక దేశమున నుండ వచ్చును.

ఉత్తమము, అధమము, మధ్యమము అని, రీతులలో మూడు భేదములను కల్పించుట కూడ యుక్తము కాదు. ఏలయన-సహృదయాహ్లాదమును కలిగించు కావ్యము యొక్క లక్షణమును చెప్పెడు ప్రసంగమున (అట్టి ఆనందమును కల్గించునది వైదర్భి యొక్కటియే గాన,) వైదర్భీరీతితో సమాన మగు సౌందర్యము లేని మధ్యమాధమ కావ్యముల ఉపదేశము వ్యర్థము కావలసి వచ్చును. ఈ రెండు భేదములను ఉపదేశించుటకు ప్రయోజనము వీటిని పరిహరింప వలె నని చెప్పుటయే అని అనుటకు కూడ వీలులేదు. ఈ విషయము వారిచే అనంగీకార్యము కదా।

వి. అనగా-రీతివాదు లగు వామనాదులు వైదర్భి, గౌడి, పాంచాలి ను మూడు రీతులును పరిగ్రాహ్యములే యని అభిప్రాయ పడుచున్నారు కాని

గౌడీ-పాంచాలీ రీతులు అపరిగ్రాహ్యము లని అభిప్రాయపడుట లేదు. 'అగతిక గతి' న్యాయముచే (వీలు కానపుడు ఏమి చేయవలయును అను పద్ధతిలో) దరిద్రదానమువలె (దరిద్రుడు యథా శక్తిగ తృణమో పణమో దానము చేసి నట్లుగ) యథా శక్తిగా కావ్యమును రచింపవచ్చును అని చెప్పుట యుక్తము కాదు. (అనగా సహృదయాహ్లాదకముగ రచింప గల్గిననే కావ్యమును రచింప వలెను కాని, 'నా శక్తికొలది రచించినాను, దీనిని కావ్య మని అంగీకరింపుడు,' అనుట యుక్తము కాదు అని యర్థము).

(ఈ విధముగ దేశమును బట్టి రీతులు మారుచుండు ననియు, వాటిలో గూడ ఒకటి ఉత్తమము, మరి యొకటి అధమము, మూడవది మధ్యమము అనియు చెప్పు వారి వాదము యుక్తి సంగతము కాదనియు తేలినది). (దేశ విశేషమును బట్టి రీతుల నామములను నిర్ణయించుటలో మా యభిప్రాయ మది కాదు. ఈ రీతులకు ఏవియో నామధేయములు ఈయవలెను గాన అందు కొర కును-వాటికి ఏవియో నిర్వచనములను చూపుటకును మాత్రమే దేశ విశేషనా మములను ఆశ్రయించినాము అన్నచో) కేవలము నిర్వచనమునకును నామకర ణమునకును కారణముగ దేశవిశేషముల నాశ్రయించినచో మాకు ఆ విషయమున వివాదమే లేదు. (వైదర్భము గౌడీయము అను మార్గ ద్వితయమును అంగీక రించు వారి (భామహ దండ్యాదుల) మతమునందు గూడ ఈ దూషణములు (రీతిత్రయ వాదమున చూపిన దోషములు) ప్రవర్తించును. కాన,-ఇక నిస్సార వస్తు మర్దనము చాలును.

కవి స్వభావ భేదమును బట్టి కావ్యమార్గమునందు భేదమును చెప్పుట సమంజసముగ నుండును. సుకుమార స్వభావము గల కవికి ఆ విధముగనే యుండు శక్తి సహజముగ ఆవిర్భవించును. శక్తికిని శక్తి కలవానికిని భేదము లేదు (కావున శక్తి మంతుడు సుకుమార స్వభావు డైనచో శక్తి కూడ సుకుమారముగనే యుండు నని అభిప్రాయము). అట్టి శక్తితో ఆ విధమగు సౌకుమార్యముచే రమణీయ మగు వ్యుత్పత్తిని సమకూర్చుకొనును. ఆ రెండింటి చేతను (సుకుమారము లగు శక్తి వ్యుత్పత్తులచే) సుకుమార మార్గమున అభ్యాసము చేయువాడుగ చేయబడును. అదే విధముగ, తద్విదాహ్లాదకారి కావ్యరచనా దృష్టిచే సుకుమార స్వభావునికంటె విచిత్ర మగు స్వభావము గల కవికి సౌకుమార్యము కంటె భిన్న మగు వైచిత్ర్యముతో రమణీయ మగు

స్వభావ ముండును. అతని శక్తి కూడ తదనురూపముగ విచిత్రముగనే ఉల్లసించును. ఆ శక్తితో, అట్టి నేర్పుతో, సుందర మగు వ్యుత్పత్తిని సంపాదించుకొనును. ఆ రెండింటి చేతను వైచిత్ర్య వాసనచే వాసిత మగు మానసము గలవాడై విచిత్ర మార్గమున అభ్యాసము చేయువా డగును.

ఇట్లు (సుకుమార విచిత్ర స్వభావు లగు) ఈ ఉభయవిధ కవుల స్వభావముతో మిశ్రిత మగు స్వభావము గల కవికి, ఆ స్వభావమునకు అనువగు నదియు, మిశ్రిత మగు శోభాతిశయముచే ప్రకాశించునదియును అగు శక్తి ఉదయించును. ఆ శక్తి సహాయముచే, ఆ ఉభయ విధ స్వభావములచే సుందర మగు వ్యుత్పత్తి నార్జించుకొనును. అందువలన ఆ రెండు ఛాయల పరిపోషణ ముచే రమణీయ మగు అభ్యాసమునందు ఆసక్తు డగును.

కావున ఈ విధముగ ఈ (సుకుమార విచిత్రోభయాత్మక స్వభావులగు) కవులు, కావ్యరచన కావశ్యక మగు సాధన సముదాయ మంతయు పరాకాష్ఠను చెందుటచే రమణీయ మగునదియు, అనిర్వచనీయమును అగు సుకుమార కావ్యమును, విచిత్ర కావ్యమును, ఉభయాత్మక కావ్యమును రచింతురు. ఇవియే వారి ప్రవృత్తికి నిమిత్త భూతము లగు (సుకుమార, విచిత్ర, ఉభయాత్మక) మార్గము లని చెప్పబడుచున్నవి.

కవి స్వభావ భేదముపై నాధారపడి యుండుటచే (కావ్యములు గూడ) అనంత భేదము లని తప్పక చెప్పవలసి యుండును. అయినను (అనంత భేదములను ఒక్కొక్కటిగ) పరిగణించుట శక్యము కాదు గాన సామాన్య రూపముగ కావ్యములు త్రివిధము లని చెప్పుటయే ఉపపన్నము. కావున, రమణీయము లగు కావ్యములను గూర్చి ముచ్చటింపవలసిన సందర్భమున స్వభావ సుకుమార మనునది ఒక రకము. తద్భిన్న మగు అరమణీయ కావ్యము, కావ్యముగ అనుపాదేయము కదా! రమణీయముగ నుండి సుకుమారము కంటె భిన్నముగ నుండునది విచిత్ర కావ్యమని చెప్పబడును. ఇది రెండవ రకము. ఈ రెండును రమణీయములే గాన, వీటి ఛాయా ద్వయము నాశ్రయించి యున్న మూడవది కూడ (ఉభయాత్మకము గూడ) రమణీయమే యని న్యాయముచే సిద్ధించును. త్రివిధము లగు ఈ కావ్యములలో ప్రతియొక్క దానికిని నిర్దుష్ట మగు స్వభావ మహిమచే తద్విదాహ్లాద కారిత్వము పూర్ణముగ

లభించుచున్నది గాన (అన్నియు ఉత్తమములే కాని) ఏ ఒక్కటియు న్యూనము కాదు (కావున కావ్యములలో ఉత్తమాధమ మధ్యమత్వ విభాగము అనుచితము ఉత్తమము కానిచో అది కావ్యమే కాజాల దని భావము)

అవ ఇంతవరకును కావ్యములలోని మార్గభేదము దేశభేదముపై కాక కవుల స్వభావ భేదముపై ఆధారపడి యుండు నని ప్రతిపాదింపబడినది శక్తి వ్యుత్పత్తి అభ్యాసము అను మూడును కావ్యమునకు కారణము లని వెనుక చెప్పబడి యున్నది వాటిలో శక్తి స్వాభావికమే యైనను వ్యుత్పత్త్యభ్యాస ములు ప్రయత్న సాధ్యములు గాన శక్తి వ్యుత్పత్త్యభ్యాసములు మూడింటి కలయికచే ఉత్పన్నము లగు కావ్యముల మార్గములు కేవలము స్వభావభేదముచే భిన్నము లని చెప్పుట ఎట్లు పొసగును అని ఆశంకించుకొని సమాధానము చెప్పుచున్నాడు –

వ్యా (శంక) (సుకుమారవిచిత్ర) శక్తులు రెండును మిక్కిలి అంత ర్గతము లగుటచే (ఆత్మకు సంబంధించిన వగుటచే) అవి స్వాభావికము లని చెప్పుట యుక్తముగ నున్నది కాని వ్యుత్పత్త్యభ్యాసములు ప్రయత్నసంపా ద్యము లగుటచే ఇవి (స్వాభావికము లని చెప్పుట) ఎట్లు పొసగును? (సమా ధానము) ఇది దోషముకాదు ఏలయన– కావ్యరచన మాట అటుండ అనాది సంస్కారముచేతను తత్కృత మగు అభ్యాసము (అలవాటు) చేతను అధివాసిత మగు మనస్సు గల ప్రతియొక్కని వ్యుత్పత్త్యభ్యాసములును స్వభావానుసార ముగనే ప్రవర్తించుచుండును

వి అనగా – అసంఖ్యాకము అగు పూర్వజన్మగత సంస్కారములచే ప్రతి ఒక్కనికి కొన్ని అలవాట్లు వచ్చును ఆ అలవాట్లచే సంస్కార మేర్పడు చుండును ఈ విధముగ ప్రతి ఒక్కనియందును పూర్వజన్మసంచితము లగు సంస్కారములు ఉండుటచే అదియే ఈ జన్మమున స్వభావమై కావ్యనిర్మాణము ననే గాక దైనందిన వ్యవహారములందుగూడ, అతడు ఒకవిధ మగు వ్యుత్ప త్తిని సంపాదించునట్లును ఒక విధమగు అభ్యాసము చేయునట్లును చేయుచుండు నని యభిప్రాయము

వ్యా అవియు (వ్యుత్పత్త్యభ్యాసములుగూడ) స్వభావాభివ్యంజనముచే సాఫల్యమును పొందుచుండును (అనగా ఆ వ్యక్తికి గల వ్యుత్పత్త్యభ్యాసము

లను బట్టి ఆతని స్వభావమును గూడ నిర్ణయింపవచ్చు నని భావము). ఏలయన-స్వభావమునకును, వ్యుత్పత్త్యభ్యాసములకును నడుమ పరస్పరము ఉపకార్యోప కారకభావ మున్నది. స్వభావము వ్యుత్పత్త్యభ్యాసములను జనింపచేయును అవి (వ్యుత్పత్త్యభ్యాసములు) స్వభావమునకు పోషణమును చేయును. ఇట్లు అచేతనపదార్థముల స్వభావము గూడ వాటి స్వభావమునకు అనుకూలము లగు ఇతరపదార్థముల సన్నిధానము ప్రభావముచే అభివ్యక్త మగు చుండును. ఉదాహరణమునకు- చంద్రకాంతమణులకు చంద్రకిరణస్పర్శ కలుగగనే, సహజము గనే, రసము స్రవించును.

వి: అనగా చంద్రకరస్పర్శచే చంద్రకాంతమణులనుండి రసము ఆవిర్భవించి నట్లు కవికి గల సుకుమారస్వభావము, లేక విచిత్రస్వభావము ఆతని వ్యుత్పత్త్యభ్యాసముల ద్వారా రచనలలో ప్రతిఫలించును. ఈ విధముగ కవి తన స్వభావమున కనుగుణ మగు వ్యుత్పత్త్యభ్యాసములనే సంపాదించుకొను చుండును గాన అవి ఆహార్యములే యైనను స్వభావవిరుద్ధముగ నుండజాలవు. ఈతని స్వభావ మెట్టి దని నిర్ణయించుటకు గూడ వ్యుత్పత్త్యభ్యాసములు సహాయపడును. ఈ విధముగ వ్యుత్పత్త్యభ్యాసములకు స్వభావముతో అవినాభావసంబంధ మున్నది గాన స్వభావమును బట్టి కావ్యమార్గములను నిర్ణయించుటలో దోషము లేదని యభిప్రాయము. 24

ఈ విధముగ మార్గముల నామధేయనిర్దేశము చేసి ఇపుడు వాటికే క్రమముగ లక్షణములు చెప్పుచున్నాడు :—

కా. అమ్లాన ప్రతిభోద్భిన్న నవశబ్దార్థ బన్ధురః
అయత్న విహితస్వల్ప మనోహారి విభూషణః॥ 25

కా. భావస్వభావప్రాధాన్య న్యక్కృతాహార్యకౌశలః।
రసాదిపరమార్థజ్ఞ మనః సంవాద సున్దరః। 26

కా. అవిభావితసంస్థానరామణీయక రఞ్జకః
విధివైదగ్ధ్యనిష్పన్న నిర్మాణాతిశయోపమః 27

కా. యత్కిఞ్చనాపి వైచిత్ర్యం తత్సర్వం ప్రతిభోద్భవమ్
సౌకుమార్యపరిస్పన్దస్యన్ది యత్ర విరాజతే॥ 28

కా. సుకుమారాభిధః సోఽయం యేన సత్కవయో గతాః ।
మార్గేణోత్ఫుల్లకుసుమకాననేనేవ షట్పదాః ॥ 29

"వసి వాడని కవిప్రతిభచే వికసింపచేయబడిన నూతనశబ్దములతోడను, అలౌకికార్థములతోడను మనోహర మగునదియు, అప్రయత్నముగ కూర్చిన స్వల్పములును మనోహరములును అగు అలంకారములు కలదియు"...... 25

"పదార్థముల స్వభావమునకే ప్రాధాన్య మిచ్చుటచే కృత్రిమ మగు కౌశలము విషయమున ఉపేక్షాభావమును వహించునదియు, రసాదుల యథార్థ స్వరూపము నెరింగిన సహృదయుల మనస్సుకు అనుకూలముగ నుండుటచే సుందర మగునదియు" 26

"దురూహ్య మగు (వర్ణనాగోచరము గాని) ఘటనాసౌందర్యముచే లేదా ఊహింప నలవి కాని స్థితి కల సౌందర్యముచే రంజింపచేయునదియు, విధాత యొక్క వైదగ్ధ్యముచే నిష్పాదిత మగు నిర్మాణాతిశయముతో సమాన మగునదియు" 27

"దేనియందు ఏ యే వైచిత్ర్యము (వక్రోక్తియుక్తత్వము) సంభావ్యమో అది యంతయు, (అనగా అలంకారాదికము లన్నియు) ప్రతిభామాత్రసముద్భూతములై, అనగా (అనాహార్యములై) సౌకుమార్యముయొక్క రామణీయకముచే రసమయముగ చేయబడినవై ప్రకాశించునో, అట్టిదియు......" 28

"అగునదియే సుకుమార మను పేరు గల మార్గము. వికసించిన పుష్పములు గల అరణ్యమున తుమ్మెదలు సంచరించి నట్లు ఈ మార్గముననే సత్కవులు అందరును ప్రయాణము చేసి యున్నారు". 29

అవ. 25 వ కారిక మొదలు 29 వ కారిక వరకును గల ఐదు కారికలలో సుకుమారమార్గలక్షణము చెప్పబడు చున్నది. ఈ కారికలను ఆకాంక్షాక్రమమున వ్యాఖ్యానించుచు మొదట 29 వ కారికను వ్యాఖ్యానించుచున్నారు—

"సుకుమారాభిధః సోఽయమ్" మొ। సోయం = వెనుక (25-28 కారికలలో) చెప్పబడిన లక్షణము గల మార్గము సుకుమారమార్గ… యేన = ఏ మార్గముచే, సత్కవయః = కాళిదాస ప్రభృతులగు సత్కవు… గతాః = నడచినారో, (అనగా), దానిని (సుకుమారమార్గమును)…

కావ్యములను రచించినారో. ఎట్లు ? "ఉత్ఫుల్లకుసుమకాననేనేవ షట్పదాః" ఉత్ఫుల్లాని = వికసించిన, కుసుమాని = పుష్పములు, యస్మిన్ = ఏ, కాననే = వనమునందు కలవో, దానిచే, షట్పదాః ఇవ = తుమ్మెదలువలె, ఆ మార్గమును వికసితకుసుమకాననముతో పోల్చుటచే, దానికి పుష్పసౌకుమార్యముతో సమాన మగు ఉత్తమజాతీయత్వము సూచింపబడుచున్నది. (వారిని సత్కవులను) భ్రమరములతో పోల్చుటచే వారు కుసుమమకరందముతో సమాన మగు సారమును సంగ్రహించుటయందు అత్యాసక్తు లను విషయము ద్యోతిత మగుచున్నది...29

అవ. ఇప్పుడు 28 వ కారికను వ్యాఖ్యానించుచున్నాడు:-

వ్యా. అదియును ఎట్టిది ? యత్ర = దేనియందు, కించనాపి = ఏకొంచెమైనను, వైచిత్ర్యమ్ = విచిత్రత్వము, వక్రోక్తియుక్తత్వము (కలదో) తత్సర్వం = ఆ అలంకారాదిక మంతయు, ప్రతిభోద్భవం = కవి శక్తిమాత్రముచే ఉల్లసిత మగునో, ఏదియో విధముగ ప్రయత్నపూర్వకముగ సంపాదింపబడుటచే ఆహార్యము కాదో, (ఆ వైచిత్ర్యము) ఎట్టిది? "సౌకుమార్యపరిస్పన్దస్యన్ది" సౌకుమార్యం = ఉత్తమజాతీయత్వము, దానియొక్క, పరిస్పన్దః = తద్విదాహ్లాదకారిత్వలక్షణ మగు రామణీయకము; దానిచే, ఏది, స్యన్దతి = రసమయముగ చేయబడునో అట్టిది, (ఈ వైచిత్ర్యము అనుదానికి) 'యత్ర విరాజతే' = "ఎచట శోభాతిశయమును పోషించునో", అనుదానిలో సంబంధము.

ఎట్లనగా—

ప్రవృత్తతాపో దివసోఽతిమాత్రమత్యర్థమేవ క్షణదా చ తన్వీ
ఉభౌ విరోధక్రియయా విభిన్నౌ జాయాపతీ సానుశయావివాస్తామ్.

(ఇది రఘువంశము, 16 వ సర్గలోనిది. గ్రీష్మర్తువర్ణనమట్టమ్నునకు సంబంధించినది).

"దివసము మిక్కిలి అధిక మగు తాపము గలది. రాత్రి కూడ ఎంతయు క్షీణించిపోయినది. విరోధక్రియచే (దివసరాత్రిపక్షమున బాగా పెద్ద దగుట, బాగా చిన్న దగుట అను విరుద్ధక్రియ యని అర్థము. నాయికానాయకుల పక్షమున ప్రణయకలహము అని అర్థము) వేరు వేరుగ నున్న (విడిపోయిన) ఈ రెండును (ఇరువురును) పశ్చాత్తాపముతో గూడిన భార్యాభర్తల వలె నున్నవి".

వ్యా. ఇచట శ్లేషయొక్క రంగు పూసిన, కవి ప్రతిభామాత్రముచే వికసిత మగు అలంకారము, (ఉపమాలంకారము) అకృత్రిమమై, ఒక అపూర్వ శోభను పోషించుచున్నది. 'ప్రవృత్తతాపః' 'తన్వీ' అను రెండు పదములును సుందరస్వభావమాత్రమును వర్ణించుచున్నవి. అంతియే గాని, (పతియొక్క సంతాపము పత్నియొక్క కృశత్వము అనెడు) అర్థాంతరముల ప్రతీతి కలుగుటకు అనుకూలముగ ప్రవర్తించుటలేదు. (అనగా 'ప్రవృత్తతాపః' అను పదమునకు 'అధిక మైన తాపము కలది' 'అధిక మైన విరహబాధ కలవాడు' అను అర్థద్వయమును బోధించు శక్తి ఉన్నది. అట్లే 'తన్వీ' అను పదమునకు గూడ, 'చిన్నదిగా నైనది', 'కృశించినది' అను యర్థద్వయమును బోధించు శక్తి యున్నది. అయినను ఇది గ్రీష్మఋతువర్ణనాప్రసంగ మగుటచే ఈ పదముల వాచకత్వము నియంత్రితమై ప్రకృతమున ఒక్కొక్క అర్థమును మాత్రమే బోధింపగలవు. అర్థాంతరబోధకములు కాజాలవు). కాని కవిచే చూపబడిన కౌశలముచే సముల్లసిత మగు ప్రకారాంతరముయొక్క అర్థప్రతీతికి అనుగుణముగ మాత్ర ముండి సహృదయాహ్లాదకారులగుచున్నవి.

వి. ప్రకారాంతర మనగా 'విరోధ', 'విభిన్న', శబ్దముల ప్రయోగ మని చెప్పనున్నాడు. కావున 'ప్రవృత్తతాపః' 'తన్వీ అను' పదములు ద్వితీయార్థ బోధనాశక్తము లైనను 'విరోధ' 'విభిన్న' శబ్దములకు గల (ప్రణయ కలహాదిరూప) అర్థాంతరము స్పష్టముగ స్ఫురించుటకు సహాయము చేయుచున్న వని యభిప్రాయము.

వ్యా. ఆ ప్రకారాంతర మనగా నేదిః అర్థాంతర ప్రతీతిని కలిగించు 'విరోధ', 'విభిన్న' అను శబ్దముల ప్రయోగము. ఉపమేయముల (దివసరాత్రుల) నడుమ గల విరోధము కలసి యుండజాలక పోవుట అనునది; రెండును వేరు వేరు స్వభావములు కలిగి యుండుట యనునది వాటి విభిన్నత్వము. ఉపమానముల (దంపతుల) నడుమ విరోధ మనగా-ప్రణయ కలహము: కోపముచే దూరదూరముగ నుండుట వారియందు గల విభిన్నత్వము 'అతిమాత్రమ్' 'అత్యర్థమ్' అనెడు విశేషణద్వయము కూడ రెండు పక్షము లందును (ఉపమేయ పక్షోపమాన పక్షములు రెండింటి యందును) అత్యధికత్వ ప్రతీతిని కలిగించుటచే మిక్కిలి రమణీయముగ నున్నది. ఇచట శ్లేషచ్ఛాయ కొంచెము

క్లేశ సంపాద్యమే యైనను ప్రయత్నము లేకుండగనే ఘటిత మగుటచే మనోహర ముగ నున్నది

అవ: 25వ కారికను వ్యాఖ్యానించుచున్నారు—

ఇంకను (ఆ మార్గము) ఎట్టిది? "అమ్లాన ప్రతిభోద్భిన్న నవశబ్దార్థ బన్ధురః". అమ్లానా = దోషోపహతము కానిదియు, పూర్వజన్మ సంస్కారైత జ్జన్మ సంస్కారములచే ప్రౌఢమైనదియు నగు ఏ, ప్రతిభా = ఒకానొక (అనిర్వచ నీయ మగు) కవి శక్తి కలదో, దాని నుండి, ఉద్భిన్నౌ = నూతనాంకురముల వలె స్వయముగనే మొలకెత్తిన, అంతియే కాని బలాత్కారముగ తెచ్చిపెట్టి కొనినవి గానివి; నవౌ = నూతనమైన, అనగా తద్విదాహ్లాదమును కలిగింప శక్తి గల, శబ్దార్థౌ = వాచక వాచ్యములు, వాటిచే, బంధురః = హృదయహారిగ నుండునది.

ఇంకను ఎటువంటిది "అయత్న విహిత స్వల్పమనోహారి విభూషణః" అయత్నేన = క్లేశము లేకుండగా, విహితం = కూర్పబడిన, ఏ, స్వల్పం = స్వల్ప మైనదియు, మనోహారి = హృదయాహ్లాదకర మగు, విభూషణం = అలంకరణము కలదో అది దేనియం దుండునో అది. ఇచట స్వల్ప శబ్దము ప్రకరణాద్యపేక్షము కాని వాక్యమాత్ర పరము కాదు.

వి. స్వల్పము లగు అలంకారము లుండవలె ననగా మొత్తము ప్రకరణము ననే అలంకారములు స్వల్పముగ నుండవలె నని యర్థము కాని, ఏదియో ఒక వాక్యమున అలంకారములు స్వల్పముగ నున్న చాలు నని యర్థము కాదు. ఆ అలంకారములు కూడ స్వాభావికముగ నుండ వలెను. ప్రయత్నపూర్వకముగ తెచ్చి పెట్టినవి కాకూడదు. ప్రయత్నపూర్వకముగ ఎన్నియో అలంకారములను కూర్చిన కావ్యము సహృదయాహ్లాదకరము కాజాలదు. అలంకారములు అతి సహజములు గను, రసోపకారకములుగను ఉండవలె నను విషయమును ఆనన్ద వర్ధనుడు కూడ :-

"రసాక్షిప్తతయా యస్య బన్ధః శక్యక్రియో భవేత్
అపృథగ్యత్ననిర్వర్త్యః సోఽలఙ్కారో ధ్వనౌ మతః।"

(II. 16)

అను కారికలో చెప్పియున్నాడు.

వ్యా. ఉదాహరణ మెట్లనగా-

బాలేన్దువక్రాణ్యవికాస భావాద్బభుః పలాశాన్యతిలోహితాని
సద్యో వసన్తేన సమాగతానాం నఖక్షతానీవ వనస్థలీనామ్.

(ఇది కుమారసంభవ తృతీయ సర్గమున వసంతవర్ణనావసరమున చెప్పిన శ్లోకము).

"వికసింపకుండుటచే ద్వితీయ చంద్రుడు వలె వక్రముగ నున్నవియు, మిక్కిలి ఎర్రగ నున్నవియు అగు మొగ్గలు వసన్తునితో అప్పుడే సమాగమము చేసిన వనస్థలుల (శరీరమునందలి) నఖక్షతములు వలె ప్రకాశించినవి."

వ్యా. ఇచట; "బాలేన్దు వక్రాణి," "అతిలోహితాని," "సద్యః = వసన్తేన సమాగతానామ్" అను పదములు సౌకుమార్యవశముచే (పలాశ) స్వభావ వర్ణనా మాత్ర పరములుగ ప్రయుక్తము లైనను, శ్లేశ మేమియు లేక అతిసహజ ముగ రూపొందిన "నఖక్షతానీవ" అనేడు అలంకారముతో సంబంధమును పొందుచు చమత్కార జనకములుగ నున్నవి." 25

ఇంకను ఎట్టిది ?

"భావస్వభావ ప్రాధాన్యన్యక్కృతా హార్య కౌశలః". భావాః = పదార్థములు, వాటియొక్క స్వభావః = తత్త్వము; దానియొక్క, ప్రాధాన్యమ్ = ముఖ్య త్వము, దానిచేత, న్యక్కృతమ్ = తిరస్కృత మైన, ఆహార్యం = వ్యుత్పత్తి (మాత్రము)చే చూపబడిన, కౌశలమ్ = నైపుణ్యము దేనియందో అట్టిది. దీని యభిప్రాయ మేమనగా-దీనియందు, (ఈ మార్గమునందు) కవిశక్తిచే సమున్మీలిత మగు పదార్థముల స్వాభావిక చమత్కారమే విజృంభించు చుండును; దీనిచే (కవి ప్రతిభాసమున్మీలిత మగు పదార్థ స్వాభావిక చమత్కారముచే) కావ్యాంతర ములలో చూపబడిన వ్యుత్పత్తి మాత్ర కల్పిత మగు విలాస మంతయు, అందు ఎంత వైవిధ్యమున్నను, తిరస్కరింపబడును.

రఘువంశములో దశరథుని మృగయా వర్ణన ఘట్టము ఇందులకు ఉదాహరణము ఎట్లనగా-(ఆ ప్రకరణమునుండి ఒకశ్లోకము చూపబడుచున్నది).

తస్య స్తనప్రణయిభిర్ముహురేణశాబై -
ర్వ్యాహన్యమానహరిణీ గమనం పురస్తాత్.
ఆవిర్బభూవ కుశగర్భముఖం మృగాణాం
యూథం తదగ్రసరగర్వితకృష్ణసారమ్. 78 (ర. 6.5)

"మా టిమాటికిని పాలుత్రాగ ప్రయత్నించు లేడి పిల్లలచే అడ్డుకొనబడిన ఆడలేళ్ళ గమనము కలదియు (అడ్డుకొనబడిన గమనము గల ఆడలేళ్ల గలదియు) నోళ్ళ నడుమ కుశములు గలదియు, ఎదుట నడుచుచున్న గర్వించిన మగలేడి కలదియు నగు ఒక మృగయూథము అతనికి ఎదురయ్యెను."

వ్యా. ఇంకను ఎట్లనగా-కుమార సంభవమున (తృతీయ సర్గములో).

"ద్వన్ద్వాని భావం క్రియయా వివవ్రుః"

"జంటలు క్రియలచే తమ మనోగత ప్రేమభావమును ప్రకటించినవి" అని (35వ శ్లోకమున) చెప్పిన పిమ్మట, చేసిన ప్రాణి ధర్మవర్ణనము కూడ ఉదాహరణము. (ఈ శ్లోకము తరువాత 42వ శ్లోకము వరకును వివిధ ప్రాణుల ధర్మములు వర్ణితములైనవి. వాటిలో ఉదాహరణార్థమై శ్లోకార్ధమును చూపు చున్నాడు).

"శృంగేణ చ స్పర్శనిమీలితాక్షీం
మృగీమకండూయత కృష్ణసారః" (కు. 3.36)

"కృష్ణసారము (మొగలేడి) స్పర్శ (సుఖ)ముచే మూసికొనిపోయిన కండ్లుగల ఆడలేడిని శృంగముతో గోకెను."

వి. "మధు ద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వామనువర్తమానః.
శృంగేణ చ స్పర్శ నిమీలితాక్షీం
మృగీమ కణ్డూయత కృష్ణసారః॥"

అనునది పూర్తి శ్లోకము.

వి. రఘువంశ కుమార సంభవముల నుండి ఇచట ఉదాహృతము లగు ప్రకరణములలో కవి, మృగముల స్వభావమును చాల చక్కగ చిత్రించినాడు. ఇచట కృత్రిమము లగు అలంకారముల ప్రయోగ మేదియును లేదు. ఐనను ఈ వర్ణనము చమత్కార జనకముగనే యున్నది. ఇది స్వభావోక్తి కృత మగు చమత్కారమే యని స్వభావోక్తి వాదు లనవచ్చును. కవి తన ప్రతిభచే ఈ స్వభావమును ఈ విధముగ వర్ణింపకలిగినాడు గాన ఇది కవి ప్రతిభామాత్ర కల్పిత వర్ణనా వక్రతయని కుంతకుని అభిప్రాయము.

వ్యా. ఇంకను ఎట్టిది? "రసాది పరమార్థజ్ఞమనః సంవాద సుందరః". రసాః=శృంగారాది రసములు; 'రసాది' అనునపుడు "ఆది" పదమునుప్రయో గించుటచే శృంగారాది రసములే కాక, రత్యాది భావములుకూడ గ్రహింపబడును.

వి. వెనుక కుంతకుడు చూపిన ఉదాహరణములలో మృగాది గత మగు శృంగారము తిర్యగ్గత మగుటచేశృంగారాభాసమే కాని శృంగారము కాజాలదు. కావునదానినిగూడ పరిగ్రహించుటకై పై విధముగ వ్యాఖ్యానము చేసినాడు. దీనిచే 'రసాది'పదము రస-రసాభాస,-భావ-భావాభాసాదు లను బోధించునని యర్థము.

వ్యా. వాటియొక్క, పరమార్థః = పరమరహస్యము. దానిని ఎరింగిన వారు తద్జ్ఞులు. వారి, మనః సంవాదః=హృదయ సంవేదనము, అనగా స్వానుభవగోచరముగ భాసించుట, దానిచే, సున్దరః=సుకుమారమైనది. సహృదయ హృదయాహ్లాదజనక మగు వాక్యబంధము అని యర్థము. రఘువంశములో రావణుని సంహరించి పుష్పకముపై తిరిగి వచ్చుచున్న రాముడు— సీ వియోగముచే వ్యాకుల మగు హృదయము గల నేను ఈ ప్రదేశములో చెప్ప రాని దుఃఖము ననుభవించితిని, అని సీతతో వర్ణించి చెప్పుచు పల్కిన వాక్యము లన్నియు ఇందులకు ఉదాహరణములు. ఎట్లనగా—

(ఆ ఘట్టములో నుండి ఒక శ్లోకమును ఉదాహరించుచున్నాడు)

"పూర్వానుభూతం స్మరతాచ రాత్రౌ
కంపోత్తరం భీరు! తవోపగూఢమ్.
గుహా విసారీణ్యతి వాహితాని
మయా కథంచిత్ ఘనగర్జితాని" 79 (6.13.28)

"ఓ భయస్వభావము కలదానా! రాత్రియందు పూర్వమునందు అనుభవించిన భయకంపముతో కూడిన నీ యాలింగమును స్మరించుచు, నేను గుహలలో వ్యాపించుచున్న ఘనగర్జితములను ఎటులనో గడిపినాను".

వ్యా. ఇచట "భావ స్వభావ ప్రాధాన్యన్యక్కృతా హార్య కౌశలః" అనియు "రసాది పరమార్థజ్ఞమనః సంవాద సున్దరః" అనియు రెండు భాగములుగ చేసి చెప్పుటలోని యభిప్రాయ మేమనగా— విభావాది రూపమున రసాంగము లగు పక్షిధ్వనులు, వృక్షములు, జలములు, వసంతము, మొదలగు పదార్థములు, అతిశయముతో కూడిన వాటి స్వభావముల వర్ణనముల ప్రాధాన్యము చేతనే రసాంగము లగును. (పధానముగ వాటిస్వభావమును వర్ణించుటచే అవి రసాంగములగును కావున 'భావ స్వభావ' మొదలగు విశేషణము చెప్పబడినది.) తద్భిన్నులును, విశిష్టచైతన్య యక్తులును అగు సుర గంధర్వాదులను శృంగారాది రస పూర్ణులనుగ వర్ణించిననే సహృదయ హృదయాహ్లాదము కలుగును. (కావున "రసాది" ఇత్యాది ద్వితీయ విశేషణము). లక్ష్యములందు ఈ విధముగనే కన్పట్టుచున్నది. 26

అవ. 27వ కారికను వ్యాఖ్యానించుచున్నాడు—

వ్యా. ఇంకను ఎట్టిది? "అవి భావిత సంస్థాన రామణీయకరఞ్జకః"

అవిభావితం = అనాలోచిత మగు (మానసా గోచర మగు) సంస్థానం = సంస్థితి (శబ్దార్థాది సంఘటనము) దేనియందో అట్టి (లేదా ఊహింపబడని స్థితి దేనియందో అట్టి); రామణీయకేన = రమణీయత్వముచే, రఞ్జకః = సహృదయ హృదయాహ్లాదక మగునదియు, దీని యభిప్రాయమిది. రచనలో ఈ విధమగు కవి కౌశల మున్నచో దానిని, ఇది, ఇంత ఉన్నది; అని ఏ విధముగను చెప్పుటకు శక్యము కాదు. కేవలము సర్వోత్కృష్టముగ మనస్సులో స్ఫురించుచుండును.

ఇంకను ఎట్టిది? "విధి వైదగ్ధ్య నిష్పన్న నిర్మాణాతి శయోపమః"

విధిః = బ్రహ్మ, వానియొక్క, వైదగ్ధ్యం = నేర్పు, దానిచే నిష్పన్నః = పరి సమాప్త మగు ఏ, ఈ, నిర్మాణాతిశయః = రమణీయ లలనా లావణ్యాదిక మగు సుందర మైన సృష్టికలదో, అది. ఉపమా = నిదర్శనము, దేనికో, అట్టిది.

కావున దేనియందు, బ్రహ్మయొక్క కౌశలము వలె కవియొక్క కౌశలము వర్ణింప శక్యము కాదో (అది సుకుమార మార్గము.)

ఎట్లనగా—

జ్యాబన్ధ నిష్పన్దభుజేన యస్య వినిఃశ్వసద్వక్త్రపరంపరేణ.
కారాగృహే నిర్జితవాసవేన దశాననే నోషితమాప్రసాదాత్. 80
(ర. 6-40)

"నారిచే బంధించుటచే కదలని భుజములు కలవాడును, నిట్టూర్చుచున్న ముఖ పంక్తి కలవాడును, ఇంద్రుని కూడ జయింప కల్గినవాడును అగు రావణుడు ఎవని కారాగృహమున (అతనికి) అనుగ్రహము కలుగు నంతవరకును నివసించెనో". ఇచట మరియొకవర్ణనావిధాన మేదియు అపేక్షింపని కవిశక్తి పరిణామము చరమసీమను అధిష్ఠించినది.

వి. ఇది ఇందుమతీ స్వయంవర ఘట్టమున కార్తవీర్యార్జునుని ప్రతాపమును వర్ణించు శ్లోకము. కార్తవీర్యార్జునుడు ఇంద్రుని కూడ జయింప కల్గిన రావణుని బంధించి కారాగారములో నుంచినాడు. ఇచట కవి ప్రయోగించిన "జ్యాబంధ నిష్పన్దభుజేన" "వినిఃశ్వసద్వక్త్ర పరం పరేణ" అను విశేషణ ద్వయము రావణుని దురవస్థను చాల చక్కగ స్పష్టీకరించుచున్నది. మరి యే విశేషణమును ఈ విధముగ ఆతని దురవస్థను వ్యక్తీకరింప జాలదు గాన, ఇచట కవి ప్రతిభ పరాకాష్ఠను చెందిన దని భావము.

వ్యా. ఈ కులకమునందలి ప్రథమ శ్లోకమున, ప్రధానముగ శబ్దముల యొక్కయు, అలంకారముల యొక్కయు సౌందర్యము ప్రతిపాదింపబడినది. రెండవ శ్లోకమున వర్ణనీయ వస్తువుయొక్క సౌకుమార్యము ప్రతిపాదిత మైనది. తృతీయ శ్లోకమున మరియొక ప్రకారమును దేనిని గూడ నపేక్షింపని శబ్దార్థ సన్నివేశముయొక్క సౌకుమార్యము ప్రతిపాదింపబడినది. వైచిత్ర్యమును గూడ సౌకుమార్యమునకు ప్రతికూలము గాకుండు విధమున సంపాదింపవలెను? అని చతుర్థ శ్లోకమున తెలుపబడినది. పచమ శ్లోకము విషయ విషయుల (విషయము సుకుమారమార్గము; దాని ననుసరించు సత్కవి విషయి) సౌకుమార్యము ప్రతిపాదింప నుద్దిష్టమైనది.

వి. ఒకే అన్వయము గల ఐదు లేక అంతకంటె అధిక సంఖ్యాకము లగు శ్లోకముల సముదాయమునకు కులక మని పేరు. రెండు శ్లోకములు

యుగ్మము. మూడు శ్లోకములు విశేషకము. నాలుగు శ్లోకములు కలాపకము. అంతకు పైన కులకము.

ద్వాభ్యాం యుగ్మమితి ప్రోక్తం త్రిభిః శ్లోకైర్విశేషకమ్।
కలాపకం చతుర్భిః స్యాత్, త దూర్ధ్వం కులకం స్మృతమ్॥
25-29

ఈ విధముగ "సుకుమారము" అను పేరుగల మార్గమునకు లక్షణము చెప్పి దాని గుణములను నిరూపించుచున్నాడు—

కా. అసమస్త మనోహారి పదవిన్యాస జీవితమ్
మాధుర్యం సుకుమారస్య మార్గస్య ప్రథమో గుణః॥ 30

"సమాసములు లేనివియు, మనోహరములును, అగు పదముల విన్యాసమే జీవితముగా గల మాధుర్యము సుకుమార్గ మార్గముయొక్క మొదటి (ప్రధాన) గుణము." 30

అస మస్తాని = సమానరహితములుమ, మనోహారీణి = వినుటకు ఇంపుగ నుండుటచేతను అర్థసౌందర్యము చేతను హృదయాహ్లాదకము లగు ఏ, పదాని = సుబన్తతిజన్తరూపము లగు పదములు కలవో, వాటియొక్క, విన్యాసః = సన్నివేశవైచిత్ర్యము, కూర్పులోని వైచిత్ర్యము, జీవితం = సర్వస్వము, దేనికో అట్టి, మాధుర్య మనునది సుకుమార మనెడు మార్గముయొక్క, ప్రథమః = ప్రధానమైన గుణము. ఇచట "అస్తమస్త" అనుదానికి సమాసములు లేని పదములు ప్రచురముగ నుంచవలెనని యభిప్రాయము. అంతియే కాని, సమాసములే ఉండరా దని నియమించుటకాదు. ఉదాహరణము ఎట్లనగా—

క్రీడారసేన రహసి స్మితపూర్వమిన్దో
ర్లేఖాం వికృష్య వినిబధ్య చ మూర్ధ్ని గౌర్యా।
కిం శోభితాహమనయేతి శశాంకమౌళేః
పృష్టస్య పాతు పరిచుంబిత ముత్తరం వః। 31

"ఏ కాంతమున పార్వతి క్రీడారసముచే చిరునవ్వు నవ్వుచు చంద్రలేఖను లాగికొని తన శిరస్సున బంధించి, 'ఇది నాకు బాగుగా నున్నదా?' అని

ప్రశ్నించగా శశాంకమౌళి ఇచ్చిన చుంబన మనెడు ప్రత్యుత్తరము మిమ్ములను రక్షించుగాక."

వ్యా. ఇచట పదములలో సమాసములు లేకుండుట, శబ్దార్థముల రమణీయత్వము, (అసమస్త పదముల) విన్యాసమున వైచిత్ర్యము. ఈ త్రయమును ప్రకాశించుచున్నది. 80

ఈ విధముగ మాధుర్యమును చెప్పి ప్రసాద (గుణ) మును గూర్చి చెప్పుచున్నాడు.

కా. అక్లేశ వ్యఞ్జితా కూతం ఝగిత్యర్థ సమర్పణమ్
రస వక్రోక్తి విషయం యత్ప్రసాదః స కథ్యతే 81

'రసములును వక్రోక్తియు విషయముగా కలదియు, అనాయాసముగ వ్యంజింపబడిన అభిప్రాయము (తాత్పర్యశోభ) కలదియు అగు అతిశీఘ్ర మగు అర్థబోధనము ప్రసాద మని చెప్పబడుచున్నది." 81

ఝగితి = మున్ముందుగనే. (పఠించిన వెంటనే), అర్థ సమర్పణమ్ = వస్తు ప్రతిపాదనము. ఎట్టిది? అక్లేశ వ్యఞ్జితా కూతం = బాధపడవలసిన పని లేకుండగనే ప్రకటింపబడిన అభిప్రాయము గలది. ఏది విషయముగా గలది? — (దీని, విషయమేది?) 'రస వక్రోక్తి విషయమ్'. రసాః = శృంగారాది రసములును, వక్రోక్తిః = సామాన్యరూపముగ ఏ అలంకార మైనను, విషయః = గోచరము, దేనికో అట్టిది. అదియే ప్రసాద మనెడు గుణముగా చెప్పబడుచున్నది. ఇచట (ఈ ప్రసాద గుణమున) పదములు సమాస విహీనములుగ నుండుట, వాటి యర్థము ప్రసిద్ధముగ నుండుట, ఆ పదముల పరస్పర సంబంధము దూరముగ లేకుండుట (లేదా పదములకు అర్థముల తోడి సంబంధము లక్షణాదులచే వ్యవహితము కాకుండుట) సమాసము లున్నను అర్థమునకు ఝటితిస్ఫూర్తిని కల్గింప గలుగు సమాసములు మాత్రమే యుండుట, అనునది ప్రధాన మగు రహస్యము. ("అక్లేశవ్యంజితాకూతం" అనుదానిలోని) "ఆకూత" శబ్దము తాత్పర్య విచ్ఛిత్తి, (రమణీయ మగు తాత్పర్యము) అను నర్థమును బోధించును. ఉదాహరణము ఎట్లనగా—

"హిమవ్యపాయాద్విశదాధరాణా-
మాపాణ్డురీ భూతముఖచ్ఛవీనామ్.
స్వేదోద్గమః కింపురుషాంగనానాం
చక్రే పదం పత్రవిశేషకేషు" 82. (కు. 3.33)

"మంచు తొలగిపోవుటచే స్వచ్ఛ మగు (చలిచే గలిగిన పగుళ్ళు మొదలగునవి లేని) అధరములు కలిగినట్టియు, బాగుగ తెల్లనైన ముఖ కాంతి గల కింపురుష స్త్రీల (గండ స్థలాదులందు రచితములగు) మకరి కాది పత్ర చిహ్నములందు స్వేదాంకురము అడుగుపెట్టెను" (ఇది వసంతఋతు వర్ణన ఘట్టములోని శ్లోకము).

వ్యా. ఇచట (ఈ ఉదాహరణమున) అసమస్తత్వము మొద లగు సామగ్రి యున్నది. వివిధము లగు పత్ర చిహ్నముల వైచిత్ర్యముచే లభించిన అపూర్వ మగు వదన సౌందర్యము ముత్యముల వంటి స్వేద బిందువులచే ఇనుమడించినది, అనునది (తాత్పర్య విచ్ఛిత్తి) గూడ సుస్పష్టముగనేయున్నది.

ఇంకను ఎట్లనగా—

ఇది రఘువంశ షష్ఠ సర్గలో ఇందుమతీ స్వయంవర ఘట్టమున హేమాంగదు డను కలింగదేశ రాజును చూపి సునంద ఇందుమతితో అన్న వాక్యము.

అనేనసార్ధం విహరాంబురాశే-
స్తీరేషు తాడీవన మర్మరేషు.
ద్వీపాన్తరానీతలవంగ పుష్పై-
రపాకృత స్వేదలవా మరుద్భిః. 83. (ర. 6.57)

"ద్వీపాంతరముల నుండి తీసికొని రాబడిన లవంగ పుష్పములు గల వాయువులచే తొలగింపబడిన చెమట బిందువులు గలదానవై తాటితోపులతో మర్మర ధ్వని చేయుచున్న సముద్రతీరముల యందు ఈతనితో గూడ విహరింపుము."

అవ పై రెండు శ్లోకములును రసవిషయక ఝగిత్యర్థ సమర్పణరూప మగు ప్రసాదమునకు ఉదాహరణములు. ఇపుడు అలంకార సామాన్యరూప మగు వక్రోక్తిని వెంటనే బోధించుట యనెడు ప్రసాదమునకు ఉదాహరణము చూపుచున్నాడు—

వ్యా. అలంకారాభి వ్యక్తికి ఉదాహరణము ఎట్లనగా—
'బాలేందు వక్రాణి' అనునది.

వి. అలంకార రూపార్థ సమర్పణరూప మగు ప్రసాదమునకు వెనుక (7వ ఉదాహరణముగ) చూపిన "బాలేన్దు వక్రాణి" ఇత్యాది కుమార సంభవ గత శ్లోకము ఉదాహరణ మని యర్థము. 31

ఈ విధముగ ప్రసాదమును నిరూపించి లావణ్య (గుణ) మునకు లక్షణము చెప్పుచున్నాడు-

కా. వర్ణవిన్యాస విచ్ఛిత్తి పదసన్ధాన సమ్పదా
స్వల్పయా బన్ధ సౌన్దర్యం లావణ్య మభి ధీయతే. 32

"స్వల్ప మగు వర్ణ విన్యాస విచ్ఛిత్తితో కూడిన పదసంధాన సంపదచే ఏర్పడిన బంధ సౌందర్యమునకు లావణ్య మని పేరు." 32

వ్యా. బన్ధః = వాక్య విన్యాసము, దానియొక్క, సౌన్దర్యం = సౌందర్యము, లావణ్యం అభిధీయతే = లావణ్య మని చెప్పబడుచున్నది. ఎట్టిదిః వర్ణానాం = అక్షరములయొక్క, విన్యాసః = విచిత్రమైన కూర్పు. దానియొక్క విచ్ఛిత్తిః = శోభ, అనగా నేర్పుతోకూడిన ఒక ఒడుపు. దానితో కూడిన, పదానాం = సుబన్తతిజంతముల, సన్ధానమ్ = కూర్పు, దానియొక్క సంపద, అదియు శోభయే; దానితో కూడినని. ఆ ఉభయరూప మగు శోభయు ఎట్టిదిః స్వల్పయా = అల్పమైనది, ఎక్కువ నిర్బంధము లేకుండగనే నిర్మింపబడినది. కావున దీని యర్థమిది—

శబ్దార్థముల సౌకుమార్యముచే సుందర మగు కూర్పుయొక్క మహిమయే లావణ్య మనెడు గుణముగా చెప్పబడుచున్నది.

ఎట్లనగా—

స్నానార్ద్రముక్తేష్వనుధూపవాసం
విన్యస్త సాయంతన మల్లికేషు.
కామో వసన్తాత్యయ మన్ద వీర్యః
కేశేషు లేభే బలమఙ్గనానామ్॥ 85

(రఘువంశము 16-50)

"వసన్త ఋతువు గడచిపోవుటచే మంద మైన పరాక్రమము గల మన్మథుడు స్నానముచే తడసినట్టియు, జాలువారునట్లు చేయబడి నట్టియు; ధూపముచే సువాసన కలిగింప చేసిన పిమ్మట ఉంచబడిన సాయంకాల మల్లికా పుష్పములు గల, అంగనల కేశములందు, బలము పుంజుకొనెను."

ఇచట సహృదయ హృదయైక సంవేద్య మగు కూర్పులో నున్న రామణీయకము యొక్క గొప్ప తనము మాటలతో వర్ణింపనలవి కానిది. ఇంకను ఎట్లనగా—

"చకార బాణై రసురాంగనానాం
గండస్థలీః ప్రోషిత పత్రలేఖాః" 86. (రఘు. 6.72)

"బాణములచే అసురాంగనల గండస్థలములను తొలగిపోయిన పత్ర లేఖలు కలవాటినిగా చేసెను."

వి. ఈ శ్లోకము రఘువంశ షష్ఠసర్గము నందలి ఇందుమతీ స్వయంవర ఘట్టములోనిది. సునన్ద అజుని చూపి ఆతని వంశమునకు మూలపురుషు డగు కకుత్థ్సుని వర్ణించిన శ్లోకమిది.

"మహేన్ద్ర మాస్థాయ మహోక్షరూపం
యః సంయతి ప్రాప్త పినాకిలీలః"

అనునది దీని పూర్వార్ధము.

"ఆ నాడు దేవాసుర యుద్ధము నందు వృషభరూపమును ధరించిన మహేంద్రుని వీపుపై నెక్కి ఈశ్వరుని వలె నొప్పుచు" అని దీని యర్థము. 'కకుత్' అనగా ఎద్దుమూపురము. దానిపై కూర్చుండుటచే ఈతనికి 'కకుత్ స్థః' అను పేరు వచ్చినది.

వ్యా॥ ఇచట వర్ణవిన్యాసవిచ్ఛిత్తియు, పదముల కూర్పుకు గల శోభయు, సన్నివేశసౌందర్యమును బట్టి స్ఫుటముగనే ప్రకాశించుచున్నవి. 32

ఈ విధముగ లావణ్యమును ప్రతిపాదించి, ఆభిజాత్య (గుణ) మును గూర్చి చెప్పుచున్నాడు.

కా. శ్రుతిపేశలతాశాలిసుస్పర్శమివ చేతసా
స్వభావమసృణచ్ఛాయమాభిజాత్యం ప్రచక్షతే. 33

"చెవులకు (వినుటకు) అందముగా (ఇంపుగా) నుండుటచే ప్రకాశించు చున్నదియు, మనస్సుచే సుఖముగ స్పృశింప శక్యమగునది వలె నుండునదియు, స్వభావముచే మృదు వగు కాన్తి గల (బంధసౌందర్యము) ఆభిజాత్య మని చెప్పుదురు."

వ్యా॥ ఈ విధ మగు వస్తువును, అభిజాత్యం ప్రచక్షతే = అభిజాత్య మనెడు గుణమునుగా వర్ణించుచున్నారు. శృతిః = శ్రవణేంద్రియము దానియందు, పేశలతా = రమణీయత్వము, దానిచే ఏది, శాలతే = అత్యుత్కృష్టముగనున్నదో అట్టిది, సుస్పర్శమివచేతసా = మనస్సుచే సుఖముగా స్పృశింపబడినది వలె నుండునది, అని ఇది అతిశయోక్తి. ఏలయన- స్పర్శయోగ్యమై యుండి, సౌకు మార్యముచే ఒకానొక స్పర్శసుఖమును కలిగించుచున్నది వలె నున్నది అను ఈ ఉభయమును ఇందు ఉన్నది· అది అతిశయోక్తికల్పితమే.

వి ఆనగా అభిజాత్య మనెడు ఈ గుణము మూర్తపదార్థము వలె స్పృశింపయోగ్య మైనదనియు, ఆ విధముగ స్పృశింపబడి మనస్సున స్పర్శ సుఖము నిచ్చుచున్న దనియు, ఈ అంశద్వయమును గూడ కవి కల్పితమే గాన అతిశయోక్తియని యభిప్రాయము.

వ్యా. ఎందువలన ననగా-స్వభావమసృణచ్ఛాయమ్ = ప్రయత్నసంపా దితము గాని, ఏ సుకుమారకాంతి కలదో దానిని అభిజాత్యమని చెప్పుదురు అని యర్థము. ఎట్లనగా-

"జ్యోతిర్లేఖావలయి గలితం యస్య బర్హం భవానీ
పుత్రప్రీత్యా కువలయదలప్రాపి కర్ణే కరోతి" 87. (మేఘ. 44)

"పార్వతి మెరయుచున్న వలయాకారరేఖ కలిగిన, రాలిన, ఏ స్కందుని మయూరము యొక్క ఈకను, పుత్రప్రేమచే, తన చెవిలోని కలువరేకు ప్రక్క చేరుదానినిగా చేయుచున్నదో".

వ్యా. ఇచట శ్రవణసుఖకరత్వము మొదలగు ఒకానొక స్వభావముచే మృదు వగు కాంతి, సహృదయహృదయ వేద్యమై స్ఫురించుచున్నది. లోకోత్తర మగు తరుణీరూప మనెడు వస్తువుయొక్క ధర్మములుగా ప్రసిద్ధము లగు లావణ్యమును అభిజాత్యమును కావ్యధర్మము లెట్లగునుఅని అశంకింపరాదు. ఏలయన ఈ యుక్తిని బట్టి పూర్వప్రసిద్ధము లగు (అనగా పూర్వ కావ్యశాస్త్ర ప్రసిద్ధములు లేదా పూర్వోక్తము లగు) మాధుర్య ప్రసాదములు గూడ కావ్యధర్మములు కావని చెప్పవలసియుండును ఏలయన— గుడాదిమధురద్రవ్యముల ధర్మముగా ప్రసిద్ధ మగు మాధుర్యము అట్టి (గుడాదిద్రవ్యములు కలిగించు ఆనందమువంటి) ఆనందమును కలిగించుట అనెడు సమానధర్మారోపముచే కావ్యమునందు కూడ చెప్పబడుచున్నది. అట్లే స్వచ్ఛ మగు జలము, స్ఫటికము, మొదలగు వాటి ధర్మముగ ప్రసిద్ధ మగు ప్రసాదము స్ఫుటముగ భాసించుట అనెడు సమాన ధర్మముయొక్క ఆరోపముచే "శీఘ్రముగ అర్థప్రతీతి కలుగుటచే కలిగిన సౌందర్యము—" అను నర్థమును పొందుచున్నది. (అను నర్థమున ప్రయోగింపబడు చున్నది). ఆ విధముగనే కావ్యమునందు కవిశక్తిచే నేర్పుతో సంపాదింపబడిన కాన్తిచే కమనీయ మగు బన్ధసౌందర్యమును బోధించుటకు కూడ, సహృదయులకు చమత్కారమును కలిగించుట అనెడు సమానధర్మమును పురస్కరించుకొని యేర్పడిన ఆరోపముచే, లావణ్యశబ్దము తక్క మరి యే శబ్దమును సమర్థము కాదు. ఇట్లే కావ్యమునందలి స్వభావసుందరచ్ఛాయత్వము ('మసృణచ్ఛాయా' అను పదమునకు నిగనిగలాడు కాన్తి యని అర్థము). అభిజాత్యశబ్దముచే బోధింపబడును.

వ్యా. (ఆశంక) లలనాలావణ్యముతో సామ్య ముంగుటచే ప్రతీయమాన మగు వస్తువే లావణ్యమనునట్లు తోచువిధమున కొందరు (ఆనందవర్ధనాదులు) చెప్పి యున్నారుకదా ? —

"ప్రతీయమానం పునరన్యదేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తంవిభాతి లావణ్యమివాఙ్గనాసు"

(ధ్వన్యా. 1-4)

"అంగనలలో ప్రసిద్ధము లగు కరచరణాద్యవయవములకంటె భిన్న మగు లావణ్యము ప్రకాశించునట్లు, మహాకవుల వాక్కులలో ప్రసిద్ధము లగు శబ్దార్థాద్యవయవములకంటె వ్యతిరిక్త మగు ప్రతీయమానార్థరూప మైన ఒకానొక వస్తువు ఉన్నది".

కావున బంధ సౌందర్యము మాత్రమే లావణ్యము అని చెప్పుట యెట్లు పొసగును- అని ఆశంకింపరాదు. ఈ (లావణ్య) దృష్టాంతముచే వాచ్యవాచక రూపము లగు ప్రసిద్ధావయవములకంటె వ్యతిరిక్తముగ ప్రతీయమానార్థ మను నది ఒకటి యున్న దని మాత్రమే సాధింపబడుచున్నది. అంతియే కాని సహృదయహృదయములకు మాత్రమే గోచర మగు ప్రతీయమానార్థము సకలజననేత్ర గోచర మగు లలనాలావణ్యముతో సమానము అని చెప్పుట శక్యము కాదు. పదపదార్థవ్యుత్పత్తి లేనివారికి గూడ శ్రవణమాత్రముచేతనే మనోహరముగ నుండుట యనెడు సామ్యముచే బంధసౌందర్యమే లావణ్య మని చెప్పబడుచున్నది. ప్రతీయమానార్థమన్ననో, కేవలము కావ్యపరమార్థము నెరింగినవారికి మాత్రమే అనుభవగోచర మగును. ఎట్లనగా- కామినుల సౌభాగ్యవిశేషము దాని ననుభవింపతగిన నాయకులకు మాత్రమే అనుభవగోచర మగును. వారి లావణ్య మన్ననో— సత్కవీంద్రుల వాక్కుల సౌందర్యము వలె సకలజనులకును గోచర మగును- అను విషయము కూచ చెప్పినట్లే, కావున ఇకనీ అతిప్రసఙ్గము చాలును. 33

ఈ విధముగ సుకుమారమార్గలక్షణము చెప్పి విచిత్రమార్గలక్షణము చెప్పుచున్నాడు-

కా. ప్రతిభాప్రథమోద్భేదసమయే యత్ర వక్రతా
శబ్దాభిధేయయోరన్తః స్ఫురతీవ విభావ్యతే. 34

"కవిప్రతిభ తొలుదొల్త అంకురించినపుడే, శబ్దార్థముల లోపల వక్రత్వము స్ఫురించుచున్నట్లు దేనియందు (ఏమార్గమునందు) తోచునో..." 34

కా. అలంకారస్య కవయో యత్రాలఙ్కారణాన్తరమ్
అసన్తుష్టా నిబధ్నన్తి హారాదేర్మణిబంధవత్. 35

"కవులు (ఒక అలంకారముతో) సంతృప్తి చెందక (సువర్ణ) హారాదులతో మణులను కూర్చినట్లు ఎచట, అలంకారమునకు మరియొక అలంకారమును చేర్చుచుందురో..." 35

కా. రత్నరశ్మిచ్ఛటోత్సేక భాసురై ర్భూషణై ర్యథా
కాన్తాశరీరమాచ్ఛాద్య భూషాయై పరికల్పతే. 36

కా. యత్ర తద్వదలంకారై ర్భ్రాజమానై ర్నిజాత్మనా
స్వశోభాతిశయా న్తస్థమలఙ్కార్యం ప్రకాశ్యతే. 37

"రత్నకిరణసముదాయముల విజృంభణముచే ప్రకాశించుచున్న అలంకారములచే కప్పివేసి కాన్తాశరీరము ఏ విధముగ సౌన్దర్యాతిశయముకొరకై అలంకరింపబడునో ఆ విధముగనే, ఏ మార్గమునందు, నిజస్వరూపముతో ప్రకాశించు అలంకారములచే, తమశోభచేత లోపల నున్న (రసాది) అలంకార్యము ప్రకాశింపచేయబడుచున్నదో...." 36-37

కా. యదప్యనూతనోల్లేఖం వస్తు యత్ర తదప్యలమ్
ఉక్తివైచిత్ర్యమాగ్రేణ కాష్ఠాంకామపి నీయతే. 38

"క్రొత్తగ వర్ణింపబడని (అనగా పూర్వకవులు వర్ణించిన) విషయము కూడ, దేనియందు, ఉక్తివైచిత్ర్యమాత్రముచే ఒకానొక (సౌందర్య) చరమ సీమను పొందింపబడునో..." 38

కా.యత్రాన్యథా భవత్ సర్వమన్యథైవ యథారుచి
భావ్యతే ప్రతిభోల్లేఖమహత్త్వేన మహాకవేః. 39

"మహాకవియొక్క ప్రతిభాప్రసరమాహాత్మ్యముచే ఏ మార్గమునందు, వేరొక విధముగ (నిస్సారముగ) నున్న సర్వమును, కవియొక్క రుచి ననుసరించి, మరియొక విధముగ (అతిసుందరముగ) భావింపబడునో...." 39

కా. ప్రతీయమానతా యత్ర వాక్యార్థస్య నిబధ్యతే
వాచ్యవాచకవృత్తిభ్యాం వ్యతిరిక్తస్య కస్యచిత్. 40

"వాచ్యవాచకవృత్తులకంటె భిన్న మగు ఒకానొక (అనిర్వచనీయస్వరూప మగు) వాక్యార్థము ఏ మార్గమునందు ప్రతీయమానముగ నిబంధింపబడునో" 40

కా. స్వభావః సరసాకూతో భావానాం యత్ర బధ్యతే
కేనాపి కమనీయేన వైచిత్ర్యేణోపబృంహితః. 41

"ఒకానొక కమనీయ మగు వైచిత్ర్యముచే పోషింపబడినదియు, సరస మగు అభిప్రాయము కలదియు, నగు పదార్థస్వభావము ఏ మార్గమునందు వర్ణింపబడునో...." 41

కా. విచిత్రో యత్ర వక్రోక్తివైచిత్ర్యం జీవితాయతే
పరిస్ఫురతి యస్యాన్తః సా కాప్యతిశయాభిధా. 42

"దేనియందు వక్రోక్తియొక్క వైచిత్ర్యము జీవితమువలె నుండునో, దేనిలోపల అపూర్వ మగు అతిశయముతో కూడిన ఉక్తి ప్రస్ఫురిత మగు చుండునో, అది విచిత్రమార్గము..." 42

కా. సోఽతిదుఃసంచరో యేన విదగ్ధకవయో గతాః
ఖడ్గధారాపథేనేవ సుభటానాం మనోరథాః. 43

"సుభటుల మనోరథములు ఖడ్గధారామార్గమున సంచరించు నట్లు ఏ మార్గమున వైదగ్ధ్యవంతు లగు కవులు నడచినారో అట్టి ఈ విచిత్రమార్గము సంచరించుటకు చాల కష్టమైనది..." 43

అవ. ముప్పదినాల్గవ కారిక మొదలు నలుబదిమూడవ కారికవరకును గల పది కారికలతో, విచిత్రమార్గలక్షణమును చెప్పి ఈ కులకమును అన్వయ క్రమానుసారముగ వ్యాఖ్యానించుచున్నాడు:—

వ్యా. విచిత్ర మను పేరు గల ఆ మార్గము ఎట్టిది? "అతిదుః సఞ్చరః" —దేనియందు చాల కష్టముతో ప్రయాణము చేయుదురో అట్టిది. యేనః ఏ మార్గముచే, విదగ్ధకవయః = వ్యుత్పన్ను లగు కొందరు కవులు మాత్రమే,

గతాః = వెళ్ళినారో; అ మార్గము నాశ్రయించి కావ్యములను రచించినారో యని అర్థము. ఎట్లు? "ఖడ్గధారా పథేనేవ సుభటానాం మనోరథాః"— ఖడ్గధారా మార్గముచే, సుభటానాం = మహావీరుల; మనోరథాః = సంకల్ప విశేషములు ఏ విధముగ (సంచరించునో) అట్లు. దీని యభిప్రాయమేమవగా— ఔచిత్యానుసారముగ రుచి ననుసరించి అసిధారా మార్గగమనము చేయుటకై ప్రవర్తించు మనోరథములకు కొంచెము కూడ అలసట సంభావ్యము కాదు. కాని (మనోరథమాత్రములచే సంచరించుటకు బదులు) సాక్షాత్తుగ సమర సంమర్దమును చేయుటకు ప్రయత్నించినచో కొంచెము అలసట కలుగుటకు కూడ అవకాశమున్నది.

వి. ఈ విధముగ సాక్షాత్తుగ సమర రంగమున పాల్గొని అలసట చెందకుండుట యున్నచో కొంతమందికి మాత్రమే సాధ్యము. ఈ విచిత్ర మార్గమున సంచరించి సాఫల్యము నందుట యనునది కూడ అట్టిదే యని యభిప్రాయము.

వ్యా. దీనిచే ఈ మార్గము చాలదుర్గమ మనియు, ఇందు ప్రయాణము చేయగలిగిన వారికిగల విహరణ ప్రౌఢియు ప్రతిపాదితములగు చున్నవి. 43

ముప్పదినాల్గవ కారికను వ్యాఖ్యానించుచున్నాడు—

ఆ మార్గము ఎట్టిది? యత్ర = ఏ మార్గమునందు; శబ్దాభిధేయ యోః = శబ్దార్థముల, అన్తః = స్వరూపమున ప్రవేశించిన, వక్రతా = ఉక్తివైచిత్ర్యము, స్ఫురతీవ = స్ఫురించు చున్నది వలె; విభావ్యతే = చూడబడుచున్నదో. ఎప్పుడు? ప్రతిభా ప్రథమోద్భేదసమయే— ప్రతిభాయాః = కవిశక్తియొక్క, ప్రాథమిక వికాసమయమునందు; కావున ఇచట పరమార్థ మేమనగా—

కవి ప్రయత్నాపేక్ష లేకుండగనే శబ్దార్థములలో స్వాభావిక మగు ఒకానొక వక్రతాప్రకారము స్ఫురించుచు కానవచ్చును. ఎట్లనగా—

"కోఽయం భాతి ప్రకార స్తవ పవన పదం లోకపాదాహతీనాం
తేజస్విప్రాత మధ్యే నయసి నయసి యత్పాంసుపూరం ప్రతిష్ఠామ్.
యస్మిన్నుత్థా ప్యమానే జననయన పథోపద్రవస్తావ దాస్తాం
కేనోపాయేన సహ్యో వపుషి కలుషతాదోష ఏష త్వయైవ" 89

"ఓ పవనమా! లోకుల పాదసంఘట్టనమునకు స్థాన మగు (జనుల పాద ములచే త్రొక్కబడెడు) పరాగముల సముదాయమునకు, ఆకాశమున, తేజశ్శాలుల సమూహము మధ్యమున ప్రతిష్ఠను కల్పించుచున్నావు. ఇది ఏమి పద్ధతి? దీనిని పైకి ఎగుర గొట్టినపుడు (లేవదీసినపుడు) జనుల నేత్రమార్గమునకు ఉపద్రవము మాట అటుండ (నీ) శరీరమున కల్గు కాలుష్య దోషమును నీవే ఎట్లు సహింప గలవు? 89

వి. ఈ శ్లోకమున అప్రస్తుత మగు వాయువర్ణనముచే గుణదోష విమర్శ అనునది లేక, నీచుని ఉన్నతస్థానము నధిరోహింప చేయు అవివేకియొక్క వృత్తాంతము గమ్య మగుచున్నది.

వ్యా. ఇచట (ప్రస్తుత మగు) మరి యొక పదార్థము ప్రతీయమాన మగు విధమున (అప్రస్తుత వాయురూపార్థము) ప్రయుక్త మగుటచే అప్రస్తుత ప్రశంస యను పేరు గల అలంకారము ప్రధానముగ వాక్యార్థము.

వి. అప్రాకరణిక మగు విషయమును వర్ణించగా ప్రాకరణికార్థ ప్రతీతి కలిగినచో అది అప్రస్తుత ప్రశంసాలంకారము.

వ్యా. విచిత్ర మగు కవిశక్తిచే సంపాదితము లగు వక్రిశబ్దార్థముల కూర్పుయొక్క మహిమచే ప్రతీయమానార్థము కూడ వాక్యార్థము వలె కన్పట్టు నట్లు చేయబడినది; ఏలయన ప్రకృతార్థముకూడ ప్రారంభముననే ప్రతిభా సించుచున్నది.

వి. అనగా శ్లోకమును చదువగనే అప్రకృత వాయు వృత్తాంతము వలె ప్రకృత వివేక శూన్యపురుష వృత్తాంతము కూడ ప్రతీత మగుచున్నది.

వ్యా. పదములు అర్థాంతర ప్రతీతి కలిగించుచున్నను ఇచట శ్లేష యని చెప్పుటకు వీలు లేదు. ఏలయన వాచ్యార్థము ప్రతీయ మానార్థముతో సమప్ర ధానముగ లేదు.

వి. అనగా రెండు అర్థములకును సమాన మగు ప్రాధాన్యము ఉన్న యడలనే శ్లేషాలంకార మని చెప్పవచ్చును. కాని ఇచట వాచ్య మగు పవన రూపార్థము అప్రధానము. ప్రతీయమానార్థము ప్రధానము. ఈ విధముగ అర్థద్వయమునకును సమప్రాధాన్యము లేకుండుటచే ఇది శ్లేష కాదు.

వ్యా. ప్రతీయ మాన మగు అర్థము స్ఫుటముగ బుద్ధిగోచర మగుటకై కల్పింప బడిన (శబ్దముల) ద్వితీయార్థ బోధకత్వము ఎంతయు చమత్కార జన కముగ నున్నది.

వి. అనగా పై శ్లోకములో ప్రయుక్తము లగు 'ప్రతిష్ఠా' "తేజస్వి వ్రాతసేవ్యే" "కలుషతా" ఇత్యాది పదములకు 'ఉనికి' ఉన్నత స్థాన స్థితి' 'నక్షత్రాదులకు నిలయము—మహాపురుషుల స్థానము; మలినత్వము-పాపము' అను విధమున రెండేసి అర్థములు కలవు. ఈ విధముగ రెండేసి అర్థములు గల పదములను ప్రయోగించుటచే ప్రతీయ మాన మగు ప్రకృతార్థము స్ఫుట ముగ తెలియుచున్నది, అని భావము.

అవ. ముప్పదియైదవ కారికను వ్యాఖ్యానించుచున్నాడు—

వి. ఆ విచిత్ర మార్గమునకే 'అలంకారస్య' ఇత్యాది శ్లోకముచే మరి యొక విధ మగు లక్షణము చెప్పుచున్నాడు—

యత్ర = ఏ మార్గమునందు; కవులు; నిబధ్నన్తి = రచింతురో, అలం కారస్య = అలంకారమునకు, అలఙ్కరణాన్తరమ్ = మరియొక అలంకారమును; సంతృప్తిలేనివారై, ఎట్లు? 'హారాదేర్మణి బన్ధవత్ = ముక్తాహారము మొదలగు దానికి, అలంకారములను తయారుచేయువారు పతకము మొదలగు మణి బంధ మును అనగా రత్నముల విన్యాస విశేషమును ఏ విధముగ (ఏర్పరుతురో) ఎట్లనగా—

"హే హేలాజితబోధిసత్త్వ వచసాం కిం విస్తరైస్తోయధే
నాస్తి త్వత్సదృశః పరః పరహితాధాన గృహీతవ్రతః.
తృష్యత్పాన్థ జనోపకారఘటనావైముఖ్య లబ్ధాయశో
భారప్రోద్వహనే కరోషి కృపయా సాహాయ్యకం యన్మరోః"

'బోధి సత్త్వుని గూడ అనాయాసముగ జయింప కలిగిన ఓ సముద్రమా! వాగ్విస్తారముచే ఏమి ప్రయోజనము? పరులకు హితమును కూర్చుటకై వ్రత మును గ్రహించిన నీ వంటి వాడు మరియెవ్వడును లేడు. ఏలయన దప్పిగొన్న పాంథజనులకు ఉపకారమును చేయుటయందు వైముఖ్యముచే లభించిన అపకీర్తి

యొక్క భారమును వహించుటలో, దయతో నీవు మరుభూమికి సహాయము చేయుచున్నావు.'

వి. మరుస్థలమున జలమే లేకుండుటచే అది దప్పికొన్నవారికి ఉపకారము చేయజాలదు. సముద్రమునందు అంత నీరు ఉన్నను వారికి ఉపకారము చేయుటలేదు. కావున దప్పిగొన్నవారికి ఉపకారముచేయకుండుట యను, అపకీర్తి భారమును ఆ ఒక్క మరుభూమియే వహించుచున్న దను జాలిచే నీవు కూడ కొంతభారము తీసుకొన్నావు. గాన నీవు నిజముగ పరోపకార కరణబద్ధదీక్షుడవు అని భావము.

ధనము లేని వారు ఎటులను ఇతరులకు ఉపకారము చేయ జాలరు. ధనవంతుడు కూడ వారివలెనే పరోపకార విముఖుడౌట ఎంతయు శోచనీయము అని ఇందలి ప్రతీయమానార్థము.

వ్యా. ఇచట అత్యంత నింద్యచరిత్ర గల లుబ్ధరూప పదార్థాన్తరమును ప్రతీయమానముగ (ప్రతీతముకావలెనని) మనస్సులో నుంచుకొని అట్టి ప్రవృత్తి గల సముద్రము వాచ్యరూపమున ఉపక్రమింపబడినది. కావున (ఇచట) అప్రస్తుత ప్రశంసాలఙ్కారము యొక్క స్వరూపము ఇదియే. ఈ వాక్యము పర్యవసానముగ గర్హణీయ మగు ప్రతీయమాన పదార్థాన్తరమును బోధించునదే యైనను స్తుతిచే ప్రారంభించుటచే రమణీయముగ నిబంధింపబడి తద్విదాహ్లాదకారిగ నున్నది. ఈ విధముగ వాజ్యస్తుతి ప్రతిబింబము వలె నున్న మరియొక అలంకారము అప్రస్తుత ప్రశంసకు అలంకారముగ కూర్పబడినది.

వి. వాచ్య మగు నిందచే స్తుతి ప్రతీత మైనను, లేక వాచ్య మగు స్తుతిచే నింద ప్రతీయమాన మైనను వ్యాజస్తుత్యలంకారము.

"నిందయా వాచ్యయా యత్ర స్తుతి రేవావగమ్యతే
స్తుత్యా వా గమ్యతే నిన్దా వ్యాజస్తుతి రుదాహృతా॥.

అని దాని లక్షణము ఇచట ఆముఖమున సముద్రుని స్తుతించినట్లున్నను పర్యవసానమున తన్నిందయే గమ్యమాన మగుచున్నది గాన ఇది వ్యాజస్తుత్యలంకారము.

వ్యా. ఇచట (వ్యాజస్తుత్య ప్రస్తుత ప్రశంసల) సంకర మనుట యుక్తము కాదు. ఏలయన ఈ రెండు అలంకారములు వేరు వేరుగ అతిస్పష్టముగ భాసించు చున్నవి. ఈ రెండును సమప్రధానముగ లేవు. కావున సంసృష్టి కూడ కాదు. ఈ రెండును విభిన్న విషయములు గాన ఇవి వాచ్యాలంకారములు కూడ కావు.

వి. రెండు అలంకారములు ఒక శ్లోకమున అనుప్రవిష్టము లైనపుడు వాటి పరస్పరసంబంధమును బట్టి సంకరాలంకారము గాని, సంసృష్ట్యలంకారము గాని ఉండుటకు అవకాశ ముండును. రెండు అలంకారములకును అంగాంగి భావము (ఒక అలంకారము అంగి గాను రెండవది అంగము గాని ఉండుట), ఏకాశ్రయానుప్రవేశము (రెండుఅలంకారములును ఒకే విషయమును ఆశ్రయించు కొని యుండుట), సందేహము, (ఈ అలంకార మని చెప్పవలెనా, లేక ఆ అలంకార మని చెప్పవలెనా యని సందేహము) అను మూడు నిమిత్తములలో నేదైన ఒకటి ఉన్ననే సంకరాలంకారము చెప్ప వీలగును. ఇచట ఏదియును లేదు గాన సంకరము కాజాలదు. సంసృష్ట్యలంకారమున రెండు అలంకారములు పరస్పరనిరపేక్షములై సమప్రధానములై యుండును. ఇచట వ్యాజస్తుత్య ప్రస్తుత ప్రశంసలకు సమప్రాధాన్యము లేదు. అప్రస్తుతప్రశంస ప్రధానము; వ్యాజ్యస్తుతిఅప్రధానము. కావున సంసృష్టి అని కూడ చెప్పజాలము. ఈ రెండు అలంకారములలోను ఒకటి (వ్యాజస్తుతి) వాచ్యము, రెండవది (అప్రస్తుత ప్రశంస) ప్రతీయమానము. కావున ఈ రెండును వాచ్యాలంకారములే యని చెప్పవీలు లేదు. ఈ విధముగ ఇచట వ్యాజస్తుత్యలంకారము అప్రస్తుతప్రశంసా లంకారమునకు అలంకారముగ హారమునందు రత్నములను పొదిగి నట్లు కూర్ప బడియున్నదని భావము.

ఇంకను ఎట్లనగా—

నా మాప్యన్యతరోర్ని మీలితమభూత్ తత్తావదు న్మీలితం
ప్రస్థానే స్ఖలతః స్వ వర్త్మని విధేరన్యద్ గృహీతః కరః.
లోకశ్చాయ మదృష్టదర్శన కృతాద్దృగ్వైశ సాదుద్ధృతో
యుక్తం కాష్ఠిక లూనవాన్ యదసి తా మ్రాళిమా
మాకాలికీమ్॥ [భల్లట శతకము-86] 91

"ఓ! కాష్ఠచ్ఛేదకుడా! అకాల ఫలముల నిచ్చు ఆ ఆమ్రవృక్షపంక్తిని ఛేదించి మంచి పని చేసితివి. ఇతర వృక్షముల నామధేయము కూడ కప్పబడి యుండెను. (ఇప్పుడు) అది పైకి తీసికొని రాబడినది. మరియొక్క విషయ మేమనగా— తన మార్గమున నడుచు నపుడు తొట్రుపడిన (అనగా ఈ చూత వృక్షపంక్తియందు అకాలమున ఫలములను ఫలింపచేసి తన కర్తవ్యనిర్వహణ మున పొరపడిన) బ్రహ్మయొక్క హస్తము గ్రహింపబడినది. (అనగా అతని చేయి పట్టుకొని ఆతడు చేయుచున్న తప్పును సరిదిద్దినావు.) (ఈ అకాలమున) చూడబడని వస్తువు యొక్క దర్శనముచే కలిగెడు నేత్రబాధనుండి ఈ లోకము కూడ ఉద్ధరింపబడినది"

వి. సర్వదా పరోపకార నిరతుడగు ఒకనిని నిర్మూలించిన ఒక దుర్మా ర్గుని మనస్సులో నుంచుకొని వ్రాసిన శ్లోకమిది. ఇది పైకి స్తుతివలె కన్పించు నింద కావున వ్యాజస్తుతి. దీనిని ప్రతీయమాన మగు అప్రస్తుత ప్రశంసకు అలంకారముగ నుండుటకై కూర్చి యున్నాడు కవి.

వ్యా. ఇచట కూడ పూర్వోక్తమగు న్యాయమే అనుసంధింప తగినది.

ఇంకను ఎట్లనగా:-

కిం తారుణ్యతరోరియం రసభరోద్భిన్నా నవా వల్లరీ
లీలాప్రోచ్ఛలితస్య కిం లహరికా లావణ్య వారాంనిధేః.
ఉద్గాఢోత్కలికావతాం స్వసమయోపన్యాస విశ్రమ్భిణః
కిం సాక్షాదుపదేశయష్టి రథవా దేవస్య శృఙ్గారిణః 92

"ఈమె, తారుణ్యవృక్షము యొక్క రసభారముతో బయల్వెడలిన క్రొత్త లతయా? విలాసచే ఎగురుచున్న లావణ్య సముద్రము యొక్క చిరు తరంగమా? అత్యధిక మగు ఉత్కంఠ కలవారికి తన సిద్ధాంతములను బోధింప వలె ననెడు విశ్వాసము గల శృఙ్గారాధిష్ఠాన భూతు డగు దేవుని (మన్మథుని) ప్రత్యక్షముగ వచ్చుచున్న ఉపదేశయష్టియా— ఉపదేశమునకై ఉపయుక్త మగు మాయాదండమా—?"

వ్యా. ఇచట రూపక మనునది (ప్రధాన మగు) వాక్యాలంకారము. దానికి ఈ సందేహాలంకారము అపూర్వ మగు సౌందర్యాతిశయమును కూర్చుటకై

కూర్చబడినదై సహృదయ చమత్కార కారిగ నున్నది. (ఇచట సంకర సంసృష్ట్యాదులను అంగీకరింపరాదు ఇత్యాదిక మగు) మిగిలిన విషయమంతయు పూర్వోదాహరణద్వయమున చూపబడిన విధముగనే అనుసరింపదగినది.

అవ. ముప్పదియారు, ముప్పదియేడవ కారికలను వ్యాఖ్యానించు చున్నాడు—

వ్యా. ఇంకను ఎట్టిది? 'రత్న' ఇత్యాది శ్లోకద్వయము యుగ్మము. (ఏకాన్వయము కలది). యత్ర = దేనియందు "అలఙ్కారైః భ్రాజమానైః నిజాత్మనా "తమ జీవితముతో ప్రకాశించుచున్న అలఙ్కారములచే, "భూషాయై పరికల్ప్యతే" = శోభార్థమై అలంకరింపబడుచున్నదో; ఎట్లు? ఏ విధముగా, భూషణైః—కంకణాది భూషణములచే, ఎట్టిది? "రత్న రశ్మిచ్ఛటోత్సేక భాసురైః" = మణికాంతుల ఉల్లాసముచే ప్రకాశించుచున్నవి. ఏమిచేసి? "కాన్తా శరీర మాచ్ఛాద్య" = కామినీ శరీరమును తమ కాంతుల ప్రసారముచే కప్పబడిన దానినిగా చేసి, శోభకారకమై అలంకరింపబడునో ఆ విధముగనే, అలఙ్కారణైః = ఉపమాద్యలంకారములచే, ఎచట అలంకరింపబడునో. ఇవి శోభకారకమై అలంకరించుట యనునది ఏ మనగా—వీటిచే, "స్వశోభాతిశయాన్తఃస్థమ్" = తమ కాన్తియొక్క కామనీయకము నడుమ నున్న, అలంకార్యం = అలంకరింప బడ దగినది, ప్రకాశ్యతే = ప్రకాశింప చేయబడును. దీని తాత్పర్య మిది—ఇచట అలంకార మహిమ ఏ విధముగ నుండు ననగా—అత్యంతో ద్రిక్త మగు దాని (ఆ అలంకారముయొక్క) శోభాతిశయములో ఇమిడి ఉండియే, అలంకార్య మగు వస్తువు ప్రకాశించును.

వి. అనగా అలంకారములు అలంకార్య మగు రసాది వస్తువును పూర్తిగ కప్పివేయును అని యర్థము.

ఎట్లనగా:—

అర్థ్యస్యాజిమహోత్సవ వ్యతికరేనాసం విభక్తోఽత్ర వః
కశ్చిత్ క్వాప్యవశిష్యతే త్యజత రే నక్తఞ్చరాః సంభ్రమమ్,
భూయిష్ఠేష్వపి కా భవత్సు గణనాత్యర్థం కియత్తామ్యతే
తప్త్ర్యోదారభుజోష్మణోఽనవసితా నాచారసమ్పృత్తయః॥ 98

అవ. రాముడు యుద్ధము చేయుచుండగా ఒక్కుమ్మడి వచ్చి పడుచున్న అసంఖ్యాకు లగు రాక్షసులను చూచి లక్ష్మణుడు పల్కిన మాట లివి.

"అన్నగారు చేయుచున్న ఈ యుద్ధమహోత్సవ సందర్భమున మీలో ఏ ఒక్కడును తన పాలు పొందనివాడు, ఎక్కడను ఉండడు. ఓరీ! రాత్రించరులారా! తొందరపడకుడు. మీరు ఎందరు ఉన్న నేమి? ఇద్ది ఒక లెక్కయా? ఎందు కీ విధముగ తొందరపాటు? ఉదార మగు భుజశక్తి గల ఆతని ఆచార సంపదలు (కార్యనిర్వహణ సంపదలు) అంతము లేనివి."

వి. మన మసంఖ్యాకులముగ నున్నాము రాము డొక్కడే యున్నాడు. అతనితో యుద్ధము చేయ నవకాశము మనకు లభించునో లభించదో యని మీలో ఏ ఒక్కరును సందేహింప బనిలేదు. అన్నగారు మీలో ఒక్కొక్కరిని గూడ చక్కబెట్టగలరు. అని యభిప్రాయము.

వ్యా. ఇచట "అన్నగారు తమ శౌర్యముచే మిమ్ముల నందరను సంహరింప గలరు." అను అలంకార్య మగు అర్థము పూర్తిగ (రూపక) అలంకార శోభాతి శయమునం దంతర్గతమై ప్రకాశించు విధముగ, యుద్ధమే ఒక మహోత్సవ వ్యతికరము అనెడు రూపణము చేయబడినది. మీలో సామాన్యు డైనను, ఎచటనో దూర ప్రదేశము నందున్న వాడైనను, ఏ ఒక్కడును గూడ తన పాలు పొందని వాడు మిగలడు కావున సమర మహోత్సవమున మీ మీ భాగములకై అత్యాసక్తితో తొందరపాటును విడువుడు. సంఖ్యలో మేము అత్యధికముగ నున్నాము కదా! కావున (ఎల్లరికిని వారి వారి భాగములను పంచిపెట్టుట యనునది) చేయ శక్యము కాని పని యని అనుకొనుచున్నారు కాబోలును! అట్లు అనుకొనుట అయుక్తము. ఏలయన–అసంఖ్యాకులకు భాగముల నిచ్చుట అశక్యము అనుటకు సమృద్ధి లేక పోవుట, (సమృద్ధి యున్నను) లుబ్ధత్వము అను రెండు కారణము లుండవచ్చును. ఈ ఉభయము కూడ (రాముని యందు) లేదు అని "తస్యోదార భుజోష్మణోఽనవసితా నాచార సమ్పత్తయః" అను వాక్యము, ('ఉదారభుజ', 'సంపత్తయః', 'న అవసితాః' ఇత్యాది పదముల ద్వారా) చెప్పుచున్నది.

ఇంకను ఎట్లనగా—

"కతమః ప్రవిజృంభిత విరహవ్యథః శూన్యతాం నీతో దేశః"

94 (హర్ష చ. 1-40-41)

"మిక్కిలి విజృంభించిన విరహ వ్యథ గల ఏ దేశము శూన్యముగ చేయబడినది"—

ఇంకను ఎట్లనగా—

"కాని చ పుణ్యభాఞ్జి భజన్త్యభిఖ్యా మక్షరాణి"

(హర్ష చ· I 40-41)

"పుణ్యవంతము లగు ఏ అక్షరములు నామధేయమును సేవించు చున్నవి?"

ఇచట "ఎక్కడ నుండి వచ్చినారు?" "ఈతని పేరేమి?" అను అలంకార్య మగు అర్థము అప్రస్తుత ప్రశంసారూప మగు అలంకారము యొక్క కాంతిచే పూయబడి, దాని శోభలో అంతర్గత మగుటచే సహృదయ హృదయాహ్లాదకారి యగునట్లు చేయబడినది. ఇది 'వ్యాజస్తుతి', 'పర్యాయోక్తము' మొదలగు వాటి విషయమున అధికముగ కాన నగును (అనగా వ్యాజస్తుత్యాద్యలఙ్కారము లున్న స్థలములలో ముఖ్యార్థము ఆ యలంకారముల సౌందర్యముచే తిరోహిత మయినట్లు కనబడును).

(శంక) రూపకాద్యలంకారముల స్వరూపము వాటి లక్షణములను చెప్పు సమయముననే నిర్ణయింపబడగలదు కావున వాటిని ఇచట ఉదాహరించుట ఎందులకు? (సమాధానము)· ఇది సత్యమే; కాని విచిత్ర మార్గములో నున్న వైచిత్ర్య మేమనగా—(ఇందు) అలౌకిక శోభాతిశయముతో కూడిన అలంకారముల కూర్పు ఒకానొక వాక్య వక్రత్వమును వికసింపచేయును. (ఈ విషయమును నిరూపించుటకే ఇచట కొంత వరకు వాటి స్వరూపము చూపబడినది. విస్తృతముగ వాటి స్థానమున నిరూపింపబడగలదు అని యర్థము). 37

అవ. "యదప్య నూతనోల్లేఖం" ఇత్యాది (౩౮వ) కారికచే ఆ విచిత్ర మార్గమునకే రూపాంతరముచే లక్షణము చెప్పుచున్నాడు—

వ్యా. అనూతనోల్లేఖం = అనూతనముగనే (అనగా ప్రాచీనరూపము తోడనే) వర్ణింపబడిన ఏ, వస్తు = వాచ్యము కలదో, అదికూడ, యత్ర = దేని యందు, అలం = అత్యంతము; కామపి కాష్ఠాం నీయతే = లోకోత్తరాతిశయ కోటిని అధిష్ఠింప చేయబడునో, ఎట్లు? 'ఉక్తి వైచిత్ర్య మాత్రేణ' = కేవలము చెప్పుటలో చాతుర్యము చేత నని యర్థము. ఎట్లనగా—

అణ్ణం లడహత్తణఅం అణ్ణం చ్చిఅ కాఇ వత్తణచ్ఛాఆ
సామా సామణ్ణప అవఇణో రేహచ్చిఅ ణ హోఇ॥ 96
అన్యల్లభటత్వ మన్యైవ కాపివర్తనచ్ఛాయా
శ్యామా సామాన్యప్రజాపతే రేఖైవ చ న భవతి. ఇతి ఛాయా.

(గాథా సప్తశతి 969)

''ఆ సౌకుమార్యమే వేరు; ఆ శరీర కాంతియే వేరు. ఆ శ్యామ (నవ యౌవనవతి యగు లలన) సామాన్యు డగు బ్రహ్మయొక్క సృష్టియే కాజాలదు."

ఇంకను ఎట్లనగా—

ఉద్దేశోఽయం సరస కదళీ శ్రేణిశోభాతిశాయీ
కుఞ్జోత్కర్షాఙ్కురితరమణీ (హరిణీ) విభ్రమో నర్మదాయాః.
కిఞ్చైతస్మిన్ సురత సుహృద స్తన్వి తే వాన్తి వాతా
యేషామగ్రే సరతి కలితాకాణ్డకోపో మనోభూః। 97

"ఈ నర్మదాతీర ప్రాంతము సరసము లగు కదళీ వృక్షముల శ్రేణి యొక్క శోభచే సర్వాతిశాయిగ నున్నది, పొదరిండ్ల ఉత్కర్షచే అంకురించిన హరిణీ (రమణీ) విలాసములు కలది. మరియు, ఓ తన్వీ ఇచట సురతమున సహాయకారులుగ నుండు అట్టి వాయువులు వీచుచున్నవి; వేటి ఎదుట అసమయ మున ప్రకోపించిన మన్మథుడు నడుచు చున్నాడో."

వ్యా. ఇచట ఉక్తి వైచిత్ర్యము మాత్రమే కావ్యార్థము; అంతియే కాని నూతనోల్లేఖముతో గూడిన వాచ్యము యొక్క విజృంభణ మేదియును లేదు,

ఇట్టి ఉక్తి వైచిత్ర్యము సహస్ర విధముల నుండవచ్చును గాన స్వయముగనే ఊహించుకొనవలయును.

"యత్రాన్యథా" ఇత్యాది (౩౨వ) కారికచే మరల వైచిత్ర్యమునే విశదీకరించుచున్నాడు—

యత్ర = ఏ విచిత్ర మార్గమునందు, అన్యథాభవత్. మరియొక ప్రకారమున నున్న, సకల పదార్థజాతము కూడ, అన్యథైవ=మరియొక ప్రకారముననే ఊహింపబడునో, ఎట్లు? యథారుచి=తన ప్రతిభాస్ఫూర్తికి అనురూపమైన ప్రకారమున ఉత్పన్నమగును. దేనిచేత? "ప్రతిభోల్లేఖ మహత్త్వేన మహాకవేః,"=సత్కవియొక్క ప్రతిభాస్ఫూర్తి వికాసము యొక్క అతిశయముచేత. అది ఎట్లనగా-కవి ప్రస్తావాను గుణముగా, వర్ణ్యమాన మగు వస్తువునకు సహృదయాహ్లాద జనక మగు ఒకానొక రూపాంతరమును కల్పించుచుండును. ఎట్లనగా—

తాపః స్వాత్మని సంశ్రితద్రుమలతా శోషోఽధ్వగైర్వర్జనం
సఖ్యం దుఃశమయా తృషా తవ మరో కోఽసావనర్థో నయః.
ఏకోఽర్థస్తు మహానయం జలలవ స్వామ్యస్మయోద్గర్జినః,
సన్నహ్యన్తి న యత్తవోపకృతయే, ధారాధరాః ప్రాకృతాః॥ 98

"తనయందు తాపము! ఆశ్రయించిన వృక్షములను లతలను శోషింపచేయుట! పాంథులచే దూరముగా వర్జింపబడుట! తీర్పరాని దాహముతో స్నేహము! ఓ! మరుస్థలమా! నీవద్ద నున్న గుణములలో అనర్థకరము కానిది ఏది ఉన్నది? కాని ఇది మాత్రము ఒక సుగుణము: అది యేదనగా-కొంచెము జలమునకు ఆధిపత్యము లభింపగనే గర్వముచే గర్జించు సామాన్య మేఘములు నీకు ఉపకారము చేయుటకై ప్రయత్నింపవు". 98

వి. కొంచెము ఐశ్వర్యము చేరగనే మిడిసి పడెడు వారినుండి సహాయమును పొంది సుఖమయ జీవితమును గడుపుటకంటె, తాను, తన ఆశ్రితులును దుఃఖమును సహించుటయే ఆత్మాభిమాన వంతులకు శ్లాఘ్యము అని ఈ అన్యోక్తి యందలి భావము.

వ్యా. ఇంకను ఎట్లనగా—

"విశతి యది నో కశ్చిత్ కాలం కిలామ్బునిధిం విధేః
కృతిషు సకలాస్వేకో లోకే ప్రకాశకతాం గతః.
కథమితరథా ధామ్నాం ధాతా తమాంసి నిశాకరం
స్ఫురదిదమియత్తారాచక్రం ప్రకాశయతి స్ఫుటమ్" 99

"బ్రహ్మ సృజించిన పదార్థములలో ఏ సూర్యుడు లోకమును ప్రకాశింప చేయు ఏకైక వ్యక్తియో, కాంతులకు నిలయభూతు డగు అట్టి సూర్యుడు కొంత కాలము సముద్రమును ప్రవేశింపకపోయినచో, తమస్సులను, చంద్రుని, ప్రకాశించుచున్న ఈ నక్షత్ర చక్రమును, స్పష్టముగ ఎట్లు ప్రకాశింపచేయ గలడు?"

వి. సూర్యు డప్పుడప్పుడు సముద్రమున ప్రవేశించి అస్తమించకున్నచో ఈ లోకమున తమస్సు, చంద్రుడు, నక్షత్రములు మొదలగు పదార్థము లున్నట్లు తెలియుట ఎట్లు? అని దీని భావము.

వ్యా. ఇచట కవి తన ప్రతిభచే జగద్గర్హిత మగు మరుభూమిని గూడ లోకోత్తర మగు ఔదార్యము విషయమున అగ్రస్థానముపై నిల్పి ప్రతీయ మాన ప్రవృత్తి గల (ప్రతీయ మాను డగు) ఒకానొక ఉదార చరితుని స్వరూపము వంటి స్వరూపమును వికసింపచేసినాడు. యథోచిత మగు స్వభావముచే సుందరము లగు వేలకొలది పదార్థము లున్నను అదియే (ఆ ఔదార్యమే) ప్రధానముగ చెప్పుకొన దగినదిగ నుండు నని తాత్పర్యము.

(ఈ శ్లోకము) అవయవార్థ మేమనగా—దాహమునకు 'తీవ్రరానిది' అను విశేషణము చేర్పుటచే ప్రతీయ మానునకు (ఉదార పురుషునకు) త్రైలోక్య రాజ్యాధి పత్యము లభించినను, సంతృప్తి యండ దని పర్యవసించును. ఆతనికి ఔదార్య మున్నను, ఆతడు తగు దానమును చేయజాలకుండుటచే యాచకులు సిగ్గు పడుచున్నవారు వలె తమంతట తామే ఆతని వద్దకు వెళ్లుట లేదు. అను విషయము, 'అధ్వగైర్వర్జనమ్' అనుదానిచే (సూచిత మగుచున్నది). ఆతనిని ఆశ్రయించుకొనియున్న వారు అట్టి కష్టసమయమునందు గూడ (తదేక సేవా

నిరతులై) ఆతనిపై మాత్రమే ఆధారపడి యున్నా రను విషయము "సంశ్రిత ద్రుమలతాశోషః" అను దానిచే సూచిత మగుచున్నది. ఆతనికి గూడ వెనుక చెప్పిన తన పరివారమును సంతోష పెట్టజాలక పోవుటచే తనలో తాపముగాని, స్వల్ప భోగలాలసచే కాదని కూడ తెలియుచున్నది. అట్టి కష్టసమయమునందు గూడ పరోపకారమును గ్రహింపకుండుటచే, శ్లాఘనీయత్వము ఉత్తరార్ధమున ప్రతిపాదింపబడినది.

రెండవ శ్లోకములో కూడ-తన ఉదయముచే స్వపరపక్షము వారి నందరిని కప్పివేయు సూర్యుడు, "నీవు సకల పదార్థములను ప్రకాశింపచేయ వలయును," అని బ్రహ్మ చేసిన నియమము యొక్క అంగీకారమును నిర్వహించుకొనుటకై, విధి విహిత మగు సముచిత సమయమున సంభవించు సముద్ర మజ్జనమును స్వయముగనే చేయుచుండును. అట్లు చేయకున్నచో, చంద్రుడును తమస్సు నక్షత్రములు మొదలగునవి ఏనాటికిని కొంచెము కూడ అభివ్యక్తములు కాకుండెడివి — అని కవి చేసిన ఈ క్రొత్త వర్ణనము ప్రతీయ మాన మగు మహత్త్వము గల వ్యక్తిని సూచించున దగుటచే చమత్కార జనకముగ నున్నది.

విచిత్ర మార్గమునే (40వ కారికలో) మరి యొక ప్రకారముచే వివరించు చున్నాడు—

యత్ర = దేనియందు; ప్రతీయ మానతా = గమ్య మానత్వము, వాక్యార్థస్య = ముఖ్యముగా చెప్ప నభిలషిత మైనదియు, కాని చెప్ప శక్యము కానిదియు, అగు ఒకానొక వస్తువునకు, నిబంధింపబడునో, ఏ యుక్తి (వృత్తి) చేతః వాచ్యవాచక వృత్తిభ్యాం = శబ్దార్థ శక్తులచేత, వ్యతిరిక్తస్య, వాటికంటె భిన్న మగు వృత్తికల, అనగా—వ్యంగ్య మగు భిన్న వాక్యార్థము యొక్క, అభివ్యక్తి చేయబడునో, ఇచట 'వృత్తి' శబ్దము, శబ్దార్థములకు గల ఆ వాక్యార్థమును, ప్రకాశింపచేయు శక్తిని బోధించును. ఈ 'ప్రతీయమానము' అనెడు వ్యవహారము వాక్య వక్రతా వ్యాఖ్యాన సమయమున బాగుగ వివరింపబడ గలదు. వెనుకనే చెప్పిన ('తాపః స్వాత్మని,' 'విశతి యదినో' అను) ఉదాహరణద్వయమునే ఇచట ఉదాహరణముగ కూర్చుకొనవలెను.

ఇంకను ఎట్లనగా—

వక్త్రేన్దోర్న హరన్తి బాష్పపయసాం ధారా మనోజ్ఞాం శ్రియం
నిశ్వాసా న కదర్థయన్తి మధురాం బిమ్బాధరస్య ద్యుతిమ్.
తస్యాస్త్వద్విరహే విపక్వలవలీ లావణ్యసంవాదినీ
ఛాయా వాపి కపోలయోరనుదినం తన్వ్యాః పరం పుష్యతి॥ 100

"నీ విరహమునందు బాష్పోదకముల ధారలు ఆ తన్వియొక్క ముఖ చంద్రుని మనోహర మగు శోభను హరించుటలేదు. నిట్టూర్పులు బింబాధరము యొక్క కాంతిని పాడుచేయుటలేదు. కాని ఆమె చెక్కిళ్ళయందు పండిన లవలీ పత్రముల లావణ్యముతో సమాన మగు ఒకానొక కాంతి ప్రతిదినమునందును పెరుగుచున్నది".

వ్యా. ఇచట- "నీయొక్క విరహముచే కలిగిన దుఃఖమును కప్పిపుచ్చు కొనుటకై శ్రమపడుచు అట్టి గొప్ప కష్టస్థితిలో నున్న ఆమెకు— వేయేల?— కన్నీటిని నిట్టూర్పును విడచుటకు అవకాశము కూడ లభించుట లేదు. కాని ఆమె కపోలములపై పండిన లవలీపత్రముల లావణ్యముతో తుల్య మగుటచే సుందర మగు, కప్పిపుచ్చుకొనుటకు శక్యము గాని ఒకానొక కాంతి మాత్రము రోజురోజునకును ఎక్కువ పెరుగుచున్నది". అను వాచ్యముకంటె భిన్న మగు వృత్తి గల దూత్యుక్తియొక్క తాత్పర్యము ప్రతీత మగుచున్నది. పై విధ మగు కాంతి కలదై యున్నది అని చెప్పుట కూడ కాంతునికి ఉత్కంఠ కలుగుటకు కారణ మగును. (కాంతునికి తత్సంగమోత్కంఠ కలుగుటకై పై విధ మగు కాంతి యున్నట్లు వర్ణింపబడినదని యర్థము). 40

వ్యా. 'స్వభావ' ఇత్యాది (41) కారికచే ఆ విచిత్రమార్గస్వరూపమునే మరి యొక విధముగ (విశదీకరించు) ప్రతిపాదించుచున్నాడు-

యత్ర = దేనియందు, భావానాం = పదార్థముల, స్వభావః = స్వభావము, సరసాకూతః = రసనిర్భర మైన అభిప్రాయము కలదిగా' నిబధ్యతే = కూర్చ బడునో, ఎట్టిది? "కేనాపి కమనీయేన వైచిత్ర్యేణోపబృంహితః" = లోకోత్తర మును, మనోహరమును అగు నేర్పుచే ఉత్తేజిత మైనది. ఇచట భావశబ్దమునకు పదార్థము అని యర్థము; రత్యాదిభావము అని మాత్రమే కాదు. ఉదాహరణము-

"క్రీడాసు బాలకుసుమాయుధసఙ్గతాయా
య_త్తత్ స్మితం న ఖలు తత్ స్మితమాత్రమేవ.
ఆలోక్యతే స్మితపటా_న్తరితం మృగాక్ష్యా
స్త_స్యాః పరిస్ఫురదివాపరమేవ కిఞ్చిత్". 101

"బాలమన్మథునితో కూడిన (అనగా వయఃసంధియందు నూతనకామ వికారము లావహించిన) ఆమె క్రీడలలో (నన్ను చూచి) చిరునవ్వు నవ్వినదనగా అది చిరునవ్వు మాత్రమే కాదు. ఆ మృగాక్షియొక్క చిరునగవు తెరల మాటున దాగిన మరియొక చేదియో కాననగుచున్నది".

ఇచట పూర్వార్ధమున 'న ఖలు తత్ స్మితమాత్రమేవ' అను వాక్యము అభిలాషతో సుందర మగు సరసాభిప్రాయత్వమును చెప్పుచున్నది. ఉత్తరార్ధమున "చిరునగవు తెరల వెనుక దాగినది మరి యేదియో కదలు చున్నట్లు కాన వచ్చుచున్నది" అని చెప్పుటలో సుందర మగు వైచిత్ర్యశోభ అభివ్యక్త మగు చున్నది. 41

ఇపుడు "విచిత్రోయత్ర" ఇత్యాదిశ్లోకమున (42) విచిత్రమార్గనిరూపణమును ఉపసంహరించుచున్నాడు.-

విచిత్రమార్గము ఈ విధ మైనది. యత్ర = దేనియందు; వక్రోక్తి వైచిత్ర్యం = అలంకారముల వైచిత్ర్యము, జీవితాయతే = జీవితమువలె నుండునో. ఈ (వక్రోక్తి) వైచిత్ర్యమును బట్టియే విచిత్రమార్గమునకు (ఆ పేరు) 'విచిత్రము' అను పేరు వచ్చినది. కావున అదియే దానికి జీవితము. ఈ వైచిత్ర్య మనునది ఏది అని చెప్పుచున్నాడు-"పరిస్ఫురతి యస్యా_న్తఃసాకాప్యతిశయాభిధా" దేనియొక్క, అంతః=లోపల, అనగా దేని స్వరూపములో ఇమిడిపోవుటచే ఆ ఒకానొక అలౌకిక మగు అతిశయోక్తి ప్రకాశించునో, (దేని స్వరూపములో నంతర్గతమై అపూర్వ మగు అతిశయోక్తి ప్రకాశించునో అది వైచిత్ర్యము అని యర్థము). ఎట్లనగా-

"యత్సేనాజసారముదఞ్చతి చయే ద్వాభ్యాం దవీయో_న్తరాన్
పాణిభ్యాం యుగపద్విలోచనపుటానష్టౌ తమో రక్షితుమ్.

పశ్చైకం దలమున్నమయ్య గమయన్ వాసాంబుజం కోశతాం
ధాతా సంవరణాకులశ్చిరమభూత్ స్వాధ్యాయబద్ధాననః"

"ఈ రాజుయొక్క సేనాపరాగసంఘాతము పైకి ఎగయునపుడు బ్రహ్మ దూరదూరముగా నున్న ఎనిమిది నేత్రములను రెండు చేతులతో ఒక్కమారుగ కప్పికొనజాలక ఒక్కొక్కదళమును ఎత్తి తన నివాసస్థాన మగు (అష్టదళ) పద్మమును మొగ్గగా చేయుచు, కప్పికొనుటకు అవస్థ పడుచు చాలకాలము స్వాధ్యాయమునుండి విరమించిన ముఖములు కలవా డయ్యెను". 102

వి. ఇచట- "బ్రహ్మ తన నేత్రములను సంరక్షించుకొనుటకై కమల దళములను ముకుళితవింప చేసెనా ?" అని ఊహించుటచే (సంభావనచే) ఉత్ప్రేక్షాలంకారము. కాని ఇవాదిశబ్దముల ప్రయోగము లేకుండుటచేనిది గమ్యోత్ప్రేక్ష. ఈ విషయమునే చెప్పుచున్నాడు.

వ్యా సంభావనను అనుసరించి ప్రవర్తించు ఉత్ప్రేక్ష ఈ విధముగ ప్రతీయమాన మగుటయే ఇందలి వైచిత్ర్యము. ఇది కూడ (రజస్సుయొక్క స్వర్గ) అధిరోహణరామణీయకముచే అతిశయోక్తివిలాసస్పందిగ కనబడు చున్నది.

వి. అనగా రజస్సు బ్రహ్మలోకము వరకును పైకెగసినది అని చెప్పుటలో గల అతిశయోక్తిచే ఉత్ప్రేక్షావైచిత్ర్యము ద్విగుణీకృత మైన దని యభిప్రాయము 42

అవ. సుకుమారమార్గమునందు వలె విచిత్రమార్గమునందు గూడ— మాధుర్య— ప్రసాద— లావణ్య— అభిజాత్యము— లనెడు నాలుగు గుణము లుండును. వాటి లక్షణములు మాత్రము భిన్నముగనుండును. వాటిని చెప్పుచున్నాడు.

వ్యా. ఈ విధముగ వైచిత్ర్యమును వ్యాఖ్యానించి దానికి సంబంధించిన గుణములను వివరించుచున్నాడు-

కా. వైదగ్ధ్యస్యన్దిమాధుర్యం పదానామత్ర బధ్యతే
యాతి యత్త్యక్తశైథిల్యం బన్ధబన్ధురతాంగతామ్. 44

"ఏది శైథిల్యమును త్యజించి బంధసౌందర్యమునకు అంగముగ (పోషకముగ) నుండునో అట్టి, వైదగ్ధ్యమును స్రవించెడు పదముల మాధుర్యము, ఈ మార్గమున కూర్పబడును". 44

వ్యా. అత్ర = ఈ మార్గమునందు, మాధుర్యము, వైదగ్ధ్యస్యన్ది = వైచిత్ర్యమును కల్పించునట్టిది, పదానాం = వాక్యావయవము లగు పదములకు, బధ్యతే = కూర్పబడును. ఏది - త్యక్తశైథిల్యమ్ = విడువబడిన కోమలత్వము కలదై, బన్ధబన్ధురతాంగతాం యాతి = సన్నివేశసౌందర్యమునకు ఉపకరణముగ అగునో — ఎట్లనగా —

"కింతారుణ్యతరోః" అను పూర్వోదాహృతశ్లోకముయొక్క (92 వ ఉదాహరణము) పూర్వార్ధమునందు వలె.

ఈ విధముగ మాధుర్యమును చెప్పి ప్రసాదమును నిరూపించుచున్నాడు:

కా. అసమస్తపదన్యాసః ప్రసిద్ధః కవివర్త్మని
కిఞ్చిదోజః స్పృశన్ ప్రాయః ప్రసాదోఽప్యత్ర దృశ్యతే. 45

"సమసింపని పదముల విన్యాసము కలదియు, కొంచెము ఓజస్సును స్పృశించు నదియు, కవిమార్గమున ప్రసిద్ధ మైనదియు నగు ప్రసాదము గూడ తరచుగ ఇచట (ఈ మార్గమున] కానవచ్చుచున్నది". 45

అసమస్తానాం = సమాసరహితములగుపదముల, న్యాసః కూర్పు, కవివర్త్మని = పండితులమార్గమునందు, ఏది, ప్రసిద్ధః = ప్రఖ్యాత మైనదో, అట్టి ప్రసాద మనెడు గుణము గూడ, అస్మిన్ = ఈ విచిత్రమను పేరు గల మార్గమున, కించిత్ = కొంచెము, ఓజః స్పృశన్ = ఓజస్సునుస్పృశించుచు, (అనగా) దీర్ఘీకృతము వలె నున్నదై, ప్రాయః దృశ్యతే = సాధారణముగ చూడబడుచున్నది. ఏలయన — అట్టి ఓజస్సు బంధసౌందర్యమును కలిగించును. సమాసములతో కూడిన వృత్తి ఓజస్సు అని (వామనాది) ప్రాచీనాలంకారికులు చెప్పియున్నారు. కావున ఇందలి పరమార్థ మిది —

వెనుకటి ("అక్లేశవ్యంజితాకూతమ్" ఇత్యాది 31 వ కారికలో చెప్పిన) ప్రసాదలక్షణము అటుండగా (ఇచట) ఓజఃస్పర్శమాత్రము (క్రొత్తగ) విధింప

బడుచున్నది. (సుకుమారమార్గమున కుపయుక్త మగు ప్రసాదగుణమునకే కొంచెము ఓజఃస్పర్శ యున్నచో అది విచిత్రమార్గమున కుపయుక్తమగునని యభిప్రాయము). ఎట్లనగా-

'అపాంగగతతారకాః స్తిమితపక్ష్మపాలీభృతః
స్ఫురత్సుభగకాన్తయః స్మితసముద్గతి ద్యోతితాః.
విలాసభరమన్థరాస్తరలకల్పితైకభ్రువో
జయన్తి రమణార్పితాః సమద సున్దరీదృష్టయః' 104

"నేత్రాంతములు చేరిన నల్లగ్రుడ్డు కలవియు, అచంచల మగు కనురెప్పలు కలవియు, ప్రకాశించుచున్న అందమైన కాంతులు కలవియు, స్మితోద్గమనముచే మెరయుచున్నవియు, విలాసభారముచే మందమైనవియు, ఋజువుగ నుండునట్లు చేయబడిన ఒక కనుబొమ్మ కలవియు, ప్రియునియందు ప్రసరింపచేయబడినవియు నగు, మదవతి యైన సుందరియొక్క చూపులు సర్వోత్కృష్టముగ నున్నవి. 104. 45

ప్రసాదగుణమునే మరియొక విధముగ గూడ విశదీకరించుచున్నాడు-

కా. గమకాని నిబధ్యన్తే వాక్యే వాక్యాఽన్తరాణ్యపి
పదానీవాత్ర కోఽప్యేష ప్రసాదస్యాపరః క్రమః 46

"ఒక వాక్యమునందు అన్వితార్థబోధకము లగు వాక్యాన్తరములు, పదములువలె, కూర్పబడుచుండును. ఇది ప్రసాదముయొక్క అపూర్వ మగు మరియొక ప్రకారము". 46

వ్యా. అత్ర = ఈవిచిత్రమార్గమునందు, ఏ వాక్యం = పదసముదాయము కలదో, దానియందు, గమకాని = అర్థసమర్పకము లగు, అన్యాని = ఇతరవాక్యములు, నిబధ్యన్తే = కూర్పబడుచు, ఎట్లు ? పదానీవ = పదములువలె, పదములువలె పరస్పరాన్వితములు అని యర్థము. ఇది, కోఽపి = అపూర్వమైన, ప్రసాదముయొక్క మరియొక, క్రమః = బన్ధచ్ఛాయాపద్ధతి. ఎట్లనగా—'నామాప్యన్యతరోః' అనునది (వెనుక 91 వ ఉదాహరణముగ చూపిన శ్లోకము)

వి. ఈ శ్లోకమున మహావాక్యార్థసమర్పకములును, పరస్పరాన్వితములును, అగు ఐదు వాక్యము లున్నవి గాన ఇది ప్రసాదమునకు ఉదాహరణము, అని యభిప్రాయము.

వ్యా. ప్రసాదమును నిర్వచించి, లావణ్యలక్షణము తెలుపుచున్నాడు-

కా. అత్రాలుప్తవిసర్గాన్తైః పదైః ప్రోతైః పరస్పరమ్
హ్రస్వైః సంయోగపూర్వైశ్చ లావణ్యమతిరిచ్యతే. 47

"ఇందు (ఈ విచిత్రమార్గమున) అంతమునందలి విసర్గములు లోపింపనివియు, ఒకదానితో నొకటి దగ్గరగా కలసి యున్నవియు నగు పదముల చేతను, సంయోగము (సంయుక్తాక్షరముకంటె) పూర్వమునందుండు హ్రస్వముల చేతను లావణ్యము అధిక మగును". 47

వ్యా. అత్ర = ఈ మార్గమునందు, ఈవిధములగు పదములచే లావణ్యము, అతిరిచ్యతే = పరిపుష్టినిపొందును. ఎట్టివి ? పరస్పరం = పరస్పరము, ప్రోతైః = సంశ్లేషమును (కలయికను) పొందింపబడినవి. ఇంకను ఎట్టివి ? "అలుప్త విసర్గాన్తైః— అలుప్తవిసర్గాః = వినబడుచున్న విసర్గలుకల, అంతములు వేటికో అట్టివి, హ్రస్వైశ్చ = లఘ్వక్షరములతో, సంయోగముకంటె పూర్వమునం దున్న వాటితో, 'అతిరిచ్యతే' అనుదానితో సంబంధము. దీని తాత్పర్య మేమనగా- వెనుక 'వర్ణవిన్యాస' ఇత్యాది (౩౨ వ కారికలో) లావణ్యలక్షణము చెప్పబడినది. అది అట్లుండగా ఇది కూడ ఉన్నచో (ఈ కారికలలోచెప్పిన విశేషముకూడ కలసినచో) దానికొక వైశిష్ట్యము లభించును.

ఎట్లనగా-

'శ్వాసోత్కమ్పతరఙ్గిణి స్తనతటే ధౌతాఞ్జనశ్యామలాః
కీర్యన్తే కణశః కృశాఙ్గి కిమమీ బాష్పామ్భసాం బిన్దవః.
కిం చాకుంచితకంఠరోధకుటిలాః కర్ణామృతస్యన్దినో
హుంకారాః కలపంచమప్రణయినస్త్రుట్యన్తి నిర్యాన్తి చ
106

"శ్వాసముచే కలిగిన ఉత్కంపము (పైకిఎగయుట) చే తరంగిత మగు స్తనతటమునందు, ఓ కృశాంగీ! కడిగివేయబడిన అంజనము కలవగుటచే నల్లనైన

ఈ బాష్పజలబిందువులు కణరూపమున ఏల చిమ్మబడుచున్నవి? మరియు, వంచబడిన కంఠమునందు అడ్డుకొనుటచే కుటిలము లైనవియును, చెవులలో అమృతమును స్రవించు నవియును, మధుర మగు పంచమస్వరముతో సమాన మైనవియును అగు హుంకారములు (ఎక్కిళ్ళు) ఏల బయల్వెడలుచు ఆగిపోవుచున్నవి ?" 106

(ఈ శ్లోకము ప్రథమపాదములోని భాగము వెనుక 46 వ ఉదాహరణముగ చూపబడియున్నది).

ఇంకను ఎట్లనగా—

ఏతన్మంద విపక్వతిన్దుకఫలశ్యామోదరాపాణ్డుర
ప్రాన్తం హన్త పులిన్దసున్దర కర స్పర్శక్షమం లక్ష్యతే.
తత్ పల్లీపతి పుత్రి కుఞ్జరకులం కుమ్భాభ యాభ్యర్థనా
దీనం త్వా మనునాథతే కుచయుగం పత్రాంశుకై ర్మా పిధాః. 107

"ఓ పల్లీనాయకుని పుత్రీ ! కొంచెము ముదిరిన తిందుకఫలమువలె నల్లనైన మధ్యభాగమును, తెల్లనైన ప్రాంతభాగమును గల ఈ కుచయుగము పులిన్దసున్దరుని కరస్పర్శకు అనుకూలం మైనదిగ కానవచ్చుచున్నది. దీనిని పత్రవస్త్రములతో కప్పివేయకుము. (దీనికిగల) కుంభస్థలసాదృశ్యముచే, కుంజరముల సమూహము నిన్ను ప్రార్థించుచున్నది".

వి. నీవు కుచయుగము నాచ్ఛాదింపకున్నచో తత్స్పర్శాసక్తుడై గాని, ఏనుగుల కుంభములు నీకుచముల వలె నున్నవి కదాయని గాని పులిందసుందరుడు వేటాడుట మానివేయును. అవుడు ఏనుగులకు క్షేమము కలుగును. అందుచే ఏనుగులు నిన్ను ప్రార్థించుచున్నవి అని భావము.

వ్యా. ఇంకను ఎట్లనగా—

"హంసానాం నినదేషు" ఇత్యాది పూర్వోదాహృత పద్యమున— (79 వ ఉదా)

వి. ఇచట మొదటి శ్లోకము ప్రధానముగ 'శ్యామలాః', 'కణశః', 'బిందవః', 'కుంటిలాః', 'హుంకారాః', ఇత్యాదులలో విసర్గలోపములేకుండుటకు ఉదాహరణము. రెండవ శ్లోకము సంయోగపూర్వక లఘువులకు ఉదాహరణము. మూడవది ఉభయమునకును ఉదాహరణము.

వ్యా. ఈ విధముగ లావణ్యమును చెప్పిన పిమ్మట ఆభిజాత్యము నిరూపింపబడుచున్నది-

కా. యన్నాతికోమలచ్ఛాయం నాతికాఠిన్యముద్వహత్
ఆభిజాత్యం మనోహారి తదత్ర ప్రౌఢినిర్మితమ్. 48

"ఇచట ఏది అతికోమలచ్ఛాయ కలది కాదో, అతికాఠిన్యమును గూడ వహింపదో, అట్టి ఆభిజాత్యము కవికౌశలముచే నిర్మితమై మనోహరముగ నుండును". 48

వ్యా. అత్ర = ఇచట, ఆభిజాత్యము, ఏది (ఏ ఆభిజాత్యము), నాతికోమలచ్ఛాయం = మిక్కిలి కోమలమైనకాంతికలదికాదో, నాతికాఠిన్యంఉద్వహత్ = నాతికఠోరతాంధారయత్ = ఎక్కువకాఠిన్యమునుకూడాధరింపదో, అది, ప్రౌఢినిర్మితమ్, సత్కవుల కౌశలముచే సంపాదింపబడినదై, మనోహారి = హృదయరంజకము, అగును అని యర్థము. ఎట్లనగా—

"అధికరతలతల్పం కల్పితస్వాపలీలా
పరిమిలన నిమీలత్పాండిమా గండపాలీ.
సుతను కథయ కస్య వ్యఞ్జయత్యఞ్జసైవ
స్మరనరపతికేలీ యౌవరాజ్యాభిషేకమ్" 109

"ఓ! అందమైన శరీరము కలదానా! అరచేయి యనెడు తల్పముపై కల్పిత మగు శయనము కలిగినట్టిదియు, (అరచేతితో) కలయికచే తగ్గుచున్న తెలుపుకలదియు నగు గండప్రదేశము, ఎవనికి, వెంటనే మన్మథమహారాజు యొక్క కేళులయందు యౌవరాజ్యాభిషేకమును సూచించుచున్నది? చెప్పుము". 109

వ్యా. ఈ విధముగ విచిత్రమార్గమున, సుకుమారమార్గమునవిహితము లగు గుణములకే ఒకానొక అతిశయము సంపాదింపబడును, అని తెలిసికొనవలెను.

ఆభిజాత్యప్రభృతయః పూర్వమార్గోదితా గుణాః
అత్రాతిశయమాయాన్తి జనితాహార్యసమ్పదః. 110

"వెనుకటి (సుకుమార) మార్గమునందు చెప్పబడిన అభిజాత్యాదిగుణములే కవిప్రతిభాదులచే జనించిన లోకోత్తరసౌందర్యముతో ఈ మార్గమున అతిశయమును పొందుమ".

ఇది అంతరశ్లోకము— 48

ఈ విధముగ విచిత్రమార్గమును చెప్పి మధ్యమమార్గమును నిరూపించుట కుపక్రమించుచున్నాడు.

కా. వైచిత్ర్యం సౌకుమార్యం చ యత్ర సంకీర్ణతాం గతే
భ్రాజేతే సహజాహార్యశోభాతిశయశాలినీ. 49

కా. మాధుర్యాదిగుణగ్రామో వృత్తిమాశ్రిత్య మధ్యమామ్
యత్ర కామపి పుష్ణాతి బన్ధచ్ఛాయాతిరిక్తతామ్. 50

కా, మార్గోఽసౌ మధ్యమో నామ నానారుచిమనోహరః
స్పర్ధయా యత్ర వర్తన్తే మార్గద్వితయసమ్పదః. 51

కా. అత్రారోచకినః కేచిచ్ఛాయావైచిత్ర్యరఞ్జకే
విదగ్ధనేపథ్యవిధౌ భుజఙ్గా ఇవ సాదరాః. 52

"(క్రమముగ) ఆహార్యశోభాతిశయముతోడను సహజశోభతోడను ప్రకాశించు వైచిత్ర్యమును, సౌకుమార్యమును దేనియందు సంకీర్ణములై (కలసినవై) ప్రకాశించునో..." 49

"ఎచట మాధుర్యాదిగుణసముదాయము మధ్యమవృత్తి-నాశ్రయించి అపూర్వమగు రచనాసౌందర్యాతిశయమును పోషించునో—" 50

"అది వివిధరుచులు కలవారికి మనోహరముగా నుండెడు మధ్యమ మనెడు మార్గము. దీనియందు మార్గద్వయసంపదలు స్పర్ధతో నుండును". 51

"అరోచకు లగు కొందరు కవులు, సౌందర్యవైచిత్ర్యముచే రంజక మగు దీనియందు, విటులు విదగ్ధవేషధారణము నందువలె అదరము కలవారై యుందురు". 52

అవ. ఈ కలాపకమును అన్వయక్రమమున వ్యాఖ్యానించుచు మొదట 51వ కారికను విశదీకరించుచున్నాడు.

వ్యా. 'మార్గోఽసౌమధ్యమోనామ'— ఇది మధ్యమ మను పేరుగల మార్గము. ఎట్టిది? నానావిధము లగు, రుచయః = అభిరుచులు, ఎవరికో, అట్టి సుకుమార–విచిత్ర–మధ్యమమార్గాసక్తు లగు ఎల్లరికిని, మనోహరః = హృదయంగమను. దేనియందు మార్గద్వితీయసమ్పదః = సుకుమారవిచిత్రమార్గముల శోభలు, స్పర్ధయా = సామ్యముతో, వర్తన్తే = వ్యవస్థితము లై యుండునో, తక్కువగగాని, ఎక్కువగగానిఉండవో. 51

అవ. 49 వ కారికను వ్యాఖ్యానించుచున్నాడు—

వ్యా. దేనియందు; వైచిత్ర్యం = విచిత్రత్వము, సౌకుమార్యం = సుకుమారత్వము, సఙ్కీర్ణతాంగతే = మిశ్రత్వమునుపొందినవై, భ్రాజేతే = ప్రకాశించుచున్నవో, ఎట్టివి? "సహజాహార్యశోభాతిశయశాలినీ" = శక్తివ్యుత్పత్తులచే లభించు ఏ, శోభాతిశయః = కాన్త్యుత్కర్షముకలదో, దానిచేలోకోత్తరముగ నుండునవి. 49

(50 వ కారిక). దేనియందు; మాధుర్యాదిగుణగ్రామః = మాధుర్యము మొద లగు గుణముల సమూహము, మధ్యమాం = రెండింటియొక్క ఛాయతో కూడిన, వృత్తిం = తన స్వాభావికపద్ధతిని ఆశ్రయించి, కామపి = అపూర్వమైన, బన్ధచ్ఛాయాతిరిక్తతామ్ = సన్నివేశకాంతియొక్క ఆధిక్యమును, పుష్ణాతి = పోషించునో-

అందు గుణముల ఉదాహరణములు: ముందుగమాధుర్యమున కుదాహరణ మెట్లనగా-

వేలానిలైర్మృదుభి రాకులితాలకాన్తాః
గాయన్తి యస్య చరితాన్యపరాన్తకాన్తాః.
లీలానతాః సమవలమ్బ్య లతా స్తరూణాం
హింతాలమాలిషు తటీషు మహార్ణవస్య. 111

[పాదతాడితకభాణము-55]

"హింతాలవృక్షముల పంక్తులతో కూడిన మహార్ణవతటములందు మృదువైన సముద్రతీరవాయువులచే కదలుచున్న ముంగురులుకల పడమటిసరిహద్దులలో నున్న స్త్రీలు, వృక్షములయొక్క లతలను గ్రహించి, విలాసముతో వంగినవారై, ఎవని చరితములను గానము చేయుచున్నారో-"

vi. సుకుమారమార్గమునకు చెందిన మాధుర్యమున సమాసరహితము లగు పదముల విన్యాస ముండవలయును. విచిత్రమార్గమునకు చెందిన మాధుర్యము శైథిల్యరహితమై బంధసౌందర్యోపయుక్తమై యుండవలెను. ఈ ఉదాహరణమున ఈ రెండును మిశ్రితములై యున్నవి. అనగా సమాసములు అధికముగ లేవు; శైథిల్యము లేదు 'ష్టి' 'ల' మొదలగు కొన్ని సుకుమారవర్ణములను ఆవృత్తి చేయుటచే ఒక విధ మగు వైచిత్ర్యము సంపాదింపబడినది. కావున ఇవి మధ్యమమార్గమునకు చెందిన మాధుర్యము. మధ్యమమార్గమునకు చెందిన ఇతరగుణోదాహరణములందు గూడ ఈ విధముగనే చూచుకొనవలెను.

ప్రసాదమునకు ఎట్లనగా- ''తద్వక్త్రేన్దువిలోకనేన'' ఇత్యాది పూర్వోదాహృతశ్లోకము (ఉదా: 28).

లావణ్యమునకుదాహరణ మెట్లనగా:-

సంక్రాన్తాంగుళిపర్వసూచితకరస్వాపా కపోలస్థలీ
నేత్రే నిర్భరముక్తబాష్పకలుషే నిఃశ్వాసతాన్తోఽధరః.
బద్ధోద్భేదవిసంష్ఠులాలకలతా నిర్వేదశూన్యం మనః
కష్టం దుర్నయవేదిభిః కుసచివైర్వత్సో దృఢంఖేద్యతే. 113
[తాపసవత్సరాజ చరితము III-75].

"కపోలస్థలము సంక్రమించిన అంగుళిపర్వములచే సూచింపబడిన హస్తస్వాపము కలది. (కపోలమున వ్రేళ్ళ ముద్ర లుండుటచే చాలకాలము కపోలము అరచేతిలో నున్నట్లు తెలియుచున్నది). నేత్రములు అత్యధికముగ విడువబడిన బాష్పముచే కలుషముగ నున్నవి అధరము నిట్టూర్పుచే వాడిపోయినది. ముంగురులు ముడి వీడిపోవుటచే వ్యాకులముగా నున్నవి. మనస్సు నిర్వేదవశముచే శూన్యమువలె నున్నది. ఎంత కష్టము ? దుర్నీతిమంతు లగు కుసచివులచే వత్స అధికముగ బాధింపబడుచున్నది''.

అభిజాత్యగుణమున కుదాహరణ మెట్లనగా—

ఆలమ్బ్య లమ్బాః సరసాగ్రవల్లీః పిబన్తి యస్యాస్తనభారనమ్రాః
స్రోతశ్చ్యుతం శీకరకూణితాక్ష్యో మందాకినీనిర్ఝరమశ్వముఖ్యః.
114

"స్తనభారముచే వంగిన కిన్నరస్త్రీలు వ్రేలాడుచున్న సరసము అగు వల్ల్యగ్రములను పట్టుకొని, స్రోతో (ధారా) రూపమున పడుచున్న, ఏపర్వతము యొక్క మందాకినీప్రవాహమును తుంపురులచే కొంచెము మూయబడిన నేత్రములుకలవారై త్రాగుచున్నారో-" 114

వ్యా. ఈ విధముగ మధ్యమగుణమును వ్యాఖ్యానించి 'అత్రారోచకినః' ఇత్యాది (52 వ) కారికయందు దానినే ఉపసంహరించుచున్నాడు.

అత్ర = దీనియందు, కేచిద్ = కొందరు, సాదరాః = ఆదరవంతులై, ఏతన్మార్గానుసారముగ కావ్యములను రచింతురు. ఎందువలన అనగా వారు, అరోచకినః = కమనీయవస్తువులయందు వ్యసనము కలవారు. ఇది ఎట్టిది? "ఛాయావైచిత్ర్యరఞ్జకే—" కాంతియొక్క వైచిత్ర్యముచే రంజింపచేయునది. ఎట్లు? విదగ్ధనేపథ్యవిధౌ భుజఙ్గా ఇవ = అగ్రామ్యమగు వేషకల్పనయందు నాగరకులు వలె. అది (నాగరకవేషధారణముకూడ) శోభా వైచిత్ర్యముచే మనోరఞ్జకమే.

ఇచట గుణముల ఉదాహరణములు తక్కువ సంఖ్యలో నున్నవి గాన, వాటిని చూపియున్నాము. కాని ప్రతిపదమునందును గూడ ఛాయావైచిత్ర్యముండును; దానిని సహృదయులు స్వయముగనే తెలిసికొనవలెను. తెలిసికొనెడు విధానమును మాత్రము చూపుచున్నాము

ఎట్లనగా— మాతృగుప్త — మాయురాజ — మంజీరాదులకావ్యములు సౌకుమార్య - వైచిత్ర్యముల కలయికచే సుందరముగ నుండును. ఆ కావ్యములలో మధ్యమమార్గముతో గూడిన స్వరూపమును విచారింపవలెను. (అన్వేషింపవలెను). ఇట్లే కాళిదాస - సర్వసేనాదుల కావ్యములు సహజ మగు సౌకుమార్యముచే మనోహరములుగ కానవచ్చుచున్నవి. వాటిలో సుకుమారమార్గమును గూర్చి చర్చించవలెను. అట్లే బాణభట్టుని హర్షచరితమున విచిత్రవక్రత్వవిజృంభణము ప్రచురముగ కానవచ్చుచున్నది. భవభూతి- రాజశేఖరులు రచించిన బంధసౌందర్యముచే మనోహరము అగు ముక్తకశ్లోకములలో కూడ (విచిత్ర వక్రత) చూడబడుచున్నది. కావున సహృదయులు ఈ అన్ని కావ్యములయందును ఈ విశేషముల నన్నిటిని పరిశీలింపవలెను.

ఈ విధముగ మూడు మార్గముల లక్షణము దిఙ్మాత్రముగ చూపి యున్నాము. సత్కవుల కౌశలముతో గూడిన పద్ధతుల స్వరూపము పూర్తిగ చూపుట ఎవ్వరికిని శక్యము కాదు. మార్గములలో, గుణములు సముదాయ ధర్మములే కాని శబ్దాదిధర్మములు కావను విషయము వాటి లక్షణములను వ్యాఖ్యానించు నవుడు ప్రతిపాదిత మైనది.

వి. వామనాదులు పది గుణములనంగీకరించిరి. భామహాదులు మూడు గుణముల నంగీకరించిరి. కుంతకుడు- సుకుమార, విచిత్రమధ్యమము లనెడు మార్గత్రయమున మాధుర్య, ప్రసాదలావణ్యాభిజాత్యము లనెడు నాల్గు గుణములను ప్రతిపాదించినాడు. ఔచిత్యము సౌభాగ్యము అనెడు మరి రెండు గుణములను గూడ చెప్పనున్నాడు. కావున ఈతని మతమున గుణములు ఆరు. ఈ గుణములు కూడ శ్లోకాదిరూపపదసముదాయధర్మములే కాని (అనగా మొత్తము శ్లోకమునకు లేదా శ్లోకసముదాయమునకు సంబంధించినవే కాని) కేవల శబ్దాదిధర్మములు కావని కుంతకుని అభిప్రాయము.

వ్యా. ఈ విధముగ ప్రతినియత మగు (ఈ మార్గమునకు ఈ గుణసము దాయ ముండును అని నిర్ణీత మగు) గుణసముదాయముచే రమణీయ మగు మార్గత్రయమును వ్యాఖ్యానించి (సర్వమార్గ) సాధారణము లగు గుణముల స్వరూప (స్వభావ) మును తెలుపుటకు చెప్పుచున్నాడు.

కా. ఆంజసేన స్వభావస్య మహత్త్వం యేన పోష్యతే
ప్రకారేణ తదౌచిత్యముచితాఖ్యాన జీవితమ్. 53

"పదార్థముయొక్క ఉత్కర్ష స్పష్ట మగు అభిధావైచిత్ర్యముచే, దేనిచే పోషింపబడునో అది ఉచితవర్ణనమే జీవనముగాగల ఔచిత్యము". 53

వ్యా. అది, ఔచిత్యము అనెడు గుణము, ఎట్టిది? ఆఞ్జసేన = సుస్పష్ట మైన ('ప్రకారేణ'కు విశేషణము). స్వభావస్య = పదార్థముయొక్క, మహత్త్వం = ఉత్కర్ష, యేన = దేనిచే, పోష్యతే = పోషింపబడునో. ఇచట 'ప్రకార' శబ్దము ప్రస్తుత మగుటచే అభిధావైచిత్ర్యమును బోధించును. ఎట్టిది? ఉచితాఖ్యానం = ఉదార మగు అభిధానము, జీవితం = పరమార్థము దేనికో అట్టిది. దానికి అను కూలముగ నున్న యదలనే అలంకారవిన్యాసము విచ్ఛిత్తిని కలిగించును.

ఎట్లనగా:-

కరతలకలితాక్షమాలయోః సముదితసాధ్వసనన్నహస్తయోః
కృతరుచిరజటానివేశయో రపర ఇవేశ్వరయోః సమాగమః. 115
[తాపసవత్సరాజ చరితము. III. 84]

"హస్తములందు అక్షమాలలను గ్రహించినవారును, ఉదయించిన సాధ్వసముచే వెనదీయుచున్న హస్తములు కలవారును, అందమగు జటాబంధ మును కల్పించుకొన్నవారును అగు వారియొక్క సమాగమము, మరియొక పార్వతీపరమేశ్వరుల సమాగమమువలె నున్నది".

ఇంకను ఎట్లనగా-

"ఉపగిరి పురుహూతస్యైష సేనానివేశ-
స్తట మపరమితోఽద్రే స్త్వద్బలానాం వసన్తు.
ధ్రువమిహ కరిణస్తే దుర్ధరాః సన్నికర్షే
సురగజ మదలేఖాసౌరభం న క్షమన్తే" 116

"గిరి సమీపమున సిద్ధదేవేంద్రుని సేనానివేశము నీ సేనలు ఇటు పర్వతముయొక్క రెండవప్రాంతమున విడియుగాక. ఇచట సమీపమున (నున్నచో) నిలుపుటకు శక్యము కాని నీ ఏనుగులు సురగజముల మదరేఖాగంధ మును ఏమాత్రమును సహింపవు". 116

హే నాగరాజ బహుధాస్య నితంబభాగం
భోగేన గాఢమభివేష్టయ మన్దరాద్రేః.
సోఢావిషహ్యావృషవాహన యోగలీలా
పర్యంకబంధనవిధే స్తవ కోఽతిభారః. 117

"ఓనాగరాజా! ఈ మందరపర్వతముయొక్క మధ్యభాగమును నీ శరీర ముతో గట్టిగా బహువిధముల చుట్టి వేయుము. వృషవాహనుని సహింపరాని యోగాసనబంధమును సహించిన నీకు ఇది ఎంతభారతము?"

వ్యా. ఇచట మొదటి రెండు ఉదాహరణములలో అలంకారముల (ఉప మాతిశయోక్తుల) గుణముచేతనే (ఔచిత్యరూప) గుణపరిపోషణము జరిగినది.

మూడవ ఉదాహరణమున స్వభావసిద్ధ మగు ఔదార్యమును వర్ణించుటచే (ఔచిత్య పోషణము జరిగినది). 53

ఔచిత్యస్వరూపమునే ప్రకారాంతరముచే స్పష్టీకరించుచున్నాడు-

కా. యత్ర వక్తుః ప్రమాతుర్వా వాచ్యం శోభాతిశాయినా
ఆచ్ఛాద్యతే స్వభావేన తదప్యౌచిత్యముచ్యతే. 54

"వక్తయొక్క గాని, జ్ఞాతయొక్క గాని శోభాతిశయయుక్త మగు స్వభావముచే ఎచట వాచ్యము ఆచ్ఛాదింపబడునో అదికూడ ఔచిత్య మని చెప్పబడును". 54

వ్యా. యత్ర = దేనియందు, వక్తుః = వక్తయొక్క కాని, ప్రమాతుర్వా = శ్రోతయొక్క కాని, స్వభావేన = స్వభావముచేత, వాచ్యం వాచ్య మగు వస్తువు, శోభాతిశాయినా—రామణీయకముచే మనోహర మైన ('స్వభావేన'కు విశేషణము) ఆచ్ఛాద్యతే = ఆచ్ఛాదింపబడునో, అదియును ఔచిత్య మనియే చెప్పబడును. ఎట్లనగా—

శరీరమాత్రేణ నరేన్ద్ర తిష్ఠన్నాభాసి తీర్థప్రతిపాదితర్ధిః
ఆరణ్యకోపాత్తఫల ప్రసూతిః స్తంబేన నీవార ఇవావశిష్టః"
118 (రఘు. 5.15

"ఓరాజా! ఐశ్వర్యమును సత్పాత్రల కిచ్చివేసి శరీరముతో మాత్రము నిలచిన నీవు అరణ్యనివాసులు పంట నంతను తీసికొనగా కాడమాత్రము మిగిలిన నీవారము (నివ్వరిమొక్క) వలె ప్రకాశించుచున్నావు."

వి. గురుదక్షిణార్థమై 14 కోట్లు యాచించుటకై రఘువుపద్దకు వచ్చి, ఆతడు సర్వస్వమును విశ్వజిద్యాగమున వెచ్చించినాడని తెలిసిన పిమ్మట ఆతనితో కౌత్సు డన్నమాట లివి.

ఇచట అట్టి మహారాజుయొక్క స్వభావమును శ్లాఘ్యరూపమున వర్ణించుచు ముని (తాను అరణ్యనివాసి యగుటచే) స్వానుభవసిద్ధ మగు వ్యవహారమును అనుసరించి అలంకారమును (నీవారోపమను) కూర్చుట ఔచిత్యమునకు పుష్టి కలిగించుచున్నది. ఇచట వక్తయొక్క స్వభావముచే వాచ్యముయొక్క

స్వభావము కప్పివేయబడినట్లు కానబడుచున్నది. ప్రమాతముయొక్క (స్వభావ ముచే వాచ్యార్థము సంవృతప్రాయ మగుటకు ఉదాహరణము) ఎట్లనగా—

నీపీయమాన స్తబకా శిలీముఖై రశోకయష్టిశ్చల బాల పల్లవా।
విడమ్బయన్తీ దదృశే వధూజనై రమన్ద దష్టోష్ఠకరావధూననమ్॥
(కిరాతార్జునీయమ్ 8-6) 119

"తుమ్మెదలచే పానముచేయబడుచున్న గుత్తులు కలదియు, చంచలమగు లేతచిగుళ్ళు గల అశోకవృక్షశాఖ వధూజనులచే, గట్టిగా ఓష్ఠమును కొరుకుటచే కలిగిన హస్తధాలనమును అనుకరించుచున్నదిగా, చూడబడెను." 119

వ్యా. ఇచట వధూజనులకు వారి స్వానుభవవాసనానుసారముగా (వారు అమందదష్టోష్ఠలగునపుడు ఆ విధముగ జేయుదురు గాన) అట్టి శోభచే కలిగిన సౌందర్యముయొక్క అనుభూతి కలిగినది. ఇది ఔచిత్యమునకు పుష్టి కలిగించు చున్నది.

ఇంకను ఎట్లనగా—

వాపీతడే కుడుంగా పిఅసహి హాణ్హఉం గఏహిం దీసంతి।
ణ ధరంతి కరేణ భణంతి ణత్తివలిఉం పుణ ణదేంతి॥ 120

[వాపీతటే కురంగాః ప్రియసఖిస్నాతుం గతైర్దృశ్యన్తే।
న ధ్రియన్తే కరేణ భణన్తి నేతి వలితుం పునర్న దదతి॥]
ఇతిచ్ఛాయా

"ఓ ప్రియసఖీ! వాపీతటమున, స్నానముచేయుటకు వెళ్ళిన వారిచే కురంగములు చూడబడుచున్నవి. అవి చేతికి దొరకవు, మాటలాడవు తిరిగి పోనివ్వవు".

వి. ఈ శ్లోకముభావము అస్పష్టముగ నున్నదని S. K. De పండితుడు వ్రాసినాడు. ఆచార్యవిశ్వేశ్వరుడు ఒక విధమగు ఛాయనిచ్చి మేఘపరముగ సమన్వయించినాడు. రాధేశ్యామమిశ్రా మరియొక ఛాయనిచ్చినాడు. రెండవ ఛాయయే యుక్తముగ నున్నట్లు, తోచుచున్నది. భావముమాత్రము అస్పష్టముగనే యున్నది.

వ్యా. ఇచట జ్ఞాతి యగు ఒకానొకతెయొక్క అధికమగు మౌగ్ధ్యప్రసర సుందర మగు స్వభావముచే వాచ్యమాచ్ఛాదిత మై ఔచిత్యమునకు పుష్టిని కలిగించుచున్నది. 54

ఈ విధముగ ఔచిత్యమును చెప్పి సౌభాగ్యమును వివరించుచున్నాడు-

కా. ఇత్యుపాదేయవర్గేఽస్మిన్యదర్థం ప్రతిభా కవేః
సమ్యక్సంరభతే తస్య గుణః సౌభాగ్యముచ్యతే. 55

"ఈ విధముగ ఈ శబ్దాదులగు ఉపాదేయవర్గమునందు దేనికొరకై కవియొక్క ప్రతిభ ఎక్కువగ ప్రయత్నించునో, అట్టి వస్తువుయొక్క గుణము సౌభాగ్యమని చెప్పబడుచున్నది". 55

వ్యా. ఇతి = ఈవిధమైన, అస్మిన్ = ఈ, ఉపాదేయవర్గే = శబ్దాదులగు ఉపేయముల (సంపాదింపదగిన వస్తువుల) సమూహమునందు, యదర్థం = దేని నిమిత్తము. కవేః = కవియొక్క, ప్రతిభా = శక్తి. సమ్యక్ = సావధానత్వముతో, సంరభతే = ప్రయత్నముచేయునో, తస్య = ప్రస్తుతమగుటచే కావ్యరూపమగు ఆ వస్తువుయొక్క, ఏ గుణము కలదో అది, సౌభాగ్య మని, ఉచ్యతే = చెప్ప బడును. 55

ఆ సౌభాగ్యము కూడ ప్రతిభా వ్యాపార మాత్రముచే సంపాదింప శక్య మగునది కాదు, ఇక నేమన-ప్రతిభావిహిత మగు సమస్త సామగ్రిచే సంపాదింప దగినది అని చెప్పుచున్నాడు—

కా సర్వసమ్పత్పరి స్పన్ద సంపాద్యం సరసాత్మనామ్
అలౌకిక చమత్కార కారి కావ్యైక జీవితమ్॥ 56

"అన్నింటి సంపదయొక్క స్ఫురణచే సంపాదింపదగినది; సరస హృదయులకు అలౌకిక మగు చమత్కారమును చేయునది; కావ్యమునకు ప్రధాన జీవితము." 56

వ్యా. సర్వ సమ్పత్పరి స్పన్ద సమ్పాద్యం = సమస్త మగు ఉపాదేయ రాశియొక్క ఏ, సమ్పత్ = నిర్దుష్టత్వముయొక్క పరాకాష్ఠ కలదో దానియొక్క, పరిస్పన్దః = స్ఫురణము, దానిచేత, సమ్పాద్యం = సంపాదింపదగినది. ఇంకను

ఎట్టిది? సరసాత్మనాం = ఆర్ద్రచిత్తము కలవారికి, అలౌకిక చమత్కార కారి = లోకోత్తరమగు ఆనందమును చేయునది. వేయేల? అది, కావ్యైక జీవితమ్ = కావ్యము యొక్క సర్వోత్కృష్టమగు పరమార్థ మని యర్థము.

ఎట్లనగా—

"దోర్మూలావధి సూత్రిత స్తనమురః స్నిహ్యత్కటాక్షే దృశౌ
కించిత్తాండవ పండితే స్మితసుధాసిక్తోక్తిషు భ్రూలతే.
చేతః కన్దలితం స్మరవ్యతికరై ర్లావణ్య మంగై ర్వృతం
తన్వ్యాస్తరుణిమ్ని సర్పతి శనై రన్యైవ కాచిల్లిపిః" 121

"వక్షః స్థలమున స్తనముల పొంగు బాహుమూలముల వరకును వ్యాపించి నది. నేత్రములు స్నేహయుక్తము లగు కటాక్షములు కలవి. స్మితామృతముతో తడసిన మాటలతో కను బొమ్మలు కొంచెము నాట్యమునందు ప్రావీణ్యమును చూపుచున్నవి. మనమున కామాంకురములు ఉదయించుచున్నవి. అవయవము లచే లావణ్యము వరింపబడినది. (ఈ విధముగ) మెల్ల మెల్లగ తారుణ్యము ప్రసరించుచుండగా తన్వంగికి అపూర్వ మగు రూపరేఖ ఏర్పడినది." 121

వ్యా. ఇచట తన్వికి ప్రథమ యౌవనము ఆవిర్భవింపగనే కలిగిన ఆకారము, చిత్తము, చేష్ట, వీటి వైచిత్ర్యము వర్ణింపబడినది అందు "సూత్రిత స్తనం ఉరః" "లావణ్యం అఙ్గైః వృతమ్" అనునవి ఆకార వైచిత్ర్యమును, "స్మర వ్యతికరైః కన్దలితమ్" అనునది చేతోవైచిత్ర్యమును, "స్నిహ్యత్కటాక్షే దృశౌ," "కిఞ్చిత్తాణ్డవ పణ్డితే స్మితసుధా సిక్తోక్తిషు భ్రూలతే" అనునవి చేష్టా వైచిత్ర్యమును వర్ణించుచున్నవి. ఈ శ్లోకమున ప్రయుక్తము లగు 'సూత్రిత' 'సిక్త' 'తాణ్డవ' 'పణ్డిత' 'కన్దళిత' అను పదములలో ఉపచార వక్రత్వము కనబడుచున్నది. "స్నిహ్యత్" అను పదమున కాల విశేషమును (వర్తమాన కాలమును) బోధించు ప్రత్యయ వక్రత్వము కనబడుచున్నది. "అన్యైవ కాచిత్" అనగా 'వర్ణింపరాని' అని చెప్పుటచే సంవృతి వక్రతాకృత మగు శోభ కనబడుచున్నది. 'అంగైః వృతమ్' అనునపుడు కారక వక్రత్వము కనబడు చున్నది. విచిత్ర మార్గమునకు సంబంధించిన లావణ్య గుణము కూడ ప్రధాన రూపమున నున్నది. కావున, ఈ శ్లోకమునం దీ విధముగ ప్రతిభా సంరంభముచే

కలిగిన సకల (వక్రతాది) సామగ్రిచే అవిష్కృతమై, సరసుల హృదయముల కాహ్లాదమును కలిగించు ఒకానొక (అనిర్వాచ్య మగు) సౌభాగ్యము ప్రకాశించు చున్నది.

వెనుక చెప్పిన గుణద్వయమునకు విషయమును (అనగా ఆగుణద్వయ ముండెడి స్థానమును) చూపుచున్నాడు—

కా. ఏత త్త్రిష్వపి మార్గేషు గుణద్వితయ ముజ్జ్వలమ్।
పదవాక్య ప్రబన్ధానాం వ్యాపకత్వేన వర్తతే॥ 57

"పద వాక్య ప్రబంధముల యొక్క ఈ ప్రకాశించుచున్న గుణద్వయము, మూడు మార్గము లందును వ్యాపించి (అనగా) సర్వావయవ సంబద్ధమై యున్నది."

వ్యా. ఈ గుణద్వితయం = ఔచిత్యము, సౌభాగ్యము అనెడు గుణద్వయము, ఉజ్జ్వలం = మిక్కిలి ప్రకాశించునది; పదవాక్య ప్రబంధములు మూడింటికిని సంబంధించినది, వ్యాపకత్వేనవర్తతే = సకలావయవములను వ్యాపించి ఉన్నది. ఎక్కడ అని చెప్పుచున్నాడు త్రిష్వపి మార్గేషు = సుకుమార విచిత్ర మధ్యమము లనెడు మూడు మార్గముల యందును, అందు, పదౌచిత్య మనగా —బహువిధ భేదములతో భిన్న మగు (పద) వక్రత్వమే స్వభావమును స్పష్ట మగు ప్రకారముచే పోషించుటయే వక్రతలోని పరమరహస్యము.

వాక్యమునకు గూడ ఉచితాభిధానమే జీవితము గాన ఔచిత్యము లేనిచో అది తద్విదాహ్లాదకారి కాజాలదు ఎట్లనగా రఘువంశమున-(రావణ సంహారానన్తరము శ్రీ రాముడు సీతా సమేతుడై పుష్పకముపై తిరిగి వచ్చుచు అమెకు పూర్వానుభూతము లగు ఆయా ప్రదేశములను చూపు సందర్భమున)—

"పురం నిషాదాధిపతే స్తదేతత్
యస్మిన్ మయా మౌలిమణిం విహాయ.
జటాసు బద్ధాస్వరుదత్ సుమ న్న
కైకేయి కామాః ఫలితా 122



"ఇదియే ఆ నిషాదరాజు (గుహుని) పట్టణము. ఇచట నేను శిరోలంకార మగు మణిని విడచి జటలు బంధింపగా సుమంత్రుడు–"ఓ కైకేయీ! నీ కోరిక తీరినది" అని యనుచు ఏడ్చెను."–

ఇచట అత్యుత్తమము లగు మహాపురుష లక్షణము లున్నట్లు వర్ణింపబడు చున్న రఘునాథుడు—"కైకేయి కామాః ఫలితా స్తవ" అనెడు తుచ్ఛ విషయ మును స్మరించుట (చినట్లును), (దానిని పైకి) చెప్పుట (చెప్పినట్లును వర్ణించుట) ఎంతయు అనుచితముగ నున్నది.

ప్రకరణములోని ఒక ప్రదేశమున ఔచిత్య భంగము వాటిల్లినను, ఏ ప్రబంధమైనను గూడ, ఒకచోట కాలిపోవుటచే పాడయిపోయిన దగ్ధ పటము వంటి దగును. ఎట్లనగా– రఘువంశమున (వశిష్ఠముని ధేనువును సేవించుచు అరణ్యమున సంచరించుచున్న) దిలీపునకును, (దిలీపుని భక్తిని పరీక్షించుటకై ఆ ధేనువుచే సృజింపబడి, దానిని ఆక్రమించుకొనియున్న) సింహమునకును నడుమ జరిగిన సంవాదము సందర్భమున సింహము—

"అథైక ధేనోరపరాధ చండాత్
గురోః కృశాను ప్రతిమాద్బిభేషి.
శక్యోఽస్య మన్యుర్భవతాపి జేతుం
గాః కోటిశః స్పర్శయతా ఘటోధ్నీః" 128

"అట్లు కాక– ఈ ఒక్క ధేనువు విషయమున (నీవు చేసిన, దీనిని రక్షింపజాలక పోవుట యనెడు) అపరాధముచే తీవ్రముగ కోపించిన, అగ్ని సదృశు డగు గురువు వలన భయపడుచుంటివా— (అదియును అనావశ్యకము; ఏలయన) ఘటములవంటి పొదుగులు గల కోట్ల కొలది గోవులను అతనికి సమర్పించి అతని కోపమును నీవు కూడ జయింపవచ్చును"—

అని పల్కుట ఉచితమే. ఏలయన– ఈ వాక్యమును (సింహము) రాజును పరిహసించుటకై పల్కుచున్నది. కాని రాజు, తన కీర్తిని సంరక్షించు కొనుటయందు మాత్రమే ఆసక్తి కలవా డగుటచే అతనికి తన ప్రాణములు గడ్డిపోచ వలె చాల తేలికగా కనబడును. అట్టివాడు (సింహము పలికిన) ఈ పూర్వపక్షమునకు ప్రత్యుత్తరముగ—

"కథం చ శక్యోఽనునయో మహర్షేః
విశ్రాణనాచ్చాన్య పయస్వినీనామ్.
ఇమాం తనూజాం సురభేరవేహి
రుద్రౌజసా తు ప్రహృతం త్వయాస్యామ్" 124
(రఘు 2.49)

"ఇతర ధేనువుల నిచ్చి మహర్షి కోపమును దీర్చుట ఎట్లు శక్యమగును? ఈ ధేనువు కామ ధేనువు కుమార్తె యను విషయమును తెలిసికొనుము. కేవలము రుద్రుని తేజో బలము (నీకు) ఉండుటచే నీవు దీనిని ఆక్రమించగలిగితివి" 124

అని పల్కుటలో-ఈ గోవుకు బదులుగ ఇచ్చుటకు తగిన ఇతర గోవు లేవైన యున్నచో ఆ మునియు, నేనును, ఇరువురమును గూడ దీని జీవితమును రక్షించుటకై ఇంతగ పాటుబడకుండుటకు వీలుండెడిది అను తాత్పర్యము గమ్యమాన మగుటచే (వచ్చుటచే) ఈ ఉక్తి అత్యంతము అనౌచిత్యముతో కూడినది.

వి. కావున ఏకదేశదగ్ధ పటము వలె ఈ ప్రకరణమంతయు సౌందర్య విహీనమైనదని యభిప్రాయము.

వ్యా. ఇంకను ఎట్లనగా-కుమార సంభవమున త్రైలోక్యమును ఆక్రమింప నున్న పరాక్రమము గల తారకు డనెడు శత్రువును జయింపవలసి యున్నపుడు (సురపతిచే స్మరణ మాత్రా హూతుడగు) మన్మథుడు సురపతితో ఈ విధముగ పల్కను—

కామేక పత్నీవ్రత దుఃఖ శీలాం
లోలం మనశ్చారుతయా ప్రవిష్టామ్।
నితమ్బినీ మిచ్ఛసి యుక్తలజ్జాం
కణ్ఠే స్వయం గ్రాహ నిషక్త బాహుమ్॥ 125
(కుమార సంభవము 3-7)

"పాతివ్రత్య వ్రతమును అవలంబించుటచే సాధించుటకు శక్యము కానిదియు, సౌందర్యముచే చంచల మైన నీ మనస్సును ప్రవేశించినదియు అగు

ఏ నితంబిని ముక్తలజ్జయై స్వయముగ వచ్చి నీ కంఠము నాశ్లేషింపవలె నని కోరుచున్నావు?''

వ్యా. త్రైలోక్యాధిపత్య ప్రతిష్ఠితు డగు ఇంద్రునకే కలిగిన దైనను అట్టి (పతివ్రతా వర్ణన రూప మగు దుర) అభిప్రాయమునకు అనుగుణముగ పల్కి నట్లు చెప్పిన ఈ పాపానుష్ఠాన పర మగు వాక్యము అనౌచిత్యమును కలిగించుచున్నది. (కావున ఈ ఘట్టము కూడ ఏకదేశదగ్ధ పటము వలె దూషిత మగుచున్నది )

అవ. కాళిదాసు వంటి మహాకవి రచనలయందే దోషమును చూపుట యా యని ఆశంకించుకొని, దోషములు చూపినచో అట్టి మహాకవి రచనలలోనే చూపవలయును. సామాన్య కవులలో దోషముల కేమి కొదవ యనునట్లు సమాధానము చెప్పుచున్నాడు.

వ్యా. ఇది కూడ సహజ మగు సౌకుమార్యముద్ర వహించిన సూక్తులతో స్వాభావిక మగు సౌందర్యమును చూప కల్గిన ఈ కవి విషయముననే విమర్శింప బడుచున్నది. అంతియే కాని (ప్రయత్న సాధ్యమగు) కృత్రిమము మాత్రమే యగు కావ్యరచనా కౌశలముచే బడాయి చెప్పుకొనెడు ఇతర కవుల విషయమున పర్యాలోచింపబడదు.

వేరువేరుగ అనేకాకారములుగల కమనీయకారణ కలాపముచే సంపాదింప బడిన రామణీయకము గల పదవాక్య ప్రకరణ ప్రబంధముల సౌభాగ్య మనెడు రెండవ గుణము గూడ అనిర్వాచ్యమై, సహృదయహృదయ మాత్రసంవేద్యమై, కావ్యమునకు జీవితమై, అలౌకిక చమత్కార జనకమై, మిశ్రితము లగు అనేక రసముల ఆస్వాదముచే సుందరమై, కావ్యమునందలి సకలావయవములందును వ్యాపించి ఒప్పారుచున్నది. ఇక (దీనిని గూర్చిన) అతిప్రసంగము చాలును.

ఇపుడు దీనిని (ప్రకృత మగు గుణనిరూపణమను విషయమును) ఉప సంహరించి మరియొక విషయమును ప్రవేశ పెట్టుచున్నాడు:—

కా. మార్గాణాం త్రితయం తదేతద సకృత్ ప్రాప్తవ్య పర్యాప్తిభిః
క్షుణ్ణం కైరపి యత్ర కామపి భువం ప్రాప్య ప్రసిద్ధిం గతాః।
సర్వే స్వైర విహారహారి కవయో యాస్యన్తి యేనాధునా
తస్మిన్ కోఽపి స సాధుసున్దర పదన్యాసక్రమః కథ్యతే॥ 5

"ఇది (సుకుమార–విచిత్ర మధ్యమము లనెడు) మార్గముల త్రయము, ప్రాప్తవ్య మగు వాటియందు ఆసక్తికల కొందరు (కాళిదాసాదులు) ఈ మార్గ మునెన్నియో సార్లు నలగకొట్టి యున్నారు. దీని ద్వారా ఒకానొక భూమిని (మహా కవిత్వ పదమును) పొంది ప్రసిద్ధి నొందినారు. స్వైర విహారముచే మనోహరు లగు కవులెల్లరును ఇంకను ఈ మార్గ త్రయమున ఏ సుందరక్రమ ముతో నడువకలరో; అట్టి ఒకానొక (అలౌకిక మగు) సుందరపద (న్యాస) ప్రయోగక్రమమును కూర్చి (ఇపుడు) బాగుగ చెప్పబడుచున్నది"

వ్యా. మార్గాణాం=సుకుమారాది మార్గముల, ఈ త్రయము, కైరపి = కొందరు మహాకవులచేమాత్రమే, సామాన్యులచేకాదు, ప్రాప్తవ్యపర్యుత్సుకైః = పొందతగిన (మహా కవిత్వాది పదమునందు) ఆసక్తు లగు (గమ్యస్థానము చేరు టకై ఔత్సుక్యము కలవా రని అర్థాంతరము), అసకృత్ = అనేక పర్యాయ ములు, అభ్యాసముచేత, క్షుణ్ణం = నలగగొట్టబడినది. యత్ర = ఏ మార్గ త్రయ మున, కామపి = లోకోత్తరమగు, భూమిని అనగా స్థితిని, (ప్రదేశమును అని అర్థాంతరము ) పొంది, ప్రసిద్ధి వడసినారు. ఇపుడు స్వైరవిహార హారిణః= స్వేచ్ఛా విహారముచే రమణీయములగు, కవులెల్లరును, తస్మిన్ = ఆ మార్గ త్రయమున ఏ మార్గముచే, యాస్యన్తి = వెళ్ళగలరో, అట్టి, కోఽపి = అలౌకిక మైన, సున్దర పదన్యాసక్రమః = సున్దరమగు పదములను కూర్చెడు విధానము, (సుందరమగుపదవిన్యాస క్రమము). సాధు = బాగుగ చెప్పబడును. సుందర మగు సుబంత, తిజంతముల ప్రయోగ పద్ధతి రూప మగు విన్యాసము వర్ణింప బడుచున్నది. ఈ శ్లోకము నందలి "మార్గ" 'స్వైరవిహార'- 'పద' మొదలగు పదములను శ్లేషచ్ఛాయతో కూడిన వాటినిగ వ్యాఖ్యానించుకొనవలెను.

వి. ఈ శ్లేషచే-పూర్వము అనేకులచే క్షుణ్ణమగు మార్గమున స్వేచ్ఛావిహా రము సలుపుచు పాంథులు గంతవ్యస్థానమును చేరి ఆనందసీమల నధిరోహించు నట్లు కవులు కూడ కాళిదాసాది ప్రాచీన కవులచే ప్రహత మగు నీ మార్గత్రయ మున స్వేచ్ఛగ సంచరించి ఉత్తమ కవితాపదము నధిరోహింప వీలగుటకై సుందర పదన్యాస క్రమమును వర్ణించి చెప్పుచున్నాము, అని తాత్పర్యము.

— ప్రథమోన్మేషము సమాప్తము —

# ద్వితీయోన్మేషము

అవ. కుంతకుడు ప్రథమోన్మేషమున ఆరు విధము లగు కవివ్యాపార వక్రతలు ఉండును, అని చెప్పి వాటి సామాన్య లక్షణములను కూడ చూపి యున్నాడు. ఈ ద్వితీయోన్మేషమున వాటి విశేష లక్షణములను చెప్పనున్న వాడై, ఈ రెండు ఉన్మేషముల పరస్పరసంగతిని తెలుపుచున్నాడు.

వ్యా. ఏ గ్రంథమునందైనను, సామాన్య లక్షణము చెప్పిన పిమ్మట విశేషలక్షణము చెప్పవలెను గావున, "శబ్దార్థౌ సహితౌ" ఇత్యాదికారికచే మొదట కావ్య సామాన్య లక్షణము చెప్పి, ఆ కావ్యలక్షణమునకు అవయవము అగు శబ్దార్థముల సాహిత్యమునకు విశేషలక్షణము కూడ ప్రథమోన్మేషమునందే చెప్పి యున్నాడు. (దానితరువాత "కవి వ్యాపార వక్రత్వ ప్రకారాః సమ్భవన్తిషట్" ఇత్యాది కారికలలో షడ్విధ వక్రతలు ఉద్దిష్టములైనవి.) అందు ప్రథమోద్దిష్ట మగు వర్ణవిన్యాస వక్రత్వమునకు లక్షణము నిపుడు ఉపక్రమించుచున్నాడు—

కా. ఏకో ద్వౌ బహవో వర్ణా బధ్యమానాః పునః పునః
స్వల్పాన్తరాస్త్రిధా సోక్తా వర్ణవిన్యాస వక్రతా. 1

"ఒకటి, లేక రెండు, లేదా అంతకంటె అధికము, అగు వర్ణములు తక్కువ వ్యవధానముతో మాటి మాటికిని కూర్చబడినచో అది మూడు విధము లగు వర్ణవిన్యాస వక్రతగా చెప్పబడినది" 1

వ్యా. ప్రసిద్ధి ననుసరించి, ఇచట వర్ణశబ్దమునకు వ్యంజనము (హల్లు) అని యర్థము. దానిచే (ఆ వ్యంజనమును బట్టి) ఆ, వర్ణవిన్యాస వక్రతా = వ్యంజనముల కూర్పులో నున్న శోభః త్రిధా = మూడు విధములతో నున్నదిగ, ఉక్తా = వర్ణింపబడినది. ఆ ప్రకారము లేవి యనగా చెప్పుచున్నాడు— ఏకః = ఒక్కటి (హల్లు) మాత్రమే, ఒకప్పుడు రెండు లేక అధిక సంఖ్యాకములు అగు వర్ణములు మాటిమాటికిని కూర్చబడినవై; ఎట్టివి? స్వల్పాన్తరాః = స్వల్పం = స్వల్పమైన, అన్తరం, వ్యవధానము; వేటికో అట్టివి. అవియే మూడు ప్రకారము

అని చెప్పబడుచున్నవి. ఇచట "పునః పునః" అను ద్విరావృత్తి, అయోగ వ్యవచ్ఛేద పర మగు నియమమే గాని అన్యయోగవ్యవచ్ఛేద పర మగు నియమము కాదు. కావున మాటిమాటికి కూర్పబడిన హల్లులే వర్ణవిన్యాసవక్రతా ప్రయోజకములు. అంతియే కాని, మాటిమాటికి మాత్రమే కూర్పబడినవి కాదు.

వి. ఇచట కుంతకుడు వ్రాయుదానిని బట్టి వీప్సకు (ద్విరావృత్తికి) అయోగ వ్యవచ్ఛేద- అన్యయోగవ్యవచ్ఛేదార్థకత్వ మన్నదన్నట్లు తోచుచున్నది. కాని వీప్సకు ఆ యర్థములు లేవు. 'ఏవ' కారమునకు మాత్రమే ఆ అర్థము లున్నవి కావున గమ్యమాన మగు ఏవ కారమును మనస్సులో నుంచుకొని కుంతకు డీ విధముగ వ్రాసినాడు కావుననే చివర నున్న వివరణ వాక్యమున "పునః పునర్బధ్యమానా ఏవ, న తు పునః పునరేవ బధ్యమానాః" అని ఏవకారమును ప్రయోగించెను.

'ఏవ' శబ్దమునకు ప్రధానముగ "అవధారణము" "అసంభవము"— అనగా అవధారణాభావము ("క్వేవభోక్ష్యసే" ఇత్యాదులలో) అను రెండర్థములని కైయటాదులు చెప్పినారు. ఏవ శబ్దమును ప్రయోగింపకున్నను అవధారణార్థము బోధ్య మగుచునే యుండు నని శాస్త్రకారుల అభిప్రాయము. కావుననే "సర్వం వాక్యం సావ ధారణమ్" అని అభియుక్తోక్తి. 'రామః ఆగచ్ఛతి' అని యనగనే 'రాముడు వచ్చుచున్నాడు' అను నిస్సంశయ మగు అర్థబోధ కలుగును. "రాముడు తప్పకుండగ వచ్చుచున్నాడు; అందు సందేహములేదు" అని ప్రత్యేకించి చెప్ప బనిలేదు. "రామః ఆగచ్ఛతి" అను మాటలోనే ఆ అవధారణము ఇమిడి యున్నది. ఇక కేవలము స్పష్టతార్థమే 'ఏవ' శబ్దమును ప్రయోగించుట. గాని 'ఎవ' శబ్దము ఏ శబ్దముతో సంబంధించునో, దానిని బట్టి అర్థవిశేషమును బోధించును. ఏవకారము విశేషణముతో సంబంధించి నపుడు అయోగవ్యవచ్ఛేదరూప మగు అవధారణమును సూచించును. "శంఖః పాణ్డుర ఏవ" ఇత్యాదులలో ఏవకారము అయోగవ్యవచ్ఛేదమును సూచించును. అనగా శంఖమునకు పాండురత్వముతో సంబంధము లేకపోవుట నిషేధింప బడుచున్నది. శంఖము తప్పక తెల్లనిదే యని యర్థము. 'ఏవ' కారము విశేష్యముతో సంబంధించినపుడు అన్యయోగ వ్యవచ్ఛేదరూప మగు అవధారణమును తెలుపును. 'శ్రీరామ ఏవ ధనుర్ధరః" అనునపుడు 'ఏవ' కారము "రామః" అను విశేష్యముతో సంబంధించినది గాన అన్యయోగ్య వ్యవచ్ఛేదమును— అనగా ధనుర్ధర

త్వమనునది రామునియందు మాత్రమే ఉన్నది గాని ఇతరుల యందు లేదు, అని బోధించుచున్నది. 'శ్రీరాము డొక్కడే ధనుర్ధరుడు', అని యర్థము. 'ఏవ' కారము క్రియతో అన్వయించు నపుడు అత్యన్తాయోగవ్యవచ్ఛేదమును బోధించును. 'నీలం సరోజం భవత్యేవ' (నల్లని పద్మము తప్పక ఉన్నది) అను నపుడు నల్లని పద్మము అత్యంతము లేదని చెప్పరాదు. నల్లని పద్మము కూడ తప్పక ఉన్న దని యర్థము. ఇచట నీలసరోజమునకు అత్యంతాభావము నిషేదింపబడినది.

"అయోగ మన్యయోగం చాప్యత్యన్తాయోగమేవ చ
వ్యవచ్ఛినత్తి ధర్మస్య ఏవకార స్త్రిధా మతః".

అని అభియుక్తోక్తి—

ఇచట "పునఃపునర్బధ్యమానాః" అనుచోట గమ్యమాన మగు ఏవకారము అయోగవ్యవచ్ఛేదకమేకాని అన్యయోవ్యవచ్ఛేదపరముకాదు. అనగా "వర్ణములను మాటిమాటికిని కూర్చినచో వర్ణవిన్యాసవక్రత" అని యర్థము. అంతే కాని మాటి మాటికిని మాత్రమే కూర్పవలెను అని యర్థము కాదు. కావున మాటిమాటికిని కూర్చకపోయినను — రెండు పర్యాయములు మాత్రమే కూర్చినను ఈ వక్రత ఉండవచ్చును.

వాస్తవమున "శ్రీరామ ఏవ ధనుర్ధరః" "శ్రీరామః ధనుర్ధర ఏవ" ఇత్యాదులతో 'ఏవ'కారము విశేష్యసంబద్ధ మైనవుడు అన్యయోగవ్యవచ్ఛేదమును విశేషణ సంబద్ధమైనవుడు అయోగ వ్యవచ్ఛేదమును బోధించుట విస్పష్టము. కాని "పునః పునః ఏవ బధ్యమానాః" అని చెప్పినను, "పునః పునః బధ్యమానా ఏవ" అని చెప్పినను అర్థములో భేదమేమియు కానవచ్చుటలేదు. అన్యయోగ వ్యవచ్ఛేదమే గమ్యమగుచున్నది. అనగా పునః పునః నిబంధనము లేనిచో, వక్రత్వము లేదని తెలియుచున్నది. కావున ఇచట ఏవకారమునకు అర్థవైచిత్ర్యము చెప్పుట యుక్తము కాదని తోచుచున్నది.

"పునఃపునరితి ప్రాయోవాదః, క్వచిత్పౌనః పున్యాభావేఽపి వక్రతా ప్రతీతేః"— (పునఃపునర్నిబంధనము లేకపోయినను ఈ వక్రత కానవచ్చుచున్నది గాన, "పునఃపునః" అనుదానికి అంతగా ప్రాధాన్య మీయ వలసిన పని లేదు)— అని వ్రాసి యుండవలసినది.

వ్యా అందు ఒక వ్యఞ్జనమును కూర్చిన ఉదాహరణము ఎట్లనగా-

ధమ్మిల్లో వినివేశితాల్పకుసుమః సౌన్దర్యధుర్యం స్మితం
విన్యాసో వచసాం విదగ్ధమధురః కణ్ఠే కలః పఞ్చమః
లీలామన్థరతారకే చ నయనే యాతం విలాసాలసం
కోఽప్యేవం హరిణీదృశః స్మరశరాపాతావదాతః క్రమః 1

"కేశపాశమున కొంచెము పుష్పములు ముడువ బడినవి చిరునవ్వు సౌందర్యధుర్య మైనది. (సౌందర్యమున శ్రేష్ఠ మైనది) వచో విన్యాసము నేర్పుతో కూడినది, మధుర మైనది. కంఠమున మధుర మగు పంచమస్వర మున్నది నేత్రములు విలాసచే మందమైన గ్రుడ్లు కలవి. నడక విలాసచే అలసముగా నున్నది. ఈ విధముగ మృగనయనయొక్క అనిర్వచనీయ మగు పద్ధతి మన్మథబాణపాతముచే అందముగ నున్నది".

ఇచట 'వినివేశిత' అనునపుడు 'వ'కారమునకు, 'సౌందర్యధుర్య' అనునపుడు 'ర్య'కు, 'విన్యాసో వచసాం విదగ్ధ' అనునపుడు 'వ'కార 'స'కారములకు 'కణ్ఠే కలః' అనునపుడు 'క'కారమునకు, విలాసాలసమ్' అనునపుడు సకార, లకారములకు 'పాతావదాతః' అననపుడు తకారమునకును ఆవృత్తి యుండుటచే ఇది వర్ణవిన్యాసవక్రతకు ఉదాహరణము. ఇదియే ఇతరాలంకారికుల మతమున అనుప్రాస.

వ్యా. పునఃపునర్నిబద్ధ మగు ఏక వ్యంజనమునకును, వ్యంజనద్వయమునకను బహువ్యంజనములకును ఉదాహరణము ఎట్లనగా-

భగ్నైలావల్లరీకాస్తరలితకదలీస్తమ్బతామ్బూలజమ్బూ
జమ్బీరాస్తాలతాలీసరళతరలతాలాసికా యస్య జహ్రుః.
వేలత్కల్లోలహేలాబిసకలనజడాః కూలకచ్ఛేషు సిన్ధోః
సేనాసీమన్తినీనామనవరతరతాభ్యాసతాన్తిం సమీరాః. 2

"సింధుతీరమునందలి జలప్రాయప్రదేశములయందు ఏలకులతీగెలను వంచినవియు, అరటిచెట్లను తాంబూలలతలను నేరేడుచెట్లను, నిమ్మచెట్లను కదల్చుచున్నవియు, తాలవృక్షములను తాలీవృక్షములను సరలము లగు లతలను

నాట్యముచేయించునవియు, తరంగములతో క్రీడించునవియు, తామరతూడులను స్పృశించుచున్నవియు నగు సమీరములు ఎవని సైనికుల భార్యల అనవరతరతి శ్రమను తొలగించుచున్నవో—" 2

వి. ఇచట ప్రథమచరణమున 'ల'కారమునకు ఆవృత్తి, 'తాలతాలీ' ఇత్యాదులలో వర్ణద్వయమున కావృత్తి, 'జమ్బూజమ్బీరా' ఇత్యాదులలో బహు వర్ణముల కావృత్తి. ఈ విధముగ ఈ శ్లోకమున ఏక-ద్వి-బహు- వర్ణముల ఆవృత్తికి ఉదాహరణము నూహించుకొనవలెను.

కుంతకుడు చెప్పిన ఈ వర్ణవక్రతాభేదములు ఇతరాలంకారికులు అంగీకరించిన ఛేకానుప్రాస, వృత్త్యనుప్రాస శ్రుత్యనుప్రాస, అన్త్యానుప్రాస, లాటానుప్రాసము లనెడు ఐదు అనుప్రాసములలో అంతర్గతము లగును

వ్యా. ఈ వర్ణవిన్యాసవక్రతకే చెందిన మరియొక విధ మగు విచ్ఛిత్తిని (సౌందర్యమును) వివరించుచున్నాడు.-

కా. వర్గాన్తయోగినః స్పర్శా ద్విరుక్తాస్తలనాదయః
శిష్టాశ్చ రాదిసంయుక్తాః ప్రస్తుతౌచిత్యశోభినః. 1

"వర్గపంచమాక్షరముతో కూడిన స్పర్శవర్ణములు (కకారము మొదలు మకారము వరకును గల వర్ణములకు అనగా కవర్గము మొద లగు ఐదు వర్గము లకును స్పర్శ లని పేరు). ద్విత్వమును పొందిన, తకార, లకార, నకారాదులు, ప్రస్తుతరసాదులకు అనుకూలముగ నుండుటచే శోభించు రేఫాదిసంయుక్తము లగు ఇతరవర్ణములును (మూడువిధము లగు మరి యొక వర్ణవిన్యాసవక్రతకు స్థానములు"

వ్యా. ('శిష్టాశ్చ'...అను) 'చ'కారముచే వెనుకటి శ్లోకముతోనున్న 'వర్ణ విన్యాసవక్రతా త్రిధా ఉక్తా" అనుదానితో సంబంధించును. మరి యొక విధ మగు ఈ వర్ణవిన్యాసవక్రత మూడు విధములుగ నుండును అని దాని యర్థము. దీని ఆ మూడు ప్రకారములును ఏవి అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు-

"వర్గాన్తయోగినః స్పర్శాః" కకారము మొదలు మకారము వరకును గల వర్ణములు స్పర్శములు. వర్గాన్తైః = ఙకారము మొద లగు వర్గాన్త్యాక్షరములతో సంబంధము వేటికో అవి; అట్టి స్పర్శములు మాటిమాటికిని కూర్పబడినచో అది

మొదటి ప్రకారము. తలనాదయః = త కార ల కార న కారాదులు, ద్విరుక్తాః = రెండు పర్యాయములు ఉచ్చరింపబడినవై అనగా— ద్విరుక్తరూపమున మాటి మాటికిని కూర్పబడినవై ఉన్నచో అది రెండవ ప్రకారము. వాటికంటె భిన్నము లగు మిగిలిన వ్యఞ్జనసంజ్ఞకము లగు వర్ణములు రేఫ మొదలగు వాటితో సంయుక్తములుగ- మాటిమాటికిని కూర్పబడినచో అది మూడవ ప్రకారము.

(వెనుకటి కారికలోని) "స్వల్పాన్తరాః" "తక్కువవ్యవధానము కలవి" అనునది అన్నింటియందును (భేదత్రయమునందును) అన్వయించును. అవి ఎట్టివి? ప్రస్తుతౌచిత్యశోభినః; ప్రస్తుతం = వర్ణింపబడుచున్న ఏవస్తువుకలదో, దానియొక్క, ఏ, ఔచిత్యం = ఉచితత్వము కలదో దానితో ప్రకాశించుచున్నవి. అంతియె కాని సవర్ణము లగు వర్ణములను కూర్పవలె ననెడు పట్టుదలతో మాత్రమే కూర్పబడి ప్రస్తుతౌచిత్యమునకు కొదువను కూర్చునవి కాకూడదు. పరుషరసములను కూర్చుసందర్భములందు అట్టి వర్ణములే ప్రస్తుతౌచిత్యముచే శోభించును. గాన (అచట అట్టివిఉండవచ్చునని) అంగీకరించుచున్నాడు.

వి. ఈ విధముగ కుంతకుడు మొత్తము ఆరు వర్ణవిన్యాసవక్రతాభేదములను నిరూపించినాడు. మొదటి మూడు భేదములు ఇతరాలంకారికుల అనుప్రాస భేదములలో అంతర్గతము లని చూచియుంటిమి. ఈ మూడుభేదములను గూర్చి ఇతరాలంకారికులు వృత్తులను రీతులను వర్ణించుప్రసంగమునవివరించియున్నారు.

వ్యా. అందు "వర్గాన్తయోగినఃస్పర్శాః" అను మొదటి ప్రకారమునకు ఉదాహరణము. ఎట్లనగా-

ఉన్నిద్రకోకనదరేణు పిశఙ్గితాఙ్గా  
గుఞ్జన్తి మఞ్జు మధుపాః కమలాకరేషు।  
ఏతచ్చకాస్తి చ రవేర్నవ బన్ధుజీవ  
పుష్పచ్ఛదాభ ముదయాచలచుమ్బి బిమ్బమ్ 3

"వికసించిన పద్మముల పరాగములచే పింగళముగ చేయబడిన (పచ్చనైన) అంగములు గల తుమ్మెదలు పద్మాకరములందు మంజుగుంజితములను చేయుచున్నవి. నూతన మగు బంధుజీవపుష్పముయొక్క రేకులతో సమానమైన

కాంతి గల సూర్యబింబము ఉదయాచలనమును చుంబనము చేయుచు ప్రకాశించు చున్నది—" 8

ఇంకను ఎట్లనగా—

"కదలీస్తమ్భతాంబూలజమ్బూజమ్భీరాః" అను పూర్వోక్తోదాహరణము. (చూ. II. 2)

ఇంకను ఎట్లనగా—

"సరస్వతీహృదయారవిన్దమకరన్దబిన్దు సన్దోహసున్దరామ్" 5.

"సరస్వతియొక్క హృదయారవిందమునందలి మకరందబిందువుల సందోహము వలె సుందరములగు".

వి. పై మూడు ఉదాహరణములందును జ్గ, ఙ్గ, న్ధ, మ్బ, న్ద మొదలగు వర్ణములు అనేకపర్యాయము లావృత్తము లైనవి. క కారము తన వర్గములో ఐదవ దగు ఙకారముతో కలిసి ఙ్గ అయినది. అట్లే జ, ధ, మ, ద, కారములు స్వస్వవర్గపంచమాక్షరములతో కలసినవి. కావున ఇవి "స్వర్గ్యాక్షరములు వర్గాంతవర్ణములతో కలియుట" అను మొదటి ప్రకారమునకు ఉదాహరణము.

వ్యా. "ప్రథమమరుణచ్ఛాయః" (చూ. 1-41) ఇత్యాదిశ్లోకమునందలి ద్వితీయ చతుర్థపాదములు (ద్విరుక్తము లగు, తకార, లకార, నకారములను ప్రయోగించుట అను) ద్వితీయవర్ణవక్రతా ప్రకారమునకు ఉదాహరణము.

వి. "తదను విరహోత్తామ్యత్తన్వీకపోలతలద్యుతిః".

అను ద్వితీయచరణమున త కారద్విత్వమును రెండు మార్లు ప్రయోగించుటచే అది ఉదాహరణము. నాల్గవపాదమగు—

"సరసబిసినీకన్దచ్ఛేదచ్ఛవిర్మృగలాఞ్ఛనః"

అను చోట తకార, లకార, నకారములలో ఏ ఒక్కదాని ద్విత్వమును ప్రయోగింపబడలేదు. ఐనను "తలనాదయః"అను 'ఆది' గ్రహణముచే ఇతర వర్ణములను గూడ గ్రహింపవచ్చును గాన ఇచట చకారద్విత్వము రెండు పర్యాయములు ప్రయుక్త మగుట దీనికుదాహరణము.

వ్యా. (మిగిలిన వ్యంజనములు రేఫాదులతో సంయుక్తములగుటఅనెడు) తృతీయభేదమునకు ఈ శ్లోకములోని తృతీయపాదము ఉదాహరణము:—

వి. "ప్రసరతి తతో ధ్వాన్తక్షోదక్షమః క్షణదాముఖే"—
అను నీ తృతీయపాదమున ప్ర, క్ష, మొదలగునవి రేఫషకారాది సంయోగము లగుటచే ఇందుకు ఉదాహరణము.

వ్యా. ఇంకను ఎట్లనగా— (పూర్వోక్తోదాహరణము II-1 లోని) "సౌన్దర్యధుర్యం స్మితమ్" అనునది. (ఇచట ర్య అను రేఫయకారసంయోగము రెండు పర్యాయములు ప్రయుక్త మైనది.)

ఇంకను ఎట్లనగా—

'కహ్లార' శబ్దముతో హ్లాద శబ్దప్రయోగము.

వి. అనగా 'కహ్లారహ్లాదః' ఇత్యాది ప్రయోగములలో హకారసంయుక్త మగు లకారము రెండు పర్యాయములు ప్రయోగింపబడినదిగాన ఇందుకుదాహరణము. దీనిని బట్టి "రాది సంయుక్తాః" అనుదానిలోని 'ఆది' పదముచే షకారహకారాదులను గ్రహింపవలె నని యభిప్రాయము.

వ్యా. పరుషమగు రసమును చిత్రించు ప్రసంగమున అట్టి (రేఫాది) సంయోగమునకు ఉదాహరణము ఎట్లనగా—

"ఉత్తామ్యత్తాలవళ్చ ప్రతపతి తరణావాంశవీం తాపతన్ద్రీం
అద్రిద్రోణీకుటీరే కుహరిణి హరిణారాతయో యాపయన్తి"

"సూర్యుడు మిక్కిలి ఎండ కాయుచుండగా) ఎండిపోవుచున్న చెలువులు కలవై, సింహములు కొండలోయలలోని గుహారూపము లగు కుటీరములలో సూర్యకిరణతాపము వలన కలిగిన మాంద్యమును గడుపుచున్నవి"

వి. ఇచట భయంకర మగు గ్రీష్మమును వర్ణించు సందర్భమున 'తన్ద్రీం', 'అద్రి', 'ద్రోణీ' ఇత్యాదులలోని రేఫసంయుక్త వర్ణప్రయోగము ఔచిత్యసమంచితమై గ్రీష్మమునందలి తీవ్రతను సూచించుచున్నది.

వ్యా. దీనినే (ఈ వర్ణ విన్యాసవక్రతనే) మరియొక వైచిత్ర్యముతో ప్రతిపాదించుచున్నాడు:—

కా. క్వచిద వ్యవధానేఽపి మనోహారినిబంధనా
సాస్వరాణా మసారూప్యాత్ పరాం పుష్ణాతి వక్రతామ్ 3

"(వాక్యమునందలి) కొన్ని ప్రదేశములలో, వ్యవధానము లేకున్నను, అది మనోహర మగు కూర్పు కలదిగ నుండును. స్వరములకు (అచ్చులకు) సామీప్యము లేకపోవుటచే అది అధిక మగు వక్రత్వమును పోషించును."

( వ్యా.. క్వచిత్ = వాక్యముయొక్క ఏదియో యొక భాగమునందు, అవ్యవధానేఽపి = వ్యవధానము లేకున్నను. (మొదటి కారికలో చెప్పిన విధ ముగ) మాటిమాటికిని నిబంధింపబడుచున్న ఒకటి, లేక కలసియున్న రెండు, లేక అనేకములు అగు వ్యంజనములు, మనోహరనిబన్ధనా = హృదయాకర్షక మగు విన్యాసము కలదై, అగును. ఒకానొక వక్రత ఈ విధముగ సంపన్న మగు నని యర్థము. యమకమునందు స్థాననియమ ముండును, గాన దీనిని యమక మనుటకు వీలులేదు. ఇచట (అవ్యధానేఽపి అనగా వ్యంజనాంతరములతో వ్యవధానము లేకుండవలె నని యర్థము గాని) స్వరములతో వ్యవధాన ముండరా దని యర్థము కాదు. అట్టి అవ్యవధానము అసంభావ్యము కదా!

వి. అనగా ప్రథమ కారికా ప్రతిపాదిత మగు వర్ణవిన్యాసవక్రతతో పునఃపునర్నిబధ్యమానము లగు వ్యంజనములకు ఇతర జాతీయ వ్యంజనములతో స్వల్పవ్యవధాన ముండవచ్చునని ("స్వల్పాన్తరాః" అను పదముచే) చెప్పబడు చున్నది. ఇచట పునః పునర్నిబధ్యమానము లగు వ్యంజనములకు ఇతర వ్యంజ నములతో వ్యవధానము లేకపోయినను-స్వరవ్యవధాన ముండవచ్చును — అది వర్ణ వక్రతలోని ప్రకారాన్త మని యర్థము.

వ్యా. అందు ఒక వ్యంజనమును వ్యవధాన రహితముగకూర్చుట ఎట్లనగా—

'వామం' మొ ॥ (చూ 1- 44). ఇచట "ఉరో రోహత్" అను నపుడు 'రో రో' అని రేఫ పునరావృత్త మైనది గాన ఇందుల కుదాహరణము.

ద్వయమునకు ఎట్లనగా:—

తామ్బూలీ నద్ధముగ్ధ క్రముకతరుతలప్రస్తరే సానుగాభిః
పాయం పాయం కలాచీకృతకదల దలం నారికేళీఫలామ్భః
సేవ్యన్తాం వ్యోమయాత్రాశ్రమ జలజయినః సైన్యసీమన్తినీభి
ర్దాత్యూహవ్యూహ కేలీకలిత కుహుకుహూరావకాన్తా వనాన్తాః॥
(బాలరామాయణము 1—63) 10

''తమ సహచరులతో గూడిన సైన్యవనితలు తాంబూలీలతలతో అల్లుకొనిన అందమగు పోకచెట్ల నీడలలోని ఆ స్తంభములపై దొన్నెలుగా- జేసిన అరిటాకులతో నారికేళ ఫలజలమును త్రాగి త్రాగి, ఆకాశప్రయాణమున కలిగిన చెమటబిందువులను తొలగించునవియు, కాక సమూహముల క్రీడలలో బయల్వెడలిన కుహకుహధ్వనులతో మనోహరములును అగు వనాంతములను సేవింతురుగాక.'

వి. సీతా స్వయంవరమునకై, సేనాసమేతముగ మిథిలా ప్రాంతము చేరిన రావణుని మాటలివి.

ఇచట 'పాయం పాయం', 'దలదలం , 'కేలీకలి' 'కుహకుహ', అను స్థలములందు వ్యంజనద్వయము వ్యవధానరహితముగ ఆవృత్త మైనది. 10

ఇంకను ఎట్లనగా:—

అయి పిబత చకోరాః కృత్స్నమున్నామ్య కణ్ఠాన్
క్రమక (బ) వలనచఞ్చచ్చఞ్చవశ్చన్ద్రికామ్భః
విరహ విధురితానాం జీవితత్రాణహేతో
ర్భవతి హరిణలక్ష్మా యేన తేజోదరిద్రః 11

[బాలరామాయణము V—73]

''ఓ చకోరము లారా! క్రమమున కబళించుటచే కదలుచున్న ముట్టెలు కలవై, కంఠములను ఎత్తి విరహపీడితుల జీవనము లను రక్షించుటకై, వెన్నెలనీటినంతను కబళింపుడు— అట్లు చేయుటచే, చంద్రుడు తేజఃహీనుఁ డగును."

వి. ఇచట 'చఞ్చచ్చఞ్చవః' అనునవుడు రెండేసి హల్లులు అవ్యవధానముగ అవృత్తములైనవి.

వ్యా. బహువ్యంజనములకు ఆవృత్తి అవ్యవధానముగ వచ్చినపుడు ఎట్లనగా—

"సరల తరతలతా లాసికా" అను పూర్వోక్తోదాహరణాంశమున (11-2), 'రలత', 'రలత' అని వ్యంజనత్రయమునకు అవ్యవధానముగ అవృత్తి ఉండుటచే దీని కుదాహరణము.

(అవ్యవధానేఽపి అనునపుడు) అది శబ్దమును ప్రయోగించుటచే, కొన్ని స్థలములందు వ్యవధాన మున్నను, ఈ వక్రత యుండును. రెండు వ్యంజనములకు (వ్యవధానముచే నిట్టియావృత్తి యున్నపుడు) ఎట్లనగా—

"స్వస్థాః సన్తు వసన్తతే గతిపతే ర్యగ్రేసరా వాసరాః" 13

"ఓ వసన్తమా! రతిపతికి అగ్రేసరము లగు నీ వాసరములు స్వస్థముగ నుండుగాక''

వి. ఇచట 'సన్తు' 'సన్త' 'సరా' 'సరీ' అను వ్యంజన ద్వయఘటిత సముదాయములు ఆవృత్తము లైనవి. కాని ఇవి 'వ' "వా" లచే వ్యవహితము లైనవి. 'సన్తు' 'సన్త' అనునపుడు నకారతకారముల నడుమ స్వరము లేదు గాన, ఏతదుదాహరణప్రసంగమున ఆ హల్ద్వయమును ఏకహల్లుగ తీసి కొనవచ్చును.

వ్యా. బహూవ్యఞ్జనములు, ఇతర వ్యఞ్జన వ్యవహితములై ఆవృత్తము లైనపుడు ఎట్లనగా—

"చకిత చాకతమేచకిత వియతి వర్షాత్యయే" 14

'చకితము లగు చాతకములచే నల్లగా చేయబడిన వర్షాకాలాంతమునందు'

వి. ఇచట 'చకిత" అను వ్యంజనత్రయ సముదాయము పునరావృత్త మైనది. కాని వాటి నడుమ "చాతకమే" అను దానిచే వ్యవధాన మేర్పడినది.

వ్యవధానముతో ఆవృత్తి చేసిన పక్షమున కల్గు వర్ణవిన్యాస వక్రతకు వెనుకనే (ప్రథమ కారికా వ్యాఖ్యానావసరమున) ఉదాహరణాదులు చూపబడి యున్నవి. కావున మరల ఇచట చెప్పుట పునరుక్త దోషనిహతము.

అవ. ఇపుడు మూడవ కారిక ఉత్తరార్ధమును వ్యాఖ్యానించుచున్నాడు—

వ్యా. సా = ఇపుడే చెప్పబడిన ఆ వర్ణవిన్యాసవక్రత, స్వరాణాం = అకారాదిస్వరములయొక్క, అసారూప్యాత్ = అసాదృశ్యమువలన, క్వచిత్ = ఆవృత్త మగు వర్ణసముదాయముయొక్క ఒక భాగమునందు, పరాం = మరి యొక అనిర్వచనీయ మగు వక్రతను, పుష్ణాతి = పోషించును. (ఒకే విధ మగు హల్లుల సముదాయములు ఆవృత్తము లైనను వాటితో సంబంధించి అచ్చులు

మాత్రము వేరువేరుగ నుండుటచే ఒక శోభాతిశయము లభించునని యభి ప్రాయము. ఎట్లనగా-

"రాజీవ జీవితేశ్వరే" 15

వి. ఇచట 'జీవ', 'జీవి', అను హల్సముదాయములలోని హల్లులు తుల్య ములే యైనను 'జీవ' అను మొదటి సముదాయమున క్రమముగ ఈకార, అకార ములును, రెండవ సముదాయ మగు 'జీవి' అనుదానిలో ఈకార, ఇకారములును ఉన్నవి. ఈ విధముగ హల్లులు తుల్యములై యుండ అచ్చులు వేరగుటచే, ఒక వక్రతావిచ్ఛిత్తి కానవచ్చుచున్నది.

వ్యా. ఇంకను ఎట్లనగా-

'ధూసరసరితి'-

వి. ఇచట గూడ 'సర' 'సరి' అను రెండు హల్సముదాయములలో వేరు వేరు అచ్చు లున్నవి.

వ్యా. ఇంకను ఎట్లనగా-

"స్వస్థాః వస్తువసన్త" 17

వి. ఇచటగూడ అవృత్తము లగు 'సన్తు' 'సన్త' అను హల్సముదాయ ములలోని అచ్చులు మాత్రము భిన్నములు. ఇచట వ్యంజనాన్తరవ్యవధానము విశేషము.

వ్యా. ఇంకను ఎట్లనగా-

'తాలతాలీ' 18

వి. ఇచట కూడ ఆవృత్తము లగు 'తాల' 'తాలీ' అను వ్యంజనసము దాయములలో అచ్చులు వేరువేరుగ నున్నవి.

వ్యా. వర్ణవిన్యాసవక్రతతో కూడిన వాక్యమునందు విన్యస్త మగు యమ కము వలె కనబడు ఈ ఉభయవిధ మగు (వ్యవహితావ్యవహిత వ్యంజనావృత్తి రూప మగు) సన్నివేశవిశేషము ముక్తాకలాపము నడుమ గ్రుచ్చిన మాణిక్యముల పదకము వలె సుందర మైనదై ఎంతయు సహృదయహృదయాహ్లాదకారిగ నుండును. కావుననే 'అలఙ్కారస్య' ఇత్యాదికము, (మూ = కా. 1-35) చెప్ప బడినది.

వివిధప్రకారములు గల ఈ వక్రతను ఈ చెప్పు విశేషణములతో కూడిన దానినిగ చేయవలె నని చెప్పుచున్నాడు-

కా. నాతినిర్బన్ధవిహితా నాప్యపేశలభూషితా
పూర్వావృత్తపరిత్యాగ నూతనావర్తనోజ్జ్వలా. 4

"దీనిని ఎక్కువ పట్టుదలతో, కూర్చగూడదు. ఇది అసుందరము లగు (రసాననుగుణము లగు) వర్ణములతో భూషితము కారాదు. పూర్వము ఆవృత్తము లగు వర్ణసముదాయమును విడచి (అనగా మాటిమాటికిని ఒకే వర్ణసముదాయ మును ఆవృత్తిచేయరాదు. ఒకటి రెండు సార్లు ఒక వర్ణసముదాయమును ఆవృత్తి చేసి, దానిని విడచి) క్రొత్త (మరియొక) వర్ణసముదాయముయొక్క ఆవృత్తిచే ప్రకాశించునదిగ ఉండవలెను" 4

వ్యా. 'నాతినిర్బన్ధవిహితా'— ఇచట నిర్బన్ధశబ్దము వ్యసనము- అనగా 'అదియే కావలయును' అనుపట్టుదల- అను అర్థమును బోధించును. అట్టి అతి నిర్బన్ధేన = మాటిమాటికి ఆవృత్తి చేయవలయు ననెడు పట్టుదలతో, కూర్చ బడనిది; అప్రయత్నముగ రచిత మైనది అని యర్థము. పట్టుదలతో ప్రయత్న పూర్వకముగ కూర్చినచో ప్రస్తుత (రసాద్యౌ) చిత్యము దెబ్బతినుటచే, వాచ్య వాచకముల- పరస్పరస్పర్ధిత్వరూప మగు సాహిత్యము లేకుండ పోవును. (అనగా ప్రయత్నపూర్వకముగ వర్ణముల నావృత్తి చేసినచో అర్థము కుంటువడును. అపుడు శబ్దార్థముల నడుమ పూర్వప్రతిపాదిత మగు సాహిత్యము లేకుండ పోవును). ఎట్లనగా-

"భణతరుణి" మొ॥ (చూ. ఉదా 1-9)

వి. ఈ శ్లోకమున కవి ప్రయత్నపూర్వకముగ వర్ణావృత్తికై పాటు బడుటచే వాచ్యవిచ్ఛిత్తి లోపించినది. కావున ఈ విధముగ కూర్పరాదు.

వ్యా. 'నాప్యపేశలభూషితా'— అపేశలైః = సుకుమారములు కాని వర్ణములతో; కూర్పబడినది కాకూడదు. ఎట్లనగా-

"శీర్ణఘ్రాణాంఘ్రి" ఇత్యాద్యుదాహరణమున.

వి. శీర్ణఘ్రాణాంఘ్రిపాణీన్ వ్రణిభిరపఘనైర్ఘర్ఘరావ్యక్తఘోషాన్
దీర్ఘాఘ్రాతా నఘౌఘైః పునరపి ఘటయత్యేక ఉల్లాఘయన్యః.
ఘర్మాంశోస్తస్యవోఽన్తర్ద్విగుణ ఘనఘృణానిఘ్ననిర్విఘ్నవృత్తే
ర్దత్తార్ఘాః సిద్ధసంఘైర్విదధతుఘృణయః శీఘ్రమంహోవిఘాతమ్.

అను నీ మయూరవిరచితసూర్యశతకశ్లోకమున ర్ఘ, ఘ్న, మొదలగు పరుషవర్ణముల పునఃపునరావృత్తి ఔచితీదూర మైనది గాన ఇది వర్ణవిన్యాసవక్రతకు ఉదాహరణము కాజాలదు.

వ్యా. అట్లైన ఎట్టి దానిని కూర్చవలెను. అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు—

"పూర్వావృత్త పరిత్యాగ నూతనావర్త నోజ్జ్వలా". పూర్వం = వెనుక, ఆ వృత్తానాం = మాట మాటికిని కూర్పబడిన వర్ణముల, పరిత్యాగేన = విడచుట చేతను, నూతనా నాం = క్రొత్త వర్ణముల, ఆ వర్తనేన-మాటి మాటికిని కూర్చుట చేతను, ఈ విధముగ రెండు ప్రకారముల చేతను ప్రకాశించునది.

ఎట్లనగా—

ఏతాం పశ్య పురస్తటీమిహ కిల క్రీడాకిరాతో హరః
కోదండేన కిరీటినా సరభసం చూడాన్తరే తాడితః.
ఇత్యాకర్ణ్య కథాద్భుతం హిమనిధావద్రౌ సుభద్రాపతే
ర్మన్దం మన్దమకారి యేన నిజయోర్దోర్దణ్డయోర్మణ్డనమ్. 22

"ఎదుట ఈ తటమును చూడుము-ఇచట కిరాత వేషధారి యగు ఈశ్వరుని అర్జునుడు ధనస్సుతో నడినెత్తిపై కొట్టినాడట. ఈ విధముగ హిమవత్పర్వతముపై అర్జునుని కథకు సంబంధించిన అద్భుత విషయమును విని అతడు తన దోర్దండముల అలంకారములను మెల్లమెల్లగ సర్దుకొనెను" అనగా యుద్ధ సన్నద్ధత్వమును సూచించుచు బాహుపురులు మొద లగు అలంకారములను సర్దుకొనెను. 22

వి. ఈ శ్లోకమునందలి పూర్వార్ధమున కకారమును అనేక పర్యాయములు ఆవృత్తి చేసి దానిని విడచి క్రమముగా 'డ' కారము, ద కారరేఫములు,

'మన్ద' శబ్దము ఐకార, దకారములు ఆవృత్తము లగుటచే శోభాతిశయము చేకూరినది.

వ్యా. ఇంకను ఎట్లనగా—

"హంసానాం నినదేషు" ఇత్యాది పూర్వోదాహృత (చూ I-78) శ్లోకమున.

వి. ఈ శ్లోకమున మొదట నకారము, పిమ్మట తకారము, తరువాత గకార రేఫములును ఆవృత్తము లైనవి.

వ్యా. ఇంకను ఎట్లనగా—

'ఏతన్మంద విపక్వ' ఇత్యాది పూర్వోదాహృత (చూ. I-107) శ్లోకమున.

వి. ఇచట మొదట 'న్ద' అనునదియు, పిమ్మట 'న్త' మరల 'న్ద' పిమ్మట 'క్ష' మొదలగునవి పునః పునరావృత్తములై శోభాతిశయ జనకములుగ నున్నవి—

వ్యా. ఇంకను ఎట్లనగా—

"నమత దశానన సరభస
కర తులితవలచ్ఛైలభయ విహ్వలామ్‌।
వేపమానస్థూల స్తనభర
హరకృతకంఠ గ్రహాం గౌరీమ్" 25

"దశాననుడు తొందరగ కరములతో కదల్చుటచే వంగుచున్న పర్వతముపై భయముచే వ్యాకులు రాలైనట్టియు, కదలుచున్న స్థూలమగు స్తనభారము కలుగునట్లుగా హరుని విషయమున చేయబడిన కంఠ గ్రహణము గల (హరుని కంఠమును కౌగలించుకొనుచున్న) పార్వతికి నమస్కరింపుడు."25

వి. ఇచట మొదట 'ఆ' కారము పిమ్మట 'హర' శబ్దము ఆవృత్తము లైనవి.

వ్యా. ఈ విధముగ వర్ణ విన్యాస వక్రతను వ్యాఖ్యానించి దానిని ఉపసంహరించుచున్నాడు—

కా. వర్ణచ్ఛాయానుసారేణ గుణమార్గానువర్తినీ
వృత్తి వైచిత్ర్యయుక్తేతి సైవ ప్రోక్తా చిరంతనైః. 5

"వర్ణముల సౌందర్యము ద్వారా ప్రధాన వస్తువునందు (రసాదికమునందు) ఇముడుచు గుణములను, మార్గములను, అనుసరించుచు ఉండెడు అదియే (వర్ణ విన్యాస వక్రతయే) వృత్తి వైచిత్ర్యముతో కూడిన దని అతిప్రాచీనులచే చెప్పబడినది." 5

వ్యా. వర్ణానాం = అక్షరములయొక్క, ఏ, ఛాయా = కాన్తి యున్నదో-అనగా శ్రవ్యముగా నుండుట వంటి గుణసంపద కలదో-నిమిత్త భూత మగు దానిచేత, 'ఏ' అనుసరణం = ప్రాప్యము లగు గుణ మార్గముల స్వరూపమునందు అను ప్రవేశము కలదో, దానిచేత, గుణాన్ = మాధుర్యాది గుణములను, మార్గాంశ్చ = సుకుమారాది మార్గములను, ఏది అనుసరించుచున్నదో, అట్టిది. వాటిలో గుణములు ఆంతరంగికములు గాన వాటిని (మార్గములకంటె) ముందుగ చెప్పియున్నాడు. ఏలయన-ముందుగ గుణముల ననుసరించి వాటి ద్వారా మాత్రమే మార్గానుసరణము చేయ వీలగును. దీని యర్థ మేమనగా-వర్ణవిన్యాస వక్రత యనునది వ్యఞ్జన చ్ఛాయను అనుసరించి యుండునదే యైనను, ఇది (ఈ వర్ణవిన్యాస వక్రత) ప్రతి నియతము లగు (ఈ మార్గమునకు ఈ గుణములు అను రీతిని నియతము లగు) గుణములతో గూడిన మార్గములను అనువర్తించుచు, (అనగా మార్గములకు అనుకూలముగ నుండుచు,) ఏ విధముగ స్వరూపాను ప్రవేశమును చేయునో (గుణమార్గముల స్వరూపమున లీన మగునో) ఆ విధముగ చేయదగినది.

వి. అనగా వర్ణవిన్యాస వక్రత యను దాని కొక స్వతంత్రస్థితి లేదు. ఇది గుణములకును, తద్ద్వారా మార్గములకును, అంగముగ నుండును. ఈ వర్ణ విన్యాస వక్రతను బట్టియే గుణము లేర్పడును. తద్ద్వారా మార్గము లేర్పడును అని అభిప్రాయము. వర్ణములను తీసి వేసిన పదము లుండనట్లు, దీనిని తీసి వేసిన గుణములు కూడ ఉండవు. కాని, వ్యవహారార్థమై పదముల నుండి విడదీసి వర్ణములను గూర్చి ముచ్చటించినట్లు గుణమార్గాదుల నుండి విడదీసి ఈ వర్ణవిన్యాస వక్రతను గూర్చి చెప్పుచుందురు.

వ్యా. కావుననే, గుణమార్గాను వర్తన మూలకము లగు ఎన్నియో, వర్ణవిన్యాస వక్రతా భేదములు, కానవచ్చుచున్నవి. కాని, ప్రాచీనాలంకారికులు అదియే స్వతంత్రరూపమున వృత్తి వైచిత్ర్యముతో కూడియున్న దని చెప్పి యున్నారు. అనగా, వృత్తీనాం = ఉపనాగరి కాది వృత్తుల, ఏ, వైచిత్ర్యం = తమ యందున్న సంఖ్యా భేదముచే భిన్న మగుట అనెడు ఏ విచిత్రత్వము కలదో, దానితో కూడిన దని ప్రాచీను లగు పండితులచే చెప్పబడినది.

వ్యా. దీని తాత్పర్య మేమనగా-ఇది (వర్ణవిన్యాస వక్రత) సకల గుణముల స్వరూపములను అనుసరించుచు, వానితో సమన్వయమును పొందుచు, (తద్ద్వారా) సుకుమారాది మార్గములను అనువర్తించుటకై ప్రయత్నించుచుండును. కావున దీనికి అస్వాతంత్ర్యము, అపరిమిత సంఖ్యాకత్వము అను ఉభయమును ఉండి తీరును. కావున ఇది స్వతంత్ర మనియు, పరిమిత మగు భేదములు కలదనియు చెప్పుట అంత యుక్తము, కాదు.

(ప్రశ్న). మొదట (ద్వితీయోన్మేష ప్రారంభమున) ''ఏకౌ ద్వౌ'' ఇత్యాది కారికచే పరిమిత సంఖ్యాకము లగు భేదములను ప్రతిపాదించి దీనికి స్వతంత్రత్వమును గూడ స్వయముగ చూపి, ఇపుడు ఇట్లనుట అయుక్తము కదా? అని ఆశంకింపరాదు. ఏలయన—

(సమాధానము) లక్షణకారులు, ఒక సముదాయమునందు (అంగముగ నుండి) పరాధీనముగ నున్నను, ఒక పదార్థమును, పరవ్యుత్పత్తి కొరకు, బౌద్ధిక కల్పనలచే విడదీసి దాని స్వరూపమును స్వతంత్రముగ చూపుచుందురు. పిమ్మట అది సముదాయాంతర్భూతమే యగును. కావున ఈ అతిప్రసంగము చాలును.

అవ. ఇపుడు యమకరూప వర్ణవిన్యాస వక్రతను ప్రతిపాదించుచున్నాడు—

వ్యా. ఈ వర్ణవిన్యాస వక్రతారూప మగు శబ్దాలంకారమునకు స్థాననియమము లేదు గాన, ఇది సకల వాక్య విషయకము. (వాక్యమునం దెక్కడైనను ఉండవచ్చును.) దీనినే నియతస్థానమునందు కూర్చినచో ప్రకారాన్తర విశిష్టమై మరియొక విధమగు వైచిత్ర్యమును కూర్చునని చెప్పుచున్నాడు—

కా. సమాన వర్ణ మన్యార్థం ప్రసాది శ్రుతిపేశలమ్
ఔచిత్య యుక్త మాద్యాది నియతస్థానశోభి యత్ 6

కా. యమకం నామ కోఽప్యస్యాః ప్రకారః పరిదృశ్యతే
స తు శోభా న్తరాభావా దిహ నాతి ప్రతన్యతే 7

"సమాన మగు వర్ణములు కలదియు, (కాని) భిన్నార్థములు కలదియు, ప్రసాద గుణయుక్తమును, చెవులకు ఇంపైనదియు, (రసాది) ఔచిత్య యుక్తమును, ఆది, మొదలగు (ఆది, మధ్యము, అంతము అనెడు) స్థానములందు శోభించునదియు, అగు యమక మనెడు మరి యొక వర్ణవిన్యాస వక్రతా భేదము కూడ ఉన్నది. కాని శోభా భేద మేమియు లేకుండుటచే దానిని గూర్చి ఇచట అంతగా విస్తృత నిరూపణము చేయుటలేదు." 6; 7

వ్యా. 'కోఽప్యస్యాః ప్రకారః పరిదృశ్యతే' అస్యాః = పూర్వోక్త మగు ఈ వర్ణవిన్యాసవక్రతయొక్క, కోఽపి = అపూర్వమగు భేదము చూడబడు చున్నది. అది ఏది- అని చెప్పుచున్నాడు– 'యమకం నామ' యమకమని దేనికి ప్రసిద్ధి యున్నదో అది. అది ఎట్టిది–? 'సమానవర్ణమ్'; సమానాః = సమాన మగు రూపము, సమాన మగు శ్రవణము, గల వర్ణములు దేనియందో అట్టిది. ఒకటి గాని, రెండు గాని, అంతకంటె ఎక్కువ గాని యగు సమాన ముగ వినవచ్చు వర్ణములను వ్యవహితముగా గాని, అవ్యవహితముగా కాని, కూర్చుటకు యమక మని పేరు. ఈ విధముగ ఒకే విధముగ నుండు రెండు ఆకారము లున్నను– అన్యార్థమ్ = వేరువేరు అర్థములుకలది.

ఇంకను ఎట్టిది ? ప్రసాది = ప్రసాదగుణముతో కూడినది: వెంటనే అర్థ స్ఫూర్తి కలిగించునది. అర్థము తెలిసికొనుటకు శ్రమపడవలసిన పని లేనిది అని భావము. దానికే 'శృతిపేశలమ్' అని గూడ విశేషణమును చెప్పు చున్నాడు. శ్రుతిః = శ్రవణేన్ద్రియము, దానియందు, పేశలం = రంజకము; కఠినము కాని శబ్దములతో కూర్పబడినది. ఎట్టిది? 'ఔచిత్యయుక్తమ్' ఔచిత్యం = వస్తువుయొక్క స్వభావమునందలి ఉత్కర్షము; దానితో, యుక్తం = కూడినది. ఎచట యమకమును కూర్చుటయందలి ఆసక్తిచే ఔచిత్యమునకు గ్లాని కలుగ కుండునో, అది యని యర్థము. దానినే "ఆద్యాదినియతస్థానశోభి యత్"

అను మరి యొక విశేషణముచే విశేషించుచున్నాడు. ఆదిః ఆదిః యేషాం తే = ఆది వేటికి మొదటిదో అవి, ప్రథమ మధ్యమాంతములు. అవియే నియతము లగు స్థానములు- అనగా విశిష్టము లగు సన్నివేశములు. వానితో శోభతే- ప్రకాశించుచున్నది గాన అట్లు చెప్పబడుచున్నది. ఇచట 'ఆది' మొదలగు సంబంధిశబ్దములను (సంబంధవాచకశబ్దములను) 'పద' మొదలగు శబ్దములతో కూడిన వాటినిగ గ్రహింపవలెను.

వి. అనగా ఆది, మధ్యము, అంతము, అని యనగనే, దేనియొక్క ఆది? అను ఆశంకకలుగును కావున పదముయొక్క లేక పాదముయొక్క లేక శ్లోకముయొక్క ఆది, మధ్యము, అంతము, అను నర్థము గ్రహింపవలె నని యభిప్రాయము.

వ్యా. అ (యమకరూపమగువర్ణవిన్యాసవక్రతా) ప్రకారము పైన చెప్పిన లక్షణసంపదతో కూడిన దైనను; ఇహనాతి ప్రతన్యతే = ఈ గ్రంథమున ఎక్కువ విస్తారముగ వర్ణింపబడుటలేదు. ఎందువలన? 'శోభా న్తరాభావాత్' = స్థాన నియమము కంటె భిన్నమగు మరి యొక, శోభా న్తరస్య = ఛాయాంతరము, సంభావ్యముకాదు కావున అని యర్థము. దీనియందు (యమకము నందు) వర్ణ విన్యాసవైచిత్ర్యము మాత్రమే యున్నది కాని తద్భిన్న మగు మరి యొక జీవిత విశేష మేదియును కానరాదు. కావున ఇది వెనుక చెప్పిన వర్ణవిన్యాసవక్రతా రూపాలంకారములో ఒక భేదము అని మాత్రమే అంగీకరించుట యుక్తము. శిశుపాలవధమునందలి చతుర్థసర్గమునందలి, ఝటిత్యర్థస్ఫూర్తిజనకము లగు కొన్ని యమకములును, రఘువంశము నందలి వసంతవర్ణనఘట్టమునందలి (నవమ సర్గలోని) (అన్ని) యమకములును ఇందులకు ఉదాహరణము.

వి అనగా శీఘ్రముగ అర్థస్ఫూర్తి కలిగింపజాలని, శిశుపాలవధచతుర్థ సర్గమునందలి, మిగిలిన యమకములను వాస్తవమున యమకములుగ గ్రహింప రాదని యభిప్రాయము. 7

వ్యా. ఈ విధముగ పదావయవములగు వర్ణముల విన్యాసమునందలి వక్రతను గూర్చి విచారించిన పిమ్మట వర్ణసముదాయాత్మకము లగు పదముల వక్రభావముయొక్క విచారము క్రమప్రాప్తము గాన, అందు పదపూర్వార్ధవక్ర తలో ఎన్ని భేదము లుండవచ్చునో చెప్పుటకుపక్రమించుచున్నాడు-

వి. సుబంతములు, తిజంతములు అని పదములు రెండు విధములు. సుబంతపదముల - పూర్వార్ధము ప్రాతిపదికము' తిజంతపదముల పూర్వార్ధము ధాతువు. ఈ రెండింటి వక్రతకు పదపూర్వార్ధ వక్రత యని పేరు. ఇందు 1. రూఢివైచిత్ర్యవక్రత, 2. పర్యాయవక్రత, 3. ఉపచారవక్రత, 4. విశేషణ వక్రత, 5 సంవృతి వక్రత, 6. వృత్తివైచిత్ర్య వక్రత, 7. లింగవక్రత, 8. క్రియావైచిత్ర్యవక్రత అను ఎనిమిది భేదములున్న వని ప్రథమోన్మేషనమున చెప్పబడెను ఇపుడు రూఢి వైచిత్ర్యవక్రతను నిరూపించుచున్నాడు.

కా. యత్ర రూఢేరసంభావ్యధర్మాధ్యారోపగర్భతా.
సద్ధర్మాతిశయారోపగర్భత్వం వా ప్రతీయతే. 8
లోకోత్తరతిరస్కారశ్లాఘ్యోత్కర్షాభిధిత్సయా.
వాచ్యస్య సోచ్యతే కాపి రూఢివైచిత్ర్యవక్రతా. 9

"వాచ్య మగు అర్థమునకు, లోకోత్తర మగు తిరస్కారమును గాని, శ్లాఘ్య మగు ఉత్కర్షను గాని చెప్పవలె ననెడు ఇచ్ఛచే, ఎచట రూఢశబ్దము అసంభావ్య మగు ధర్మముయొక్క అధ్యారోపము గర్భమునందున్నట్లుగ గాని, వాస్తవమునందున్న ధర్మముయొక్క అతిశయముయొక్క ఆరోపము గర్భము నందున్నట్లుగ గాని ప్రతీత మగునో అది (అట్టి ప్రతీతి) ఒకానొక అపూర్వ మగు రూఢివైచిత్ర్యవక్రత యని చెప్పబడుచున్నది" 8-9

వ్యా "యత్రరూఢేరసమ్భావ్యధర్మాధ్యారోపగర్భతా ప్రతీయతే"- నియత మగు అర్థమును బోధించుట అనెడు శబ్దమునందలి ఒక ధర్మమునకు రూఢి యని పేరు. రోహణము (అనగా ఒక శబ్దమునుండి ఒక యర్థము మొలచినట్లు పైకి వచ్చుట) రూఢి యని దీని వ్యుత్పత్త్యర్థము. నియతముగ ఒక సామాన్యార్థమును బోధించుట యనియు, నియతముగ ఒక విశేషార్థమును బోధించుట యనియు ఆ రూఢి కూడ రెండు విధములు. కావున ఇచట ధర్మమునకును, ధర్మికిని అభేదమును ఆరోపించుటచే (ధర్మవాచక మగు) 'రూఢి' శబ్దము, రూఢిప్రధాన మగు (ధర్మియైన) 'శబ్ద'మును బోధించును. (అనగా— ఈ కారికయందలి 'రూఢేః' అనుదానికి 'రూఢార్థమును బోధించు శబ్దమునకు' అని యర్థము). యత్ర = ఏ విషయమున, రూఢిశబ్దమునకు, అసమ్భావ్యః = ఊహింప శక్యము

కాని, ఏ, ధర్మః = ఒకానొక పరిస్పందము, కలదో, దానియొక్క, అధ్యారోపః = సమర్పణము, గర్భః = అభిప్రాయము దేనికో అది; దానియొక్క భావము. అసమ్భావ్యధర్మాధ్యారోపగర్భత, అది ఏ విషయమున ప్రతీత మగునో అని సంబంధము.

'సద్ధర్మాతిశయారోపగర్భత్వంవా' = సన్ చ అసౌ ధర్మశ్చ సద్ధర్మః = విద్యమాన మగు పదార్థధర్మము; దానియందు ఏదియో ఒకానొక అపూర్వ మగు అతిశయస్య = అద్భుతరూప మగుమహిమయొక్క, ఆరోపణమ్ = సమర్పణము, గర్భః = అభిప్రాయము దేనికోఅది, దానియొక్క భావము సద్ధర్మాతిశయా రోపగర్భత్వము. అదిగాని ఎచట ప్రతీయమానమగునో...

ఏ హేతువుచేత ? "లోకోత్తరతిరస్కారశ్లాఘ్యోత్కర్షాభిధిత్సయా" లోకోత్తర = సర్వాతిశాయి యగు, ఏ, తిరస్కారః = దూషణము కలదో, శ్లాఘ్యశ్చ = ప్రశంస నీయ మగు, ఏ ఉత్కర్షః = సాతిశయత్వము కలదో, వాటియొక్క, అభిధిత్సా = చెప్పుటకొరకు ఇచ్ఛ, చెప్పవలెననెడు అభిలాష; దానిచే. దేనియొక్క? వాచ్యస్య = రూఢిశబ్దముచే వాచ్య మగు ఏ అర్థము కలదో దానియొక్క, అది, ఉచ్యతే = చెప్పబడుచున్నది; కాపి = అలౌకిక మగు, 'రూఢివైచిత్ర్య వక్రతా" రూఢి శబ్దముయొక్క ఈ విధ మగు వైచిత్ర్య మాచే కలిగిన వక్రత్వము.

దీనితాత్పర్య మేమనగా అనుమానము వలె సామాన్యమును మాత్రము బోధింప గల్గిన శబ్దములు, విశేషమును బోధించుట అనునది ఏదియును స్వభావ సిద్ధముగ సంభావ్యము కాకున్నను ఈ (అసంభావ్యధర్మాధ్యారోపము లేదా విద్యమాన ధర్మాతిశయాధ్యారోపము అనెడు) యుక్తిచే అవి కవివివక్షిత నియత విశేష బోధకము లగుచు ఒక అపూర్వ మగు చమత్కారమును కలిగించును.

వి. సాంఖ్య, యోగ, దర్శనములందు ప్రత్యక్షము, అనుమానము. శబ్దము అను మూడు ప్రమాణములను అంగీకరించిరి. అందు ప్రత్యక్షము విశేషావధారణ ప్రధాన మనియు, అనుమానశబ్దములు సామాన్యావధారణ ప్రధానము లనియు, వారిమతము. ప్రతివస్తువునకును, సామాన్యారూపము, విశేష రూపము అను రెండు రూపము లుండును. ఉదాహరణమునకు— "ఇది వృక్షము" అను నపుడు వృక్షమునందు. వృక్షత్వము అనెడు సామాన్యరూప

మున్నది. ఆ వృక్షత్వము ప్రపంచమునందలి సకలవృక్షములయందును ఉన్నది. అట్లే ఆ వృక్షమున ఒక ఎత్తు, ఒక ఆకారము, మొదలగు విశేషము కూడ ఉన్నది. అది ప్రపంచమునందలి ఇతరవృక్షములలో లేక ఈ వృక్షము నందు మాత్రమే ఉన్నది గాన, అది, దాని విశేషరూపము. ప్రత్యక్షముగ మన కండ్లతో ఆ వృక్షమును చూచు నపుడు దాని విశేషరూపము మన కండకు గోచరించును. కాని అనుమానము ద్వారా గాని, శబ్దప్రమాణము ద్వారా గాని, ఏదైన ఒక వస్తువును తెలిసికొని నపుడు దాని సామాన్యరూపము మాత్రమే మనకు గోచరించును, కాని విశేషరూపము గోచరించదు. ఉదాహరణమునకు—

ధూమమును చూచి దూరమున వహ్ని యున్నదని ఊహించు నప్పుడు కాని, లేదా, 'అచట అగ్ని యున్నది' అను ఇతరుల వాక్యమును విన్నినప్పుడు గాని, దాని సామాన్యరూపమే మనకు గోచరించును గాని, ఆ అగ్ని ఆకార మెట్లున్నది— దాని మంటలు ఎంతవరకు ఎగయుచున్నది; మొదలగు విశేషము లేవియు మనకు గోచరము కావు.

ప్రకృతమున కుంతకుడు చెప్పిన దేమనగా— అనుమానము ద్వారా వస్తుజ్ఞానము కలిగి నపుడు ఏ విధముగ ఆ వస్తువుకు సంబంధించిన విశేష రూపముమనకు బుద్ధిగోచరము కాజాలదో అట్లే శబ్దము ద్వారా కూడ ఒక వస్తువు నకు సంబంధించిన రూపమే బుద్ధిగోచర మగును గాని, విశేష రూపము కాజా లదు. ఇది శబ్దస్వభావము. అయినను వ్యఞ్జనాది సాహాయ్యముచే కవి వివక్షిత మగు విశేషరూపము గూడ బుద్ధిగోచరము గావచ్చును. తద్ద్వారా చమత్కారము కలుగును.

వ్యా. ఎట్లనగా—

"తదా జాయన్తే గుణాః యదా తే సహృదయైర్గృహ్యన్తే
రవికిరణానుగృహీతాని భవన్తి కమలాని కమలాని"

'సహృదయు లెప్పుడు గ్రహింతురో అప్పుడే అవి గుణము లగును. సూర్యకిరణములచే అనుగృహీతము లగు కమలములే కమలము లగును'

వి. ఇచట రెండవ "కమలాని" అను పదమునకు 'సౌందర్యాది విశేష యుక్తము లగు కమలములు' అను నర్థ మగుటచే ఈ పదము అసంభావ్య

ధర్మాధ్యారోప గర్భము గాన, ఇది ఉత్కర్ష వివక్షాకృత మగు రూఢివైచిత్ర్య వక్రతకు ఉదాహరణము.

వ్యా. (ఎనిమిదవ కారికలోని) 'ప్రతీయతే' అను విచిత్రక్రియాపద ప్రయోగమునందలి అభిప్రాయ మేమనగా— ఇట్టి విషయములలో శబ్దముల అభిధావ్యాపారము పనిచేయదు. ఇక నేమనగా— వాటికి గల వస్త్వంతరమును రంజింప జేయుశక్తియే— అనగా వ్యంజన వ్యాపారమే పనిచేయును. ఇది, (వ్యంజనచే వస్త్వంతర ప్రతీతిని కల్గించుట అనునది) యుక్తి యుక్తమే యైనను దీనిని గూర్చి విస్తృత మగు విచార మిచట చేయబడుటలేదు. ధ్వని కారుడు వ్యంగ్య వ్యంజకభావమును బాగుగ సమర్థించి యున్నాడు కదా? ఇచట మరల పునరుక్తి ఎందులకు?

వి. అనగా ధ్వనికారుడు చెప్పిన అత్యంత తిరస్కృతవాచ్య, అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వనులను కుంతకుడు క్రమముగ అసంభావ్య ధర్మారోప గర్భ మగు రూఢివైచిత్ర్య వక్రతయందును, సద్ధర్మాతిశయాధ్యారోపగర్భ రూఢి వైచిత్ర్య వక్రతయందును అంతర్గతము చేసినాడు.

వ్యా. ఈ రూఢి వైచిత్ర్యవక్రత ముఖ్యముగ రెండు విధముల సంభ వించును. రూఢి పద వాచ్యార్థ మగు (రామాదిరూపవక్త) తానే తనయందు ఉత్కర్షమును గాని, నికర్షమును గాని ఆరోపించుకొనుటకై యత్నించు చున్నట్లు కవిచే వర్ణింపబడినచో మొదటి విధము. మరియొక డెవ్వడైన ఆ ఉత్కర్ష నికర్షములను చెప్పినచో అది రెండవ భేదము. ఎట్లనగా—

"స్నిగ్ధశ్యామల" మొ (చూ I—42)

ఇచట "దృఢం కఠోరహృదయః" "సర్వం సహే" అను రెండింటి చేతను గూడ ప్రతిపాదింప శక్యము కానిదియు, ఈ విధములైన వివిధోద్దీపన విభావముల ప్రభావమునుగూడ సహించెడు స్వార్థమునకు కారణభూతమైన దియు, సహింపరాని జనకసుతా విరహవ్యథచే ఎగుడు దిగుడుగ నున్న సమ యమునందుకూడ సిగ్గులేక ప్రాణములను రక్షించుకొనుట యందు నేర్పు కలిగి యుండుట యనెడు లక్షణము కలదియు, సంజ్ఞాపదసంపాదితమును, ఊహింప శక్యముకానిదియు అసాధారణమును అగు ఒకానొక క్రౌర్యము "రామ"శబ్దముచే

వ్యజింపబడుచున్నది వర్షకాలమ నందలి సుందరపదార్థములదర్శనమును సహింప జాలకుండుటకు కారణభూతమును, సహజ సౌకుమార్య సులభమును అగు ఆమెకు గల ఒకానొక కాతర స్వభావము 'వై దేహి' అను పదముచే సమర్థింపబడు చున్నది. పూర్వోక్తము కంటె విశేషమును బోధించు "తు' శబ్దమునకు ఇదియే (రాముని కఠోరత్వమునకు విరుద్ధ మగు సీతయొక్క కాతరత్వమే) జీవితము.

వి. ఇచట "రామోఽస్మి" అనునపుడు రాముడే స్వయముగ తన నికర్షమును చెప్పుచున్నాడు గాన మొదటి విధమునకును, కాతరత్వాది వ్యంజక మగు వై దేహి అను పదమును ప్రయోగించినవాడు వై దేహిభిన్ను డగు రాము డగుటచే రెండవ ప్రకారమునకును గూడ, ఇవి ఉదాహరణము. రామునియందు వాస్తవమున క్రౌర్యము లేదు గాన ఇది అసంభావ్య ధర్మాధ్యారోప గర్భము.

వ్యా. విద్యమాన మగు ధర్మమునకు చెందిన అతిశయము నారోపించుట గర్భమునం దుండుట ఎట్లనగా—

తతః ప్రహస్యాహ పునః పురన్దరం
వ్యపేతభీర్భూమి పురన్దరాత్మజః.
గృహాణ శస్త్రం యది సర్గ ఏష తే
న ఖల్వనిర్జిత్య రఘుం కృతీ భవాన్ 28

"అంతట భూలోక దేవేంద్రు డగు దిలీపుని కుమారుడు భయము లేనివాడై, నవ్వి, దేవేంద్రునితో నిట్లనెను. ఇదియే నీ నిశ్చయ మైనచో ఆయుధము పట్టుము. రఘువును జయింపకుండగా నీవు చరితార్థుడవు కాజాలవు." 28

సురపతి ఎల్లెడలను అడ్డులేని ప్రభావము కలవా డైనను, ఆతనికి కల్గిన అట్టి నిర్ణయమును (అశ్వమును తిరిగి ఈయరాదను నిశ్చయమును) ఎదుర్కొన గలిగిన అట్టి సామర్థ్యమును బట్టి వచ్చిన తన పౌరుషాతి శయము 'రఘు' శబ్దముచే నిచట ప్రతీత మగుచున్నది. 'ప్రహస్య' అనునది దీనికే చేయూత నొసగుచున్నది. ఇచట రఘువే స్వయముగ తన ఔన్నత్యమును చెప్పుకొను చున్నాడు గావున నిది ప్రథమ భేదమునకు చెందినది. అతని యందా అతిశయము వాస్తవముననే ఉన్నది గాన సద్ధర్మారోప గర్భత్వము

వక్త అన్యమైనపుడు ఉదాహరణము ఎట్లనగా —

ఆజ్ఞా శక్రశిఖామణి ప్రణయినీ శాస్త్రాణి చక్షుర్నవం
భక్తిర్భూతపతౌ పినాకిని పదం లంకేతి దివ్యా పురీ.
సమ్భూతిర్ద్రుహిణాన్వయే చ తదహో నేదృగ్వరో లభ్యతే
స్యాచ్చేదేష న రావణః క్వ ను పునః సర్వత్ర సర్వే గుణాః. 29

"ఆజ్ఞ దేవేంద్రుని శిరోమణులయందు ప్రేమ గలది (దేవేంద్రునిచేత గూడ శిరసా ధరింపబడుచున్నది). శాస్త్రములు నూతనమగు నేత్రము. సర్వ భూతపతి యగు ఈశ్వరునిపై భక్తి యున్నది. లంక యనెడు దివ్య పత్తనము నివాస స్థానము. బ్రహ్మయొక్క వంశమున జన్మ. ఈతడు రావణుడు కాకున్నచో ఇట్టి వరుడు లభింపడు. అందరియందును అన్ని గుణములును ఎట్లుండును." 29

బాల రామాయణములోని పంచమాంకములో జనక శతానందులు మాట లాడుకొను సందర్భమున శతానందుడు-ఈ రావణుడు రావణుడే కనుక కాకున్నచో ఈతనికంటె ఉత్తము డగు వరుడు వేరొక డుండజాల డని అను మాటలివి.

ఇచట 'రావణ' శబ్దముచే సకలలోక ప్రసిద్ధ మగు దుర్విలాస గల దశాననుని యందు వ్యక్తమైనదియు, సద్వంశము, వివేకము, సదాచారము, ప్రతాపము, సంభోగసుఖము, సమృద్ధి యనెడు సమస్త మగు వరగుణసామగ్రి వైశిష్ట్యము మరుగుపడి పోవుటకు కారణభూతమును, సకలలోక ప్రసిద్ధ మగు దశాననుని దౌష్ట్యముకంటె భిన్నమును, స్వీకరింప తగినవాడు కాడు అని చెప్పుటకు కారణభూతమును అగు ఒకానొక నీచత్వము ప్రతీతమగుచున్నది.

విద్యమాన మగు గుణమునందలి అతిశయము యొక్క ఆరోపము శబ్దమునందుండుట ఎట్లనగా—

"రామోఽసౌ భువనేషు విక్రమగుణైః
ప్రాప్తః ప్రసిద్ధిం పరామ్" 30

"ఈ శ్రీరాముడు విక్రమగుణములచే భువనములలో ఎక్కువ ప్రసిద్ధిని పొందియున్నాడు." (మూ-I-48)

ఇచట 'రామ' శబ్దముచే మూడు లోకములందును అత్యుత్కృష్ట మైనది యును, రావణుని అనుచరులకు ఆశ్చర్యకారణమును అగు శౌర్యాతిశయము గమ్యమగుచున్నది.

ప్రతీయమానము లగు ధర్మములు ఎన్నియో ఉండుటచు ఇట్టి ఈ రూఢి వైచిత్ర్య వక్రత గూడ అనేక ప్రకారములు కలదిగనున్నది.

ఎట్లనగా—

గుర్వర్థమర్థీ శ్రుతపారదృశ్వా
రఘోః సకాశాదనవాప్య కామమ్
గతో వదాన్యాన్తర మిత్యయం మే
మాభూత్ పరివాద నవావతారః॥ 34.

"గురు దక్షిణకొరకై యాచింప వచ్చిన శాస్త్రపారంగతుడు, రఘువు నుండి తాను కోరిన వస్తువును పొందజాలక మరియొక దాత దగ్గరకు వెళ్ళినాడు అనెడు ఈ క్రొత్త అపవాదు నాకు లేకుండుగాక." 31

వ్యా. ఇచట 'రఘు' శబ్దముచే త్రిభువనాతిశాయియగు ఉత్తమౌదార్యము ప్రతీయమాన మగుచున్నది.

వి. ఇచట వక్త యగు రఘు మహారాజు స్వయముగనే తన విద్యమా నౌదార్యమును సూచించుచున్నాడు.

వ్యా. ఈ వక్రతయొక్క యథార్థ స్వరూప మేమనగా—ఇందు వాచక మగు శబ్దము సామాన్య మాత్రబోధకత్వమును విడచి, (సామాన్య మాత్రమునే బోధింపక) కవి వివక్షిత మగు విశేషమును ప్రతిపాదింప కల్గుట యనెడు శోభాతిశయముతో ఒప్పారుచుండును

('రామః', 'రాఘవః' మొదలగు) సంజ్ఞాశబ్దములు (వ్యక్తి విశేషబోధక ములై) నియతార్థ ప్రతిపాదకములు గాన వాటిలో సామాన్య విశేషభావము ఏమి ఉండును? అని ఆశంకింపరాదు. ఏలయన-సంజ్ఞా శబ్దముల విషయమున గూడ అవస్థా సహస్రములతో సాధారణ రూపమున సంబంధించిన ('వ్యక్తి' రూప) వాచ్యము సత్కవి వివక్షిత మగు నియతావస్థతో సంబంధించుట, స్వరశ్రుతి న్యాయము చేతను, లగ్నాంశుక న్యాయము చేతను యుక్తమే.

వి. "అయం ఘటః" "అయం పటః" ఇత్యాది వాక్యములలో 'ఘటః' 'పటః' మొదలగు పదములు ఘటత్వ, పటత్వ సామాన్యములతో కూడిన ఘట పట వ్యక్తులను బోధించుచున్నవి. అనగా ఏ ఘటమును చూపుచు ఈ పదము ప్రయుక్త మైనదో అది విశేషము. ఘటత్వము సామాన్యము. ఇది సర్వ ఘటములకును సంబంధించినది. పట విషయమున గూడ నిట్లే. కాని, 'రామః' 'రాఘవః' అను నామవాచకములు 'రాముడు', 'రాఘవుడు', అనెడు వ్యక్తి విశేషములను మాత్రమే బోధించును గాన, (అనగా 'రామత్వము' 'రాఘవత్వము' మొదలగు జాతులు లేవు గాన) ఇట్టి స్థలములలో సామాన్య విశేషభావ మేమి యున్నది-అని ఆశంక. 'రామః' మొదలగు పదములు ఒక్కొక్క రామాది వ్యక్తులనే బోధించుచున్నవి అయినను, రాముడను ఆ ఒక్క వ్యక్తికిని, అనేక అవస్థలతో (బాల్యము, యౌవనము, నిలచుట, కూర్చుండుట, సద్గుణవంతు డగుట, పరాక్రమవంతు డగుట మొదలగు వాటితో) సంబంధ ముండును గాన, ఆ అవస్థాభేదమును బట్టి వ్యక్తికి కూడ భేదముండ వచ్చును. అనగా బాలరాముడు వేరు. యువరాముడు వేరు. యుద్ధము చేయుచున్న రాముడు వేరు. ఈ విధముగ అవస్థాసహస్ర విశిష్ట రామ వ్యక్తిని బోధింప సమర్థమగు రామశబ్దము కవి వివక్ష ననుసరించి అవస్థా విశేష విశిష్ట రాముని బోధింప కలుగుటయే ఈ వక్రతకు ఉదాహరణ మని సమాధానము.

ఒకే వ్యక్తికి అవస్థాభేదముచే భేదము లుండ వచ్చు నని చెప్పుటకు కుంతకుడు "స్వరశ్రుతి న్యాయము", "లగ్నాంశుక న్యాయము" అను రెండు న్యాయములను చూపినాడు. షడ్జాది స్వరములు ఏడు. ఒక్కొక్క స్వరముతో గ్రాహక గాయకుని నైపుణ్యము ననుసరించి తారము, మంద్రము మొదలగు వేలకొలది శ్రుతు లుండవచ్చును. అయినను, షడ్జ మనునది ఒక్కటే. అట్లే ఒక వ్యక్తి అనేకము లగు అవస్థలతో సంబంధించి యుండవచ్చును. ఇదియే స్వరశ్రుతి న్యాయము. లగ్నాంశుకన్యా యమననేదియో పరిశీలింపవలసి యున్నది.

వ్యా. ఈ విధముగ (పదపూర్వార్ధ వక్రతలో ప్రథమ భేదమగు) రూఢి వక్రతను ప్రతిపాదించి, ఇపుడు క్రమప్రాప్త నిరూపణము గల పర్యాయ వక్రతను వివరించుచున్నాడు-

కా. అభిధేయా న్తర తమ స్తస్యాతిశయ పోషకః।
రమ్యచ్ఛాయా న్తర స్పర్శా త్తదల జ్కర్తు మీశ్వరః॥ 10
స్వయం విశేషణేనాపి స్వచ్ఛాయోత్కర్ష పేశలః,
అసమ్భావ్యార్థ పాత్రత్వ గర్భం యశ్చాభిధీయతే. 11

కా. అలఙ్కారోప సంస్కార మనోహారి నిబన్ధనః।
పర్యాయ స్తేన వైచిత్ర్యం పరా పర్యాయ వక్రతా॥ 12

"ఏ శబ్దము బోధింపవలసి యున్న అర్థమునకు దగ్గరగ నుండునో, దానియొక్క అతిశయమును పోషించునో, రమ్య మగు శోభాన్తరము యొక్క సంబంధ ముండుటచే దానిని, (అభిధేయార్థమును) అలంకరింప సమర్థ మగునో," 10

"స్వయముగ (విశేషణరహితముగ) గాని, విశేషణ సహితమై యుండి గాని, తన సౌందర్యాతిశయముచే మనోహరముగ నుండునో, అసంభావ్యమగు అర్థము గర్భమునం దుండు విధమున ప్రయోగింపబడునో." 11

"అలంకారముఃచే కలిగిన సంస్కారముచే మనోహర మగు కూర్పు కలదో అట్టి శబ్దము, పర్యాయ శబ్దము. దానిచే నేర్పడిన వైచిత్ర్యము ఉత్కృష్ట మగు పర్యాయ వక్రత్వము." 12

వ్యా. పూర్వోక్త విశేషణ విశిష్ట మగు శబ్దము కావ్య విషయమున పర్యాయ శబ్ద మని చెప్పబడును. హేతుభూత మగు దానిచే ఏ, వైచిత్ర్యం = విచిత్రత్వము — శోభా విశేషము (లభించునో) అదియే, పరా = ప్రకృష్ట మగు ఒకానొక ''పర్యాయ వక్రత" అని చెప్పబడుచున్నది పర్యాయము ప్రధానముగా గల శబ్దము పర్యాయ మని చెప్పబడును.

దీనియందున్న పర్యాయ ప్రాధాన్య మేమనగా-అది (ఒక శబ్దము) ఒకప్పుడు వివక్షిత మగు అర్థమునకు వాచకముగ ప్రయుక్త మగును, మరి యొకప్పుడు మరి యొక శబ్దము ప్రయుక్త మగును. (అనగా ఒక అర్థవిశేష మును బోధించుటకై ఒక పర్యాయము ప్రయోగింపబడునదియు, మరియొక పర్యాయము ప్రయోగింపబడనిదియు నగు శబ్దము పర్యాయశబ్ద మని యభి

ప్రాయము పర్యాయమున (ఒకమారు) ప్రయుక్తముగాన ఇది పర్యాయశబ్దము) కావున వెన్నుక (పై కారికలో) చెప్పిన విధముగ పర్యాయ శబ్దము బహుప్రకారమై యుండవచ్చు నని చెప్పియున్నట్లైనది.

దీనికి ఎన్ని ప్రకారములు ఉండు ననగా– చెప్పుచున్నాడు. "అభిధేయాన్తరతమః"– అభిధేయం = వాచ్యమగు వస్తువు, దానికి అన్తరతమః = చాల సన్నిహిత మైనది. ఏలయన– వివక్షిత మగు ఒక వస్తువును ఒక శబ్దము ఏ విధముగ బోధింపగల్గునో ఆ విధముగ పర్యాయశబ్దమే యైనను మరి యేశబ్దము కూడ బోధింపజాలదు. ఎట్లనగా–

నాభియోక్తుమనృతం త్వమిష్యసే కస్తపస్వివిశిఖేషు చాదరః.
సన్తి భూభృతి హి నః శరాః పరే యే పరాక్రమ వసూని వజ్రిణః. 32

"నీ విషయమున అసత్యమగు అభియోగము చేయుటకు (మాకు) అభిలాష లేదు. తాపసుని బాణముల విషయమున మాకు ఆదర మేమి? (అనగా– అవి మాకు ఎందులకు?) మా పర్వతముపై దేవేంద్రుని పరాక్రమధనము లగు ఎన్నియో బాణములు ఉన్నవి కదా–!"

వి. ఇది కిరాతార్జునీయము 13 వ సర్గలోని 58 వ శ్లోకము. అర్జునుని పరీక్షించుటకై కిరాతవేషమున వచ్చిన శివుని దూత, అర్జునుడు తాను వరాహముపై ప్రయోగించిన బాణము తీసికొనుచుండగా, అది తన ప్రభువుయొక్క బాణ మని చెప్పుచు పలికిన సందర్భములోనిది.

వ్యా. మహేంద్రార్థకము లగు ఎన్నియో పర్యాయశబ్దము లున్నను ఇచట ప్రయుక్త మగు 'వజ్రిణః' అను శబ్దము పర్యాయవక్రతను పోషించుచున్నది. ఏలయన– ఎల్లవేళలను వజ్రమును సమీపమున నుంచుకొనెడు దేవేంద్రునకు గూడ పరాక్రమధనములు అని చెప్పుటచే సాయకములు లోకోత్తరము లని తెలియుచున్నది. 'తపస్వి'శబ్దము కూడ ఎంతయు రమణీయముగ నున్నది. ఏలయన– మహాభటుల బాణముల విషయమున ఒకప్పుడు ఆదరము కలిగిన కలుగవచ్చును. ఎందులకును పనికిరాని తాపసబాణముల విషయమున ఆదర మెట్లుండును అని యభిప్రాయము.

క_స్త్వం జ్ఞాస్యసి మాం స్మర స్మరసి మాం దిష్ట్యా కిమభ్యాగత-
స్త్వా మున్మాదయితుం, కథం, నను బలాత్, కి న్తే బలం, పశ్య తత్.
పశ్యామీత్యభిధాయ పావకముచా యో లోచనేనై వ తం
కాన్తాకణ్ఠనిష_క్తబాహుమదహాత్ తస్మై నమః శూలినే. 88

వ్యా. (ఇది శివమన్మథులనడుమ ప్రశ్నో_త్తరరూప మగు శ్లోకము.)

"నీ వెవరవు?" "నేనెవరినో తెలిసికొనగలవు". "మన్మథా నేనెవరినో గుర్తు ఉన్నదా?" "అదృష్టవశముచేత" (గుర్తు ఉన్నది). "ఎందుకు వచ్చినావు?" "నీకు ఉన్మాదమును కలిగించుటకు" "ఎట్లు?" "నా బలముచేత" "నీ బలము ఏమి?" "ఇదిగో చూడుము". "చూచెదనులే....!?" అని పలికి అగ్నిని విడచిన నేత్రముచేతనే ఎవడు కాంతచేకంఠమునం దుంచబడిన బాహువుగల అతనిని దహించెనో అట్టి ఈశ్వరునకు నమస్కారము." 88

వ్యా. ఇచట పరమేశ్వరవాచకము లగు వేలకొలది పర్యాయములు ఉన్నను 'శూలినః' (త్రిశూలధారియొక్క) అను పదమును ప్రయోగించుటలోని అభిప్రాయ మేమనగా— అట్టి భగవంతునకు నమస్కారము చేయుట తప్ప ఇంక చెప్పుట కేమున్నది?. ఏలయన- సర్వదా శూలము దగ్గరనే యున్నను, అతడు, అట్టి గర్వముచే వినయమార్గమును విడచిన మన్మథునిపై కోపగించినను, అతనికి అభిమత మగు అవలోకనవ్యతికరము (సంబంధము) మాత్రము చేసి, కోపమునకు సముచిత మగు ఆయుధగ్రహణమును చేయలేదు. (అనగా "ఆ బలమును చూడుము" అని మన్మథుడు పలుకుటచే ఆతని అభీష్టము ప్రకారము "ఏదీ చూచెదను' అని చూచినాడు. అంతకు తప్ప ఆయుధ ప్రయోగము చేయలేదు). లోచనపాతమాత్రము చేతనే కోపకార్యమును చేయగల్గుటచే భగవంతుని ప్రభావాతిశయము పరిపుష్ట మగుచున్నది. కావుననే- "అట్టివానికి నమస్కారము" అని చెప్పుట యు_క్తియు_క్తముగ నున్నది.

వ్యా. పదపూర్వార్ధవక్రతా హేతు వగు మరియొక పర్యాయ మేది యనగా- "తస్యాతిశయపోషకః"- తస్య = అభిధేయ మగు అర్థముయొక్క, అతిశయం = ఉత్కర్షమును, ఏది పోషించునో అది, సహజ మగు సౌకుమార్యముచే సుందర మగు పదార్థము కూడ దానిచే (పర్యాయముచే) పోషింపబడిన అతిశయము కలదై ఎంతయు, సహృదయహృదయాహ్లాదకారి యగును.

ఎట్లనగా-
"సమ్బన్ధీ రఘుభూభుజాం మనసిజవ్యాపారదీక్షాగురు-
ర్గౌరాఙ్గీవదనోపమాపరిచితస్తారావధూవల్లభః.
సద్యోమార్జితదాక్షిణాత్యతరుణీదన్తావదాతద్యుతి
శ్చన్ద్రః సున్దరి దృశ్యతామయమితశ్చణ్డీశచూడామణిః" 84
(బాలరామా. 10-41)

"ఓసుందరీ! రఘువంశీయరాజుల బంధువును, మన్మథవ్యాపారదీక్షకు గురువును, స్త్రీల ముఖముతో పోల్చుటతో పరిచితుడును, తారావధువులకు ప్రియుడును, అప్పుడే తోమిన దాక్షిణాత్యవనితాదంతము వలె శుభ్ర మగు కాంతి కలవాడును, ఈశ్వరుని శిరోరత్నమును అగు చంద్రుని ఇటు చూడుము."

ఇచట ప్రయుక్తము లగు, పర్యాయపదములు సహజ మగు సౌందర్యము గల చంద్రుని యందు గూడ సహృదయహృదయాహ్లాదక మగు ఒకానొక అతిశయమును జనింపచేయుచు, పదపూర్వార్ధవక్రతను పోషించుచున్నవి.

రావణుని సంహరించి, పుష్పకముపై ప్రయాణము చేయుచున్న రాముడు విలాసపూర్వకముగ సీతతో విస్రంభపూర్ణము లగు సంలాపములు సల్పుచు— "చన్ద్రః సున్దరి దృశ్యతాం" అనగా- "రామణీయకముచే మనోహారిణి యగు ఓసీతా! సకలజనులలోచనములకు ఉత్సవకారి యగు చంద్రుని చూడుము" అని చెప్పుచున్నాడు. ఏలయన- అట్టివారికి (అట్టి ఉత్సాహజనకము లగు పరిస్థితులలో నున్నవారికి, లేదా మనోహరసౌందర్యశాలులకు) మాత్రమే అట్టివాడు (సహజసౌందర్యశాలియగువాడు) విచారగోచరు డగుట సముచితము. "సంబన్ధీ రఘుభూభుజామ్" అని చెప్పుటచే "ఈతడు మనకు క్రొత్త చుట్టము కాదు కాన అవలోకనముచే ఈతనిని సమ్మానించుము" అని ప్రకారాంతరముచేత గూడ చంద్రవిషయక మగు గౌరవభావము వ్యక్త మగుచున్నది.

మిగిలిన పర్యాయపదములుగూడ ఆ చంద్రునియందు ఒక విధమగు అతిశయము కూర్చుటకు ప్రధానముగ నుద్దిష్టములైనట్లు స్పష్ట మగుచున్నది. కావుననే ఒక్కొక్క పర్యాయము వేరువేరుగ ప్రస్తుత చంద్రరూపార్థమున ఉత్కర్షవిశేషమును ప్రకటించుచున్నది గాన, ఇన్ని పర్యాయపదము లున్నను

వాటికి పౌనరుక్త్యములేదు. తృతీయపాఠమున విశేషణవక్రత యున్నది. పర్యాయ వక్రత కాదు.

వి. ఇది బాలరామాయణము, దశమాంకములోని 41 వ శ్లోకము. కాని బాలరామాయణమున ఈ శ్లోకమునందలి ప్రథమపాదము చతుర్థపాదముగ నున్నది. శ్లోకము "గౌరాంగ" ఇత్యాదిపాదముతో ప్రారంభ మైనది.

వ్యా. ఇది పదపూర్వార్ధవక్రతకు కారణభూత మగు మరియొక పర్యాయ ప్రకారము—

"తదలఙ్కర్తుమీశ్వరః"— తత్ = అభిధేయరూప మగు వస్తువును, అలంకరించుటకు ఏది సమర్థమో అది. ఎందువలనః 'రమ్యచ్ఛాయాన్తర స్పర్శాత్'- రమ్యం=రమణీయ మగు, ఏ, ఛాయాన్తరం = శ్లిష్టత్వము మొదలగు మరి యొక విచ్ఛిత్తి కలదో, దాని యొక్క స్పర్శవలన; శోభాన్తరము యొక్క ప్రతీతివలన అని యర్థము. ఎట్లుః "స్వయంవిశేషణేనాపి"- స్వయం = స్వయముగనే కాని, లేదా, తనకు విశేషణ మైన పదాంతరముచేత గాని, అందు స్వయముగ (విశేష్యమే శ్లిష్టత్వముచే వాచ్యాలఙ్కారి యగుటకు ఉదాహరణము) ఎట్లనగా—

"ఇత్థం' మొ. (చూ-1-౬౬)

ఇచట "మాతంగ' శబ్దము, ప్రకృత మగు ఏనుగును మాత్రమే బోధించును. మిగిలిన వృత్తిచేత (అనగా అభిధ కంటె భిన్న మగు వ్యంజనా వృత్తిచేత) చండాలుడు అనెడు అప్రస్తుతార్థముయొక్క ప్రతీతిని కలిగించుచు, రూపకాలంకారచ్ఛాయ సంపర్కమువలన, 'గౌర్వాహీకః' ('వాహీకుడే ఎద్దు') ఇత్యాదులందు వలె సాదృశ్యనిబన్ధన మగు ఉపచారము ఉండవచ్చును గాన అప్రస్తుతమగు వస్తువునందు (గజమునందు) చండాలత్వమును ఆరోపించుచు, పర్యాయవక్రతను పోషించుచున్నది. ఏలయన ఇట్టి సందర్భములలో రూపకాలంకారముద్వారా గాని, ఒకప్పుడు ఉపమాలంకారముద్వారా గాని, ప్రస్తుతమునకు అప్రస్తుతముతోడ సంబంధము ఏర్పరుపబడును. ఎట్లనగా-(స ఏవాయమ్) "ఇది అదియే" అనిగాని లేక (స ఇవాయమ్) 'ఇది దానివలె నున్నది" అని గాని. ఇదియే శబ్దశక్తి మూలానురణన రూపవ్యంగ్య మనెడు పదధ్వనికి విషయము. లేదా ఇట్టి పదము లనేకములు ప్రయుక్త మైనపుడు వాక్యధ్వనికి విషయ

మగును. ఎట్లనగా— 'కు సుమసమయయుగముపసంహర న్నుత్ఫుల్లమల్లికా ధవలాట్టహాసో వ్యజృమ్భత గ్రీష్మాభిధానో మహాకాలః' (హర్షచరిత్రము)

"వసన్తకాలమును ఉపసంహరించుచు, వికసించిన మల్లికాపుష్పములే ధవళ మగు అట్టహాసము గల (ప్రళయకాలమున యుగోపసంహారము చేయుచు, వికసించిన మల్లికాపుష్పముల వలె తెల్లనైన అట్టహాసము గల- అని రెండవ అర్థము) గ్రీష్మ మనెడు పేరు గల గొప్ప కాలము (మహాకాలుడు=రుద్రుడు- అని రెండవ అర్థము) విజృంభించెను."

(ఇది హర్షచరిత్రము ద్వితీయాశ్వాసములోని వాక్యము.) 86

ఇంకను ఎట్లనగా

'వృత్తేఽస్మిన్ మహాప్రళయే ధరణీధారణాయాధునా త్వం శేషః' 87
(హర్షచరితమ్)

"ఈ మహా ప్రళయము (ప్రభాకర వర్ధనాదుల మరణము) జరిగిన పిమ్మట రాజ్యభారమును మోయుటకు (భూమిని మోయుటకు) ఇపుడు నీవే శేషుడవు. (మిగిలినవాడవు: ఆదిశేషుడవు- అని రెండర్థములు)" 87

ఇచట యుగాదిశబ్దములు ప్రస్తుతార్థవాచకములుగ ప్రయుక్తములైనను అప్రస్తుత వస్తు ప్రతీతిని కలిగించుటచే ఒకానొక అపూర్వ మగు కావ్య సౌందర్యమును ఆవిష్కరించుచు, ప్రతీయమానము లగు (రూపకాద్య) అలంకారముల నామధేయముచే చెప్పుటకు యోగ్య మగుచున్నవి.

వి. అనేకార్థము లగు శబ్దములను ప్రయోగించినపుడు ఆ శబ్దములకు గల అర్థము లన్నియు ఒక్కమారుగ అభిధచే బోధ్యములగునా? కావా? అని ప్రశ్న. దానికి సమాధాన మేమనగా అనేకార్థశబ్దమును ప్రయోగించి నపుడు అది బోధించు అర్థము లన్నియు ప్రకృతమునకు సరిపడవు ఏదియో ఒక అర్థము మాత్రమే సరిపడును. (ఎక్కడనైన ఆ శబ్దముచే బోధ్యము లగు అన్ని అర్థములు ప్రకరణానుగుణ మైనచో అది శ్లేష యగును) కాని, ప్రకరణానుగుణ మగు అర్థము బుద్ధిగోచర మైన పిమ్మట మరియొక అర్థము కూడ స్ఫురించినచో అట్టి ద్వితీయార్థస్ఫూర్తి వ్యంజన చేతనే జరుగుచున్నది గాని అభిధద్వారా కాదని ధ్వనివాదుల అభిప్రాయము కావ్య ప్రకాశములోని ఈ దిగువ కారిక ఈ విషయమునే స్పష్టీకరించుచున్నది—

"అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియన్త్రితే
సంయోగాద్యైః అవాచ్యార్థధీకృద్వ్యాపృతిరంజనమ్"

అనగా- ఒకశబ్దమునకు అనేక అర్థములను బోధించుశక్తి యుండ వచ్చును కాని సంయోగము మొదలగు నవి దానికి గల ఆ శక్తిని కుదించి ఒక అర్థమును మాత్రమే బోధించునట్లు చేయును. అట్టి పరిస్థితులలో కూడ మరియొక అర్థము స్ఫురించుచుండును. అట్లు ద్వితీయార్థము స్ఫురించుటకు కారణభూత మైనదే వ్యంజనవృత్తి అని యర్థము.

'ఇత్థంజడే' ఇత్యాది శ్లోకమున ప్రయుక్త మగు మాతంగశబ్దమునకు సహజముగ "గజము", "చండాలుడు" అను అర్థద్వయమును బోధించెడు శక్తి యున్నది. కాని, ఈ శ్లోకమున గజవృత్తాంతము ప్రస్తుతమగుటచే "మాతంగ" శబ్దము అభిధ ఏనుగు అను అర్థమును మాత్రమే బోధింప గలదు. అనగా దాని వాచకత్వశక్తి ఏనుగ అను అర్థమును మాత్రమే బోధించు టకు నియమితమై పోయినది. ఇక చండాల- రూపార్థము ప్రతీత మగుచున్న దనిన అది కేవలము వ్యంజనా వృత్తిచేతనే.

ఈ విధముగ అనేకార్థకశబ్దముల వాచకత్వమును నియమించెడు కారణము లను భర్తృహరి ఈ క్రిందికారికలలో చూపియున్నాడు.

"సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా
అర్థః ప్రకరణం లిఙ్గం శబ్దస్యాన్యస్య సన్నిధిః.
సామర్థ్యమౌచితీ దేశః కాలో వ్యక్తిః స్వరాదయః
శబ్దార్థస్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః".

ఈ శబ్దమున కిచట అర్థమేమి అని సందేహము కలిగినపుడు 'సంయోగము మొదలగునవి నిర్ణాయకములుగ ఉపయుక్తము లగును

1) "సశంఖచక్రః హరిః" అనునపుడు శంఖచక్రముల సంయోగము చేతను, 2) "అశంఖచక్రో హరిః" అనునపుడు వాటి వియోగముచేతను, 'హరిః' అనుపదమునకు 'విష్ణువు' అను అర్థము నిర్ణీత మగుచున్నది.

3) "రామలక్ష్మణౌ" అన నపుడు లక్ష్మణసాహచర్యముచే రామశబ్దము నకు దశరథపుత్రు డగు శ్రీరాము డని యర్థము.

4) "రామార్జునగతిస్తయోః" (వీరిద్దరిపద్ధతి రామార్జునులపద్ధతి వంటిది) అను నపుడు విరోధమును బట్టి రామశబ్దమునకు పరశురాము డనియు, అర్జున శబ్దమునకు, కార్తవీర్యార్జును డనియు అర్థము.

5) అర్థమనగా ప్రయోజనము- "స్థాణుం భజ భవచ్ఛిదే" "సంసార విమోచనమునకై స్థాణువును సేవింపుము".) అనునపుడు సంసారవిమోచన మనెడు ప్రయోజనమును కూర్చగల్గువాడు ఈశ్వరుడే గాన, 'స్థాణు' శబ్దమునకు ఈశ్వరు డని యర్థము; శిల యనికాదు.

6) "సర్వం జానాతి దేవః" (దేవుడే అన్నియు ఎరుగును) అనునపుడు ప్రకరణమును బట్టి "దేవః" అనుదానికి 'తమరు' అని యర్థము.

7) "కుపితో మకరధ్వజః" (మకరధ్వజుడు ప్రకోపించినాడు) అను నపుడు ప్రకోపము కలిగియుండుట అను లింగము (చిహ్నము) చే మకరధ్వజ శబ్దమునకు 'మన్మథుడు' అని యర్థము, సముద్ర మని కాదు.

8) "దేవస్య పురారాతేః" అనునపుడు శంభువిశేషణ మగు 'పురారాతి' శబ్దముయొక్క సన్నిధానముచే 'దేవ' శబ్దమునకు 'శివుడు' అని యర్థము.

9) "మధునా మత్తః కోకిలః" అనునపుడు కోకిలకు మదమును కలిగించు సామర్థ్యము వసంతమునకు మాత్రమే ప్రసిద్ధ మగుటచే 'మధు' శబ్దమునకు 'వసంత' మని యర్థము; మద్య మనికాదు.

10) "పాతు వో దయితాముఖమ్"— (మిమ్ములను ప్రియాముఖము రక్షించుగాక). అనునపుడు ఔచిత్యమును బట్టి రక్షించుట యనగా అభిముఖ ముగా నుండుట యని యర్థము.

11) "భాత్యత్ర పరమేశ్వరః" అనునపుడు 'అత్ర' అనుపదముచే రాజధానీరూప మగు దేశము నిర్దేశింపబడుచున్నది గాన, దానినిబట్టి, 'పరమేశ్వర' శబ్దమునకు 'మహారాజు' అని యర్థము.

12) "చిత్రభానుర్విభాతి" అనునపుడు 'చిత్రభాను' శబ్దమునకు కాల మును బట్టి పగలైనచో 'సూర్యుడ'నియు, రాత్రియైనచో 'అగ్ని' యనియు అరము.

13) 'వ్యక్తి' యనగా లింగము. "మిత్రం భాతి" అనునపుడు నపుంసకలింగమునందుండుటచే 'మిత్ర' శబ్దమునకు మిత్రుడనియు, 'మిత్రో భాతి' అనునపుడు పుంలింగమునందుండుటచే సూర్యుడనియు అర్థము.

14) స్వరము అర్థనిర్ణాయకమగుట వేదమునందే అధికముగ కానవచ్చును. "ఇన్ద్రశత్రుః" ఇత్యాదులలో ఆద్యపదము ఉదాత్తమైనచో బహువ్రీహియై— 'ఇంద్రః శత్రుః యస్య సః' ఇంద్రుడు ఎవనికి మారకుడో వాడు అనగా ఇంద్రుని చేతిలో మరణించువాడు, అను అర్థమువచ్చును. అంత్యపదము ఉదాత్తమైనచో "ఇంద్రస్య శత్రుః" (ఇంద్రుని సంహరించువాడు) అను అర్థము వచ్చును. ఇట్టి స్వరకృతమగు అర్థభేదము లౌకికసంస్కృతమున ఇపుడు లేదు.

ఈ విధముగ సంయోగాదులు అనేకార్థశబ్దముల అర్థబోధకతాశక్తిని సంకుచితము చేయునపుడు కల్గెడు ద్వితీయార్థబోధ వ్యంజనావృత్తిమూలక మని తేలినది

కాని ఇట్టి స్థలములలోని వాచ్యార్థమునకును ప్రతీయమానార్థమునకును సంబంధమేమి ? యనునదిప్రశ్న. దీనికి సమాధాన మేమనగా-

"గౌర్వాహీకః" (ఈ వాహీకుడు ఎద్దు), అనునపుడు, ఎద్దునందుండెడు జాడ్యమాంద్యాదులు వాహీకునియందు (వాహీకుడనగా వాహీకదేశమున— నేటి పంజాబు ప్రాంతమున- నివసించువాడు) ఉండుటచే ఈ సాదృశ్యమును బట్టి వాహీకునియందు గోత్వము ఉపచరితము (ఆరోపితము) అగుచున్నది. అట్లే ఏదియో ఒక సాదృశ్యమును పురస్కరించుకొని ప్రకృతార్థమునందు అప్రకృత రూపత్వమును ఆరోపించి ఇదియే అది అని చెప్పుటచే రూపకాలంకారచ్ఛాయ గాని, లేదా ఇది దీనితో సమానముగ నున్నది అని చెప్పుటచే ఉపమాలంకార చ్ఛాయ గాని, సంపాదింపవచ్చును. అనగా ఔచిత్యమును బట్టి "గజః ఏవ చండాలః" అను రూపకధ్వనిని గాని, "గజఃచండాలఇవ" అను ఉపమాధ్వనిని గాని అంగీకరింపవచ్చును. కావున ఇట్టి స్థలములలో మమ్మటాదులు పదగతశబ్దశక్తిమూలానురణనధ్వని యని అంగీకరించినారు. ఒక్కపదముగాక, వాక్యమునందలి రెండుమూడుపదములు ('కుసుమసమయ' ఇత్యాద్యుదాహరణములందు చూపిన విధమున) అన్యార్థ వ్యంజకములైనచో అది వాక్యగత శబ్దశక్తిమూలానురణనధ్వని.

విశేషణము ద్వారా (వాచ్యము నలంకరించుటకు ఉదాహరణము) ఎట్లనగా—

సుస్నిగ్ధ ముగ్ధ ధవలోరుదృశం విదగ్ధ
మాలోక్య యన్మధుర మద్య విలాస దిగ్ధమ్।
భస్మీచకార మదనం నను కాష్ఠమేవ
తన్మానమీశ ఇతి వేత్తి పురంధ్రిలోకః॥ 38

"స్నేహ పూర్ణములును సుందరములును అగు తెల్లనైన విశాలనేత్రములు కలిగిన వాడును, చతురుడును, సుందరుడును, విలాస శోభితుడును అగు నిన్ను ఇపుడు చూచి, స్త్రీలోకము ఈశ్వరుడు భస్మముగ చేసినది కాష్ఠరూప మద నునే (నీరసుడగు మన్మథునే యనియు, మదన వృక్షమునే యనియు అర్థద్వయము) యని తెలిసికొను చున్నది."

వి. మదన శబ్దమునకు మన్మథు డనియు, ఒక వృక్ష విశేష మనియు అర్థము. అతిలోక సుందరు డగు ఈతడు ఇచట నుండగా ఈశ్వరుడు మదనుని భస్మము చేసినా డనుట ఎట్లు? ఈశ్వరుడు భస్మము చేసినది, నీరస మదనుడై (మదన వృక్షమై) యుండవలె నని స్త్రీలు భావించుచున్నా రని యభిప్రాయము. దీనిని బట్టి మన్మథు డనువాడు ఈతనితో పోల్చినచో కాష్ఠ సదృశుడు, లేదా, కాష్ఠమే అని ప్రతీయ మాన మగుచున్నది.

వ్యా. ఇచట 'కాష్ఠం' అనెడు విశేషణపదము వర్ణ్యమాన పదార్థము (రాజు) దృష్ట్వా చూచినచో మన్మథుడు నీరసుడు అను విషయమును ప్రతిపా దించుచు, రమ్యచ్ఛాయా న్తర స్పర్శియై అనగా శ్లేషచ్ఛాయచే మనోహర మగు విన్యాసము కలదై మదన నామధేయక వృక్షరూప మగు మరి యొక అప్రస్తుత వస్తువుయొక్క ప్రతీతిని కలిగించుచు (మన్మథుడే మదనవృక్ష మనెడు) రూపకాలంకార చ్ఛాయయొక్క స్పర్శచే ఒకానొక పర్యాయవక్రతను వికసింప చేయుచున్నది.

వ్యా. పదపూర్వార్ధ వక్రతకు కారణభూత మగు మరి యొక పర్యాయ ప్రకార మెట్టి దనగా–"స్వచ్ఛాయోత్కర్ష పేశలః"–స్వస్య = తన యొక్క (పర్యాయ పదముయొక్క), ఛాయా = ఏ కాంతి, సుకుమారత, కలదో, తదుత్క

శ్లేష=దాని అతిశయముచే, ఏది, పేశలః=హృదయ హారిగా నుండునో దీని తాత్పర్యమిది-(ఒక పర్యాయ పదము ప్రయుక్తమైనదన్నచో) వర్ణింపబడు చున్న వస్తువునందలి ఒకానొక ప్రకారమును వికసింపచేయుటయే దానికి ప్రయోజనము-ఐనను (కొన్ని యెడల) దానికి గల స్వాభావిక మగు సౌందర్య సంపదయే సహృదయ హృదయాహ్లాదకరముగ నుండును ఎట్లనగా—

"ఇత్థ ముత్కయతి తాండవలీలా
పండితాబ్ధి లహరీ గురుపాదైః.
ఉత్థితం విషమకాండ కుటుంబ—
స్యాంశుభిః స్మరవతీ విరహో మామ్" 84

"కామినీ (స్మరవతీ) విరహము నన్ని విధముగ బెంగగొనునట్లు చేయు చున్నది. (దీనికి తోడు) తాండవలీలయందు పాండిత్యము గల సముద్ర తరంగముల పూజ్య గురువులైన (సముద్రము పొంగుటకు వెన్నెల కారణము గాన సముద్ర తరంగములకు చంద్ర కిరణములు తాండవ పాండిత్యమున గురుత్వము చేయుచున్న వని వర్ణించుచున్నాడు) పంచబాణుని కుటుంబములోని వాడైన చంద్రుని కిరణములు బయల్వెడలు చున్నవి."

ఇచట కవి చంద్రశబ్ద పర్యాయ మగు "విషమకాండ కుటుంబి" శబ్దమును ప్రయోగించినాడు. చంద్రోదయమును ద్వేషించుచున్న ఒకానొక విరహపీడిత హృదయుడు పలికిన పల్కులివి. ఈ పర్యాయ పదము అప్రసిద్ధమేయైనను, సమన్వయము క్లిష్టము కాకుండుటచే అతిప్రసిద్ధముగ చేయబడినవి. ఈ కారణము చేతను, ఇదం ప్రథమముగ ప్రయుక్త మగుట చేతను హృదయమునకు చమత్కార జనకముగ నున్నది. ఇట్టి స్వచ్ఛాయోత్కర్ష పేశల మగు పర్యాయ పదము సహజ సౌకుమార్య సుందర మగుట చేతను, నవీన కల్పనా విలక్షణ మగుట చేతను కవులు, పర్యాయాంతరములను విడచి, దీనినే కూర్చుచుందురు. ఉదాహరణమునకు-"కృష్ణ కుటిలకేశీ" (నల్లని ఉంగరాల జుట్టు కలది) అనుటకు బదులు "యమునా కల్లోల వక్రాలకా" (యమునా నదీ తరంగముల వలె వక్రమైన అలకములు కలది) అని చెప్పుదురు. ఇంకను ఎట్లనగా-'గౌరాఙ్గీ వదనోపమా పరిచితః" (దూ-II-84) అనునపుడు స్త్రీ వాచకములగు ఎన్నియో పదము

లున్నను 'గౌరాంగి' (తెల్లని దేహకాంతి కలది) అని చెప్పుట ఎంతయు అగ్రామ్య రమణీయముగ నున్నది.

పద పూర్వార్ధ వక్రతా సంపాదక మగు మరి యొక పర్యాయ ప్రకారము ఇది-"అసమ్భావ్యార్థ పాత్రత్వ గర్భం యశ్చాభిధీయతే"-వర్ణింపబడుచున్న దానియందు అసంభావ్యః = ఊహింపరాని ఏ ఒకానొక, అర్థః = స్వభావము కలదో, ఆ స్వభావము విషయమున, పాత్రత్వం=పాత్రత్వము, గర్భః = అభిప్రాయము, ఏ అభిధానము నందుండునో, ఆ విధముగ నుండునట్లు ఏది చెప్పబడుచున్నదో (అది) (అనగా వర్ణ్యమాన మగు వస్తువునందు ఉన్నట్లు ఊహింపరాని అంశము బుద్ధి గోచర మగునట్లు ప్రయుక్త మగు పర్యాయ పదము కూడ పదపూర్వార్ధ వక్రతా ప్రయోజక మని యర్థము.)

ఎట్లనగా—

"అలం మహీపాల తవ శ్రమేణ
ప్రయుక్తమప్యస్త్రమితో వృథా స్యాత్.
న పాదపోన్మూలన శక్తిరంహః
శిలోచ్చయే మూర్ఛతి మారుతస్య" 40

"ఓ మహీపాలా! శ్రమ పడకుము. నాపై అస్త్రమును ప్రయోగించినను అది వ్యర్థమే యగును. చెట్లను పెకలించెడు శక్తి గల వాయువేగము పర్వతము విషయమున ప్రసరించదు కదా!"

వి. రఘువంశ ద్వితీయ సర్గమున దిలీప సింహసంవాద ఘట్టమున నందినీధేనువు నాక్రమించిన తనపై అస్త్రమును ప్రయోగింప ప్రయత్నించు చున్న దిలీపుని చూచి, సింహము పల్కిన మాటలివి.

వ్యా. సకల భూమండలమును రక్షింపకల్గిన పౌరుషము కల (వాడైనను) ఆ రాజునకు, అట్లు ప్రయత్న పూర్వకముగ రక్షింపదగిన, గురుధేనురూప మగు ఒక్క జీవు నైనను రక్షింపజాల కుండుట యనునది, స్వప్నమునందైనను అసంభావ్యము. ఇచట అట్టి అసామర్థ్యమునకు ఈతడు పాత్రుడు అను విషయమును సూచించు మహీపాల అను సంబోధనము కూర్చబడినది. (కావున ఇది పర్యాయ వక్రతారూప మగు పదపూర్వార్ధ వక్రతకు ఉదాహరణము).

వ్యా. ఇంకను ఎట్లనగా-

భూతానుకమ్పా తవ చేదియం గౌ

రేకా భవేత్ స్వస్తిమతీ త్వద న్తే.

జీవన్పునః శశ్వదుప ప్లవేభ్యః

ప్రజాః ప్రజానాథ పితేవ పాసి॥ 41

(రఘువంశము 2-48)

"నీకు భూతదయ యున్నచో (అనగా భూతదయచే నీవు ఈ ధేనువు కొరకై ఆత్మత్యాగము చేయదలచినచో చెప్పుచున్నాను; వినుము) నీవు మరణించిన విమ్మట ఈ ఒక్క ధేనువు మాత్రమే క్షేమముగ నుండును. ఓ ప్రజానాథా-నీవు జీవించి యున్నచో ప్రజలను తండ్రివలె ఎల్లవేళల ఉపద్రవ ములనుండి రక్షింతువు." 41

వి. పూర్వోక్త సందర్భమున-నందినిని విడచి నన్ను భుజింపుము అని పల్కిన దిలీపునితో సింహమన్న మాటలివి.

వ్యా. ఇచట-ప్రాణిదయచే నీ ప్రాణములను పరిత్యజించుచున్నచో అదియు యుక్తము కాదు. ఏలయన-(1) నీవు మరణించిన విమ్మట, (2) ఈ ఒక్క గోవు మాత్రమే, (3) క్షేమముగ నుండును అను ఈ త్రయ మను అనాదరమునకు అస్పదమే. నీవు జీవించియున్నచో, ఓ ప్రజానాథా-తండ్రివలె, శశ్వత్ = ఎల్లప్పుడును, ఉపప్లవేభ్యః = అనర్థముల నుండి, ప్రజాః = సకల భూమండలము నందును ఉన్న ప్రజలను, పాసి = రక్షింతువు- అని (పూర్వోక్త త్రితయము విషయమున) అనాదరాతిశయము స్పష్ట మగు చున్నది.

ఈ విధముగ ఈ వాక్యార్థము సుస్పష్ట సమన్వయముగనే కన్పట్టు చున్నను, ఇచట మరియొక తాత్పర్యము కూడ గమ్యమగుచున్నది. ఏ ఒక్క డైనను ప్రజానాథు డైనచో అత డెల్ల వేళల ఆ ప్రజా రక్షణము చేయకుండుట అసంభావ్యము. (కాని ఇచట) ఇది ('ప్రజానాథ' అను సంబోధనము, లేదా ఉత్తరార్ధము) పరిరక్షణాకరణ పాత్రత్వ సూచకముగ (రక్షింపజాలడు అని సూచించునదిగ) చెప్పబడినది. ఏలయన-కంటి ఎదుట ఒకానొక ప్రాణి

(సింహము)చే గురు హోమధేనువు భక్షింపబడుచుండగా దాని ప్రాణములను రక్షించుటలో శ్రద్ధ వహింపక జీవించితివో నీవు ఈ న్యాయముచే (అనగా గురుధేనువును ఎట్లు రక్షింపజాలక పోతివో, దీనిని బట్టి చూచినచో) ఎన్నఁడును కొంచె మైనను ప్రజా పరిరక్షణమును చేయగలవనుట అసంభావ్య మనునది యుక్తి సిద్ధము. కావుననే (పెద్దలు) చెప్పుదురు—

"ప్రమాణవత్త్వా దాయాతః
ప్రవాహః కేన వార్యతే"

"ప్రమాణసిద్ధమై వచ్చుచున్న ప్రవాహమును ఎవరు ఆపగలరు?" 42

వి: అనగా— గోవుకొరకై ప్రాణములు విడువరాదని సింహము సయుక్తికముగఁ జెప్పుచున్నట్లు పైకి కనబడుచున్నను, ఇందలి అంతరార్థమును పరిశీలింపగా "ఈ గోవునే రక్షింపజాలనివాడవు, ప్రజల నేమి రక్షించెదవు?" అని సింహము అధిక్షేపించుచున్న దని భావము.

వ్యా: ఇచట అభిధానముచే (ఆయా పర్యాయపదములచే) ప్రతీతిగోచర మగునట్లు చేయబడిన (బోధింపబడిన) పదార్థముల పరస్పరప్రతియోగిత్వమును ఉదాహరణప్రత్యుదాహరణన్యాయముచే తెలిసికొనవలెను.

వి: ఇంతవరకును చూపిన పర్యాయవక్రతోదాహరణములలో ఆయా పర్యాయపదములను ప్రయోగించుటచే ఆయా అర్థవిశేషములు ప్రతీత మగుచున్నవని నిరూపింపబడినది. ఈ విషయము ఇంకను స్పష్టము కావలె నన్నచో ఈ ఉదాహరణశ్లోకములలో ఉపయుక్తము లగు పదముల స్థానమున తత్సమానార్థకములగు పదాంతరములను ప్రయోగించి చూచుకొనవలెను. ఆ విధముగ మరియొక పర్యాయపదమును ప్రయోగించినపుడు అట్టి రమణీయార్థప్రతీతి కలుగదు. గాన ఉదాహరణములలో ప్రయుక్తము లగు పదములలోని వక్రత ఎట్టిదో మనకు స్పష్ట మగును. ఉదాహరణమునకు పై రెండు శ్లోకములలోని 'మహీపాల' "ప్రజానాథ" అను పదములకు బదులుగ "కులశ్రేష్ఠ" "మహావీర" ఇత్యాది పదములను ప్రయోగించినచో అంతచమత్కారములేదు.

వ్యాకరణాదిశాస్త్రములలో, ఒక సూత్రమును చెప్పి, ఆ సూత్రములోని ఒక పదమును చూపి; ఈ పదమును ఎందుకు ప్రయోగించినాడు అని ఆశంకించు-

కొని ఆ పదము లేకున్నచో ఈ లక్ష్యమున ఈ కార్యము వచ్చి యుండెడిది. అట్లు రాకుండుటకై ఈ పదమును ప్రయోగించినాడు; అని సమర్థింతురు. ఆ విధముగ చూపబడిన పదమునకు ప్రత్యుదాహరణమని పేరు. ఉదాహరణమునకు 'వృద్ధిరేచి' అను సూత్రమునకు 'అకారమునకు 'ఏచ్' పర మగునపుడు వృద్ధి వచ్చును' అని యర్థము. 'రామ + ఏకత్వమ్ = రామైకత్వం' ఇత్యాదు లుదాహరణములు. ఇచట ఏచి అన నేల అని ఆశంకించుకొని "పుత్రకామ + ఇష్టి" ఇత్యాదులందు కూడ వృద్ధి రాకుండుటకై 'ఏచి' అని చెప్పినాడు అని సమాధానము చెప్పుదురు. ఈ విధముగ చూపిన "పుత్రకామేష్టిః" ఇత్యాదికము ప్రత్యుదాహరణము. పర్యాయవక్రతోదాహరణస్థలములలో గూడ ఈ విధముగ ఒక పదమునకు బదులు మరి యొక పదమును ప్రయోగించి చూచినచో మొదటి పదమునందలి వైచిత్ర్యము స్పష్టము అగునని యభిప్రాయము.

వ్యా. మరి యొక విధ మగు ఈ పర్యాయప్రకారము పదపూర్వార్ధవక్రతను కల్పించును— "అలఙ్కారోపసంస్కారమనోహారినిబన్ధనః" ఇచట 'అలంకారోపసంస్కార' శబ్దమున తృతీయాసమాసమును, షష్ఠీసమాసమును, కూడ చేయవలెను. అట్లు చేసినచో అర్థవ్యయము చెప్పినట్లగును. తృతీయాసమాసపక్షమున అలఙ్కారేణ = రూపకాద్యలఙ్కారములచే, ఉపసంస్కారః శోభాన్తరసమ్పాదన మేది కలదో, దానిచే, మనోహారి = హృదయరంజక మగు, నిబన్ధనమ్ = కూర్పు దేనికోఅది (యని అర్థము) అలంకారస్య = ఉత్ప్రేక్షాద్యలంకారమునకు, ఉపసంస్కారః = శోభాన్తరసంపాదనము- అని కూడ విగ్రహముచే (షష్ఠీసమాసపక్షమున అర్థము చెప్పవలెను)

అందు తృతీయాసమాసపక్షమున ఉదాహరణ మెట్లనగా-

"యో లీలాతాలవృన్తో రహసి నిరుపధిర్యశ్చ కేళీప్రదీపః
కోపక్రీడాసు యోఽస్త్రం దశనకృతరుజో యోధరస్యైకసేకః।
ఆకల్పే దర్పణం యః శ్రమశయనవిధౌ యశ్చ గండోపధానం
దేవ్యాం స వ్యాపదం వో హరతు హరజటాకన్దలీపుష్పమిన్దుః" 43

"ఎవడు పార్వతీదేవికి, రహస్యమునందు విలాసార్థ మగు వింజామరయో, ఎవడు కృత్రిమము కాని సురతప్రదీపమో, ఎవడు ప్రణయకలహములందు

ఆయుధమో, ఎవడు దంతములచే పీడ కలిగిన అధరమునకు ప్రధాన మగు జలసేకమో, ఎవడు అలంకరింపుకొను సమయమున అద్దమో, అలసి శయనించు నపుడు చెక్కిలికి ఉపధానమో, ఈశ్వరుని జటాంకురమునందలి పుష్ప మగు అట్టి చంద్రుడు మీ ఆపదలను తొలగించుగాక".

ఇచట తాలవృంతాదులవలన కలుగు కార్యముతో సామ్యమును పురస్కరించుకొని చేసిన, (చంద్రునకు తాల వృంతాదులతో) అభేదోపచారము మూలముగా గల, రూపకాలంకారవిన్యాసము, పర్యాయపదము లన్నిటికిని శోభాతిశయమును కల్పించువిధముగ చేయబడినది. (కావున ఇది "అలంకారముచేత శోభాంతరసంపాదనము" అనుదానికి ఉదాహరణము).

షష్ఠీసమాసపక్షమున ఉదాహరణ మెట్లనగా-

దేవి త్వన్ముఖపఙ్కజేన శశినః శోభాతిరస్కారిణా,
పశ్యాబ్జాని వినిర్జితాని సహసా గచ్ఛన్తి విచ్ఛాయతామ్॥ 44

"ఓ దేవీ చూడుము ! చంద్రుని శోభను తిరస్కరించిన నీ ముఖపద్మముచే పద్మములు జయింపబడినవై, వెంటనే కాంతిరాహిత్యమును పొందుచున్నవి". 44

వ్యా. ఇచట నాగరకు డగుటచే, ప్రియురాలిని సంతోషపెట్టుటకు ఉపక్రమించిన నాయకుడు, సాయంసమయమున స్వాభావిక మగుటచే సముచిత మగు సరోరుహముల విచ్ఛాయత్వప్రాప్తిని- "నీముఖముచే జయింపబడినవి వలె ఉన్నవి" అనెడు ప్రతీయమానోత్ప్రేక్షాలంకారమునకు అనువగు రీతిని, అందులకు తగిన ఉపపత్తిని (నిదర్శనమును) చూపుటతో ప్రారంభించుటచే రమణీయ మగునట్లు ప్రతిపాదించినాడు. (అనగా 'శశినః శోభాతిరస్కారిణా' అని ఉపక్రమమున చెప్పినాడు కావుననే "ఈ పద్మములు నీముఖపద్మముచే జయింపబడినవా అన్నట్లున్నవి" అను ఉత్ప్రేక్షాలంకారమును కూర్చుటకు పీఠమైనది) ఇదియే యుక్తియుక్తము కూడ; ఏలయన- శశాంకశోభ సకలపంకజములకును తిరస్కారకముగ నుండును. చంద్రుని శోభను కూడ తిరస్కరించిన నీ ముఖపంకజముచే న్యాయముచే జయింపబడినవై విచ్ఛాయత్వమును పొందుచున్నవా అన్నట్లు ఉన్నవి, అనెడు ఉత్ప్రేక్షారూప మగు అలంకారముయొక్క శోభాతిశయము వికసింపచేయబడుచున్నది.

వి. చంద్రుడు పద్మములను తిరస్కరించినాడు. నీ ముఖపద్మము ఆ చంద్రుని కూడ తిరస్కరించినది. కావున ఒకనిని తిరస్కరించినవానిని తిరస్కరింపగలిగినవాడు మొదటివానిని తిరస్కరించుటయే కాదు — జయించుట కూడ న్యాయ (యుక్తి) సంగతమే గాన నీ ముఖపద్మము పద్మములను (తిరస్కరించుటయేకాదు) జయించినది కూడ, అని భావము కావున ఉత్ప్రేక్షాలంకారోపసంస్కారక మగు "శశినః శోభాతిరస్కారిణా" అనునది "అలంకారోపసంస్కారమనోహారినిబన్ధనత్వము"నకు ఉదాహరణము.

వి. ప్రథమోన్మేషమున కుంతకుడు ప్రధానముగ 1) వర్ణవిన్యాసవక్రత, 2) పదపూర్వార్ధవక్రత, 3) ప్రత్యయవక్రత 4) వాక్యవక్రత, 5) ప్రకరణవక్రత 6) ప్రబంధవక్రత అను వక్రతాభేదములను పేర్కొనెను. వాటిలో మొదటి దగు వర్ణవిన్యాసవక్రతను సవిస్తరముగ తెలిపి రెండవ దగు పదపూర్వార్ధవక్రతకు చెందిన 1) రూఢివైచిత్ర్యవక్రత 2) పర్యాయవక్రత 3) ఉపచారవక్రత 4) విశేషణవక్రత 5) సంవృతివక్రత 6) వృత్తివైచిత్ర్యవక్రత 7) లింగవైచిత్ర్యవక్రత 8) క్రియావైచిత్ర్యవక్రత అను ఎనిమిది అవాంతరభేదములలో, రూఢివైచిత్ర్యవక్రతకు చెందిన నాల్గుభేదములను, పర్యాయవక్రతకు చెందిన ఆరు భేదములను సవిస్తరముగ నిరూపించి పదపూర్వార్ధవక్రతా తృతీయభేద మగు ఉపచారవక్రతను నిరూపించుచున్నాడు —

వ్యా. ఈ విధముగ పర్యాయవక్రతను విచారించి క్రమము ననుసరించి విచారింపవలసి యున్న ఉపచారవక్రతను గూర్చి విచారించుచున్నాడు—

కా. "యత్ర దూరాన్తరేఽన్యస్మాత్సామాన్యముపచర్యతే
లేశేనాపి భవత్కాంచిద్వక్తుముద్రిక్తవృత్తితామ్ 13

కా. "యన్మూలా సరసోల్లేఖా రూపకాదిరలంకృతిః
ఉపచారప్రధానా సౌ వక్రతా కాచిదుచ్యతే" 14

"ఒకానొక అపూర్వ మగు అతిశయమును బోధించుటకై, ఎచట ప్రకృత మగు పదార్థమునుండి దానికంటె సుదూరవ్యవహిత మగు మరియొక పదార్థమునందు, అత్యల్ప మైనదైనను సామాన్యము ఆరోపింపబడునో అదియును;" 13

"దేనిచే రూపకాద్యలంకారము సరసస్వరూపము కలదిగ ఉండునో అదియును, ఈ విధమగు ఒకానొక వక్రత ఉపచారప్రధాన మగు వక్రతగా చెప్పబడుచున్నది." 14

ఈ కాచిత్ = అపూర్వ మగు, వక్రతా ఉచ్యతే = వక్రత్వము చెప్పబడు చున్నది. ఎట్టిది? 'ఉపచార ప్రధానా' ఉపచరణమే (సాదృశ్యాది వశముచే సమీపముగ వ్యవహరించుట ఉపచారము; అదియే) ప్రధానము. దేనికో అట్టిది. ఏమి స్వరూపము గలది. యత్ర = దేనియందు, అన్యస్మాత్ = ప్రస్తుత మగు ఒకానొక పదార్థము నుండి, వర్ణ్యమాన మగు వస్తువునందు, "సామాన్య ముప చర్యతే" = వివక్షిత మగు ఒక సాధారణ ధర్మము ఆరోపింప బడునో, వర్ణ్యమాన మగు ఏ వస్తువునందు? దూరాన్తరే—దూరం = అధిక మగు, అన్తరం = వ్యవధానము, దేనికో అట్టిది; దానియందు.

అవ. వర్ణ్యమాన మగు వస్తువునకు వ్యవధానము అని చెప్పుటలో ఆ వ్యవధానము దేశమును బట్టి కాని, కాలమును బట్టి కాని కలుగునని చెప్పవలసి యుండును. ఈ రెండు విధము లగు వ్యవధానమును వర్ణ్యమాన వస్తు విషయ మున కుదురదు, అని ఆశంకించి, సమాధానము చెప్పుచున్నాడు—

వ్యా. (ఆశంక) వర్ణ్యమాన మగు వస్తువు అమూర్తము గాన, దానికి దేశమును బట్టి (రెండు వృక్షములకు వలె) ఏర్పడిన వ్యవధానము సంభావ్యము కాదు. కాలకృత మగు వ్యవధానము కూడ సంభావ్యము కాదు. ఏలయన, కాలవ్యవధానము క్రియా విషయకము.

వి. అనగా ముందుగా పుట్టుట; తరువాత పుట్టుట, ముందుగా నశించుట, తరువాత నశించుట మొదలగు క్రియలను బట్టి రెండు వస్తువుల నడుమ కాలకృత మగు వ్యవధాన మేర్పడును. అది కూడ వర్ణ్యమాన వస్తువు విషయమున కుదురదు. దానియందు పుట్టుట నశించుట, మొదలగు క్రియలు సంభావ్యములు కావు కదా?

వ్యా. వర్ణ్యమాన మగు వస్తువు క్రియాస్వరూపము; కారక స్వరూపము అని ఉభయాత్మకముగ నుండ వచ్చును. ఐనను ఇందు; (వర్ణ్యమాన వస్తువు నందు) దేశకాలకృత మగు వ్యవధాన ముండుటకు అవకాశము లేదు. ఏలయన అనుమానము వలె శబ్దము కూడ ప్రతిపాద్యార్థము నంతటి సామాన్యమును బోధింపగలుగును గాని, విశేషమును బోధింపజాలదు. అట్టి పరిస్థితులలో దూరాంతరత్వ మనునది ఎట్లు ఉపపన్న మగును?

వి. ఇచట పూర్వపక్షి ఒక సమాధానమును ఊహించుకొని దానిని నిరాకరించియున్నాడు-కావ్యములలో వర్ణించు వస్తువు గూడ లౌకిక పదార్థముల వలె కారకరూపమునను క్రియా రూపమునను భాసించుచున్నది కదా? కావున లౌకిక పదార్థములందు వలె కావ్య వర్ణ్యమాన పదార్థములకు గూడ దేశ కాలాది కృత వ్యవధానము ఉండవచ్చును-అని అతడూహించుకొనిన సమాధానము. ఇట్లు సమాధానము చెప్పుట కుదురదు. వెనుక (పుట 176) వివరించిన విధమున అనుమానము వలె శబ్దము కూడ ఒక పదార్థమును, సామాన్య రూపముననే బోధింపగల్గును గాని, దాని విశేషరూపమును బోధింప జాలదు. సామాన్యతో ఉప గత మగు వాటికి దేశకాల వ్యవధానము వీలుపడదు అని పూర్వపక్షి అభిప్రాయము

అవ. ఇపుడు పూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నాడు-

వ్యా. ఇది వాస్తవమే "దూరాంతర" శబ్దము ముఖ్యముగ దేశకాల విషయక మగు (దేశకాలములను బట్టి ఏర్పడు) వ్యవధానమును, అనగా, సామీప్యరాహిత్యమునే బోధించున దైనను ఉపచారముచే (గౌణరీతిచే) స్వభావ విప్రకర్షమును (విరుద్ధ స్వభావత్వమును) బోధించును. పదార్థములలో నుండెడు ఈ స్వభావ విప్రకర్ష మనునది ఏది యనగా విరుద్ధ మగు ధర్మముల ఆరోపణమే. ఉదాహరణమునకు-(ఏదైన ఒక వస్తువునందు అమూర్తత్వ మున్నచో ఆ) అమూర్తత్వమునకు మూర్తి మత్త్వము స్వభావ విప్రకర్షము. ఘనత్వమునకు ద్రవత్వము, అచేతనత్వమునకు చేతనత్త్వము (స్వభావ విప్రకర్షము).

ఆ సామాన్య మెట్టిది? లేశేనాపి భవత్ = కొంచె మైనను ఉన్నది. ఎందులకు? కాంచిత్ = అపూర్వ మగు, ఉద్రిక్త వృత్తితాం వక్తుం = సాతిశయ మగు స్వభావము కలిగి యుండుటను చెప్పుటకు—

ఎట్లనగా-

"స్నిగ్ధశ్యామల కాన్తిలిప్తవియతః" (చూ॥-II-27) 45

ఆలోచించి పనిచేసెడు కొందరు చిత్రకారులు (మానవులు) ఒక రంగుకు మెరుగు పుట్టించుటకై, పూయుటకు వీలైన ఏదైన ఒక మూర్త మగు నీలిరంగు మొదలైన రంజన ద్రవ్య విశేషముచే ఏ విధముగ, వస్త్రాదుల

399 Lr1

వంటి రంగు పట్టించుటచు పీలగు మూర్త ద్రవ్యమును పూయుదురో, అట్లే, ఒకానొక అతిశయమును సంపాదించుటకై, ఇచట కొంచెము మాత్రమే ఉన్న లేపనకారిత్వ సామాన్యము (పూయుట) ఉపచారముచే, "ఆకాశము స్నిగ్ధశ్యామల మగు కాంతిచే పూయబడినది"-అను విధమున కూర్చబడినది. 'స్నిగ్ధ' శబ్దము కూడ ఉపచార వక్రమే. చూపుకును స్పర్శకును తెలియు స్నేహగుణముతో సంబంధ ముండుటచే ఒక మూర్త వస్తువును ఏ విధముగ స్నిగ్ధము అని అందురో అట్లే అమూర్త మైనను కాంతి ఉపచారముచే స్నిగ్ధ మని చెప్పబడినది.

ఇంకను ఎట్లనగా-

గచ్ఛన్తీనాం రమణవసతిం యోషితాం తత్ర నక్తం
రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యైస్తమోభిః।
సౌదామిన్యా కనకనికష స్నిగ్ధయా దర్శయోర్వీం
తోయోత్సర్గ స్తనిత ముఖరో మా స్మభూర్విక్లవాస్తాః। 46
(మేఘదూతము-37)

"అచట సూదులచే గ్రచ్ఛదగిన చీకట్లచే చూపులు అనని రాజమార్గమున, రాత్రులందు ప్రియుల నివాసమునకు పోవుచుండెడి యువతులకు గీటురాయిపై గీసిన బంగారు రేఖ వలె సుందర మగు మెరుపుచే భూమిని చూపుము. వర్షము కురియుట చేతను ఉరుముల చేతను ధ్వనిచేయకుము. వారు భీరువులు." 46

వ్యా. ఇచట అమూర్తము లగు తమస్సులు కూడ, అత్యధికముగ నుండి దట్టముగ నుండుటచే (వాటియందు) మూర్తవస్తువుల విషయమున ఉచిత మగు సూచిభేద్యత్వము ఆరోపింపబడినది.

ఇంకను ఎట్లనగా-

గఅణం చ మత్తమేహం ధారాలులిఅజ్జుణాఇ అ వణాఇ
ణిరహంకారమి అంకా హరంతి ణీలాఓ వి ణిసాఓ॥ 45
గగనఞ్చ మత్తమేఘం ధారాలులితార్జునాని చ వనాని।
నిరహఙ్కార మృగాఙ్కా హరన్తి నీలా అపినిశాః॥

"మదించిన మేఘములు కల ఆకాశము, వర్షధారలచే నలిగిపోయిన అర్జున వృక్షములు గల వనములు, అహంకారము లేని చంద్రుడు గల నల్లని రాత్రులును (మనస్సును) హరించుచున్నవి."

ఇచట చైతన్యవంతుల ధర్మ సామాన్య మగు మత్తత్వమును, అహంకార రాహిత్యమును (మేఘ, మృగాంకుల యందు) ఆరోపింపబడినవి.

సత్కవి ప్రవాహమున ఈ ఉపచార వక్రతా ప్రకారమ్ము వేలకొలది రీతుల సంభవించును గాన సహృదయులు స్వయముగనే ఊహించుకొన వలెను. కావుననే "గౌర్వాహీకః" ఇత్యాదులలో ప్రత్యాసన్న మగు వ్యవధానము గల ఉపచారమునందు (అనగా వ్యవధానము దూరము కాని విషయములలో ఉప చారము చేసినపుడు) వక్రతా వ్యవహారము లేదు.

వి. అనగా వాహీకునకును ఎద్దునకును గల వ్యవధానము అంత దూరము కాదు. జడత్వాది సామ్య మత్యధిమగ నున్నది గాన ఇట్టి స్థలములలోని ఉపచారమునందు చమత్కారము లేకుండుటచే దానిని ఉపచార వక్రత యన రాదు.

వ్యా. ఇది ఉపచార వక్రతయొక్క మరి యొక స్వరూపము-"యన్మూలా సర సోల్లేఖా రూపకాది రలఙ్కృతిః"— యన్మూలా = ఏది మూలము దేనికో అది, రూపకాదిః = రూపకము ఆది దేనికో అది. అది ఏది ? అలంకృతిః = అలంకరణము. రూపకము మొదలగు అలంకార శోభ యని యర్థము. ఎట్టిదిః సరసోల్లేఖా-సరసః = ఆస్వాదముతో కూడిన-చమత్కారముతో గూడిన, ఉల్లేఖః = ఉన్మేషము దేనికో అది-ఇచట "అతిగురవో రాజమాషా న భక్ష్యాః" మిక్కిలి బరువైన రాజమాషములను, (పెద్ద మినుములు) భక్షింపరాదు, (అనగా అవి అతిగురువులు అగుటచే జీర్ణించికొనుటకు కష్టమైనవి గాన భక్షింపరాదు అని యర్థము.) ఇత్యాదులందు వలె ఇచట సమానాధికరణము లగు (ఏక విభక్తికము లగు) పదములకు కార్యకారణ భావము.

వి. అనగా-'యన్మూలా', 'సరసోల్లేఖా'-అను ప్రథమాంత పదములు రెండును 'అలంకృతిః' అను విశేష్యమునకు విశేషణము లగుటయే గాక వాటికి కార్యకారణ భావము కూడ ప్రతీత మగుచున్నది. రూపకాదులు సరసోల్లేఖ మగుటకు, ఉపచార మూలత్వము కారణ మని యర్థము.

వ్యా. ఏ ఉపచారము మూలముగా కలదై రూపకాద్యలంకారము సరసోల్లేఖమైన దగుచున్నదో. దీనిని బట్టి రూపకాద్యలఙ్కార సముదాయమున కంతకును ఉపచార వక్రత జీవిత మని యర్థము.

(ప్రశ్న) మొదటి ఉపచార వక్రతకును, దీనికిని భేదమేమి ? (సమాధానము) వెనుక చెప్పిన ఉపచార వక్రతలో-(వర్ణ్యమాన వస్తువునందు) స్వభావ విప్రకర్ష ముండుటచే, అత్యల్పమే యగు సామ్యమును సామాన్య రూపమున ఆశ్రయించి, సాతిశయత్వమును ప్రతిపాదించుటకై, (ఇతర వస్తు) ధర్మము మాత్రము ఆరోపింపబడును. కాని దీనియందు ఎక్కువ దూరము కాని సాదృశ్యముచే ఏర్పడిన సామీప్యమునకు సముచితము గాన, ఉపచార మూలక మగు పదార్థ స్వరూపత్వమే ఆరోపింపబడుచున్నది.

వి. అనగా మొదటి ప్రకారమున రెండు వస్తువుల స్వభావము అత్యంత భిన్నమై యుండును. కావున అత్యల్ప మగు సామ్యమును పురస్కరించుకొని సామాన్యరూపమున ఒక వస్తువుకు గల ధర్మము మాత్రమే మరి యొక వస్తువు నందు ఆరోపింపబడును. రెండవ ప్రకారమున-రెండు వస్తువుల నడుమ సాదృశ్యము అతిసన్నిహిత మగుటచే ఆ రెండు వస్తువులకును అభేదోపచారము చేయ వీలగుచున్నది. దానిని పురస్కరించుకొని ఒక వస్తువునందు (అన్యవస్తు ధర్మము మాత్రమే కాక) అన్యవస్తు రూపత్వము ఆరోపింపబడుచున్నది.

ఎట్లనగా:—

"సత్స్వేవ కాలశ్రవణోత్పలేషు
సేనావనాలీ విష పల్లవేషు.
గాంభీర్య పాతాళ ఫణీశ్వరేషు
ఖడ్గేషు కో వా భవతాం మురారిః" 49

"యముని కర్ణము నందలి నల్ల కలువలును, సేనలనెడు వనపంక్తుల విషపల్లవములును, గాంభీర్య మనెడు పాతాళమునందలి సర్పరాజములును, అగు ఖడ్గములు ఉండగా మీకు ఈ విష్ణువు ఎంత?"

వ్యా. ఇచట కాలశ్రవణోత్పలాదులతో సాదృశ్యముచే కలిగిన అతి సామీప్యముచే ఏర్పడినదియు, (అభేదోపచార) ఉపచార మూలకమును అగు ఉత్పలాదిరూపత్వము ఆరోపింపబడినది.

(రూపకాదిః అనునపుడు) ఆదిశబ్ద ప్రయోగముచే అన్యాపదేశ రూపమగు ఒకానొక అప్రస్తుత ప్రశంసా భేదమునకు ఉపచార వక్రతయే జీవిత మని చెప్ప బడుచున్నది. కావుననే కవులు సాధారణముగ ప్రతీయమాన మగు ఒకానొక పదార్థాంతరమును ప్రధానముగ మనస్సులో నుంచుకొని, అట్టి లక్షణముల సామ్య ముండుటను ఆధారముగ గొని, పదార్థాంతరమును ప్రతిపాదించు చుందురు.

ఎట్లనగా—

"అనర్ఘః కోఽప్యన్తస్తవ హరిణ హేవాక మహిమా
స్ఫురత్యేకస్యైవ త్రిభువన చమత్కార జనకః।
యదన్దోర్మూర్తిస్తే దివి విహరణారణ్య వసుధా
సుధాసారస్యన్దీ కిరణనికరః శష్పకబలః" 50

"ఓ హరిణమా! నీ ఒక్క దానియందే, త్రిభువన చమత్కార జనక మగు అమూల్య మైన ఒకానొక విలాసమహిమ కానవచ్చుచున్నది. ఏలయన— చంద్రబింబము, ఆకాశమున, నీవు విహరించుటకు ఉపయుక్త మగు అరణ్య ప్రదేశము; అమృత ధారలను కురియు కిరణసముదాయమే తృణకబళము.''

వి. ఇచట కవి లోకోత్తర చరితు డగు ఒక ఉత్తమ వ్యక్తిని వర్ణింప వలె ననెడు అభిప్రాయముతో హరిణమును వర్ణించుచున్నాడు గాన ఇది అన్యోక్తి.

వ్యా. ఇచట ప్రధాన రూపమున వివక్షితమును ప్రతీయమానమును అగు వస్తువునందు, రెండింటికిని సంబంధించిన లోకోత్తరత్వ మనెడు సామాన్యమును ఆశ్రయించి, అభేదోపచారమూలక మగు (వర్ణ్యమాన చంద్ర) రూపత్వము ఆరోపింపబడినది. ఈ విధముగ ఈ రెండు (రూపక అప్రస్తుత ప్రశంసలు) అలంకారములకును ఉపచార వక్రతయే జీవితముగ నుండుట తుల్యమే యైనను, ఒకచో (రూపకమున) (ఉపచారము) వాచ్యము రెండవదానిలో (అప్రస్తుత ప్రశంసలో) గమ్యము. దానిని బట్టియే ఈ రెండింటికిని భేదము. ఈ విషయము ఈ రెండు అలంకారముల లక్షణములను వివరించునపుడు స్పష్టము కాగలదు.

ఈ విధముగ ఉపచార వక్రతను నిరూపించి క్రమప్రాప్తావకాశ మగు విశేషణ వక్రతను వివేచించు చున్నాడు-

కా. విశేషణస్య మహాత్మ్యాత్ క్రియాయాః కారకస్య వా।
యత్రోల్లసతి లావణ్యం సా విశేషణ వక్రతా॥ 15

"విశేషణము యొక్క మహాత్మ్యముచేత, ఎచట, క్రియ యొక్క లావణ్యము గాని, కారకము యొక్క లావణ్యము గాని ప్రకాశించునో అది విశేషణ వక్రత." 15

వ్యా. సా = అది; విశేషణవక్రతా = విశేషణ వక్రత్వమువలన కలిగిన విచ్ఛిత్తి యని, చెప్పబడుచున్నది. ఎట్టిది? యత్ర = దేనియందు, లావణ్యం = రామణీయకము, ఉల్లసతి = వికసించునో. దేనియొక్క ? "క్రియాయాః కారకస్యవా"—క్రియాలక్షణ మగు వస్తువుయొక్క గాని, కారకలక్షణ మగు వస్తువుయొక్క గాని. ఎందువలన? "విశేషణస్య మాహాత్మ్యాత్"-ఈ రెండింటికిని ప్రత్యేకముగ సంబంధించిన ఏ విశేషణము (భేదకము-'నీలం ఉత్పలం' అనునపుడు ఈ కలువలో నున్న విశేషమును బోధించి దీనిని ఇతరములగు కలువల నుంచి వేరు చేయుచున్నది గాన 'నీలం' అనునది భేదకము) కలదో దాని మాహాత్మ్యము వలన (అనగా) విశేషణరూప పదార్థాంతరము సాతిశయ మగుట వలన (అనగా విశేష్యము నందలి అతిశయమును ఈ విశేషణము వ్యక్తీకరించు చున్న దని యర్థము). ఆ సాతిశయత్వము ఏది ? వస్తు స్వభావము నందలి సౌకుమార్యమును ఉల్లసింప చేయుటయు, అలంకార సౌందర్యాతిశయమును పోషించుటయు.

ఎట్లనగా—

"శ్రమజలసేక జనిత నవ విలిఖత నఖపదదాహ మూర్ఛితా
వల్లభరభసలుఠిత లలితాలకవలయార్ధ నిహ్నుతా.
స్మర, రస వివిధ విహిత సురత క్రమ పరిమలనత్రపాలసా
జయతి నిశాత్యయే యువతిదృక్ తను మధుమద విశదపాటలా" 51

"క్రొత్తగా గ్రుచ్చిన నఖ చిహ్నములు చెమటచే తడియుటచే కలిగిన మంటచే ముకుళిత మైనదియు, ప్రియునిచే తొందరగ నలిపివేయబడిన లలితాలక

ములు ఉంగరములచే సగము కప్పబడినట్టియు, మన్మథా వేశముచే వివిధ రీతుల చేయబడిన సురత క్రమమునందు నలిగిపోవుటచే కలిగిన సిగ్గుచే అలసమైనదియు, మద్యమదము క్షీణించుటచే తెల్లగను, ఎర్రగను ఉన్నదియు నగు తెల్లవారు జామునాటి యువతీ నేత్రము సర్వోత్కృష్టముగ నున్నది "

వి. ఇచట అనేక విశేషణముల మాహాత్మ్యముచే రతాంత కాంతయగు యువతి యొక్క నయనముల స్వాభావిక సౌందర్యము చక్కగ ప్రకటిత మైనది.

ఇంకను ఎట్లనగా—

కరాన్తరాలీన కపోలభి త్తిర్బాష్పోచ్ఛలత్కూణితపత్రలేఖా.
శ్రోత్రాన్తరే పిండితచిత్తవృత్తిః శృణోతి గీతధ్వనిమత్ర తన్వీ. 52

"అరచేతుల నడుమ అణగిపోయిన చెక్కిళ్లు కలదై, బాష్పముచే పైకి ప్రసరించుచున్న, ముణిగిపోయి నట్టైన మకరికాది పత్ర రేఖలు కలదై, శ్రోత్రముల యందు ముద్దగ చేయబడిన మనస్సు కలదై, తన్వి ఇచట గీత ధ్వనిని వినుచున్నది."

వి. ఇచట గూడ విశేషణ మాహాత్మ్యముచే తన్వీస్వాభావిక సౌందర్యము స్పష్టీకరింపబడుచున్నది.

ఇంకను ఎట్లనగా—

శుచిశీతల చంద్రికాప్లుతా-
శ్చిరనిశ్శబ్ద మనోహరా దిశః.
ప్రశమస్య మనోభవస్య వా
హృది కస్యాప్యథ హేతుతాం యయుః, 53

"తెల్లనిదియు చల్లనిదియు నగు వెన్నెలచే పూయబడినవై. చిరకాలము నిశ్శబ్దముగ నుండుటచే మనోహరము లగు దిక్కులు, ఒకని హృదయమున ప్రశమమునకును. మరియొకని హృదయమున మన్మథ వికారమునకును కారణముగ అయినవి."

క్రియా విశేషణ వక్రత్వ మెట్లనగా—

"ససా్మర వారణపతిర్వినిమీలితాక్షం
స్వేచ్ఛావిహార వనవాస మహోత్సవానామ్" 54

"(క్రొత్తగా పట్టుకొన్న) ఏనుగ, (మూసికొనబడిన కండ్లు కల్గునట్లుగా కండ్లు మూసుకొని స్వేచ్ఛా విహారసమయము నందలి వనవాస మహోత్సవము లను స్మరించెను."

వి. ఇది క్రియా విశేషణ వక్రతకు ఉదాహరణముగ చూపబడినది. గాన 'వినిమీలితాక్షం' అను పాఠము యుక్త మైనట్లు తోచుచున్నది.

వ్యా. ఇచట అన్ని ఉదాహరణము లందును విశేషణములు స్వాభావిక మగు సౌందర్యమును ఉల్లసింపచేయునవై ఉన్నవి.

వ్యా. విశేషణము అలంకారాతిశయమును పోషించుటకు ఉదాహరణము ఎట్లనగా—'శశినః శోభా తిరస్కారిణా' అను పూర్వోదాహృత శ్లోకము (II-44). 'త్వన్ముఖపఙ్కజేన' అను పదమునకు విశేషణముగ ప్రయుక్త మగు 'శోభా తిరస్కారిణా' అనునది ప్రతీయమానోత్ప్రేక్షా శోభను ఇనుమడింప చేయు చున్నది.

ఈ విశేషణ వక్రత్వమే ప్రస్తుతౌచిత్యాను సారముగ ప్రయుక్త మైనచో సకలసత్కావ్యములకును జీవితముగ నుండును. ఏలయన—దీనిచేతనే రసము పరిపూర్ణ మగు పుష్టిని పొందును. ఎట్లనగా—

'కరాన్తరాలీన' ఇత్యాది పూర్వోదాహృత శ్లోకమున (II-52).. (విశేషణ వక్రతా మాహాత్మ్యముచే శృఙ్గారము పరిపుష్టి నందినది).

శ్లో॥ "స్వమహిమ్నా విధీయన్తే యేన లోకోత్తరశ్రియః
రసస్వభావా లఙ్కారాస్తద్విధేయం విశేషణమ్" 57

"ఏది తన మహిమచే రసములను వస్తు స్వభావమును, అలంకారములను లోకోత్తర మగు శోభకలవాటినిగా చేయునో అట్టి విశేషణమునే కూర్చవలెను."

ఇది అంతర శ్లోకము—

వ్యా. ఈ విధముగ విశేషణ వక్రతను విచారించి క్రమప్రాప్తావసర మగు సంవృతి వక్రతను గూర్చి విచారించుచున్నాడు—

కా. యత్ర సంవ్రియతే వస్తు వైచిత్ర్యస్య వివక్షయా
సర్వనామాదిభిః కైశ్చిత్ సోక్తా సంవృతి వక్రతా 16

"వైచిత్ర్యమును సంపాదింపవలె ననెడు అభిలాషచే ఎచట, కొన్ని సర్వనామాది పదములచే వస్తువు ఆచ్ఛాదింపబడునో అది సంవృతి-వక్రత యని చెప్పబడుచున్నది."

వ్యా. "సోక్తా సంవృతి వక్రతా"-ఏది ఈ విధమైనదో అది సంవృతి వక్రత యని చెప్పబడుచున్నది. "సంవృత్యా వక్రతా సంవృతి వక్రతా" (సంవృతిచేత వక్రత) అని కాని, "సంవృతి ప్రధానా వక్రతా సంవృతి వక్రతా" (సంవృతి ప్రధానముగా గల వక్రత) యని గాని సమాసము. (విగ్రహము)-(తృతీయా తత్పురుషము లేదా మధ్యమ పదలోపి సమాసము) యత్ర = దేని యందు; వస్తు = పదార్థరూప మగు వస్తువు, సంవ్రియతే = ఆచ్ఛాదింపబడు చున్నదో; ఏ కారణముచేత ? "వైచిత్ర్యస్య వివక్షయా" విచిత్ర భావమును చెప్పవలె ననెడు ఇచ్ఛచేత, (అనగా) దేనిచే పదార్థము విచిత్రత్వమును పొందునో అది యని యర్థము. దేనిచే ఆచ్ఛాదింపబడుచున్నది? "సర్వనామాదిభిః కైశ్చిత్" = కొన్ని సర్వనామాదుల చేత. సర్వస్యనామ సర్వనామ-అన్నింటికిని నామధేయముగ ప్రయోగింప తగినది. అది అదియందు వేటికో అట్టివి-అట్టి కైశ్చిత్ = అపూర్వములగు వాచకములచేత అని యర్థము.

వి. "రామః" "కృష్ణః" మొదలగు నామవాచకములను ఆయా వ్యక్తుల విషయమున మాత్రమే ప్రయోగింప వచ్చును కాని రామకృష్ణాది భిన్న వ్యక్తుల విషయమున ప్రయోగింపరాదు. కాని 'సః' 'అయం' 'కః' ఇత్యాది సర్వనామ శబ్దములను అందరికిని అన్నింటికిని కూడ వాచకములుగ ప్రయోగింపవచ్చును. కావున వాటికి 'సర్వనామములు' అని పేరు.

వ్యా. ఇందు అనేకమైన ప్రకారములు సంభవించును-కొన్ని యెడల, సాతిశయ మగు కొన్ని వస్తువులను గూర్చి చెప్పుటకు శక్యమే యైనను దీనిని సాక్షాత్తుగ చెప్పినచో ఇంత యని పరిచ్ఛిన్నమై పరిమిత రూపమున భాసించు ననెడు యభిప్రాయముతో, సామాన్య వాచి యగు సర్వనామముచే ఆచ్ఛాదించి, దాని కార్యమును బోధించునదియు, దానియందలి అతిశయమును వ్యక్తీకరించు నదియు, అగు వాక్యాన్తరముచే నది ప్రతీతి గోచర మగునట్లు చేయుచుందురు.

ఎట్లనగా-

"తత్పితర్యథ పరిగ్రహాలిప్సౌ
స వ్యధత్త కరణీయ మణీయః,
పుష్పచాప శిఖరస్థ కపోలో
మన్మథః కిమపి యేన నిదధ్యౌ. 58

"అంత నాతడు (భీష్ముడు), తండ్రి యగు శంతనుడు) (సత్యవతిని) భార్యగా నభిలషించుచుండగా, ఆ అల్పమగు కార్యమును చేసెను; దేనిచే, మన్మథుడు పుష్పధనుస్సుయొక్క శిఖరముపై కపోలమును ఆన్చి, ఏమేమియో తలపోయ మొదలిడెనో. (ఆలోచింప మొదలిడెనో.)" 58

వ్యా. అచట శంతను కుమారు డగు భీష్ముడు సదాచారా సక్తు డగుటచే, గురు భక్తిచే భావిత మగు అంతః కరణము కలవాడై, లోకోత్తరాదార్శ గుణవంతు డగుటచే వివిధ విషయోప భోగములపై విర క్త మగు మనస్సు కలవాడై, అసంభావ్య మైనను స్వీయేన్ద్రియ నిగ్రహమను చేసినాడు-అని చెప్పుటకు శక్యమే యైనను (ఆ విషయమును) సామాన్యాభిధాన మగు (తత్ అను) సర్వనామముచే కప్పిపుచ్చి ఉత్తరార్ధమున అది(భీష్మ నేమియు చేయజాలక మన్మథుకు విచారమగ్ను డైనాడు అను) కార్యాన్తరమును బోధించు వాక్యాన్తర ముచే ప్రతీతి గోచర మగునట్లు చేయబడినదై ఒకానొక చమత్కారమును కలిగించుచున్నది.

కొన్ని యెడల-అత్యున్నత స్వభావోన్నతిని పొందిన ఒకానొక సాతిశయ మగు వస్తువు మాటలతో వర్ణింప నలవి కానిదని చెప్పుటకై దానిని సర్వనామ ముచే ఆచ్ఛాదించి తత్కార్య వాచకమను తదతిశయ ద్యోతకమును అగు వాక్యాంతరముచే దానిని స్పష్టీకరించుచుందురు. ఇది (రెండవ) మరియొక ప్రకారము. ఎట్లనగా-

"యాతే ద్వారవతీం తదా మధురిపౌ తద్దత్తకంపానతాం
కాలిన్దీ జలకేలి వంజుల లతామాలంబ్య సోత్కంఠయా.
తద్గీతం గురుబాష్ప గద్గదగలత్తార స్వరం రాధయా
యేనాన్తర్జలచారి భిర్జలచరై రప్యుత్క ముత్కూజితమ్" 59

"అపుడు శ్రీ కృష్ణుడు ద్వారకా నగరమునకు వెళ్ళగా, సోత్కంఠ యగు రాధ, ఆతడు కంపింప చేయుటచే వంగిన, కాళిందీ జలకేళిలోని (పట్టు కొనుటకై ఉపయోగించిన) వంజుల లతను అవలంబించి అత్యధిక మగు బాష్పములచే గద్గదముగ బయల్వెడలుచున్న తారస్వరము కలుగునట్లుగా, ఆ విధముగా గానము చేసినది; దేనిచే (దేనిని వినగనే) జలమధ్యమున సంచరించు జలచరములు గూడ బెంగ గొన్నవై ధ్వని చేసినవో..." 59

ఇచట 'తత్' అనెడు సర్వనామముచే సంవృత మగు (కరుణాత్మక మగు గానోత్కర్షరూప మైన) వస్తువు దాని కార్యమును (జలజంతు కూజన మును) బోధించు వాక్యాన్తరముచే సమున్మీలితమై సహృదయ హృదయాహ్లాద కర మగునట్లు చేయబడినది.

ఇంకను ఎట్లనగా—

"తథా రుదితం కృష్ణ విశాఖయా రోధగద్గదయా
యథా కస్యాపి జన్మశతే కోఽపి మా వల్లభో భవతు" 60

"ఓ కృష్ణా! దగ్గుత్తికచే గద్గద మగు వాక్కు గల విశాఖ ఆ విధముగ ఏడ్చినది; ఎట్లనగా—జన్మ జన్మాంతరములలో గూడ, ఎవ్వడును ఎవ్వరికిని ప్రియుడు కాకుండు గాక (అని అది వినిన వారు తలంచినారు). (ప్రేమకు ఫలితము ఇట్టి దుర్భర దుఃఖమే గాన ఎవ్వరును ఎవ్వరిని కూడ ప్రేమింప కుందురు గాక అని ఎల్లరును అనుకొని రని భావము."

వ్యా. ఇచట పూర్వార్ధమునందు సంవృత మగు (సామాన్యరూపమున చెప్పబడిన) రోదనరూప వస్తువు దానియందలి అతిశయమును బోధించు వాక్యాన్తరముచే అపూర్వ మగు సహృదయాహ్లాదమును కలిగించునట్లు చేయ బడినది.

వ్యా. కొన్నియెడల అత్యన్తసుకుమార మగు వస్తువును, కార్య మగు అతిశయమును చెప్పకుండగనే, సంవృతిమాత్రము చేతనే రమణీయముగ నుండు విధమున ఒకానొక అత్యున్నతకాష్ఠను పొందించుదురు. ఇది మరియొక (మూడవ) ప్రకారము ఎట్లనగా—

"దర్పణే చ పరిభోగదర్శినీ పృష్ఠతః ప్రణయినో నిషేదుషః,
వీక్ష్య బింబమనుబింబమాత్మనః కాని కాని న చకార లజ్జయా''. 61

"అద్దమునందు సంభోగమును (సంభోగచిహ్నములను) చూచుకొను చున్నదై, తన ప్రతిబింబము ప్రక్కనే వెనుకవైపున కూర్చుండి యున్న ప్రియుని ప్రతిబింబమును చూచి సిగ్గుచే ఏమి ఏమి చేయులేదు!".

వి ఇది కుమారసంభవమునందలి అష్టమసర్గలోని శ్లోకము. ఇచట 'కాని', 'కాని' అను సర్వనామపదము చే సంవరణము మాత్రము బోధింపబడినది. తజ్జన్య మగు కార్యాన్తర మేదియు వర్ణింపబడలేదు. ఐనను సర్వనామపద ప్రయోగకృతసంవరణముచేతనే సౌకుమార్యాతిశయము పరాకాష్ఠను అధి రోహించునట్లు చేయబడినది.

వ్యా. కొన్నియెడల స్వానుభవగోచర మగు విషయము మాటలలో చెప్పుటకు శక్యము కాదని సూచించుటకై దానిని సంవృతము చేయుచుందురు. ఇది మరియొక (నాల్గవ) పకారము. ఎట్లనగా-

"తాన్యక్షరాణి హృదయే కిమపి ధ్వనన్తి''

"ఆ అక్షరములు (ఇంకను) ఏమో హృదయమున ధ్వనించుచునే యున్నది".

వ్యా. ఇది పూర్వమునందే వ్యాఖ్యానింపబడినది- (1-51).

కొన్నియెడల పరానుభవగోచర మగు వస్తువు వక్తపు గోచరము కాదని ప్రతిపాదించుటకు సంవరణము చేయబడను. ఇది మరి యొక (ఐదవ) ప్రకారము. ఎట్లనగా-

ఉదా "మన్మథః కిమపి యేన నిదధ్యౌ"
దేనిచే మన్మథు డేమేమియో తలపోయ మొదలిడెనో". 63
(చూ. II-58)

వ్యా. ఇచట త్రిభువనములందు పసిద్ధ మగు మహిమ కలవాడగు మన్మథుడు ఆ విధముగ తన శక్తికి అడ్డు తగులుటచే విపణ్ణమైన మనస్సు కలవాడై, స్వానుభవసముచితముగ ఏమేమియో ఆలోచించెను అని (చెప్పుటచే ఇది పూర్వోక్తసంవృతికి ఉదాహరణము).

కొన్ని యడల స్వభావముచే గాని, కవివివక్షచే గాని, ఏదియో ఒకా నొక దోషముతో కూడిన వస్తువు మహాపాతకము వలె ఉచ్చరింపదగినది-కాదని చెప్పుటకు సంవృత మగును. ఇది మరి యొక (ఆరవ) ప్రకారము. ఎట్లనగా—

"దుర్వచం తదథ మా స్మ భూన్మృగ
స్త్వయ్యసౌ యదకరిష్యదోజసా.
నైనమాశు యది వాహినీపతిః
ప్రత్యపత్స్యత శితేన పత్రిణా". 64

"(మా) సేనాపతి వాడి యైన బాణముతో దీనిని (వరాహమును) శీఘ్రముగ చంపకున్నచో ఈ మృగము నీ విషయమున తన శక్తిచే, ఏమి చేసియుండెడిదో చెప్పరాని దగు అది కాకుండుగాక".

వి. కిరాతవేషధారి యగు శివుని అనుచరుడు వన్యవరాహమును చంపినది తమ ప్రభువే కాని అర్జునుడు కాదని అర్జునునితో చెప్పు ఘట్టములోని (కిరా-13-49) శ్లోకమిది.

ఇంకను ఎట్లనగా—

"నివార్యతామాలి కిమప్యయం వటుః
పునర్వివక్షుః స్ఫురితోత్తరాధరః.
న కేవలం యో మహతోఽపభాషతే
శృణోతి తస్మాదపి యః స పాపభాక్". 65

"ఓసఖీ! పెదవులు కదుపుచు ఇంకను ఏమియో చెప్పదలచుచున్న ఈ వటుని నివారింపుము. మహాత్ములను ఎవడు నిందించునో ఆతడే కాదు, ఆతని నుండి ఎవడు వినునో అతడు కూడ పాపాత్ముడే".

వి. కుమారసంభవమున పంచమసర్గలో బ్రహ్మచారివేషములో నున్న శివుడు పార్వతివద్ద, శివుని నిందింపబోవుచుండగా, ఆమె తన చెలికత్తెతో అన్న మాటలివి.

వ్యా. ఇచట (పై శ్లోకములలో వరుసగ) అర్జునుని చంపుట, శివుని నిందించుట అనునవి నోట పల్కదగినవి కావు అనునది సంవరణముచే రమణీయ మగునట్లు చేయబడినది.

కవివివక్షచే నింద్య మైనది ఎట్లనగా—

"సోఽయం దంభధృతవ్రతః ప్రియతమే కర్తుం కిమప్యుద్యతః"

"ఓ ప్రియతమురాలా! డాంబికమునకై వ్రతమును ధరించిన ఈతడు (ఈ, నేను) ఏమేమియో చేయ నుద్యమించుచున్నాడు(ను)". 66

వ్యా. ఇది పూర్వమే వ్యాఖ్యానింపబడినది. (చూ. 1-50)

వి. ఇచట వత్సరాజు చేయ నున్నది అయుక్త మని కవి చెప్పదలచి నాడు గాన దానిని 'కిమపి' అను సర్వనామపదముచే సంవృతము చేసినాడు.

ఈ విధముగ సంవృతివక్రతను విచారించి (కృత్తద్ధితాదిప్రత్యయములు కూడ) పదమధ్యమున అంతర్భూతములు గాన ఒకానొక ప్రత్యయవక్రతాప్రకార మును గూడ ఇచటనే (పదపూర్వార్ధవక్రతాప్రకరణమునందే) చర్చించుట యుక్తము గాన దాని విచారణము చేయుచున్నాడు.

కా. ప్రస్తుతౌచిత్యవిచ్ఛిత్తిం స్వమహిమ్నా వికాసయన్
ప్రత్యయః పదమధ్యేఽన్యాముల్లాసయతి వక్రతామ్. 17

"తన మహిమచే ప్రస్తుత మైన దానియొక్క ఔచిత్యశోభను వికసింప చేయుచు, ప్రత్యయము పదమధ్యమున మరి యొక వక్రతను ప్రకాశింపచేయును, (కలిగించును)".

ఒకానొక, ప్రత్యయః=కృదాదిప్రత్యయము, పదమధ్యమున నున్నదై, అపూర్వ మగు, 'వక్రతాంఉల్లాసయతి'=వక్రభావమును ఉద్దీప్తముచేయును. ఏమి చేయుచున్నదై? ప్రస్తుతస్య=వర్ణ్యమాన మగు వస్తువుయొక్క, ఏ ఔచిత్యం=ఉచితత్వ మున్నదో, దానియొక్క, విచ్ఛిత్తిం=శోభను, వికాస యన్=సముల్లసిత మగునట్లు చేయుచు.దేనిచేత? స్వమహిమ్నా=తన ఉత్కర్ష చేత. ఎట్లనగా—

"వేల్లద్బలాకా ఘనాః" (చూ. II-27)

'మేఘములు సమీపముననే ఎగురుచున్న కొంగలు గలవి'.

ఇంకను ఎట్లనగా—

"స్నిహ్యాత్కటాక్షే దృశౌ" (చూ. I-121)

'నేత్రములు స్నేహపూర్ణము లగుచున్న కటాక్షములు కలవి'

ఇచట (ఈ రెండుఉదాహరణములందును) వర్తమానకాలమును బోధించు 'శతృ' ప్రత్యయము (వేల్లత్, స్నిహ్యత్' అనునపుడు) గడచిపోయినది, రాబోవునది, యగు సౌందర్యముతో రహితమును, తాత్కాలిక మగు ప్రస్తుతౌచిత్యశోభను వికసింపచేయుచు సహృదయహృదయహార మగు ప్రత్యయవక్రతను కల్పించుచున్నది.

ఇవుడు ఈ ప్రత్యయవక్రతకు సంబంధించిన మరి యొక ప్రకారమును పర్యాలోచించుచున్నాడు.

కా. ఆగమాదిపరిస్పనసున్దరః శబ్దవక్రతామ్.
పరః కామపి పుష్ణాతి బన్ధచ్ఛాయా విధాయినీమ్. 18

"మరి యొకటి (ప్రత్యయవక్రతాప్రకారము) ఆగమాదుల పరిస్పందముచే సుందర మైనదై బంధమునకు కాంతిని కూర్చెడు ఒకానొక శబ్దవక్రతను పోషించును".

వ్యా. పరః = రెండవ ప్రత్యయ(వక్రతా)ప్రకారము, కామపి = అపూర్వ మగు, శబ్దవక్రతాం ఆబధ్నాతి = వాచకవక్రభావమును కూర్చును. ఎట్టిది? "ఆగమాదిపరిస్పన్దసున్దరః" — ఆగమః = 'ముమ్' మొదలగునది ఆది దేనికో అది, అట్టి, ఆగమాదికముయొక్క, పరిస్పన్దః = స్వవిలాసము, దానిచేత, సున్దరః = సుకుమారమైనది, ఎట్టిశబ్దవక్రతను: "బన్ధచ్ఛాయావిధాయినీమ్" = సన్నివేశమున కాంతిని సంపాదించునది యని యర్థము. ఎట్లనగా-

''జానే సఖ్యాస్తవ మయి మనః సంభృతస్నేహమస్మా
దిత్థంభూతాం ప్రథమవిరహే తామహం తర్కయామి.
వాచాలం మాం న ఖలు సుభగంమన్యభావః కరోతి
ప్రత్యక్షం తే నిఖిలమచిరాద్ భ్రాతరుక్తం మయా యత్.'' 69

"నీ సఖియొక్క మనస్సు నాపై స్నేహముతో నిండిన దని నేను ఎరుగుదును. కావుననే ప్రథమవిరహమునందు ఆమె ఈ విధముగ నుండు నని ఊహించుచున్నాను. నేను సుందరుడను అను అహంకారము నన్ను వాచాలునిగ చేయుట లేదు. ఓ తమ్ముడా! కొద్దికాలములో నేను చెప్పినదంతయు నీకే ప్రత్యక్షము కాగలదు".

వి. ఇవి మేఘసందేశములో యక్షుడు మేఘునితో తన ప్రేయసి విరహావస్థను వర్ణించి చెప్పుసందర్భమున పల్కిన మాటలు.

వ్యా. ఇంకను ఎట్లనగా—

'దాఽవహోమ్మ్యః ప్రసృతింపచః'

అనునది (చూ. 1-48)

ఇంకను ఎట్లనగా—

"పాయం పాయం కలాచీకృతకదలదళమ్" (II-10)

అనునది.

ఇచట 'సుభగంమన్యభావః' మొదలగు శబ్దములతో 'ముమ్' మొదలగు ఆగమముల స్వభావముచే సుందరము అగు ప్రత్యయములు సన్నివేశకాంతిని తూర్చేడుశబ్దవక్రతను పోషించుచున్నవి

వి. సుభగంమన్యభావః, 'ప్రసృతింపచః', అనునవి ముమాగమముచే ఏర్పడినవి. 'పాయంపాయం' అనునది ణముల్ప్రత్యయాంతము— 'సుభగం ఆత్మానం మన్యతే' అను విగ్రహమున 'ఆత్మమానే ఖశ్ చ' అను సూత్రముచే 'ఖశ్' ప్రత్యయము, 'ఖిత్యనవ్యయస్య' అను సూత్రముచే సుభగశబ్దమునకు "ముమ్" ఆగమము వచ్చి 'సుభగమ్మన్యః' అను రూపము సిద్ధించినది. ప్రసృతిం పచతి' అను విగ్రహమున "పరిమాణే పచః" అను సూత్రముచే 'ఖశ్' ప్రత్యయము, 'ఖిత్యనవ్యయస్య' అను సూత్రముచే 'ముమ్' ఆగమము వచ్చి 'ప్రసృతింపచః' అను రూపము సిద్ధించినది. 'పీత్వా పీత్వా' అను పౌనఃపున్యార్థమున 'పా'ధాతువునకు "ఆభీక్ష్ణ్యే ణముల్ చ" అను సూత్రముచే 'ణముల్' ('అమ్') ప్రత్యయము వచ్చుట "ఆతోయుక్ చిణ్కృతోః" అను సూత్రముచే యుమాగమము వచ్చి 'పాయం, పాయం' అను రూపము సిద్ధించినది.

వ్యా: ఈవిధముగ ప్రసంగసముచిత మగుపదమధ్యవర్తిప్రత్యయవక్రతను విచారించి, దాని పిమ్మట ప్రసక్త మగు వృత్తివక్రతను నిరూపించుచున్నాడు:—

కా. అవ్యయీభావముఖ్యానాం వృత్తీనాం రమణీయతా
యత్రోల్లసతి సా జ్ఞేయా వృత్తివైచిత్ర్యవక్రతా. 19

"అవ్యయీభావము మొదలగు వృత్తుల వక్రత ఎచట ప్రకాశించునో అది వృత్తివైచిత్ర్యవక్రత యని తెలియతగినది".

వ్యా. అది వృత్తివైచిత్ర్యవక్రత యని, జ్ఞేయా = తెలియదగినది. వృత్తీనాం = వృత్తులయొక్క, వైచిత్ర్యం = విచిత్రతత్వము, అనగా సజాతీయము లగు ఇతర వృత్తులకంటె సౌకుమార్యాతిశయము, దానిచే, వక్రతా = వక్రభావమువలన కలిగిన శోభ, ఎట్టిది? — రమణీయ మైనది; ఎచట ప్రకాశించునో, (అనగా) దేనియందు రామణీయకము ఉద్భిన్న మగునో, దేనియొక్క? వృత్తులయొక్క, ఏ వృత్తుల యొక్క? అవ్యయీభావ ముఖ్యానాం = అవ్యయీభావః = అవ్యయీభావ సమాసము, ముఖ్యః = ప్రధాన మైనది; వేటికో అట్టి, వైయాకరణ ప్రసిద్ధము లగు సమాస-తద్ధిత-నామధాతు-వృత్తుల యొక్క, తగిన ఆధారములపై కూర్చుటచే, ఎచట ఈ వృత్తుల స్వాభావికసౌందర్యము అభివ్యక్తిని పొందుచున్నదో అది యని దీని యర్థము. ఎట్లనగా—

"అభివ్యక్తిం తావద్బహిరలభమానః కథమపి
స్ఫురన్నన్తః స్వాత్మన్యధికతర సమున్మూర్ఛితభరః.
మనోజ్ఞాముద్వృత్తాం పరపరిమలస్పన్దసుభగా
మహోధత్తే శోభామధిమధు లతానాం నవరసః' 72

'వసంత ఋతువునందు, లతలయొక్క నూతన మగు రసము, బయటకు ఏ విధముగను అభివ్యక్తిని పొందనిదై, లోలోన స్ఫురించుచున్నదై, తనలో అత్యధికముగ వ్యాపించిన భారము కలదై మనోహర మైనదియు, అత్యధిక మైనదియు, ఉత్తమ మగు పరిమళముయొక్క స్పన్దముచే సుందర మైనదియు అగు శోభను ధరించుచున్నది, 72

వ్యా ఇచట 'అధిమధు' శబ్దమున విభక్త్యర్థమున విహిత మగు (అవ్యయీభావ) సమాసము (వసంత) సమయబోధక మైనను విషయసప్తమీబుద్ధిని కలిగించుచు 'నవరస' శబ్దమున శ్లేషచ్ఛాయ సంక్రమించుట వలన కలిగిన వైచిత్ర్యమును ఉన్మీలితము చేయుచున్నది.

వి. "అధిమధు" అనునపుడు "అవ్యయం విభక్తి" ఇత్యాది సూత్రముచే 'మధౌ' అను సప్తమ్యర్థమున 'అధి' 'మధు' శబ్దములకు అవ్యయీభావ సమాసము విధింపబడినది. "మధుసమయమునందు" అని యర్థము. కాని 'అధిమధు' అను అవ్యయీభావముచే 'మధువు' అనగా వసంతు డను నాయకుని విష

యమున అను అర్థము కూడ స్ఫురించును గాన 'నవరస' శబ్దమునందు గూడ శ్లేషచ్ఛాయచే "వసంతుని విషయమున లతావనితల నూతనానురాగము" అను అర్థము కూడ స్ఫురించుచున్న దని యభిప్రాయము.

వ్యా. ఈ అవ్యయీభావ సమాసవృత్తి లేని పక్షమున 'మధౌ' ఇత్యాది రూపమున మరి యొక విధముగ వాక్యమును కూర్చినను (మధురూపనాయకుని విషయమున నూతనానురాగము అను) వస్తువు ప్రతీత మగుచున్నను దాని యందు అంతటి సహృదయాహ్లాద కారిత్వము లేదు. 'అధిమధు' అనునపుడు వృత్తి వక్రత్వమే కాక 'ఉద్వృత్త', 'పరిమళ', 'స్పన్ద', 'సుభగ", శబ్దము లలో ఉపచార వక్రత్వము గూడ స్ఫురించుచు కనబడుచున్నది.

ఇంకను ఎట్లనగా—

ఆ స్వర్లోకాదురగ నగరం నూతనా లోకలక్ష్మీ-
మాతన్వద్భిః కిమివ సితతాం చేష్టితై స్తే న నీతమ్.
అప్యేతాసాం దయిత విహితా విద్విషత్సుందరీణాం
యైరానీతా నఖపదమయీ మణ్డనా పాణ్డిమానమ్ 73

"స్వర్గలోకమునుండి పాతాళము వరకును నూతనకాంతి లక్ష్మిని ఏర్పరచు చున్న నీ చేష్టలచే ఏది తెల్లగ చేయబడలేదు? వీటిచే ఈ శత్రు స్త్రీల యొక్క ప్రియులు ఏర్పరచిన నఖక్షతరూప మగు అలంకారము కూడ పాండుత్వమును పొందింపబడినది." 73

వ్యా. ఇచట 'పాండుత్వ', 'పాండుతా', 'పాండుభావ' శబ్దములకంటె 'పాండిమ' శబ్దమునందు ఒకానొక వృత్తి వైచిత్ర్య వక్రత్వము ఉన్నది.

వి. పాండు శబ్దముకంటె భావార్థమున 'ఇమనిచ్' ప్రత్యయమును చేర్చుటచే పాండిమ శబ్దము సిద్ధించినది.

ఇంకను ఎట్లనగా—

"కాన్త్యోన్మీలతి(కాంతత్వీయతి) సింహలీముఖరుచాంచూర్ణాభిషేకోల్లస
ల్లావణ్యామృతవాహి నిర్ఝరజుషా మాచాన్తి భిశ్చన్ద్రిమాః
యేనాపాన మహోత్సవ వ్యతికరే ష్వేకాత పత్రాయతే
దేవస్య త్రిదశాధి పావధి జగజ్జిష్ణోర్మనో జన్మనః" 74

"సుగంధ చూర్ణములను అత్యధికముగ పూసికొనుటచే (లేదా సుగంధ ద్రవ్యములు రాసికొని స్నానమాడుటచే ) ప్రకాశించుచున్న లావణ్యామృతమును ప్రవహించు (సౌందర్య) ప్రవాహములతో కూడిన సింహళ స్త్రీల ముఖ కాంతులను ఆచమనము చేయుటచే చంద్రుడు (తనకు కాంతత్వమును (సంపాదించుకొన వలెనని) కోరుచున్నాడు). కావుననే ఆతడు ఆపాన మహోత్సవములయందు స్వర్గమువరకును ఉన్న జగత్తును జయించిన మన్మథునియొక్క ఏకైకా తపత్రముగా అగుచున్నాడు" 74

వి. చంద్రుడు ఆపానోత్సవములలో మన్మథుని ఏకచ్ఛత్రముగ నుండి, సింహళీ ముఖకాంతులను గ్రోలి, తాను కూడ కాంతి కలవా డగుటకు ప్రయత్నించు చున్నాడు అని భావము.

ఇచట ('కాంతత్వం ఆత్మనః ఇచ్ఛతి కాంతత్వీయతి',' ఏకాతపత్రమివ ఆచరంతి ఏకాత పత్రాయతే' అను) సుబ్ధాతు వృత్తివలనను ( జగజ్జిష్ణోః' ఇత్యాది) సమాసవృత్తి వలనను ఒకానొక వక్రతా వైచిత్ర్యము స్ఫురించు చున్నది. 19

ఈ విధముగ వృత్తి వక్రతను విచారించి ఉచిత మగు (విచారణ) అవసరము గల పదపూర్వార్ధము నందుండెడు భావవక్రతను విచారించుచున్నాడు-

కా. సాధ్యతా మప్యనాదృత్య సిద్ధత్వేనాభిధీయతే
యత్ర భావో భవత్యేషా భావవైచిత్ర్య వక్రతా॥ 20

"ఎచట భావము (ధాత్వర్థము) సాధ్యత్వమును గూడ అనాదరించి సిద్ధరూపమున చెప్పబడుచున్నదో అది భావవైచిత్ర్య వక్రతగా అగుచున్నది "20

వ్యా. ఏషా = వర్ణిత రూపము గల, భావవైచిత్ర్య వక్రత, భవతి = ఉన్నది. భావః = ధాత్వర్థరూప మగు భావము, దానియొక్క వైచిత్ర్యం = విచిత్రత్వము; మరియొక ప్రకారముచే చెప్పుటకు శక్యము కాని రామణీయకము, దానిచే, వక్రతా = వక్రత్వరూప మగు విచ్ఛిత్తి, ఎట్టిదిః; యత్ర = దేనియందు, భావము, సిద్ధత్వేన = పరినిష్పన్న మైనట్లుగ, అభిధీయతే = చెప్పబడునో, ఏమి చేసిః సాధ్యతా మప్యనాదృత్య, ప్రసిద్ధ మగు సాధింపవలసి యుండుటను గూడ అనాదరించి, అనగా-ఇంకను సాధింపవలసి యుండుటచే నిష్పన్నము కాదు

గాన ప్రస్తుత వస్తువుయొక్క పరిపోషము దుర్బలముగ నుండును. కావున సిద్ధమైనట్లు చెప్పుట; నిష్పన్న మగుటచే ప్రకృతార్థ పోషణమును పూర్తిగ చేయును, అని దీని తాత్పర్యము-

ఎట్లనగా—

"శ్వాసాయాస మలీమసాధరరుచేర్దోః కన్దలీతానవాత్
కేయూరాయిత మంగదైః పరిణతం పాండిమ్నా గండత్విషా.
అస్యాః కించ విలోచనోత్పల యుగేనాత్యన్త మశ్రుస్రుతా
తారం తాదృగపాంగయోరరుణితం యేనోత్ప్రతాపః స్మరః" 75

"శ్వాసాయాసముచే మలిన మైన అధరకాంతి గల ఈమెయొక్క బాహు కందలులు, (కందలి అనగా అరటిచెట్టు; ఇచట అరటి దూట అని చెప్పవచ్చును. అరటి దూట వలె నున్న బాహువులు అని యర్థము) చిక్కి పోవుటచే అంగదములు కేయూరము లైనవి. గండస్థల కాంతి పాండుత్వ రూపమున పరిణమించినది. మరియు మిక్కిలి కన్నీళ్లను విడచుచున్న నేత్రోత్పలద్వయము యొక్క కొనలలో ఎంత అధిక మైన ఎరుపు ఏర్పడిన దనగా-దానితో మన్మథుడు అత్యధిక మగు ప్రతాపము కలవా డైనాడు."

వి అంగద కేయూర శబ్దములను "బాహు పురులు' అను నర్థమున పర్యాయ పదములుగ వాడుచుందురు. కాని ఇచట కవి ప్రయోగమును బట్టి, దండ క్రింది భాగమున నుండు దండ కడియములు అంగదము లనియు, పై భాగమున నున్నవి కేయూరము లనియు భేద మున్నట్లు కనబడుచున్నది.

వ్యా. ఇచట భావమును సిద్ధరూపముగ చెప్పుట అత్యంత చమత్కార కారిగ నున్నది.

వి. అనగా-అంగదములు కేయూరములుగ అగుచున్నవి; పాండుత్వ రూపమున పరిణమించుచున్నది; ఇత్యాది విధమున ఆయా వ్యాపారములు ఇంకను జరుగనున్నవి, అని చెప్పక ఆ క్రియలు జరిగిపోయి నట్లు వర్ణించుటచే ఇచట చమత్కారము సంపాదింప బడినది అని యర్థము.

*వ్యా, ఈ విధముగ భావవక్రతను గూర్చి విచారించి ప్రాతిపది కాంతర్వర్తి యగు లింగ వక్రతను విచారించుచున్నాడు.*

కా. భిన్నయోర్లింగ యోర్యస్యాం సామానాధి కరణ్యతః
కాపి శోభాభ్యుదేత్యేషా, లిఙ్గవైచిత్ర్య వక్రతా 21

"ఎచట రెండు భిన్నలింగములకు సామానాధి కరణ్యమును కూర్చుటచే అపూర్వ మగు ఒక శోభ ఏర్పడునో అది లింగవైచిత్ర్య వక్రత." 21

వ్యా. ఏషా = (కారికలో) చెప్పబడిన స్వరూపము గల ఇది, లిఙ్గవైచిత్ర్య వక్రతా = స్త్రీలింగాది లింగముల విచిత్ర భావముచే నేర్పడిన వక్రతావిచ్ఛిత్తిగా, మరియొక క్రియ యేదియు లేకుండుటచే 'భవతి'- అను పూర్వకారికా గత క్రియతో సంబంధము (అనగా ఉన్నది యని అర్థము). ఎట్టిది? యస్యాం = దేనియందు, విభిన్నయోః = వేరు వేరు స్వరూపములు గల, రెండు లింగములకు, సామానాధి కరణ్యతః = తుల్యాశ్రయత్వమువలన, అనగా-ఏకద్రవ్య బోధకత్వము వలన కాపి = అపూర్వ మగు, శోభా = కాంతి, అభ్యుదేతి = ఉల్లసిత మగునో. ఎట్లనగా—

"యస్యారోపణకర్మణాపి బహవో వీరవ్రతం త్యాజితాః
కార్యం పుంఖితబాణ మీశ్వర ధనుస్తద్దోర్భి రేభిర్మయా.
స్త్రీ రత్నం తదగర్భసంభవమితో లభ్యం చ లీలాయితా
తేనైషా మమ ఫుల్లపంకజవనం జాతా దృశాం వింశతిః" 76

"ఏ ధనస్సును ఎక్కుపెట్టుట అనెడు కర్మచేతనే అనేకులు వీరవ్రతమును విడువ వలసి వచ్చినదో అట్టి ఈశ్వర ధనస్సుపై నేను ఈ బాహువులతో బాణమును కూర్పవలసి యున్నది. ఈ విధముగ చేయుటచే అగర్భసంభవ మగు ఆ స్త్రీ రత్నమును పొందవలసి యున్నది. దీనిచే విలాసపూర్ణ మగు నా నేత్రముల వింశతి వికసితపద్మ వనముగా నైనది"

వి. ఇవి బాలరామాయణమున సీతా స్వయంవరార్థమై వచ్చిన రావణుని పల్కులు. 'ఇచట' వింశతిః 'పంకజవనం' అను స్త్రీలింగ నపుంసకలింగ శబ్దములను సమానాధి కరణములుగ, విశేషణ విశేష్యములుగ ప్రయోగించుటచే ఇది లింగవైచిత్ర్యమున కుదాహరణము.

ఇంకను ఎట్లనగా—

"నభస్వతా లాసితకల్పవల్లీప్రవాళవాలవ్యజనేన తస్య
ఉరఃస్థలేఽకీర్యత దక్షిణేన సర్వాప్పదం సౌరభమంగ రాగః" 77

(బాలరామా 7-66)

"కల్పలతల ప్రవాళము లనెడు వాలవ్యజనములను కదల్చుచున్న దక్షిణ వాయువుచే ఆతని వక్షస్థలముపై సర్వవ్యాప్త మగు సౌరభ మనెడు అంగరాగము చిమ్మబడెను" 77

వి. ఇచట 'సౌరభమ్', 'అంగరాగః', అనెడు నపుంసక, పుంలింగ పదములు సమానాధి కరణములుగ ప్రయుక్తము లైనవి.

వ్యా. ఇంకను ఎట్లనగా—

"ఆయోజ్య మాలామృతుభిః ప్రయత్న
సంపాదితామంసతటేఽస్య చక్రే.
కరారవిందం మకరన్ద బిన్దు
స్యన్దిశ్రియా విభ్రమకర్ణ పూరః" 78

"ఋతువులు ప్రయత్న పూర్వకముగ సంపాదిత మగు మాలను కూర్చి దానిని ఈతని అంసతటమున ఉంచినవి. లక్ష్మి మకరంద బిందువులను స్రవించుచున్న తన చేతిలోని అరవిందమును విలాసార్థ మగు కర్ణాలంకారముగ చేసెను". 78

వి. ఇచట 'కరారవిందం', 'విభ్రమకర్ణ పూరః' అనెడు నపుంసకలింగ, పుంలింగ శబ్దములు సమానాధికరణములుగ ప్రయోగింపబడినవి.

వ్యా. ఇది మరి యొుక విధమగు లింగవైచిత్ర్య వక్రత—

కా. సతి లిఙ్గాన్తరే యత్ర స్త్రీలిఙ్గం చ ప్రయుజ్యతే
శోభానిష్పత్తయే యస్మాన్నామైవ స్త్రీతి పేశలమ్ 22

"ఎచట, మరియొక లింగ మున్నను శోభను కూర్చుటకై స్త్రీలింగము ప్రయోగింపబడునో (అచట మరి యొుక విధమగు లింగవైచిత్ర్య వక్రత యున్నది). ఏలయన స్త్రీ అను నామమే సుకుమారమైనది." 22

వ్యా యత్ర = దేనియందు, లిఙ్గాన్తరే సతి = మరి యొక లింగము సంభవించినను, స్త్రీ లింగము, ప్రయుజ్యతే = కూర్చబడునో, ఒక పదార్థమున అనేక లింగము లున్నను, స్త్రీలింగ విషయ మగు ప్రయోగము చేయబడునో. ఎందులకు॰ శోభానిష్పత్తి కొరకు. ఏ కారణమువలన॰ "యస్మాన్నామైవ స్త్రీతి పేశలమ్" — స్త్రీ అనెడు నామధేయమే హృదయ హారిగ నుండును. ఏలయన అది శోభావిశేషముచే (పురుషుల మానసమున) శృంగార రసాదులను కూర్చుటకు యోగ్యముగ నుండును ఉదాహరణము ఎట్లనగా—

"యథేయం గ్రీష్మోష్మ వ్యతికరవతీ పాండురభిదా
ముఖోద్భిన్న మ్లానానిలతరలవల్లీ కిసలయా.
తటే తారం తామ్యత్యతి శశియశాః కోఽపి జలద
స్తథా మన్యే భావీ భువనవలయాక్రాన్తి సుభగః" 79

"గ్రీష్మము వేడిమి యొక్క సంబంధము కలదియు, తెల్లని పగుళ్ళు అనెడు ముఖము నుండి బయల్వెడలుచున్న వాడిపోయిన గాలులచే కదలుచున్న లతాకిసలయములు కలదియు నగు ఈ తటి అత్యధికముగ సంతప్త మగుట చూడగా చంద్రుని మించిన కీర్తి కలిగిన (అతిశయ యశాః = అతిశయించిన కీర్తి గల అను పాఠముండవలెనని తోచును) ఒకానొక మేఘుడు భువనవలయమును ఆక్రమించుటచే సుభగుడుగా కానున్నాడని తలచెదను". 79

వ్యా తట శబ్దము మూడు లింగము లందును ఉన్నను సౌకుమార్యము వలన, ఇచట, స్త్రీ లింగమే ప్రయుక్త మైనది. అందుచే మరి యొక విచ్ఛిత్తిచే రాబోవు నాయక వ్యవహార మొకటి నిబద్ధమైనది గాన రామణీయకముచే వక్రత్వమును కూర్చుచున్నది. 22

వి. అనగా స్త్రీలింగ తటీశబ్దప్రయోగము విరహతాప సూచక విశేషణాన్తర సహకృతమై విరహతప్త యగు ఒక నాయికకు అనతికాలములో ప్రేయః సమాగమము కాగల దని సూచించుచున్నది గాన అధిక మగు చమత్కారము కల్గిన దని యభిప్రాయము.

దీనియొక్క మరి యొక ప్రకారమును నిరూపించుచున్నాడు-

కా. విశిష్టం యోజ్యతే లిఙ్గమన్యస్మిన్ సమ్భవత్యపి.
యత్ర విచ్ఛిత్తయే సాన్యా వాచ్యౌచిత్యాను సారతః. 23

"ఎచట మరియొక లింగమును కూర్చుటకు అవకాశ మున్నను, విచ్ఛిత్తి కొరకై ఒకానొక విశిష్ట మగు లింగము కూర్చబడునో అది, వర్ణ్యమాన మగు వస్తువు యొక్క ఔచిత్యమును అనుసరించి మరి యొక లింగ వక్రత యని చెప్పదగినది."

వ్యా సా (ఈ కారికలో) చెప్పబడిన స్వరూపము గల అన్యా = మరి యొక లిఙ్గవక్రత యన్నది యత్ర = దేనియందు "విశిష్టం యోజ్యతే లిఙ్గమ్" కవి వివక్షానుసారముగ మూడు లింగములలో నొకటి కూర్చబడునో. ఎట్లు? "అన్యస్మిన్ సమ్భవత్యపి" = మఱియొక లింగము ఉన్నను ఎందులకు? విచ్ఛిత్త్యై = శోభకొరకు ఏ కారణము వలన? వాచ్యౌచిత్యాను సారతః— వాచ్యస్య = వర్ణ్యమాన మగు వస్తువుయొక్క, ఏ, ఔచిత్యం = ఔచిత్యము కలదో, దానియొక్క, అనుసరణమ్ = అనుసారము దానివలన పదార్థౌ-చిత్యము ననుసరించి అని యర్థము

ఎట్లనగా—

త్వం రక్షసా భీరు యతోఽపనీతా
తం మార్గమేతాః కృపయా లతా మే।
అదర్శయన్ వక్తు మ శక్ను వన్త్యః
శాఖాభి రా వర్జిభ పల్లవాభిః॥ 80

"ఓ భయస్వభావము కలదానా! నీవు రాక్షసునిచే ఏ మార్గముచే తీసికొని పోబడితివో ఆ మార్గమును ఈ లతలు చెప్పుటకు అసమర్థములైనవై, వంచబడిన చిగుళ్ళు గల శాఖలచే నాకు దయతో చూపినవి" 80

వ్యా ఇచట రాముడు సీతతో కూడ పుష్పకముపై ప్రయాణము చేయుచు, ఆమె విరహము వలన తనకు కలిగిన దుఃఖమును ఆమెకు స్వయముగ చెప్పుచున్నాడు- అంత తొందరతో వ్యాకుల మగు మనస్సు గల రావణుడు

నిన్ను ఏ మార్గమున తీసికొనిపోయెనో, ఆ మార్గమున వానియొక్క ఉపమర్దము వలన లతలకు కలిగిన అట్టి అవయవములు కలిగియుండుట (అనగా నిన్ను తీసికొనిపోయెడు తొందరలో రావణుడు కొన్ని లతలను వంచివేసెను. దానిచే వాటి చిగుళ్లు వంగిపోయినవి. అట్లు వంగిన చిగుళ్ళు) నేను నీ మార్గమును గూర్చి ఊహించుకొనుటకు కారణమైనవి అనెడు వస్తువును రాముడు మరి యొక విచ్ఛిత్తితో కూర్చుచున్నాడు. ఎట్లనగా—

హే భీరు=స్వాభావిక మగు సౌకుమార్యముచే భయపడుచున్న అంతః కరణము కలదానా! ఆ విధమగు క్రూరకర్మ చేసిన రావణుడు నిన్ను ఏ మార్గమున తీసికొనిపోయెనో, దానిని, ప్రత్యక్షముగ కనబడుచున్న ఈ లతలు నాకు చూపినవి అని. వాస్తవమున అవి నిశ్చేతనములు గాన, అవి మార్గమును చూపుట అసంభావ్యము గాన, ఇచట ప్రతీయమాన మగు ఉత్ప్రేక్ష కవికి అభీష్టము. ఎట్లనగా— నీ భీరుత్వమును, రావణుని క్రౌర్యమును, నేను నిన్ను రక్షింప ప్రయత్నించుచున్నా ననెడు విషయమును ఆలోచించి, స్త్రీ స్వభావమున ఆర్ద్ర హృదయ లగు ఈ లతలు సముచిత మగు సజాతీయ పక్షపాత మహిమ చేతనే నాకు మార్గ ప్రదర్శనము చేసినవి. ఏ సాధనము ద్వారా (చేసినవి ?) వంచబడిన చిగుళ్లు కల శాఖలచేత. ఏ కారణము వలన అనగా-అవి వాగింద్రియ శూన్యము లగుటచే మాటలాడుటకు అసమర్థములైనవి గనుక. ఏలయన- మాటలాడకుండగా మార్గమును చూపెడు వారు అటువైపు త్రిప్పిన హస్తపల్లవ ములు గల బాహువులతో చూపుదురు, గాన ఇది అత్యంతము యుక్తియుక్తముగ నున్నది.

ఇచటనే అట్టి మరియొక వాక్యము కూడ ఉన్నది—

"మృగ్యశ్చ దర్భాంకుర నిర్వ్యపేక్షా
స్తవాగతిజ్ఞం సమబోధయన్ మామ్।
వ్యాపారయన్త్యో దిశి దక్షిణస్యా
ముత్పక్ష్మరాజీని విలోచనాని" 81

"ఆడలేళ్ళు కూడ దర్భాంకురములందు ఆసక్తి లేనివై ఎత్తబడిన కనురెప్పల పంక్తులు గల నేత్రములను దక్షిణదిక్కు వైపు త్రిప్పుచు నీవు పోయిన మార్గము నెరుంగని నాకు తెలిపినవి." 81

వ్యా॥ ఆ దతేళ్ళు నాకు తెలియ పర్చినవి. ఎట్టి నాకు? 'తవాగర్జ్ఞమ్'-లతలు చూపిన నీ మార్గమును గుర్తింపజాలకున్న వాడను. అవి లతలకంటె కొంచెము అధికమగు జ్ఞానము కలవి గాన అవి నాకు బాగుగ తెలిపినవి (అనగా ఈ విషయమును సూచించుటకే కవి పూర్వశ్లోకమున 'అదర్శయన్ అని చెప్పి ఇచట సమబోధయన్' అని, సమ్యక్ = బాగుగా అబోధయన్, తెలియ పరచినవి." అను నర్థము గల పదమును ప్రయోగించినాడు) ఆ లేళ్ళు ఎట్టివి? అట్టి క్రూర కార్యమును చూచుటచే దుఃఖితములై తృణగ్రాసములను విడిచివేసినవి. ఏమి చేయుచు? ఆ దిక్కువయిపు నయనములను సమర్పించుచు ఎట్టివి? పైకి ఎత్తబడిన కనురెప్పల పంక్తులు కలవి అనగా అవయవ విన్యాసము ద్వారా ఆకాశ మార్గమున దక్షిణ దిక్కు వయిపు తీసికొనిపోయినారు అని (నేత్రాది) సంజ్ఞచే తెలుపుచున్నవై (అని యర్థము).

ఇచట పై రెండు శ్లోకములందును 'వృక్ష' 'మృగ' మొద లగు ఇతర (పుం) లింగ పదము లున్నను, పదార్థౌచిత్యాను సారముగ, కవికి, చేతన చమత్కార కారియగుటచే, ('లతాః', 'మృగ్యః' అను) స్త్రీ లింగము ఇష్టమైనది దీని వలన ఒక విధమగు వక్రత ఏర్పడుచున్నది. 23

వ్యా॥ ఈ విధముగ సుబంత పదములలో నుండెడు ప్రాతిపదికరూపమగు పదపూర్వార్థము యొక్క వక్రత్వమును యథాసంభవముగ విచారించి, ఇపుడు సుబంత తిఙంతములలో ధాతురూప మగు ఏ పూర్వభాగము సంభవించునో దాని యొక్క వక్రతను విచారించుచున్నాడు ఈ పూర్వభాగము యొక్క వైచిత్ర్యము క్రియా వైచిత్ర్యముపై మాత్రమే ఆధారపడి యుండును గాన ఆ క్రియా వైచిత్ర్యమున ఎన్ని ప్రకారములు ఎట్టివి, ఉండునో వాటి స్వరూపమును నిరూపించుటకై చెప్పుచున్నాడు.

కా. కర్తురత్యన్తరంగత్వం కర్త్రన్తర విచిత్రతా
స్వ విశేషణ వైచిత్ర్య ముపచార మనోజ్ఞతా. 24
కర్మాది సంవృతిః పంచ ప్రస్తుతౌచిత్య చారవః
క్రియా వైచిత్ర్య వక్రత్వ ప్రకారా స్త ఇమే స్మృతాః. 25

"కర్త అత్యంతము అంతరంగముగా నుండుట, మరియొక కర్త యొక్క విచిత్రత్వము, తన విశేషణముల వైచిత్ర్యము, ఉపచారము వలన కలిగిన

సౌందర్యము కర్మాదుల సంవృతి అను ఈ ఐదును ప్రస్తుత మగు వస్తువు యొక్క ఔచిత్యముచే సుందరమైన క్రియా వైచిత్య వక్రత్వ ప్రకారము లని చెప్పబడినవి " 24-25

వ్యా క్రియా వైచిత్ర్య వక్రత్వ ప్రకారాః = ధాత్వర్థము యొక్క విచిత్రత్వముచే నేర్పడిన వక్రతాభేదములు, తే ఇమే = ఇవి, వర్ణింపనున్న స్వరూపము కలవిగా స్మృతాః = చెప్పబడినవి ఎన్ని ? పఞ్చ = పంచత్వ సంఖ్యతో కూడినవి. ఎట్టివి ? ప్రస్తుతౌచిత్యచారవః = ప్రస్తుతం, వర్ణింప బడుచున్న వస్తువు, దానియొక్క ఏ ఔచిత్యం = ఔచిత్య మున్నదో, దానిచే చారవః = రమణీయ మైనవి

వాటిలో కర్త అత్యంతరంగముగ నుండుట యనునది మొదటిప్రకారము. కర్తుః = ('స్వతంత్రః కర్తా'అను పాణిని సూత్రాను సారముగ ధాత్వర్థ వ్యాపార విషయమున) స్వతంత్రు డగుటచే ముఖ్యకారక మగు క్రియా నిర్వర్తకు డైన కర్తయొక్క, క్రియను గూర్చిన ఏ 'అంతరంగత్వం' = అంతరతమ్యము (అతి సన్నిహితత్వము) కలదో (అది). ఏట్లనగా

"చూడారత్ననిషణ్ణ దుర్వహ జగద్భారోన్నమత్కన్ధరో
ధత్తాముద్ధురతా మసౌ భగవతః శేషస్య మూర్ధా పరమ్
స్వైరం సంస్పృశతీ షదప్యవనతిం యస్మిన్ లుఠన్త్యక్రమం
శూన్యే నూనమియన్తి నామ భువనాన్యుద్దామ కంపోత్తరమ్" 82

"శిరోరత్నముపై కూర్చున్న, మోయ శక్యము కాని జగద్భారముచేత గూడ పైకి లేచుచున్న కంఠము గలది యగు భగవంతు డగు ఆదిశేషుని ఈ శిరస్సు అత్యంతము ఉద్ధురత్వమును (భారవహకత్వమును) ధరించుగాక. ఏ కంఠము స్వేచ్ఛచే కొంచెమైనను అవనతిని స్పృశించగనే (వంగగనే) ఇన్ని భువనములు గూడ తీవ్రముగ కంపించుచు, క్రమ విరహితములై శూన్యమునందు (ఆకాశమునందు) తప్పక దొరలిపోవునో " 82

వ్యా. ఇచట ఉద్ధురత అనగా ధారణరూప మగు క్రియ, కర్త యగు ఆదిశేషుని విషయమున ఏ విధముగ ప్రస్తుతౌచిత్య మాహాత్మ్యముచే అంతర్భావ మును పొందునో ఆ విధముగ మరియొక క్రియ యేదియు పొందజాలదు గాన ఇది క్రియా వైచిత్ర్య వక్రతను సంపాదించుచున్నది.

ఇంకను ఎట్లనగా—

కిం శోభితాహ మనయేతి పినాకపాణేః

పృష్టస్య పాతు పరిచుమ్బన ముత్తరం వః। 88

"దీనితో అందముగ నున్నానా?" అని అడగబడిన ఈశ్వరుని యొక్క పరిచుంబనరూప మగు ప్రత్యుత్తరము మిమ్ములను రక్షించుగాక." 88

(చూ. I–81)

వ్యా ఇచట భగవంతు డగు ఈశ్వరుడు చుంబనము తప్ప మరి ఏ క్రియాన్తరము చేతను అట్టి లోకాత్తర మగు గౌరీ శోభాతిశయ వర్ణనము చేయజాలడు గాన ఇది (చుంబనము) క్రియా వైచిత్ర్య కృత మగు వక్రత్వమును సంపాదించుచున్నది.

ఇంకను ఎట్లనగా—

"పార్వతీచుంబిత మగు రుద్రుని తృతీయన యనము సర్వోత్కృష్టముగ నున్నది" 80, (చూ–I–58) (ఇచట కూడ చుంబన క్రియ క్రియా వైచిత్ర్య వక్రత్వమున సంపాదించుచున్నది)

ఇంకను ఎట్లనగా—

"చాపమును శిథిలము చేసిన (ధనుస్సు నారిని వదులు చేసిన) మకర ధ్వజుడు జయించుచున్నాడు." 85 (చూ-I-61)

ఈ రెండు దాహరణములందలి వైచిత్ర్యమును వెనుకనే చూపి యున్నాము.

కర్త్రన్తర విచిత్రత యనునది క్రియావైచిత్ర్య వక్రతలోని మరి యొక ప్రకారము-"అన్యః కర్తా కర్త్రన్తరమ్" మరియొక కర్త. దానివలని వైచిత్ర్యము (ఆ వైచిత్ర్యము దేనిది అనగా) ప్రస్తుతము కావునను సజాతీయ మగుటచేతను, (అది) కర్తయొక్క (వైచిత్ర్యమే) దీని వైచిత్ర్య మేమనగా—అది ఇతర కర్తకు శక్యము కాని విచిత్రస్వరూప మగు క్రియను సంపాదించును.

ఎట్లనగా—

"నైకత్ర శక్తివిరతిః క్వచిదస్తి సర్వే

భావాః స్వభావపరినిష్ఠిత తారతమ్యాః

ఆకల్పమౌర్వదహనేన నిపీయమాన-
మమ్భోధిమేకచులుకేన పపావగస్త్యః" 86

"శక్తికి అంత మనునది-ఎచ్చటను ఒకచోట ఉండదు—అన్ని వస్తువులును, స్వభావముచే నేర్పడిన తారతమ్యము కలవి. కల్పాది నుండియు, బడబాగ్నిచే త్రాగబడుచునే ఉన్న సముద్రమును అగస్త్యుడు ఒక చులుకముతో త్రాగివేసెను."

వ్యా. నిరంతర దృఢనిశ్చయముచే చేసిన అభ్యాసము యొక్క చరమ కాష్ఠను అధిష్ఠించుటచే ప్రౌఢు డగు బడబాగ్ని కంటె, ఒక్క చులుకముచే సముద్రపానము ఒకానొక క్రియా వైచిత్ర్యమును ధరించుచు అపూర్వ...మగు వక్రతను ఉన్మీలితము చేయుచున్నది.

ఇంకను ఎట్లనగా—

"ప్రపన్నార్తిచ్ఛిదో నఖాః" 87

"శరణుజొచ్చిన వారి కష్టములను త్రుంచివేసెడు గోళ్ళు." 87

(చూ-I-59)

ఇంకను ఎట్లనగా—

"స దహతు దురితం శాంభవో వః శరాగ్నిః" 88

"ఈశ్వరుని ఆ శరాగ్ని మీయొక్క పాపమును కాల్చివేయు గాక." 88

(చూ-I-60)

వీని వైచిత్ర్యము వెనుకనే చూపబడినది-

వ్యా. "స్వవిశేషణవైచిత్ర్యము" అనునది క్రియావైచిత్ర్యవక్రతయొక్క మరి యొక భేదము. (ఇచట స్వశబ్దమునకు అర్థమేమనగా—) క్రియముఖ్యముగ ప్రస్తుత మగుటచే, స్వస్య = తనయొక్క, ఏ, విశేషణమ్ = భేదకము కలదో, దానిచేత, వైచిత్ర్యం = విచిత్రత్వము ఎట్లనగా-

"ఇత్యుద్గతే శశిని పేశలకాన్తిదూతీసంలాపసంవలితలోచనమానసాభిః,
అగ్రాహి మండనవిధిర్విపరీతభూషావిన్యాసహాసితసఖీజనమంగనాభిః"

"ఈ విధముగ చంద్రుడు ఉదయించగా, మధురము అగు ప్రియదూతి కల్గి మాటల వైపు త్రిప్పబడిన నేత్రములును, మనస్సులును గల స్త్రీలచే అలంకరణవిధానము, విపరీత మగు భాషణవిన్యాసముచే నవ్వింపబడిన సఖీజనము కల్గునట్లుగా గ్రహింపబడెను" 89

వ్యా. ఇచట "విపరీతభూషావిన్యాసహాసితసఖీజనమ్" అను విశేషణము మండనవిధిగ్రహణరూప మగు క్రియయందలి ఒకానొక సౌకుమార్యమును వికసింపచేయుచున్నది. ఏలయన- అట్టి ఆదరముతో రచిత మగు ప్రసాధనము ముఖ్యముగ వర్ణింపబడు ఏ వల్లభానురాగమును వ్యంజింపచేయుటకై గ్రహింపబడినదో, అది గూడ దానిచేత మిక్కిలి ఉత్తేజిత మైనది

"మయ్యాసక్తశ్చకితహరిణీహారినేత్రత్రిభాగః 90

"భయపడిన ఆడలేడి వలె మనోహర మగు నట్లుగా; నేత్రాంతము నాయందు లగ్నము చేయబడినది''. 90

(చూ. 1-49)

వ్యా. దీని వైచిత్ర్యమును పూర్వమే తెలిపి యున్నాము. ఈ క్రియావిశేషణము క్రియాకారకములు రెండింటియొక్కయు వక్రత్వమును వికసింపచేయుచున్నది. ఏలయన- కారకవైచిత్ర్య మనగా విచిత్రక్రియాకారిత్వమేకదాః

వి. అనగా, పై ఉదాహరణమున 'చకితహరిణీహారి' అను క్రియావిశేషణము నేత్రాంతాసంగరూప మగు క్రియయందలి వైచిత్ర్యమునే కాక నేత్రత్రిభాగమునకు హరిణీనేత్రముతో సామ్యము గమ్య మగుటచే నయనత్రిభాగరూపకర్మకారకమునందలి వైచిత్ర్యమును గూడ ప్రకటించుచున్నది.

వ్యా. ఉపచారమనోజ్ఞత యనునది క్రియావైచిత్ర్యవక్రతయొక్క మరియొక ప్రకారము. ఉపచారః = సాదృశ్యాదిసంబంధమును ఆశ్రయించి ధర్మాంతరమును ఆరోపించుట. దానిచే మనోజ్ఞతా = వక్రత్వము. ఎట్లనగా-

"తరన్తీవాంగాని స్థలదమలలావణ్యజలధౌ
ప్రథిమ్నః ప్రాగల్భ్యం స్తనజఘనమున్ముద్రయతి చ.
దృశోర్లీలారంభాః స్ఫుటమపవదన్తే సరలతా-
మహో సారంగాక్ష్యాస్తరుణిమని గాఢః పరిచయః'' 91

"తరంగిత మగు విమలలావణ్యాంబుధిలో అవయవములు ఈదుచున్న ట్లున్నవి; స్తనములు, జఘనమును పృథుత్వముయొక్క ప్రాగల్భ్యమును ఆవిష్కరింపచేయుచున్నవి. నేత్రములయొక్క విలాసప్రారంభములు స్పష్టముగ (పూర్వవయస్సుకు సంబంధించిన) సరళత్వమును తొలగించుచున్నవి. ఆహా! సారంగాక్షికి తారుణ్యముతో ఎంత గాఢపరిచయ మేర్పడినది!". 91

వ్యా. ఇచట "స్ఖలదమలలావణ్యజలధౌ = ప్రకాశించుచున్న విమల సౌందర్యసంభారసముద్రమునందు స్ఫురించుచున్న స్పందనము కలవగుటచే (స్పందించుచున్నట్లు స్ఫురించుటచే) తేలుచున్నట్లు కనబడుచున్న (గాత్రములు) ఆవలి ఒడ్డును చేరుటకు ప్రయత్నించుచున్నట్లు ఉన్నవి అని చేతనపదార్థమునందు సంభావ్య మగు దానిని సాదృశ్యమునాధారముగ గొని ఆరోపించుటచే తారుణ్య మున తరళము లగు తరుణీగాత్రములకు ఈదుట ఉత్ప్రేక్షింపబడినది ఉత్ప్రే క్షకు ఉపచారమే ఎక్కువగ జీవితమై స్ఫురించుచుండును అను విషయమును ఉత్ప్రేక్షానిరూపణసమయమున నిరూపింపగలము.

"స్తనజఘనము పృథుత్వముయొక్క ప్రాగల్భ్యమును ఆవిష్కరించు చున్నది". ఇచట కర్త యగు స్తనజఘనము, ప్రథిమ్నః = పెద్దతనముయొక్క, ప్రాగల్భ్యం = ప్రౌఢిని, ఉన్ముద్రయతి = ఉన్మీలితము చేయుచున్నది. చైతన్య వంతు డగు ఒకానొక మానవుడు రక్షణీయ మగు ఒకానొక వస్తువుకు ముద్రవేసి, కొంతకాల ముంచి, తగు ఉపయోగము కలిగిన సమయమున స్వయ ముగ ముద్ర తీసి వేసి ఏ విధముగ తెరచునో ఆ విధముగ ఉద్ఘాటనకారిత్వ సామ్యముచే స్తనజఘనముయొక్క, ఉన్ముద్రణము ఆరోపింపబడినది దీనియభి ప్రాయమేమనగా- ఏది (ఏ ప్రథిమప్రాగల్భ్యము) శైశవదశలో శక్తిరూపమున (బీజమునందు అంకురము వలె) అనుద్బుద్ధరూపమున ఉండెనో అట్టి ప్రథిమ (పెద్దదగుట) యొక్క ప్రాగల్భ్యమునకు ప్రథమతారుణ్యప్రారంభసమయము నకు ఉచిత మగు స్ఫుట మగుటకు అవకాశమును (స్తనజఘనము) ఇచ్చుచున్నది.

"నేత్రముల లీలారంభములు స్పష్టముగ సరళత్వమును తొలగించు చున్నవి". ఇచట నేత్రముల విలాసోల్లాసములు శైశవమున ప్రతిష్ఠిత మగు సరళత్వమును ప్రకటముగనే తొలగించి నవయౌవనసముచిత మగు ఒకానొక విభ్రమమును తీసికొని వచ్చి ఉంచుచున్నవి. కొందరు చేతనులు ఒకానొక

వ్యవహారమును తొలగించి (దాని స్థానమున) తమ అభిప్రాయమునకు అభిమత మగు మరి యొక వ్యవహారమును స్థాపింతురో ఆ విధముగ చేయుట యనెడు సాదృశ్యముచే లీలావతుల నేత్రవిలాసోల్లాసములకు సరళత్వమును తొలగించుట యనునది ఆరోపింపబడినది. ఇట్లు ఈ విధ మగు ఉపచారముచే ఈ మూడు క్రియలును ఒకానొక వక్రతను పొందునట్లు చేయబడినవి. ఈ వాక్యమునందలి ప్రతిపదమునందును ఇతరము లగు వక్రతాప్రకారములు గూడ సంభవించును, అను విషయమును మరియొక సమయమున విచారింపగలము.

క్రియావైచిత్ర్యవక్రతయొక్క మరి యొక ప్రకారము కర్మాదిసంవృతి; (అనగా) కర్మ మొదలగు కారకముల సంవరణము. ప్రస్తుత మైనదానియొక్క ఔచిత్యమును అనుసరించి అతిశయముతో కూడినది, అను ప్రతీతికొరకై ఆచ్ఛాదించి చెప్పుట, అది కూడ క్రియావైచిత్ర్యమును కల్పించును గాన (ఒక) ప్రకారముగ చెప్పబడుచున్నది.

కారణమునందు కార్యత్వోపచారముచే ('కర్మాదిసంవృతి' రూపక్రియా వైచిత్ర్యవక్రత) ఎట్లనగా-

"నేత్రాన్తరే మధురమర్పయతీవ కించిత్
కర్ణాన్తికే కథయతీవ కిమప్యపూర్వమ్.
అన్తః సముల్లిఖతి కించిదివాయతాక్ష్యాః
రాగాలసే మనసి రమ్యపదార్థలక్ష్మీః" 92

"ఆయతాక్షియొక్క రాగాలస మగు మనస్సునందలి రమ్యపదార్థలక్ష్మి నేత్రమధ్యమునందు ఒకానొక మధువును ఉంచుచున్నది వలె నున్నది. కర్ణ సమీపమున అపూర్వ మగు ఏదియో యొక విషయమును చెప్పుచున్నట్లు ఉన్నది. లోపల ఏమియో వ్రాయుచున్నట్లున్నది".

వ్యా. ఇచట- ఆమెయొక్క అనుభవమునకు మాత్రమే గోచర మగుటచే చెప్పుటకు వీలుకానిది గాన ప్రతిపదమునందును సాతిశయ మగు ఒకానొక కర్మను సంపాదించుచున్న క్రియలు స్వాత్మయందు (తమయందు) ఒకానొక వక్రత్వమును వెల్లడించుచున్నవి. ఇచట ఉపచారకృత మగు మనోహరత్వము కూడ ఉన్నది. ఏలయన- 'అర్పణ' 'కథన' 'ఉల్లేఖన'ములుచేతనపదార్థము లగుటచే ఉపచారము పై నాధారపడినవే.

ఇంకను ఎట్లనగా:-

"నృత్తారమ్భాద్విరతరభసస్తిష్ఠ తావన్ముహూర్తం
యావన్మౌవౌ శ్లథమచలతాం భూషణం తే నయామి.
ఇత్యాఖ్యాయ ప్రణయమధురం కాన్తయా యోజ్యమానే
చూడాచన్ద్రే జయతి సుఖినః కోఽపి శర్వస్య గర్వః" 93

''నృత్తారంభమునుండి విరమించిన వేగముకలవాడవై క్షణకాలము ఆగుము. జారిపోవుచున్న భూషణమును నీశిరముపై స్థిరమైనదానినిగ చేయుదును"—ఈ విధముగ ప్రేమచే మధుర మగునట్లుగా, పలికి ప్రేయసి చూడాచంద్రుని సరిగా నుండు నట్లు చేయుచుండగా సుఖవంతు డగు ఈశ్వరునియొక్క వర్ణింపనలవి గాని గర్వము సర్వోత్కర్షముతో నున్నది".

వ్యా. ఇచట— ''కోఽపి" అను సర్వనామపదముచే, ఈశ్వరుని గర్వము, అతని అనుభవమునకు మాత్రమే గోచర మగుటచే వర్ణింపశక్యము కానిదియు, సాతిశయమును అను, కర్తయొక్క సంవృతి, జయతి = సర్వోత్కర్షముతో నున్నది అనెడు క్రియావైచిత్ర్యమునకుకారణము.

శ్లో॥ ఇత్యయంపదపూర్వార్ధవక్రభావోవ్యవస్థితః
దిఙ్మాత్రమేవమేతస్య శిష్టం లక్ష్యేనిరూప్యతే. 94

''ఈ పదపూర్వార్ధం వక్రభావము ఈ విధముగ వ్యవస్థిత మైనది. ఇది దీనియొక్క దిఙ్మాత్రమే. మిగిలినది లక్ష్యమునందు నిరూపింపబడగలదు". 94

ఇది సంగ్రహ శ్లోకము.

వ్యా. ఈ విధముగ సుప్తిఙంతములు రెండింటియందును పదపూర్వార్ధ మగు ప్రాతిపదికముయొక్కయు, ధాతువుయొక్కయు, వక్రతను యుక్తము సారముగ విచారించి ఇపుడు ప్రత్యయరూప మగు ఆ రెండింటి ఉత్తరార్ధము యొక్క వక్రతనే విచారించుచున్నాడు. అందును క్రమసమన్విత మగుటచే క్రియావైచిత్ర్యవక్రతకు అనంతరము సంభవించు కాలము క్రియాపరిచ్ఛేదకము గాన దానియొక్క వక్రత పర్యాలోచింపబడుచున్నది. (క్రియాపరిచ్ఛేదక మనగా క్రియను విభజించునది అని యర్థము).

కా. ఔచిత్యాన్తరతమ్యేన సమయోరమణీయతామ్
యాతి యత్ర భవత్యేషా కాలవైచిత్ర్యవక్రతా. 26

'ఔచిత్యముయొక్క సామీప్యముచే, కాలము ఎచట రమణీయత్వమును పొందునో అది కాలవైచిత్ర్యవక్రత యగును"

వ్యా. ఏషా = ఉపక్రమింపబడినస్వరూపముకల, కాలవైచిత్ర్యవక్రత, భవతి = ఉన్నది. కాలః = ఏదివైయాకరణాదిప్రసిద్ధమై 'లట్' మొదలగు ప్రత్యయములచే వాచ్యమై పదార్థములఉదయమును తిరోధానమును చేయునో అట్టి వర్తమానాదికాలము, దానియొక్క వైచిత్ర్యం=విచిత్రభావము, అనగా విచిత్రముగ నుండునట్లు కూర్పు, దానిచే, వక్రతా = వక్రత్వశోభ. ఎట్టిది? యత్ర = దేనియందు, సమయః కాల మనెడు సమయము, రమణీయతాంయాతి = రామణీయకమును పొందుచున్నదో, ఏ హేతువుచేత? "ఔచిత్యాన్తరతమ్యేన" (ఔచిత్య మనగా) ప్రస్తుతము గాన ప్రస్తావమున ప్రధానముగ ప్రారంభింపబడిన వస్తువుయొక్క ఏ, ఔచిత్యం = ఉచితభావము కలదో, దానియొక్క, అంతరతమ్యేన = అంతరంగత్వముచేత; అనగా ఔచిత్యమునకు అతిశయమును కల్పించుటచేత అనియర్థము. ఎట్లనగా—

"సమవిషమనిర్విశేషాః సమన్తతో మన్దమన్దసఞ్చారాః.
అచిరాద్భవిష్యన్తి పన్థానో మనోరథానామపి దుర్లంఘ్యాః. 95

(గాథాసప్తశతి)

"అచిరకాలమున అంతటను సమవిషమములయందు విశేషములేనివియు, మందమందమగుసంచారముకలవియు నగు మార్గములు మనోరథములకుగూడ లంఘింపశక్యముకానివై అగును".

వ్యా. ఇచట వల్లభావిరహదుఃఖముచే భయపడుచున్న అంతఃకరణము గల ఒకానొకడు, సంభావనాకృత మగు అనుమానముచే, రాబోవు (వర్షా) సమయముయొక్క ఉద్దీపనవిభావముగా అగు వైభవవిలాసమును; మాహాత్మ్యమును, ఊహించి దాని స్వభావసౌందర్యముయొక్క సందర్శనమును సహింపజాలనివాడై ఒకానొక భయవ్యాకులత్వమును అనుభవించి, శంకాకులత్వముతో— "కొద్దికాలములో మార్గములు మనోరథములచేత గూడ లంఘింపరానివై

కాగలవు" అని పలుకుచున్నాడు. కావున భవిష్యత్కాలవాచక మగు ప్రత్య యము ఒక అపూర్వ మగు అపరార్థ (ప్రత్యయ) వక్రతను వికసింపచేయు చున్నది.

ఇంకను ఎట్లనగా-

"యావత్కించిదపూర్వమార్ద్రమనసా మావేదయన్తో నవాః
సౌభాగ్యాతిశయస్య కామపి దశాం గన్తుం వ్యవస్యన్త్యమీ.
భావాస్తావదనన్యజస్య విధురః కోఽప్యుద్యమో జృమ్భతే
పర్యాప్తే మధువిభ్రమే తు కిమయం కర్తేతి కమ్పామహే. 96

"(వసంతప్రారంభమున) ఈ నూతనపదార్థములు సహృదయుల హృద యములందు ఒకానొక అపూర్వస్థితిని కలిగించుచు, సౌభాగ్యాతిశయముయొక్క ఒకానొక దశను పొందుటకు ఉద్యమించుచుండగనే, ఇంతలో, మన్మథుని ఒకా నొకమనోహర మగు ఉద్యమము విజృంభించుచున్నది. వసన్తవిభ్రమము పూర్తి యైన పిమ్మట ఈ మన్మథుడు ఏమి చేయనున్నాడో అని వణకుచున్నాము" .96

వ్యా. ఇచట "వ్యవస్యన్తి" (ఉద్యమించుచున్నవి). 'జృమ్భతే' 'విజృం భించుచున్నాడు) 'కర్తా' (చేయనున్నాడు) 'కమ్పామహే' (వణకుచున్నాము) అను పదములలోని ప్రత్యయములు ప్రత్యేకముగ ప్రతినియతము లగు ఆయా కాలములను బోధించుచు ఒకానొక పదపరార్థవక్రతను ప్రకటించుచున్నవి. అది ఎట్లనగా— ప్రారంభమయిన వసంతఋతువుయొక్క సౌకుమార్యముచే సము ల్లసితము లగు సుందరపదార్థముల సముదాయముయొక్క సమున్మేషముచే ఉద్దీపితమైన సహజవైభవవిలాసము కలవాడగుటచే వసంతుని అత్యల్పసాహా య్యముచేతనే వికసించిన అతులశక్తి గల మన్మథునియొక్క, సరసహృదయు లకు క్లేశమును కలిగించు ఒకానొక సంరంభము విజృంభించుచున్నది. కావున ఈ అనుమానముచే— వసన్తవిలాసవిభ్రమము అత్యధికపరిపుష్టిని పొందినచో మానవతుల మానమును తొలగించుటవిషయమున కొంటెతనము చేయునదియు, ఒకచోట కలిసినదియు నగు సహజసౌకుమార్యసంపదచే కలిగిన సముచిత మగు జిగీషకు (జయేచ్ఛకు) అవకాశము గల ఈతడు ఏమి చేయునో అని, సందే హించుచు, అతని కుసుమబాణసముదాయపాతమువలన భయపడుచున్న అంతః

కరణము కలవారమై ఏమేమియో, కమ్మామహే = భయపడినచిత్తముకలవార మగుచున్నాము,— అని ఇది ప్రియతమావిరహముచే వ్యాకులమైన చిత్తము గల ఒకానొక సరసహృదయుని వాక్యము.

ఈ విధముగ కాలవక్రతను విచారించి క్రమసముచిత మగు అవసరము గల కారకవక్రతను గూర్చి విచారించుచున్నాడు.

కా. యత్ర కారకసామాన్యం ప్రాధాన్యేన నిబధ్యతే
తత్త్వాధ్యారోపణాన్ముఖ్యగుణభావాభిధానతః. 27

కా. పరిపోషయితుం కాఞ్చిత్ భఙ్గీభణితిరమ్యతామ్
కారకాణాం విపర్యాసః సోక్తా కారకవక్రతా, 28

"చెప్పెదు విధానమునందు ఒకానొక రమ్యత్వమును పోషించుటకు, ఎచట, కారకసామాన్యము, ప్రధానత్వా (ముఖ్యత్వా) రోపముచే ప్రధానముగ కూర్పబడునో అదియు ముఖ్యమైనదానికి గౌణత్వమును చెప్పుటయు, ఈ విధ మగు కారకవిపర్యాసము, కారకవక్రత యని చెప్పబడును". 27-28

వ్యా॥ సోక్తా కారకవక్రతా"— అది కారకవక్రత్వవిచ్ఛిత్తి యని చెప్ప బడినది. ఎట్టిది? దేనియందు? కారకాణాం = సాధనముల, విపర్యాసః = పరివర్తనము, గౌణముఖ్యములకు పరస్పరస్వరూపత్వారోపము. ఎట్లు? ఏ, కారకసామాన్యం = ముఖ్య మగు కారకము దృష్ట్యాసామాన్య మగు కరణాది కారకము, ప్రాధాన్యేన = ముఖ్యరూపమున, ప్రయోగింపబడునో; అది. ఏయుక్తి చేత? తత్త్వాధ్యారోపణాత్ = తచ్ఛబ్దము ముఖ్యమైన కారకమును పరామర్శిం చును. తస్య = ఆ ముఖ్యమైనదానియొక్క, భావః = ధర్మము, తత్త్వం = ముఖ్యత్వము, దానియొక్క ఆరోపణమువలన, అనగా, ముఖ్యత్వముయొక్క సమర్పణమువలన. ఈ విధముగ ముఖ్యమైన దానివిషయమున వ్యవస్థ యేది అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు. "గుణభావాభిధానతః" ముఖ్యమైనదాని యొక్క ఏ గౌణత్వముకలదో దానిని చెప్పుటవలన, అనగా అముఖ్యరూపమున కూర్చుటవలన అని యర్థము. ఎందులకు? "పరిపోషయితుంకాంచిద్భఙ్గీభణితి రమ్యతామ్"— కాంచిత్ = అపూర్వమైనవిచ్ఛిత్తితోగూడిన ఉక్తిరమణీయత్వ మును ప్రకాశింపచేయుటకు, ఈ విధముగ అచేతనపదార్థమునకుగూడ చేతనము

నందు సంభావ్య మగు (క్రియా) స్వాతంత్ర్యమును (కర్తృత్వమును) సమర్పించుటవలనను, అముఖ్యములగు కరణాదులకు కర్తృత్వాధ్యారోపమువలనను, ఎచట కారకవిపర్యాసము చమత్కారకారిగనుండునో (అదికారకవక్రత)

ఎట్లనగా-

యాచ్ఞాం దైన్యపరిగ్రహప్రణయినీం నేక్ష్వాకవః శిక్షితాః
సేవాసంవలితః కదా రఘుకులే మౌలౌ నిబద్ధోంజలిః.
సర్వం తద్విహితం తథాప్యుదధినా నైవోపరోధః కృతః
పాణిః సంప్రతి మే హఠాత్ కిమపరం స్ప్రష్టుం ధనుర్వాఞ్ఛతి. 97

"ఇక్ష్వాకు వంశీయులు దైన్యముతో గూడిన యాచనను నేర్చుకొనలేదు. రఘుకులమునందు (పుట్టినవారిచే) సేవాసూచక మగు అంజలి శిరమున ఎప్పుడు కట్టబడినది?— అది యంతయును చేయబడినది అయినను సముద్రుడు అనుకూల్యమును చూపలేదు. ఇంక నేమున్నది? ఇప్పుడు నా హస్తము హఠాత్తుగ ధనుస్సును స్పృశించుటకై పరుగెత్తుచున్నది". 97

(ఇది దారి నిమ్మని ప్రార్థించినను, దారి నీయని సముద్రముపై కోపగించిన శ్రీరాముని వాక్యము—)

ఇచట 'హస్తముచే ధనుస్సును గ్రహించుటకు ఇచ్ఛయించుచున్నాను', అని చెప్పవలసి యుండగా కరణ మగు హస్తమునందు కర్తృత్వమును ఆరోపించుట ఒకానొక కారక వక్రత్వమును పొందుచున్నది.

వి ఇది అప్రధాన మగు కరణకారకమున ముఖ్యకర్తృ కారకత్వమును ఆరోపించుటకు ఉదాహరణము-

ఇంకను ఎట్లనగా:-

"స్తనద్వన్ద్వమ్."

ఇత్యాది శ్లోకమునందు (చూ. I 65) ఇచట అచేతనబాష్పనివహరూప మగు అప్రధానకారకమున ప్రధాన కర్తృకారకత్వము ఆరోపింపబడినది.

ఇంకను ఎట్లనగా:-

నిష్పర్యాయ నివేశపేశలరసైరన్యోన్య నిర్భర్త్సిభి-
ర్హస్తాగ్రైర్యుగపన్నిపత్య దశభిర్వామైర్ధృతం కార్ముకమ్.
సవ్యానాం పునరప్రధీయసి విధావస్మిన్ గుణారోపణే
మత్సేవా విదుషామహం ప్రథమికా కావ్యమ్పరే వర్తతే. 99

"క్రమములేకుండగా (ఒక్కమారుగ) ప్రవర్తించుటయందు సుందర మగు ఆసక్తి కలిగి, పరస్పరము భయపెట్టుకొను చున్న నాపది ఎడమ చేతు లను ఒక్కమారుగ ధనుస్సును పట్టుకొననవి. నా సేవయందు పండితము లగు సవ్యహస్తముల కైతే నారిని ఎక్కుపెట్టుట అనెడు ఈ చిన్న పని చేయుటకై అకాశమున ఒకానొక అహం ప్రథమిక నేను ముందు, (నేను ముందు అనెడు స్పర్ధ) ప్రవర్తించుచున్నది."

ఇచట పూర్వమునందు వలె (కరణము లగు హస్తముల యందు) కర్తృ త్వముయొక్క ఆరోపణముచే నేర్పడిన కారక వక్రత్వము ఉన్నది.

ఇంకను ఏట్లనగా:-

"బద్ధస్పర్ధ"

ఇత్యాది శ్లోకము 100 (చూ 1-66)

వి. ఇచట గూడ అచేతనమును కరణమును అగు చంద్రహాసమున కర్తృత్వము ఆరోపింపబడినది 28

వ్యా. ఈ విధముగ కారకవక్రతను విచారించి, సంఖ్య కారక పరిచ్ఛేద కము (విభాజకము) గాన, క్రమప్రాప్త మగు సంఖ్యావక్రతను విచారించు చున్నాడు-

కా. "కుర్వన్తి కావ్యవైచిత్ర్యవివక్షా పరతన్త్రితాః
యత్ర సంఖ్యావిపర్యాసం తాం సంఖ్యావక్రతాం విదుః" 29

"కార్యమునందు వైచిత్రమును కూర్చవలె ననెడు అభిలాషకు వశం వదులై, ఎచట సంఖ్యావిపర్యాసమును చేయుదురో, దానిని సంఖ్యా వక్రత యని చెప్పుదురు" 29

యత్ర = దేనియందు, కవులు, కావ్యవైచిత్ర్య వివక్షాపరతన్త్రితాః = తమకృతులలో (కావ్యములలో) విచిత్రభావమును చెప్పవలె ననెడు అభిలాషకు పరవశులై, సంఖ్యా విపర్యాసం = వచన విపరివర్తనమును, కుర్వన్తి = చేయుదురో, తాం సంఖ్యావక్రతాంవిదుః = దానిని వచన వక్రత్వమునుగా తద్విదులు తెలుసుకొనుచున్నారు. దీని యభిప్రాయ మేమనగా — ఏకవచనము గాని, ద్వివచనము గాని, ప్రయోగించవలసి యుండగా, ఎచట వైచిత్ర్యార్థమై మరి యొక వచనమును ప్రయోగింతురో లేదా, ఎచట భిన్నవచనములు కల వాటికి సామానాధికరణ్యము చెప్పుదురో (అచట సంఖ్యావక్రత యుండును)-ఎట్లనగా—

"కపోలే పత్రాలీ కరతలనిరోధేన మృదితా
నిపీతో నిఃశ్వాసైరయమమృతహృద్యోఽధరసః।
ముహుః కంఠే లగ్నస్తరలయతి బాష్పః స్తనతటీం
ప్రియో మన్యుర్జాతస్తవ నిరనురోధే న తు వయమ్ 101

" ఓ మాట విననిదానా! కరతలనిరోధము కపోలమునందలి పత్రలేఖలను తుడిచి వేసినది. నిఃశ్వాసములు అమృతము వలె మనోహర మగు అధర రసమును త్రాగివేసినవి బాష్పము మాటిమాటికిని కంఠమున లగ్నమగుచు స్తనతటమును తరళ మగునట్లు చేయుచున్నది. నీకు కోపము ప్రియము (ప్రియుడు) అయినది గాని మేము కాలేదు కదా!" 101

వ్యా. ఇచట 'నత్వహమ్' అని చెప్పవలసి యుండగా, నీకు అంతరంగికుడను కాకపోతిని కదా అని ప్రతిపాదించుటకును, ఔదాసీన్యమును సూచించుటకును, "న తు వయమ్" అని బహువచనము ప్రయోగింపబడినది.

ఇంకను ఎట్లనగా—

"వయం తత్త్వాన్వేషాన్మధుకర హతాస్త్వం ఖలు కృతీ" 102

వి. కణ్వాశ్రమ ద్వారమున ప్రవేశించిన దుష్యన్తుడు చెట్లచాటునుండి, తుమ్మెదచే బాధితు రాలగు శకుంతలను చూచి అన్న మాటలివి.

"ఓ మధుకరమా! సత్యమును) అన్వేషించుచు (శకుంతల బ్రాహ్మణ

కన్యయా, క్షత్రియ కన్యయా అని మీనమేషములు లెక్కపెట్టుచు) మేము హతాశుల మైతిమి. నీవు అదృష్టవంతుడవు కదా!" 102

ఇచట గూడ పూర్వమునందు వలె (దుష్యన్తుని) ఔదాసీన్యము ప్రతీత మగు చున్నది-

ఇంకను ఎట్లనగా—

"ఫుల్లేన్దీవరకాననాని నయనే పాణీ సరోజాకరాః" 103

"రెండు నయనములును వికసించిన కలువల వనములు. రెండు హస్తములును సరోజవనములు." (చూ-I-64)

ఇచట (నయనే పాణీ అను) ద్వివచనములకు, ('కాననాని, 'సరోజాకరాః' అను) బహువచనములతో సామానాధికరణ్య మనెడు సంఖ్యా విపర్యాసము సహృదయ హృదయ హారిత్వమును పొందుచున్నది-

ఇంకను ఎట్లనగా—

"శాస్త్రాణి చక్షుర్నవమ్"

"శాస్త్రములు నూత్నమైన నేత్రము." (చూ-II-29) 104

ఇచట పూర్వోదాహరణమునందు వలె సామానాధికరణ్యము వైచిత్ర్యమును కూర్చుచున్నది 29

వ్యా. ఈ విధముగ సంఖ్యావక్రతను విచారించి, పురుషములు సంఖ్యాసంబద్ధములు గాన క్రమముచే సమర్పిత మగు అవసరము గల (క్రమప్రాప్త మగు) పురుషవక్రతను గూర్చి విచారించుచున్నారు—

కా. ప్రత్యక్తా పరభావశ్చ విపర్యాసేన యోజ్యతే
యత్ర విచ్ఛిత్తయే సైషా జ్ఞేయా పురుషవక్రతా. 30

"ఎచట స్వత్వము (తాను అనుట) పరత్వము అనునవి విచ్ఛిత్తికొరకై విపర్యాసముచే కూర్చబడునో అది పురుష వక్రత యని తెలియదగినది." 30

వ్యా. యత్ర = దేనియందు, ప్రత్యక్తా = తాను అనుటయు, (ఉత్తమ పురుషము) పరభావశ్చ = అన్యత్వము (ప్రథమ పురుషము), ఈ ఉభయము

కూడ, విపర్యాసముచే, యోజ్యతే = కూర్చబడునో, ఎందులకు: విచ్ఛిత్తయే = వైచిత్ర్యముకొరకు, సైషా = వర్ణిత స్వరూపము గల ఇది, జ్ఞేయా = తెలియ దగినది, పురుషవక్రతా = పురుష వక్రత్వ విచ్ఛిత్తి యని. దీని తాత్పర్య మేమనగా—ఎచట ఉత్తమ పురుషము గాని, మధ్యమ పురుషము గాని ప్రయోగింపవలసి యున్నపుడు వైచిత్ర్యము కొరకై ఒకప్పుడు మరియొక్కటి (అనగా) ప్రథమ పురుషము, ప్రయోగింపబడునో, దానిని బట్టి పురుషముతో సమాన మగు యోగ క్షేమములు కల వగుటచే (అనగా, పురుషము మార్పును బట్టి మార్పు చెందున వగుటచే) అస్మదాది శబ్దములకును ప్రాతిపదిక మాత్రము నకును గూడ విపర్యాసము పర్యవసన్న మగునో (అచట పురుష వక్రత యని అభిప్రాయము).

ఎట్లనగా—

"కౌశాంబీం పరిభూయ నః కృపణకై ర్విద్వేషిభిః స్వీకృతాం
జానామ్యే(త్యే?)వ తథా ప్రమాదపరతాం పత్యుర్నయద్వేషిణః.
స్త్రీణాం చ ప్రియవిప్రయోగవిధురం చేతః సదైవాత్ర మే
వక్తుం నోత్సహతే మనః పరమతో జానాతు దేవీ. స్వయమ్." 105

"నీచులగు శత్రువులు, మమ్ములను తిరస్కరించి, కౌశాంబీనగరమును ఆక్రమించినారని ఎరుగుదును నీతి మార్గద్వేషి యగు ప్రభువు ప్రమాదపరు డగు ననెడు విషయమును గూడ ఎరుగుదును స్త్రీలయొక్క చిత్తము ప్రియ వియోగముచే ఖిన్న మగునని గూడ ఎరుగుదును. నా మనస్సు ఇంక ఏమియు చెప్పుటకు ఉద్యుక్తము కాకున్నది. ఇంతకు మించిన విషయమును దేవియే స్వయముగ తెలిసికొనుగాక".

వి. శత్రు వశమైన కౌశాంబిని మరల ఉదయనునకు జయించి ఈయవలె నని ప్రయత్నించుచున్న యౌగంధరాయణుడు వాసవదత్తతో-కొంత కాలము నీవు అజ్ఞాత వాసమున నున్నచో నీవు మరణించితి వని ప్రవాదమును పుట్టించి, ఉదయనుడు పద్మావతిని వివాహమాడు నట్లు చేసి పిమ్మట కౌశాంబిని తిరిగి సంపాదించవచ్చును—అని చెప్పెడు ఘట్టములోనిదై యుండును.

వ్యా ఇచట-మధ్యమ పురుష మగు యుష్మచ్ఛబ్దమును ప్రయోగింప వలసి యుండగా—'జానాతు దేవీ స్వయమ్' అని ప్రాతిపదికమును ('దేవీ' అను దానిని) ప్రయోగించుటచే (ఆ చెప్పనున్నది) చేయుటకు శక్యము కాదు అని తలచుచున్న వక్తయొక్క ఔదాసీన్యము గమ్యమగు చున్నది. ఆమె ప్రభుత్వము కలది గాన ఏది హితమో, ఏది అహితమో స్వతంత్రముగ ఆలోచించి స్వయముగనే చేయవలసిన విషయమును నిర్ణయింప వలెను, అనునది ఒకానొక వాక్యవక్రతను కూర్చుచున్నది ఏలయన- ఇదియే (పూర్వోక్తాభిప్రాయమే) వాక్యమునకు జీవితముగ స్ఫురించుచున్నది 'జానాత్వేవ' అను పాఠమున్న యుక్తమని తోచును. 80

వ్యా. ఈ విధముగ పురుషవక్రతను విచారించి ఆత్మనే పద పరస్మై పదములు పురుషాశ్రయములు గాన వాటి వక్రతా విచారము ఇపుడు ఉచితము గాన, దానిని చేయుచున్నాడు. శాస్త్రీయసారముగ ధాతువులను ఆయా పదము లందు (ఆత్మనే పదాదులందు) ప్రయోగించుటకు 'ఉపగ్రహ' మని పేరు పూర్వాచార్యులలో ప్రసిద్ధముగ నున్నది గాన ఆ పేరు తోడనే వ్యవహరించు చున్నాడు-

కా. పదయోరుభయోరేకమౌచిత్యాద్వినియుజ్యతే
శోభాయై యత్ర జల్పన్తి తాముపగ్రహవక్రతామ్. 81

"ఔచిత్యమును బట్టి, ఎచట శోభకొరకై రెండు పదములలో ఒక్కదానినే వినియోగింతురో దానిని 'ఉపగ్రహ వక్రత' యందురు." 81

వ్యా తాం=చెప్పబడిన స్వరూపముగల దానిని, ఉపగ్రహ వక్రతాం=ఉపగ్రహ వక్రత్వ ప్రయుక్త మగు విచ్ఛిత్తినిగా, జల్పన్తి=కవులు చెప్పు చున్నారు. ఎట్టి దానిని? యత్ర=దేనియందు పదయోః=రెండు పదముల మధ్యనుండి, ఏకం=ఆత్మనే పదము గాని, పరస్మై పదము గాని, ఒకటి, వినియుజ్యతే = నియమముచే కూర్చబడుచున్నదో, ఏ కారణము వలన? ఔచిత్యాత్ =వర్ణ్యమాన మగు వస్తువుయొక్క ఏ ఉచిత భావము గలదో దాని వలన; దానిని ఆశ్రయించి యని అర్థము ఎందులకు? శోభాయై=విచ్ఛిత్తి కొరకు.

ఎట్లనగా—

"తస్యాపరేష్వపి మృగేషు శరాన్ముముక్షోః
కర్ణాన్తమేత్య బిభిదే నిబిడోఽపి ముష్టిః.
త్రాసాతిమాత్రచటులైః స్మరయత్సు నేత్రైః
ప్రౌఢప్రియానయనవిభ్రమచేష్టితాని" 106

"భయముచే మిక్కిలి చలపమైన నేత్రములచే ప్రౌఢయగు ప్రియురాలి యొక్క, నేత్రముల విలాసచేష్టలను స్మరింపచేయుచున్న ఇతర మృగములపై బాణములను విడువదలచిన వాడైనను ఆతనియొక్క, బిగిసి యున్న పిడికిలి కూడ చెవి వరకును వెళ్ళి వదులై పోయెను." 106

ఇది రఘువంశమున దశరథ మృగయా వర్ణనములోనిది.

వ్యా ఇచట-లలితము లగు విలాసవతీ లోచన విలాసములు స్మృతి గోచరములైన వెంటనే తదాయత్త మగు మనోవృత్తి గల రాజుయొక్క శారీరక ప్రయత్నములు మందగించుటచే పిడికిలి స్వయముగనే వదులై పోయెను, అని కర్మకర్తృ ప్రయోగమూలక మగు ఆత్మనే పదము ఎంతయు చమత్కార కారి యగు ఒకానొక వాక్యవక్రతను ఏర్పరచుచున్నది. 81

వి క్రియ చాల అనాయాసముగ జరిగిన దని సూచించుటకు కర్మనే కర్తగ ప్రయోగింతురు అపుడు క్రియ ఆత్మనే పదములో నుండును. దీనికి కర్మ కర్తరి ప్రయోగ మని పేరు. "భిద్యతే కాష్ఠం" (కట్ట బద్దలగుచున్నది) "పచ్యతే అన్నమ్" (అన్నము ఉడుకుచున్నది), ఇత్యాదులు ఉదాహరణములు. ఇచట దేవదత్తుడు కాష్ఠమును భేదించుచున్నాడు గాన కాష్ఠము కర్మ. కాని భేదన పచన క్రియలు అనాయాసముగ జరుగుచున్న వని సూచించుటకు కర్మలనే కర్తలుగా ప్రయోగించినారు.

వ్యా. ఈ విధముగ ఉపగ్రహ వక్రతను విచారించి దాని పిమ్మట సంభావ్య మగు ప్రత్యయాన్తర వక్రతను విచారించుచున్నాడు-

కా. విహితః ప్రత్యయాదన్యః ప్రత్యయః కమనీయతామ్
యత్ర కామపి పుష్ణాతి సాన్యా ప్రత్యయవక్రతా. 33

"ఎచట ఒక ప్రత్యయముకంటె పరముగ విహిత మగు మరి యొక ప్రత్యయము ఒకానొక కమనీయత్వమును పోషించుచున్నదో అది మరి యొక విధమగు ప్రత్యయ వక్రత."

వ్యా. "సాన్యా ప్రత్యయ వక్రతా" = అది పూర్వము చెప్పిన రూపము కల దానికంటె అన్యా = భిన్నమైన ఒకానొక, ప్రత్యయ వక్రత్వ విచ్ఛిత్తి, 'అస్తి' (ఉన్నది) అను అధ్యాహృత పదముతో సంబంధము. యత్ర = దేని యందు, ప్రత్యయము, కామపి = అపూర్వ మగు, కమనీయతాం = రమ్యత్వమును, పుష్ణాతి = పోషించునో. ఎట్టిది? పత్యయతః = తిజాద్ప్రత్యయము కంటె విహితః = పరముగ విధింపబడిన మరియొకటి

ఎట్లనగా—

"లీనం వస్తుని యేన సూక్ష్మసుభగం తత్త్వం గిరాకృష్యతే
నిర్మాతుం ప్రభవేన్మనోరమమిదం వాచైవ యో వా బహిః.
వన్దే ద్వావపి తావహం కవివరౌ వన్దేతరాం తం పున
ర్యోవిజ్ఞాతపరిశ్రమోయమనయోర్భారావతారక్షమః". 107

"ఏ కవి వస్తువునందు లీనమైనదియు, సూక్ష్మమును సుందరమును అగు తత్త్వమును వాక్కుచే (బయటకు) ఆకర్షించునో, ఏ కవి (బ్రహ్మ) మనోహర మగు ఈ బాహ్య ప్రపంచము నంతను వాక్కు చేతనే (వేదవాక్కు చేతనే) ఆవిష్కరించుటకు సమర్థుడో, ఆ ఇరువురు కవివరులను గూడ నమస్కరించుచున్నాను. కాని ఎవ్వడు వీరి పరిశ్రమను గుర్తించి వీరియొక్క భారమును తగ్గించుటకు సమర్థుడో అతనిని, (భావుకుని, విష్ణువును?) ఇంకను ఎక్కువగ నమస్కరింతును."

వి. సృష్ట్యాది యందు బ్రహ్మ వేదసహాయముతో జగత్తును సృజించెనని

"నామ రూపం చ భూతానాం కర్మణాం చ ప్రవర్తనమ్.
వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః" (మనుస్మృతి. 1-21)

ఇత్యాది స్మృతి వాక్యములు చెప్పుచున్నవి.

'వన్దే' అనుతిజంతముకంటె 'తరామ్' అను ప్రత్యయముచేర్చుటచే ('ద్వివచనవిభజ్యోపపదే తరబీయసునౌ' పా సూ. 5. 3 57) "వన్దేతరామ్" అను రూపము సిద్ధించినది.

వ్యా. 'వన్దేతరామ్' అను నపుడు ఒకానొక ప్రత్యయవక్రత కవియొక్క చిత్తమునందు స్ఫురించుచున్నది కావుననే వెనుక చెప్పిన దానికంటె విశేష మును సూచించు 'పునః శబ్దము ప్రయోగింపబడినది.

ఈ విధముగ నామాఖ్యాత (సుప్తిఙన్త) రూపము లగు పదములలో వేరువేరుగ ప్రకృత్యాద్యవయవవిభాగము చేసి తద్ద్వారా యథాసంభవముగ వక్రత్వమును విచారించినాడు. ఉపసర్గనిపాతములు అవ్యుత్పన్నములు కావునను, (అనగా ప్రకృతిప్రత్యయవిభాగము లేనివి కావునను) విభక్తిప్రత్యయరహిత ములు కావునను వాటికి అవయవములు లేవు; కావున (అవయవ) విభాగము కూడ లేదు. అందుచే వాటిని సాకల్యమున గ్రహించి (అనగా మొత్తము రూప ముననే గ్రహించి) వాటి వక్రతను విచారించుచున్నాడు—

కా. రసాదిద్యోతనం యస్యాముపసర్గనిపాతయోః
వాక్యైకజీవితత్వేన సాపరా పదవక్రతా. 33

"ఎచట ఉపసర్గనిపాతములు వాక్యమునకు ప్రధానజీవితరూపమున రసాదుల ద్యోతనము చేయుచుండునో అది మరియొక పదవక్రత". 33

వ్యా. "సా పరా పదవక్రతా"- సా = చూపబడినస్వరూపము గల అది, అపరా = పూర్వోక్త మగు పదవక్రతకంటె భిన్న మైన, పదవక్రత్వవిచ్ఛిత్తి; 'అస్తి' అను అధ్యాహృతక్రియతో సంబంధము. ఎట్టిది? యస్యామ్ = ఏ వక్రతయందు, ఉపసర్గనిపాతయోః = వైయాకరణులలో ప్రసిద్ధము లగు నామ ధేయములు గల ఉపసర్గనిపాతములయొక్క, రసాదిద్యోతనం = శృంగారాదుల ప్రకాశనము. ఎట్లు? వాక్యైకజీవితత్వేన—వాక్యస్య = శ్లోకాదివాక్యముయొక్క ఏకజీవితమువాక్యైకజీవితము. దానియొక్క ధర్మము వాక్యైకజీవితత్వము దానిచేత, దీనియభిప్రాయమేమనగా- వాక్యముయొక్క ఏకైకజీవితముగ ఏరసాదికము స్ఫురించుచుండునో దానిని వ్యక్తీకరించుటచేత అని యర్థము

ఎట్లనగా-

"వైదేహీ తు కథం భవిష్యతి హా హా హా దేవి ధీరా భవ" 108

"అక్కటా వైదేహి ఎట్లుండునో! అయ్యో! దేవీ! ధైర్యము వహింపుము" 108
(మా. II–27)

వ్యా. ఇచట— తత్కాలమున ప్రజ్వలించిన (మేఘాది) ఉద్దీపనవిభావ ములసంపదచే బయల్వెడలిన శ్రీరాముని సంభ్రమము, జానకికి ఆపద కల్గెననెడు సంభావనము నిశ్చితరూపమున జనింప, ఆమెను రక్షించుటకై ఉత్సాహమునకు కారణభూతమై, ఆమె విషయముననే ఏకాగ్రచిత్తత యుండుటచే సాక్షాత్కారమును కలిగించుచు, మనస్సు సీతాకారములో నుండుటచే దూరము మాట మరపుకు రాగా, నూతన మగు స్వభావముచే సుందర మగు నిపాతపరంపరచే (హాహాహా—మొ) వృత్తిగోచరమై వాక్యమున కంతకును ఏకైకజీవితముగ భాసించుచు, ఒకానొక వాక్యవక్రతను పోషించుచున్నది.

వి. అనగా ఇట్టి సంభ్రమమును ప్రధానముగ 'హాహాహా' అను నిపాతములు ద్యోతింపచేయుచున్నవి గాన ఇది నిపాతవక్రతకు, ఉదాహరణ మని యర్థము.

వ్యా.' తు' శబ్దముయొక్క వక్రభావమునుపూర్వమే విశదీకరించి యున్నాము.

ఇంకను ఎట్లనగా-

"అయమేకపదే తయా వియోగః
ప్రియయాచోపనతః సుదుఃసహో మే.
నవవారిధరోదయాదహోభి
ర్భవితవ్యం చ నిరాతపత్వరమ్యైః" 109

"భరింపరాని ఈ ప్రియావియోగము హఠాత్తుగ నాకు వచ్చి పడినది. దివసములు గూడ నూతనమేఘములు బయల్వెడలుటచే ఎండ తొలగి రమ్యము లైనవి".

వ్యా. ఇచట- పరస్పరము సుదుస్సహత్వముతోడను, ఉద్దీపనసామర్థ్యముతోడను, కూడిన ప్రియావిరహవర్షాకాలములు రెండును ఒకే కాలమున

వచ్చి పడినవి; అని చెప్పుటయే ప్రధానోద్దేశ్యముగా గల 'చ' శబ్దద్వయము, ఒకే సమయమున బయల్వెడలిన అగ్నిదాహదక్షిణవాయువులవలన కలిగిన ఆపదవలె నున్నదని సమర్థించుచు ఒకానొకవాక్యవక్రతను వెలుగొందించు చున్నది. 'సు' 'దుః' అను శబ్దములుకూడ ప్రియావిరహమునకు ప్రతీకారి సౌదియును లేదు అను విషయమును సూచించుచున్నవి.

ఇంకను ఎట్లనగా-

"ముహురంగుళిసంవృతాధరోష్ఠం
ప్రతిషేధాక్షరవిక్లవాభిరామమ్.
ముఖమంసవివర్తి పక్ష్మలాక్ష్యాః
కథమప్యున్నమితం న చుమ్బితం తు". 110

"మాటి మాటికిని వ్రేళ్ళచే కప్పబడిన అధరోష్ఠము కలదియు, ప్రతిషేధాక్షరములచే వ్యాకులమును, మనోహరమును అయినదియు, బుజమువైపు తిరుగు చున్నదియును అగు ఆ పక్ష్మలాక్షియొక్క ముఖము, ఎటులనో ఎత్తబడినది; గాని చుంబింపబడలేదు".

వి. అభిజ్ఞానశాకుంతలతృతీయాంకమున శకుంతలను చుంబింపజాలక పోయితి నని పశ్చాత్తాపతప్తు డగు దుష్యంతుని వాక్యమిది.

వ్యా. ఇచట ప్రథమప్రేమ యగుటచే వివశ మగు మనస్సు కలవాడును, అనుభూతవిషయమును స్మరించు సమయమున ఆమెయొక్క తత్కాలసముచిత మగు వదనేందుసౌందర్యమును (మానసమున) ఉల్లేఖించుకొనుచున్నవాడును అగు నాయకునకు కలిగిన, మొదటి చుంబనమునకు అడ్డు తగులుటచే సముద్దీపిత మగు పశ్చాత్తాపావేశమును సూచించు 'తు' శబ్దము ఒకానొక వాక్యవక్రతను ఉత్తేజితముచేయుచున్నది.

వీటి చివర (ఉపసర్గలకును నిపాతములకును పిమ్మట చేర్చబడిన) ప్రత్యయముల వక్రత్వము ఈ విధముగా ప్రత్యయాన్తరవక్రతయందు (మూ. కా. 32) అన్తర్భూతము గాన వేరుగా చెప్పబడలేదు. దానిని స్వయముగనే ఊహించుకొనవలెను.

ఎట్లనగా:-

"యేన శ్యామం వపురతితరాం కాన్తిమాపత్స్యతే తే
బర్హేణేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః" 111

"దేనితో నల్లనైన నీ శరీరము, ప్రకాశించుచున్న నెమలి ఈకచే గోప వేషమును ధరించిన విష్ణువుయొక్క (కృష్ణునియొక్క) శరీరము వలె చాల ఎక్కువగా కాంతిని పొందగలదో-" 111

వ్యా॥ ఇచట "అతితరాం" అననది చాల చమత్కారకారకము. ఈ విధముగనే ఇతరవిధము లగు వక్రతలకు గూడ సజాతీయవక్రతల లక్షణముల ద్వారా లక్షణనిష్పత్తిని స్వయముగ అనుసరించవలెను.

ఈ విధముగ అనేకాకారములు గలదియు చతుర్విధఫలములకు సంబంధించినదియు నగు వక్రత్వవిచ్ఛిత్తి వాక్యముయొక్క ఏకదేశమునకు మాత్రమే జీవితముగ స్ఫురించుచున్నదైనను సకలవాక్యముయొక్కయు వైచిత్ర్యమునకు కారణ మగుచున్నది.

"వక్రతాయాః ప్రకారాణామేకోఽపి కవికర్మణః.
తద్విదాహ్లాదకారిత్వహేతుతాం ప్రతిపద్యతే". 112

"కవికర్మయొక్క (కావ్యముయొక్క) వక్రతయొక్క ప్రకారములలో ఒక్కటైనను సహృదయహృదయాహ్లాదకరముగ నుండును". 112

ఇది అంతరశ్లోకము.

ఒక్క వక్రతాప్రకారమునకే ఇంతటి మహిమ యున్నచో అనేకవక్రతా ప్రకారములు ఒక్కచో కలిసినవై దేనిని సమ్పాదించును?— అని ఆశంకించు కొనిచెప్పుచున్నాము.

కా. పరస్పరస్య శోభాయై బహవః పతితాః క్వచిత్
ప్రకారా జనయన్త్యేతాం చిత్రచ్ఛాయామనోహరామ్. 34

"అనేకము లగు (వక్రతా) ప్రకారములు, పరస్పరశోభకొరకై ఒక్కచో కలిసినవై, చిత్రచ్ఛాయచే మనోహర మగు ఈ వక్రతను జనింప చేయును". 34

వ్యా. క్వచిత్ = ఒక్కొ పదమాత్రమునందు గాని వాక్యమునందు గాని, వక్రతాప్రకారాః = వక్రతా ప్రభేదములు, బహవః = అధిక సంఖ్యాకము లైనవి. కవి ప్రతిభా మాహాత్మ్యముచే సముల్లసితములై, ఎందులకు? పరస్పరస్య శోభాయై = పరస్పర విచ్ఛిత్తికొరకు. ఈ, చిత్రచ్ఛాయామనోహరం=అనేకా కారకములగు కాంతులచేరమణీయమగు వక్రతను, జనయన్తి=పుట్టించుచున్నవి.

ఎట్లనగా—
"తరన్తీవ" ఇత్యాదిశ్లోకము.

(చూ-II-91) 113

ఇచట మూడు క్రియాపదములకును ప్రత్యేకముగ క్రియావైచిత్ర్యము, కారక వైచిత్యము, కాల వైచిత్ర్యము అనెడు మూడు విధము లగు వైచిత్ర్యము స్ఫురించుచున్నది; 'ప్రథిమ', 'స్తనజఘన', "తరుణిమ", శబ్దములకు మూడింటి కిని వృత్తివైచిత్ర్యము.

వి. స్తన-జఘన శబ్దమున, సమాహారద్వంద్వ వృత్తి వైచిత్ర్యము- మిగిలిన రెండు శబ్దములందును, "ఇమనిచ్" ప్రత్యయముచే తద్ధితవృత్తి వైచిత్ర్యము.

వ్యా. 'లావణ్య', "జలధి", 'ప్రాగల్భ్య', "సరళతా", "పరిచయ" శబ్దములకు ఉపచారవైచిత్ర్యము. ఈ విధముగా అనేకము లగు వక్రతాప్రకార ములు ఒక పదమునందు గాని, వాక్యమునందు గాని కలిసినవై, చిత్రాచ్ఛా యచే మనోహర మగు, చేతన చమత్కారజనక మైన ఈ వాక్య వక్రతనే కూర్చుచున్నవి.

ఈ విధముగ నామము, ఆఖ్యాతము, ఉపసర్గ, నిపాతము అనెడు నాల్గు విధము లగు పదముల వక్రతా ప్రభేదములను యథాసంభవముగ విచారించి, ఇపుడు ఈ ప్రకరణమును ఉపసంహరించి మరి యొక విషయమును ప్రవేశ పెట్టుచున్నారు—

కా. వాగ్వల్ల్యాః పదపల్లవాస్పదతయా యా వక్రతోద్భాసినీ
విచ్ఛిత్తిః సరసత్వసమ్పదుచితా కాప్యుజ్జ్వలా జృమ్భతే।
తామాలోచ్య విదగ్ధషట్పదగణై ర్వాక్యప్రసూనాశ్రయం
స్ఫారామోదమనోహరం మధు నవోత్కణ్ఠాకులం పీయతామ్.

"వక్రతచే భాసించునదియు, సరసత్వ సంపదకు ఉచిత మైనదియు, ఉజ్జ్వలమైనదియునగు వాగ్వల్లియొక్క ఏవిచ్ఛిత్తి పదపల్లవములను ఆశ్రయించి విజృంభించుచున్నదో అట్టి విచ్ఛిత్తిని పరిశీలించి, విదగ్ధు లనెడు తుమ్మెదల గణములు, వాక్యపుష్పములను ఆశ్రయించుకొని యున్నదియు, అత్యధిక మగు సువాసనచే మనోహర మైనదియు నగు మకరందమును నవోత్కంఠచే ఆకుల మగునట్లుగా త్రాగుదురు గాక" 35

వాగేవ వల్లీ = వాణియే లత. దానియొక్క, కాపి = అలౌకిక మగు విచ్ఛిత్తిః = శోభ, జృమ్భతే = ఉల్లసిత మగుచున్నది. ఎట్లు? పద పల్లవాస్పదతయా పదాన్యేవ = సుప్తిఙన్తరూప పదములే, పల్లవాని = పత్రములు, తదాస్పదతయా = వాటిని ఆశ్రయించుకొని. ఎట్టివిచ్ఛిత్తి? సరసత్వ సమ్పదుచితా = రసవత్త్వాతిశయముతో కూడినది. ఇంకను ఎట్టిది? వక్రతయా వక్రత్వముతో, ఏది, ఉద్భాసతే = ప్రకాశించునో అట్టిది ఎట్టిది? ఉజ్జ్వలా = ఛాయాతిశయముతో రమణీయ మైనది. ఏవం విధమగుదానిని, ఆలోచ్య = పరిశీలించి విదగ్ధషట్పదగణైః = విబుధ లనెడు తుమ్మెదల సముదాయములచే, మధు = మకరందము; పీయతాం = ఆస్వాదింపబడుగాక. ఎట్టిది?- వాక్యప్రసూనాశ్రయమ్, వాక్యాన్యేవ = పదసముదాయ రూపము లగు వాక్యములే, ప్రసూనాని = పుష్పములు; ఆశ్రయః = స్థానము- దేనికో అది, ఇంకను ఎట్టిది? స్ఫారామోద మనోహరమ్. స్ఫారః = అధిక మగు, ఏ, ఆమోదః = దానియొక్క ధర్మవిశేషము-(సువాసన) కలదో, దానిచే మనోహరం = హృదయ హారిగనున్నది. ఎట్లు ఆస్వాదింపవలెను? నవోత్కణ్ఠాకులమ్ = నూతన మగు ఉత్కంఠతో తొందరపడుచు, మధుకర సమూహములు లతయొక్క మొదట వికసించిన పల్లవములను చూచి, నమ్మకము, కలిగిన చిత్తము కలవై, వాటి ప్రక్కనే వికసించిన సుకుమారము లగు కుసుమముల మకరందమును గ్రోలుట యను మహోత్సవమును అనుభవించును. అట్లే సహృదయులు పదముల నాశ్రయించి యున్న ఒకానొక వక్రతా విచ్ఛిత్తిని పరిశీలించి, నూతన మగు ఆసక్తితో కూడిన చిత్తము కలవారై వాక్యాశ్రిత మగు ఒకానొక వక్రతా జీవిత సర్వస్వభూత మైన (రసాదికమును) విచారింతురు: అని తాత్పర్యార్థము.

ఇచట ఒక (లత) పక్షమున సరసత్వ మనగా తన ఋతువునందు సంభవించు రసాఢ్యత్వము; మరి యొక (కావ్య) పక్షమున శృంగారాది రస వ్యంజకత్వము. ఒకచో వక్రత యనగా లేతచంద్రుని వలె సుందర మగు ఆకారము కలిగి యుండుట. మరి యొకచోట కవికౌశల సౌందర్యము. ఒకచోట ఉజ్జ్వలత్వ మనగా ఆకుల కాన్తితో కూడుకొని యుండుట. మరియొకచోట సన్నివేశ సౌందర్యముయొక్క ఆవిర్భావము. ఆమోద మనగా పుష్పములలో సౌరభము, వాక్యములలో తద్విహ్లాదకారిత్వము. మధువు అనగా పుష్పములో మకరందము, వాక్యములలో సకల మగు కావ్యకారణముల సంపదయొక్క ఆవిర్భావము.

ఇతి

శ్రీమత్పుల్లెలోపాహ్వ శ్రీ సత్యనారాయణశాస్త్రి సూను

శ్రీరామ చంద్రవిరచితే

ఆంధ్ర వక్రోక్తి జీవితే

ద్వితీయ ఉన్మేషః



# తృతీయోన్మేషము

వ్యా. ఈ విధముగ పూర్వ ప్రకరణమున, యథాసంభవముగ వాక్యావయవములగు పదముల వక్రత్వమును విచారించుచు వాచకవక్రతా విచ్ఛిత్తి ప్రకారముల దిగ్దర్శనమును చేసి యున్నాడు. ఇపుడు వాక్యవక్రతా వైచిత్ర్యమును నిరూపించుటకై వాచ్యము యొక్క, అనగా వర్ణనీయముగ కృతప్రస్తావ మగు వస్తువుయొక్క వక్రతాస్వరూపమును నిరూపించుచున్నాడు. వాక్యార్థజ్ఞానము పదార్థ జ్ఞానపూర్వకము కదా!

వి. ద్వితీయోన్మేషమున వాచక (శబ్ద) వక్రత విచారింపబడినది. తృతీయోన్మేషమున ముందుగ అర్థవక్రతను విచారించి పిమ్మట వాక్యవక్రతను విచారింపగలడు. ముందుగ పదార్థవక్రతను తెలుపుచున్నాడు—

కా. ఉదారస్వపరిస్పన్ద సున్దరత్వేన వర్ణనమ్
వస్తునో వక్రశబ్దైక గోచరత్వేన వక్రతా. 1

'వస్తువును వక్ర మగు శబ్దమునకు మాత్రమే గోచరమగు విధమున ఉదార మగు స్వభావముచే సుందరముగ వర్ణించుట వక్రతయగును". 1

వ్యా. వస్తునః = వర్ణనీయముగ ప్రస్తుతమగు పదార్థము యొక్క, ఏ, ఈ విధముగ నుండునట్లు వర్ణనము కలదో అది, దానియొక్క, వక్రతా = వక్రత్వవిచ్ఛిత్తి, ఏ విధముగ నుండునట్లు అనగా- చెప్పుచున్నాడు—"ఉదారస్వపరిస్పన్ద సున్దరత్వేన"-ఉదారః = సోత్కర్ష మగు, అతిశయముతో కూడిన, ఏ స్వపరిస్పన్దః = స్వభావమహిమ కలదో దానియొక్క, సున్దరత్వం = సౌకుమార్యాతిశయము కలదో, దానితో (అనగా) అత్యన్తరమణీయ మగు స్వాభావిక ధర్మముతో యుక్త మైనట్లుగ, వర్ణనం = ప్రతిపాదనము, ఎట్లు? "వక్రశబ్దైక గోచరత్వేన"– వక్ర మగు, ఏ ఈ నానా విధవక్రతా విశిష్ట మగు, శబ్దః = వివక్షితార్థమును బోధింపసమర్థ మైన ఏ ఒక్కటియో మాత్రమైన, వాచక

విశేషము కలదో, దానికి, ఏకస్య = ఒక్కదానికి మాత్రమే, గోచరత్వేన = ప్రతిపాద్యరూపమున విషయ మగునట్లు. 'వాచ్యత్వేన', అని చెప్పలేదు. ('గోచరత్వేన' అని మాత్రమే చెప్పబడినది.) ఏలయన, (ఒక విషయమును వాచ్యరూపముననే కాక) వ్యంగ్యముఖమున కూడ చెప్పవచ్చును కదా? దీని యభిప్రాయ మేమనగా ఈ విధ మగు వస్తుస్వభావ సౌకుమార్యవర్ణన ప్రస్తావమున 'ఉపమ' మొదలగు చాల వాచ్యాలంకారములు ఉపయోగ్యములు కాజాలవు (వాటిని ఎక్కువగ ఉపయోగించినచో) స్వభావసౌకుమార్యాతిశయము మ్లానమై పోవును.

అవ. కుంతకుడు ప్రథమ పరిచ్ఛేదమున స్వభావోక్తి అలంకారము కాదని చెప్పియున్నాడు. ఇపుడు పూర్వపక్షి వస్తువక్రతయే స్వభావోక్త్యలంకార మని ఏల అంగీకరింపరాదు? స్వభావోక్తికి అలంకారత్వమును ఖండిప నేల? అని ఆశంకింప ఆ పూర్వపక్షమును సయుక్తికముగ ఖండించి వస్తువక్రతను స్వభావోక్తి యనరాదని చెప్పుచున్నాడు—

వ్యా. ఈ సహృదయాహ్లాదకారి యగు స్వభావోక్తి అలంకార మని (భామహాదులు) చెప్పి యున్నారు. దానిని ఖండించుటకై అంత పట్టుదలతో శ్రమపడనేల? (వస్తుస్వరూపకథనము మాత్రమే కదా వారు అంగీకరించు స్వభావోక్తి-? అట్లైనచో ఇక అలంకార్య మేమి యున్నది- అని ఆశంకింప రాదు). ఏలయన- వారి మతములో వస్తువులో నున్న సామాన్యధర్మము మాత్రము అలంకార్యము. అతిశయముతో గూడిన స్వభావసౌందర్యముయొక్క పరిపోషణము, అలంకారముగ భాసించును. కావున స్వభావోక్తి అలంకార మనుటయే యుక్తిసంగతముగ నుండును అని ఎవరు భావింతురో వారిని గూర్చి సమాధానము చెప్పుచున్నాము.

ఇది అంతగ అందముగ లేదు. ఏలయన- కావ్యరచన మనునది అగతికగతిన్యాయముచే (అనగా మరి యొక మార్గము లేదు గాన, ఏదియో ఒక మార్గము అను న్యాయముచే) ఏదియో విధముగ అనుష్ఠింపతగినది కాదు. ప్రస్తుతము విచారణీయ మైనది తద్విదాహ్లాదకారి యగు కావ్యమే కాని (ఏదియో యొక కావ్యము కాదు)

మరియు ఉత్కృష్టధర్మములు లేని వర్ణనీయవస్తువునకు అలంకారములను చేర్చుట గూడ, ఉచితము గాని అధారముపై వ్రాసిన చిత్తరువు వలె, శోభాతిశయమును కూర్ప జాలదు. కావున అత్యంతసుందర మగు స్వాభావిక ధర్మముతో గూడిన వస్తువునే వర్ణనీయముగ నెన్నుకొనవలెను. అట్టి వస్తువునకు వీలును బట్టి ఔచిత్యానుసారముగ రూపకాద్యలంకారయోజనము చేయవలయును. విశేషము మాత్రము ఇదియే. అది యేమనగా- స్వాభావికసౌందర్యప్రధానముగ చెప్పదలచినదానికి రూపకాద్యలంకారములను ఎక్కువగ చేర్చుట అంత ఉపకారకారిగ నుండదు. అట్లు చేసినచో వస్తుస్వభావసౌందర్యము గాని, రసాదిపరిపోషణము గాని, కప్పువడిపోవును. కావున ఒక్కొక్క విషయమున అలంకార్యము ఏ ఆకారములో నున్నను, స్నానసమయము, విరహవ్రతము, సురతావసానము మొదలగు సమయములందు విలాసవతి వలె, మరల ఎక్కువ అలంకారములచే అలంకరించుటను, సహింపజాలదు. ఏలయన- దానికి గల స్వాభావికసౌకుమార్యమే రసికహృదయాహ్లాదకముగ నుండును.

అవ. 'సహజసౌందర్య మున్నచో ఆహార్యము లగు అలంకారముల ఆవశ్యకత ఉండదు'. అను విషయమును సమర్థించుటకై కుమారసంభవమున పార్వతీవివాహఘట్టమునందలి కాళిదాసశ్లోకము నుదాహరించుచున్నాడు.

"తాం ప్రాఙ్ముఖీం తత్ర నివేశ్య తన్వీం
క్షణం వ్యలంబంత పురో నిషణ్ణాః.
భూతార్థశోభాహ్రియమాణనేత్రాః
ప్రసాధనే సన్నిహితేఽపి నార్యః". 1

"స్త్రీలు ఆ పార్వతిని ఆననమున తూర్పుదిక్కుగా కూర్చుండ బెట్టి, ఎదుటకూర్చున్నవారై అలంకరణసామాగ్రి సమీపముననే ఉన్నను, ఆమెయొక్క స్వాభావికశోభచే ఆకర్షింపబడిన నేత్రములు కలవారై, క్షణకాలము ఆలస్యము చేసిరి".

వ్యా. ఇచట అట్టి స్వాభావికసౌకుమార్యముచే మనోహర మగు శోభాతిశయమును ప్రతిపాదింపవలె నని కవి యభీష్టము. దీనికి అలంకారకలాపమును చేర్చినచో సహజశోభ మరుగున పడు ననెడు ఆశంకకు కూడ అవకాశ మున్న

దని ఈతని యభిప్రాయము. ఏలయన— ఉదార మగు స్వభావమహిమను, స్వాభావికసౌకుమార్యమునకు ప్రాధాన్య ముండు నట్లు వర్ణించునపుడు, సహజ శోభగా కప్పివేయునదియు, ప్రతీత్యంతరమును అపేక్షించునదియు నగు అలంకారకల్పనము ఉపకారకారిగ ఉండదు.

వి. ప్రతీత్యన్తరాపేక్ష మనగా— స్వాభావికసౌందర్యమును ఆస్వాదించుచున్న సమయమున, అచట గూర్చినఅలంకారమును గూడ తెలుసుకొనవలెనన్నచో స్వాభావికసౌందర్యప్రతీతి పోయి అలంకారప్రతీతి అనగా అలంకారజ్ఞానము, ఏర్పడవలెను. కావున అలంకారనిర్మాణము ప్రతీత్యన్తరాపేక్ష మగును.

వ్యా. విశేష మేమనగా-రసపరిపోషణముచే సుందర మగు ప్రతీతి విభావానుభావవ్యభిచారుల ఔచిత్యమునకు వ్యతిరేకముగ ప్రకారాన్తరముచే కలుగుట ప్రస్తుతశోభాపరిహారకారి యగును. కావుననే కవులు తరుణియొక్క ప్రథమ తారుణ్యావతారము మొదలగు విషయములను, సుకుమారములగు వసన్తాదిసమయముల సమున్మేషముయొక్క పరిపోషము, వాటి పరిసమాప్తి మొదలగు విషయములను, తత్ప్రతిపాదకము లగు వాక్యముల వక్రతకంటె భిన్నము లగు అలంకారములచే అలంకరింపకుండుట ఎక్కువగ కావ వచ్చును. ఎట్లనగా—

"స్మితం కించిన్ముగ్ధం తరలమధురో దృష్టివిభవః
పరిస్పన్దో వాచామభినవవిలాసోక్తిసరసః।
గతానామారమ్భః కిసలయితలీలాపరిమలః
స్పృశన్త్యాస్తారుణ్యం కిమివ హి న రమ్యం మృగదృశః" 2

"తారుణ్యమును స్పృశించుచున్న హరిణనయనయొక్క చిరునవ్వు కొంచెము ముగ్ధముగ నున్నది. దృష్టివైభవము చపలముగను, మధురముగను ఉన్నది. వాక్కులయొక్క పరిస్పన్దము నూతనము లగు విలాసోక్తులచే సరసమైనది. నడకల ప్రారంభము అంకురించిన లీలాపరిమళము గలది. రమ్యము కానిది ఏది ఉన్నది?".

వి. యౌవనప్రారంభమునందలి స్వాభావికసౌందర్యమును వర్ణించు ఈ శ్లోకమున కవి అలంకారాంతరములను కూర్పలేదు. కావుననే సహజసౌందర్యము నైపస్ఫుటముగ మనోగోచర మగుచున్నది.

ఇంకను ఎట్లనగా:-

"అవ్యుత్పన్నమనోభవా మధురిమస్పర్శోల్లసన్మానసాః
భిన్నాన్తఃకరణం దృశౌ ముకులయన్త్యాఘ్రాతభూతోద్భ్రమాః,
రాగేచ్ఛాం న సమాపయన్తి మనసః ఖేదం వినైవాలసాః
వృత్తాన్తం న విదన్తి యాన్తి చ వశం కన్యా మనోజన్మనః" 3

అవ. యౌవనప్రారంభమున నున్న కన్యల వర్ణన మిది:-

కన్యలు పూర్తిగ మన్మథపరిచయము లేకున్నను మాధుర్యస్పర్శచే మానసములు ఉల్లాసము చెంద, స్పష్టీకృత మగు అంతఃకరణము కలుగునట్లుగా (అంతఃకరణగతాభిప్రాయము వ్యక్తమగునటుల) నేత్రములను మూయు చుందురు. జనుల మదనోన్మాదమును పసికట్టి (వారి) మనస్సుయొక్క రాగేచ్ఛను సమాప్తము చేయరు. (అనగా తమయందు ఎవ్వరైన అనురాగము చూపినచో వారి కావిధముగ రాగము కలిగెడు విధముగనే ప్రవర్తించుచుందురు గాని దానిని తొలగిపోవునట్లు చేయరు). ఖేదకారణ మేమియు లేకుండగనే మందముగ ప్రవర్తింతురు. వృత్తాంతమున (విషయమును) ఎరుగజాలరు. కాని మన్మథునికి వశమగుదురు". 3

వి. ఇదికూడ అలంకారభారశూన్య మగు వస్తువక్రతకు ఉదాహరణము.

ఇంకను ఎట్లనగా-

"దోర్మూలావధి"

(మొ॥ చూ. 1-121) 4

ఇంకను ఎట్లనగా-

"గర్భగ్రన్థిషు వీరుధాం సుమనసో మధ్యేఽంకురం పల్లవా
వాఞ్ఛామాత్రపరిగ్రహాః పికవధూకణ్ఠోదరే పఞ్చమః.
కిఞ్చ త్రీణి జగన్తి జిష్ణు దివసైర్ద్విత్రైర్మనోజన్మనో
దేవస్యాపి చిరోజ్ఝితం యది భవేదభ్యాసవశ్యం ధనుః" 5

"లతల గర్భమునందలి గ్రంథులయందు పుష్పములును, అంకురముల నడుమ పల్లవములును బయల్వెడలినవి. పికవధూకణ్ఠ మధ్యమున పంచమ స్వరము కోరినంత మాత్రముననే బయల్వెడలు చున్నది. మరియు మూడు జగత్తులను జయింపకల్గిన మన్మథునియొక్క, చాల కాలమునకు పూర్వము విడువబడిన ధనస్సు రెండు మూడు రోజులలో అలవాటుచే వశములోనికి వచ్చును "

ఇంకను ఎట్లనగా—

'హంసానాం నినదేషు'

(మొ చూ-I-73) 6

ఇంకను ఎట్లనగా—

"సజ్జయతి సురభిమాసో

న తావదర్పయతి యువతి జనలక్ష్యముఖాన్.

అభినవ సహకారముఖాన్

నవపల్లవ పత్రలాననంగస్య శరాన్" 7

"వసంతమాసము నవపల్లవము లనెడు పత్రములు కట్టిన నూతన సహకార పుష్పములు మొదలగు బాణములను సన్నద్ధము చేయుచున్నాడు. అంతియే కాని యువతీజనులు లక్ష్యముగా గల ముఖములు కలవాటినిగా చేయుట లేదు. (అనగా యువతు లనెడు లక్ష్యముల పై ప్రయోగించుట లేదు.)" 7

వ్యా. ఈ విధము లగు విషయములలో స్వాభావిక సౌకుమార్యముననే ప్రధాన్య మిచ్చి వస్తువును వర్ణించునపుడు అది కప్పబడిపోవు ననెడు భయముచే, కవులు చాల వరకు అలంకార ప్రయోగము చేయరు. చేసినను స్వాభావిక సౌకుమార్యమును ఇనుమడింప చేయుటకు చేయుదురు. అంతియే కాని అలంకార వైచిత్ర్య ప్రతిపత్తికొరకై కాదు.

ఎట్లనగా—

"ధౌతాంజనే చ నయనే స్ఫటికాచ్ఛకాన్తి-

ర్గణ్డస్థలీ విగతకృత్రిమరాగ మోష్ఠమ్.

అఙ్గాని దన్తిశిశుదన్త వినిర్మలాని

కిం యన్న సున్దరమభూత్ తరుణీజనస్య" 8

"నయనములు కడిగివేయబడిన అంజనము గలవి. గండస్థలకాంతి స్ఫటిక కాంతి వలె నిర్మలముగ నున్నది. అధరోష్ఠము నుండి కృత్రిమమైన రంగు తొలగిపోయినది. అవయవములు చిన్న ఏనుగుయొక్క దంతముల వలె నిర్మలముగ నున్నవి. తరుణీజనమునకు సంబంధించిన వాటిలో సుందరము కానిది ఏది?"

(ఇది జలక్రీడాన్త వర్ణనము.)

వ్యా. ఇచట "దన్తిశిశు దన్త వినిర్మలాని" అను ఉపమ స్వాభావిక మగు సౌందర్యమును మాత్రమే ఉన్మీలితము చేయుచున్నది.

వి. అనగా ఇచట ఉపమాలంకారము స్వాభావిక సౌందర్యమును వృద్ధి పొందించుటకు మాత్రమే ప్రయోగింప బడినది గాని ఉపమాలంకారమునకు ప్రధాన్యమును చూపుటకు కాదు.

ఇంకను ఏట్లనగా—

"అకఠోర వారణ వధూ దన్తాఙ్కుర స్పర్ధినః"

మొ. 9 (చూ-I-68)

వి. ఇచట గూడ కవి ఉపమను స్వాభావిక సౌన్దర్య వికాసార్థమై ప్రయోగించియున్నాడు.

వ్యా. ఈ పద్ధతియే చాల యుక్తి యుక్తము. ఏలయన— మహాకవులు ఒక్కొక్కప్పుడు, ప్రస్తుత విషయౌచిత్యమును అనుసరించి స్వాభావిక సౌన్దర్యమునకే పట్టము కట్టి దానిని విజృంభింపచేయవలయు నని అభిలషింతురు. ఒకప్పుడు వివిధ రచనా వైచిత్ర్యయుక్త మగు విధమున చేయుదురు. ఇందు మొదటి పక్షమున రూపకాది యగు అలఙ్కార కలాపము ఆదరముతో కూర్చ బడదు. రెండవ పక్షమున ఆ అలంకరణ కలాపమే విజృంభించును కావున ఈ రీతిగ సర్వాతిశాయి యగు స్వాభావిక సౌన్దర్యరూప మైన పదార్థ స్వభావము అలంకార్య మని చెప్పుటయే యుక్తి యుక్తముగ నుండును కాని అలంకరణత్వము యుక్తి యుక్తము కాదు. సాతిశయత్వము లేని ధర్మముతో గూడిన వస్తువు అలంకరింపబడినను అలంకరించిన శిలాదాదికము వలె తద్విదాహ్లాదకారి కాజాలదు గాన అది అనుపాదేయమే. కావున (ఇక) అతిప్రసంగము చాలును.

ఒక వేళ-ప్రస్తుతౌచిత్య మాహాత్మ్యముచే సాతిశయరూపమున వర్ణింపబడు వస్తు స్వభావము తన మహిమచే ఇతర భూషణములను సహింపజాలనిదై స్వయముగనే శోభాతిశయశాలి యగును గాన అది అలంకార్యమైనను అలంకార మని చెప్పుచున్నాము- అని అన్నచో అది మా పక్షమే.

వి. అనగా సాతిశయ మగు వస్తు స్వభావము అలంకార్యమే కాని 'స్వభావోక్తి' అలంకారము కాదని మా (కుంతకుని) అభిప్రాయము. సాతిశయ వస్తు స్వభావము అలంకార్యమే యైనను అదియే స్వయముగ శోభాతిశయమును కూర్ప సమర్థము గాన దానిపై మరి యొక అలంకారమును చేర్చుట కుదురదు. ఈ అభిప్రాయముతోడనే మేము (పూర్వపక్షి) దీనిని అలంకారమనుచున్నాము- అని యన్నచో అది మా పక్షమే గాన మాకు విప్రతిపత్తి లేదు అని సిద్ధాంతి అభిప్రాయము.

వ్యా. సాతిశయ స్వభావ భిన్న మగు మరి యొక అలంకార మేదియు ఇచట చేర్చుట పొసగదు, అను నభిప్రాయముతో మీరు దానిని (సాతిశయ స్వభావమును) (స్వభావోక్త్యలంకార మని) చెప్పుచున్నారు గాన మాకును ఈ విషయమున వివాదము లేదు.

వర్ణ్యమాన వస్తు వక్రత ఇది యొక్కటి యేనా? మరి యొకటి కూడ ఉన్నదా అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు—

కా. అపరా సహజాహార్య కవి కౌశల శాలినీ।
నిర్మితిర్నూత నోల్లేఖ లోకాతిక్రాన్త గోచరా॥ 2

"సహజమును, అహార్యమును, అగు కవి కౌశలముచే ప్రకాశించునదియు, నూతన మగు ఉల్లేఖముచే లోకాతీత మగు విషయము కలదియు నగు నిర్మితి రెండవది (రెండవ వస్తు వక్రతా ప్రకారము)" 2

వ్యా అపరా = రెండవ, వర్ణ్యమాన మగు పదార్థము యొక్క, నిర్మితిః = సృష్టి, 'వక్రతా' అను పూర్వకారి కాగత పదముతో సంబంధము. ఎట్టిది? "సహజాహార్య కవి కౌశల శాలినీ"-సహజం స్వాభావికమును, ఆహార్యం = శిక్షాభ్యాసములచే వికసింప చేయబడినదియు, అనగా శక్తి వ్యుత్పత్తుల పరిపాకముచే ప్రౌఢమైన, ఏ, కవి కౌశలం = కావ్య నిర్మాతయొక్క

నైపుణ్యము కలదో, దానిచే ఏది, శాలతే = శ్లాఘించుచున్నదో అట్టిది. ఇంకను ఎట్టిదిః "నూతనోల్లేఖ లోకాతిక్రాన్త గోచరా"–నూతనం = క్రొంగ్రొత్త దగు, ఏ, ఉల్లిఖ్యతే ఇతి ఉల్లేఖః = తత్కాలమున వర్ణింపబడు అతిశయము కలదో, దానిచేత, లోకాతిక్రాన్తః = లోక ప్రసిద్ధ వ్యాపారమునకు అతీతమైన,కోఽపి = సర్వాతిశాయి యగు, గోచరః = విషయము, దేనికో అది యని విగ్రహము. దానివలన (అనగా లోకాతిక్రాన్త విషయము వలన) నిర్మితిః = ఆ రూపముతో నిర్మాణము అని యర్థము

దీని తాత్పర్య మేమనగా—

కవులు వర్ణ్యమాన స్వరూపము లగు పదార్థములను, పూర్వము లేని వాటిని సృష్టింపరు. కేవలము సత్తామాత్రముచే స్ఫురించుచున్న (అనగా ఉన్నట్లుగా మాత్రము తెలియుచున్న) పదార్థములలో వారు ఒకానొక అతిశయ మును ఉంచుదురు. దానితో వాటిలో సహృదయ హృదయాహ్లాదకర మగు ఒకానొక రమణీయత గోచరించును.

ఈ విషయమునే—

'లీనం వస్తుని' 10 (చూ-II-107)

ఇత్యాది శ్లోకము స్పష్టీకరించుచున్నది.

ఈ విధముగ కవులు, ఉన్నట్లు మాత్రమే తెలియ వచ్చిన పదార్థము నందలి శోభాతిశయ సంపాదక మగు ఒకానొక అలౌకిక విచ్ఛిత్తి విశేషమును మాత్రమే వర్ణింతురు. నూతనచ్ఛాయచే మనోహరమును, వాస్తవస్థితిని గూడ కప్పి పుచ్చి తన కాంతిచే దాని స్వరూపమును ప్రకాశింపచేయునదియు నగు ఆ వర్ణనముచే వర్ణనీయ పదార్థ స్వభావ మహిమ అప్పుడే తొలిసారిగ ఉల్లిఖిత మైనది వలె ప్రతిభాసించును. కావుననే కవులు సృష్టికర్త లనెడు పేరునకు గూడ అర్హులగుచున్నారు.

ఈ విషయమునే—

"అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే" 11

"అపార మగు కావ్య సంసారమునందు, కవి ఒక్కడే ప్రజాపతి. ప్రపంచము ఈతనికి ఏ విధముగ ఇష్టమో ఆ విధముగనే మార్పుచెందును."11

అని చెప్పియున్నారు.

ఈ వర్ణనీయ వస్తు వక్రత సహజాహార్య భేదభిన్నమై రెండు విధములుగ నున్నది. (సహజశక్తిచే కూర్చబడినది సహజ వక్రత. వ్యుత్పత్త్యభ్యాసాదులచే లభించినది ఆహార్య వక్రత). ఆహార్య వక్రత, ప్రస్తుత విచ్ఛిత్తి స్వరూపమైనదే యైనను, అలంకారములు లేకుండగ ఏ విధముగను ఉపపన్నము కాదు. కావున బహు విధము లగు ఆ అలంకారముల భేదముల ద్వారా (ఆహార్య వక్రతా సంబద్ధము లగు) పదార్థములు విస్తృత వ్యవహారములై కానవచ్చుచున్నవి.

ఎట్లనగా—

"అస్యాః సర్గవిధౌ ప్రజాపతి రభూచ్చన్ద్రో ను కాన్తిప్రదః
శృఙ్గారైకరసః స్వయం ను మదనో మాసో ను పుష్పాకరః.
వేదాభ్యాసజడః కథన్ను విషయవ్యావృత్త కౌతూహలో
నిర్మాతుం ప్రభవేన్మనోహర మిదం రూపం పురాణో మునిః" 12

"ఈమెను సృష్టించు విషయమున తాను కాంతిప్రదు డగు చంద్రుడు ప్రజాపతిగా నుండెనో, తాను శృఙ్గారమే ఏకైక రసముగా గల మన్మథుడే ప్రజాపతిగ నుండెనో, తాను పుష్పాకరు డగు వసంతమాసము ప్రజాపతిగ ఉండెనో; వేదాభ్యాసముచే జడుడైన, విషయములనుండి మరలిపోయిన కుతూహలము గల పురాణముని (నారాయణుడు) మనోహర మగు ఈ రూపమును నిర్మించుటకు ఎట్లు సమర్థు డగును?"

వి. నారాయణోరు సంజాత యగు ఊర్వశిని చూచి పురూరవుడు అనుకొనిన వాక్య-మిది. విక్రమోర్వశీయములోనిది.

వ్యా. ఇచట-కాంతయొక్క కాంతిమత్త్వమును, అనంత మగు విలాస సంపదలకు స్థాన మగు రసవత్త్వమును, అసామాన్య మగు సౌష్ఠవము గల సౌకుమార్యమును ప్రతిపాదించుటకై ప్రత్యేకముగ ఆ స్వభావము యొక్క ప్రాధాన్యమునకు సముచిత మగు సంభావనారూప మగు అనుమానము యొక్క

మాహాత్మ్యము వలన వేరు వేరుగా అపూర్వ మగు నిర్మాణము ఊహింపబడినది. (ఈ చంద్రాది) కారణత్రయమునకు సంబంధించిన అన్ని విశేషణముల తోడను "స్వయం" అనునది సంబంధించుచు, ఈ విషయమునే అత్యంతము ఉద్దీపితము చేయుచున్నది. ఎవడు తాను సహజముగ కాంత మగు ద్యుతికలవాడో అతనికి తన సౌజన్యమునకు సముచిత మగు అరోచకిత్వమువలన (అతి సుందర వస్తువులే కాని సామాన్య వస్తువులు రుచింపనివాడు అరోచకి) కాంతిగల కార్యమును నిర్మించు కౌశలమే ఉపపన్నము. ఎవడు తాను శృంగారైక రసుడో అట్టివాడు రసికుడు కావున రసవద్వస్తు నిర్మాణమున నేర్పు కలిగియుండుట ఉచితము. ఎవడు తాను పుష్పాకరుడు అనగా పుష్పములకు ఉత్పత్తిస్థానమో అతడు తనకు సహజ మగు అభిజాత్యముచే - అనగా ఉన్నత వంశ ప్రభవత్వముచే, అట్టి సుకుమార మగు సృష్టిని చేయుటయే సముచితముగ నుండును.

వి. ఈ విధముగ పూర్వార్ధమున ఊర్వశికి గల కాంతి, రసవత్త్వము, సౌకుమార్యము అనెడు గుణత్రయము సూచితమైనది.

వ్యా. అట్లే ఉత్తరార్ధమునందు ప్రయుక్తము లగు విశేషణములచే వ్యతిరేక ముఖమున కాంతి మత్త్వము మొదలగు ఈ మూడింటికిని అన్యథానుపపత్తి ఉపపాదింపబడినది. ఏలయన-నారాయణముని వేదాభ్యాస జడు డగుటచే కాంతి గల వస్తువును చేయజాలడనియు, విషయాభిలాష తొలగిపోయిన వాడగుటచే రసవత్పదార్థ విషయమున విముఖు డనియు, పురాణు డగుటచే (వృద్ధుడగుటచే) సౌకుమార్యముతో సరసము లగు పదార్థములను సృష్టించుట యందు విరసు డనియు గమ్య మగుచున్నది.

వి. వ్యతిరేక ముఖము:- ఏదైన ఒక విషయమును అన్వయ ముఖమున గాని వ్యతిరేక ముఖమున గాని రెండు విధములుగ చెప్పవచ్చును. ఉదా.- "అతడు బాగుగ చదివినాడు గాన ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు" అని అన్నచో ఇది అన్వయ ముఖమున చెప్పుట. "అతడు బాగుగ చదువకున్నచో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయి యుండెడి వాడుగాడు" అని చెప్పుట వ్యతిరేక ముఖమున చెప్పుట. ప్రకృతమున కాన్తిమత్త్వాదికము పూర్వార్ధమున అన్వయ ముఖమున సూచితమైనది. ఉత్తరార్ధమున వ్యతిరేక ముఖమున ప్రతిపాదింపబడి నది.

వి. అన్యథాను పపత్తి యనగా-చెప్పిన విధమున కాక మరి యొక విధముఁగ ఉపపన్నము కాకుండుట.

వ్యా. ఈ విధముగ, కవి, వర్ణనీయ మగు వస్తువునకు అలౌకిక మగు ఉల్లేఖముచే విలక్షణ మగు అతిశయమును సంపాదించుటకై, ఉత్ప్రేక్షారూప మగు నీ అలంకారమును కూర్చి యున్నాడు. అది (ఉత్ప్రేక్షా లంకారము) స్వభావ సౌన్దర్య మహిమముచే స్వయముగను, దానియొక్క (సందేహా లంకారము యొక్క) సహాయ్య సంపదచేతను, అర్థమునకు సౌన్దర్య గౌరవమును సంపా దింపవలె నిని అభిలషించుచు సందేహాలంకారము తోడి సంబంధమును అంగీక రించుచున్నది గాన దానిచే పరిపుష్టి చెందుచున్నది. ఆ కారణముచే కవి వర్ణ్యమాన మగు నాయికా స్వరూప సౌన్దర్యరూప పదార్థమునకు లోకోత్తరు డగు సృష్టికర్తచే సృష్టింపబడుట యనెడు ఒకానొక క్రొత్త అతిశయమును సంపాదించినాడు. దానిచే అదియే (నాయికా సౌన్దర్యరూప పదార్థమే) ఇదం ప్రథమముగ సృజింపబడినట్లు భ సించుచున్నది.

ఎచట ఉత్పాద్య మగు వస్తువును ప్రబంధార్థమును వలె కవులు అపూర్వ ముగ (సృజించి) వాక్యార్థ రూపమున ఉల్లేఖింతురో, అచట, తమ సత్తయొక్క సమన్వయముచేత స్వయముగనే స్ఫురించుచున్న పదార్థములకు అట్టి పరస్పరాన్వయ లక్షణ సంబంధమును కూర్చుట యనెడు నూతన మగు అతిశయమును మాత్రమే నిర్మాణమునకు విషయమునుగ చేయుదురు. (నిర్మింతురు), అంతియే గాని స్వరూపమును గాదు. (అనగా కవులు అక్కడక్కడ చేయు అపూర్వ వాక్యార్థ నిర్మాణములో గూడ ప్రధానమైనది క్రొత్తదగు అతిశయమే కాని వాక్యార్థ స్వరూపమాత్రము కాదు. అట్టి అతిశయము లేనిచో అట్టి అపూర్వ వాక్యార్థ నిర్మాణమున చమత్కారముండదు.)

ఎట్లనగా—

"కస్త్వం భో దివి మాలికోఽహమిహా కిం పుష్పార్థమభ్యాగతః
కిం తే సూనమహాక్రయో యది మహచ్చిత్రం తదాకర్ణ్యతామ్.
సంగ్రామేష్వలభాభిధానన్నృపతౌ దివ్యాఙ్గనాభిః స్రజః
ప్రోజ్ఝన్తీభి రవిద్యమాన కుసుమం యస్మాత్కృతం నన్దనమ్" 13

అవ. స్వర్గములోని మాలాకారుడు భూలోకమున పూవులమ్మువాని వద్దకు పుష్పములను కొనుటకు రాగా వారిరువురి నడుమను జరిగిన సంవాద మిది–

"నీ వెవరవు? నేను స్వర్గమునందలి మాలాకారుడను. ఇచట పని యేమి? పూవులకొరకై వచ్చినాడను. నీవు పుష్పములను వెల ఇచ్చికొనుట ఏమిటి? చాల ఆశ్చర్యముగ నున్నచో వినుము. ఏలయనగా– యుద్ధములలో అలభుడను పేరు గల రాజుపై మాలికలను విడుచుచున్న దివ్యాంగనలు నందన వనమును పూవులు లేనిదానినిగ చేసినారు." 18

వ్యా. ఈ విధ మగు విషయమున వర్ణనీయ మగు వస్తువునందు విశిష్ట మగు అతిశయము సంపాదించుటకై భూషణ విన్యాసము చేయవలసి యున్నది. కావున అలంకార కల్పనము లేనిచో ఈ ప్రకృతోదాహరణము ఏ విధముగను గూడ బాగుగ వాక్యార్థ సంగతిని పొందదు. ఏలయన (ఇట్టి సంభాషణము) ప్రత్యక్షాది ప్రమాణములచే సమర్థించుటకు శక్యము కాదు గాన ఇందు స్వాభావిక వస్తువును-ధర్మిగా స్థాపించుటకు వీలుకాదు (అనగా ఇట్టి ప్రత్యక్షాద్య విషయ మగు సంభాషణమునందు స్వాభావిక సౌందర్య మనునది ఉండజాలదు) కావున ఇది సహృదయ హృదయాహ్లాదకారి కావలెనన్నచో విదగ్ధ కవి ప్రతిభా నిర్మితా లంకరణ గోచరము కావలెను. కావున (ఈ శ్లోకమున) దుఃసహ మగు సమర సమయమునందు సముచిత మగు (అతని) శౌర్యాతిశయమును శ్లాఘించు సందర్భమున ప్రస్తుతు డగు రాజు విషయమున వల్లభలాభము కొరకై తొందరతో వ్యవహరించుచున్న సురసుందరులు సంగ్రహించిన మందారాది కుసుమమాలా సహస్రముల సంభావనాను మానముచే నందనోద్యానము నందలి వృక్షముల పుష్పముల సమృద్ధియొక్క ప్రధ్వంసా భావము యొక్క సిద్ధి (పుష్పము లన్నియు అయిపోవుట) ఉత్ప్రేక్షిత మైనది (అనగా ఇది ఉత్ప్రేక్షా లంకారము). ఏలయన ఉత్ప్రేక్షా విషయ మగు వస్తువును కవులు "అదియా అన్నట్లు ఉన్నది" అని గాని, "అదిగానే ఉన్నది" అని గాని రెండు విధముల కూర్చుచుందురు–అను విషయమును దాని లక్షణమును చెప్పు సందర్భమున విచారింపగలము.

ఈ విధముగ పూర్వార్ధగత మగు ఈ ఉత్ప్రేక్ష అప్రస్తుత ప్రశంసా సన్నివేశముచే సుందర మైనదై వక్తృతు దగు రాజు యొక్క ప్రతాపాతిశయ మును పోషించుటకై సహకరించుటచే ఎంతయు ప్రకాశించుచు తద్విదుల హృదయా వర్జనమును చేయుచున్నది.

వి కున్తకుడు "కస్త్వం భోః" ఇత్యాది శ్లోకము నుదాహరించి ఇట్టి స్థలములలో వర్ణనీయ వస్తువుల యందలి అతిశయమును బోధించు అలంకార విన్యాసము ఆవశ్యక మని చెప్పి, కావుననే ఇచట ఉత్ప్రేక్షాలంకారము కూర్ప బడినది అని చెప్పి యున్నాడు. దీనిని బట్టి ఇచట ఉత్ప్రేక్ష అతిశయాధాయక మని చెప్పినట్లైనది. కాని – అతిశయోక్త్యాధాయక మగు అలంకారము అతిశయోక్తి కావలెను గాని ఉత్ప్రేక్ష ఎట్లగును-అను ఆశంక కలుగవచ్చును. తన్నివారణమునకై ఉత్ప్రేక్షలో కూడ అతిశయము ఉండవచ్చు నని ప్రమాణ పూర్వకముగ చెప్పి వాస్తవమున భామహాదుల మతము ప్రకారము అన్ని అలంకారములందును అతిశయముండవలె చెప్పుచున్నాడు-

వ్యా. 'ఉత్ప్రేక్షాతిశయాన్వితా'

"అతిశయముతో కూడినది ఉత్ప్రేక్ష" అను ఉత్ప్రేక్షా లక్షణమున అతిశయమునకు గూడ అనుప్రవేశమున్నది గాన ఇది (ఉత్ప్రేక్షగూడ) సాతిశయమే-అనగా అతిశయాధాయకము, కావచ్చును.

వి. "ఉత్ప్రేక్షాతిశయాన్వితా" అను వాక్యము-

"అవివక్షితసామాన్యం కించిచ్చోపమయా సహ
అతద్గుణ క్రియా యోగా దుత్ప్రేక్షాతిశయాన్వితా"
(కావ్యాలంకార 2-91)

అని భామహోత్ప్రేక్షా లక్షణములోని భాగము:

"ఎచట సాదృశ్యము వివక్షితము కాదో, కాని ఉపమయొక్క ఛాయ మాత్ర ముండునో అచట లేని గుణములను, క్రియను కూర్చుటచే ఉత్ప్రేక్షా లంకార మగును. దానియందు అతిశయము కూడ ఉండును." అని దీని యర్థము.

కింశుకవ్యపదేశేన తరుమారుహ్యా సర్వతః
దగ్ధా దగ్ధ మరణ్యాన్యాః పశ్యతీవ విభావసుః ॥
కావ్యాలంకారము-II-91

"కింశుక పుష్ప మనెడు మిషచే వృక్షమును అధిరోహించి, అగ్ని అరణ్యము నందలి కాలిన భాగములను కాలని భాగములను, నలుమూలల, పరికించుచున్నట్లున్నాడు."

అనునది దీని ఉదాహరణము.

వ్యా. ''కోఽలంకారోఽనయావినా'' 15

(ఇది అనగా అతిశయోక్తి లేనిచో అలంకార మనునది ఏమిటిః) అని చెప్పిన విధముగ అతిశయోక్తి సకలాలంకారాను ప్రాణకము. కావున ఇది (ఈ శ్లోకమున) అతిశయోక్తియే ముఖ్యమైన స్వతంత్రాలంకారము - అని చెప్పినను విశేషమేదియును లేదు.

వి. అనగా-ఉత్ప్రేక్షా వాదులగు మేము గూడ ఉత్ప్రేక్షతో అతిశయము అంతర్గతముగ నున్న దని యంగీకరించినాము గాన ఇది యతిశయోక్తియే యని మీరు చెప్పినను మా మతమునకు విఘాతము లేదని యర్థము.

భామహుడు అతిశయోక్త్యలంకారమునకు—

నిమిత్తతో వచో యత్తు లోకాతిక్రాన్త గోచరమ్
మన్యన్తేఽతి శయోక్తిం తామలంకారతయా యథా॥
(కావ్యా. II-81)

''ఏదియో నిమిత్తవశమున లోకోత్తర విషయబోధక మగు ఏవాక్యము కలదో దానిని అతిశయోక్త్యలంకార మందురు" అని లక్షణము చెప్పి శుక్లగుణాది నిమిత్తములచే చేసిన రెండు లోకోత్తర వర్ణనములను ఉదాహరణముగ చూపి-

"సైషా సర్వత్ర వక్రోక్తి రనయార్థో విభావ్యతే
యత్నోఽస్యాం కవిభిః కార్యః కోఽలంకారోఽనయా వినా॥"

"ఇదియే సర్వాలంకారములందును ఉండెడు వక్రోక్తి దీనిచే అర్థమున రమణీయత్వము వచ్చును. దీని విషయముననే కవి ప్రయత్నము చేయవలెను.''

అను కారికచే అతిశయోక్తియే సర్వాలంకార ప్రాణభూత మని చెప్పి యున్నాడు. కావున "కస్త్వం భోః" ఇత్యాది శ్లోకమున అతిశయోక్తియే యున్న దని ఎవ్వరైన చెప్పినను విప్రతిపత్తి చూప పని లేదని యభిప్రాయము.

వ్యా. కవి ప్రతిభా మాత్రముచే కల్పిత మగుటచే ఏ మాత్రము కూడ సంభావ్యము కాని వస్తువును కూర్చుట యనునది ఈ యుక్తిని (సర్వాలంకారము లందును అతిశయోక్తి యున్నది అను యుక్తిని) అంగీకరించిననే సమంజసముగ నుండును గాని, స్వతంత్రరూపమున కాదు.

వి. అనగా 'కస్త్వం భోః' ఇత్యాది స్థలములలోని కవి ప్రతిభా మాత్ర కల్పిత మగు ఉత్ప్రేక్ష కూడ చమత్కార జనకముగ నున్న దనుచో అందులకు కారణము తదంతర్గత మగు అతిశయమే. అది లేనిచో ఈ ఉత్ప్రేక్షస్వతంత్రముగ చమత్కార జనకము కాజాలదు.

వా. లేదా ఏదియో ఒక కారణమును పురస్కరించుకొని లోకాతిక్రాంత గోచరముగ చెప్పుటచే అదియే (అతిశయోక్తియే) ఇది (నీవు చెప్పు ఉత్ప్రేక్ష) అని యన్నచో అటులే యగుగాక. అయినను ప్రస్తుతమునందు (అలభరాజు నందు) అతిశయమును చెప్పుటకంటె భిన్న మగు అపూర్వ విషయ మేదియు ఇచట లేదు.

వి. ఆ అతిశయము ఉత్ప్రేక్షకు సంబంధించినదా లేక స్వతంత్రముగ నున్నదా అను విషయమున మాత్రమే విప్రతిపత్తి.

వి. ఇచట "కారణతో లోకాతిక్రాన్త గోచరత్వేన వచసః" అనునది "నిమిత్తతో వచో యత్తు లోకాతిక్రాన్త గోచరమ్" అను భామహోక్తాతిశయోక్తి, లక్షణమునకు అర్థతోనువాదము. కుంతకు డీద్వితీయ కారికలో "లోకాతిక్రాన్త గోచరా" అను పదమును ప్రయోగించుట గమనార్హము.

వ్యా. ఈ విధముగ పూర్వము శబ్దముయొక్క వక్రత్వమును గూర్చియు, ఇచట అర్థము యొక్క వక్రత్వమును గూర్చియు చెప్పి ఇపుడు వాక్యము యొక్క వక్రత్వమును గూర్చి చెప్పుటకు ఉపక్రమించుచున్నాడు—

కా. మార్గస్థ వక్రశబ్దార్థ గుణాలంకార సమ్పదః ।
అన్యద్వాక్యస్య వక్రత్వం తథాభిహితి జీవితమ్ 3

కా. మనోజ్ఞ ఫలకోల్లేఖ వర్ణచ్ఛాయా శ్రియః పృథక్ ।
చిత్రస్యేవ మనోహారి కర్తుః కిమపి కౌశలమ్ ॥ 4

"సుకుమారాది మార్గములందున్న వక్రము లగు శబ్దార్థగుణాలంకారముల సంపదకంటె భిన్న మైనదియు వర్ణింప నలవి కాని ప్రకారముచే చెప్పుటయే జీవితముగా గలదియు అగు వాక్యవక్రత్వము ఉన్నది." 3

"సుందర మగు ఫలకముపై వ్రాయబడిన రంగుల కాంతియొక్క శోభకంటె వేరుగ చిత్రకారుని అపూర్వ మగు మనోహర మైన కౌశలము వలె (ఆ వాక్యవక్రత్వము) కావ్యకర్తయొక్క అనిర్వాచ్య మగు కౌశలము." 4

వ్యా. 'అన్యద్వాక్యస్య వక్రత్వమ్' - వాక్యస్య = పరస్పరాన్వితముగ నుండు పద సముదాయరూప వాక్యముయొక్క, అన్యత్ = అపూర్వము, భిన్నమును అగు, వక్రత్వం—వక్రభావము; మరి యొక్క క్రియా పదము లేదు గాన 'భవతి' అను అధ్యాహృత క్రియతో సంబంధము. దేనికంటె? "మార్గస్థ వక్ర శబ్దార్థగుణాలఙ్కార సమ్పదః" — మార్గాః = సుకుమారాది మార్గములు, తత్రస్థాః = వాటియందున్న, కొన్ని మాత్రమే యైన, వక్రాః = ప్రసిద్ధ వ్యవహారముకంటె భిన్నము లగు ఏ శబ్దార్థ గుణాలంకారములు కలవో వాటి యొక్క, సంపత్ = ఒకానొక ఉపశోభ (వాక్యశోభ ప్రధాన మగు శోభ యగుటచే శబ్దార్థాది శోభను ఉపశోభ యని చెప్పుచున్నాడు). దానికంటె భిన్న మగు ఒకానొక వక్రత్వాంతరము. ఎట్టిది? "తథాభిహితి జీవితమ్" తథా = వర్ణింపశక్యము కాని ఒకానొక ప్రకారముచే, ఏ, అభిహితిః ఒకానొక అపూర్వమగు అభిధానము కలదో, అదియే జీవితం = సర్వస్వము దేనికో అట్టిది. దాని స్వరూప మెట్టిదనగా చెప్పుచున్నాడు—"కర్తుః కిమపి కౌశలమ్"— కర్తుః = నిర్మాతయొక్క, కిమపి = అలౌకిక మైన, ఏ, కౌశలమ్ = నైపుణ్యము కలదో, అదియే వాక్యము యొక్క వక్రత్వ మని యర్థము. అది ఏ విధముగ నుండును? చిత్రస్యేవ = ఆలేఖ్యము యొక్క వలె, మనోహారి = హృదయ రంజక మైనది. ప్రకృతము లగు ఉపకరణముల కంటె (రంగులు మొదలగు వాటికంటె) భిన్నమైన కర్తయొక్క కౌశలము వలె, పృథక్ = వేరైనది, దేనికంటె అని చెప్పుచున్నాడు—"మనోజ్ఞ ఫలకోల్లేఖ - వర్ణచ్ఛాయాశ్రియః"—

మనోజ్ఞాః = హృదయ హారము లగు కొన్నియేమైన ఏ, ఫలకోల్లేఖ వర్ణ చ్ఛాయాః = ఫలకము, ఉల్లేఖములు, వర్ణములు, ఛాయలుకలవో, వాటియొక్క, శ్రీః = ఉపశోభ, దానికంటె వేరైన ఒకానొక తత్త్వాంతరము అని యర్థము. ఫలక మనగా, చిత్రరువుకు ఆధారమైన భిత్తి (గోడ మొదలగునవి). ఉల్లేఖ మనగా చిత్తరువును చిత్రించుటకు పూర్వము చిత్రరువు యొక్క సూత్ర ప్రమాణమునకు అనువుగ నుండెడు రేఖా విన్యాసము మాత్రము (Sketch). వర్ణము లనగా రంగులు. ఛాయ యనగా కాంతి (Shades).

దీని తాత్పర్య మేమనగా-చిత్తరువు యొక్క ఫలకము మొదలగు ఉపకరణముల కలాపము కంటె భిన్న మైనదియు, సకలము లగు ప్రకృత (ఫలకాది) పదార్థములకు జీవము వంటిదైన చిత్రకారుని కౌశలము వేరు గాను, ముఖ్యము గాను, ఏ విధముగ భాసించుచుండునో అట్లే వాక్యము విషయమున గూడ మార్గములు మొద లగు ప్రకృత పదార్థముల సముదాయము కంటె భిన్న మైనదియు కవి కౌశలరూపమును, సహృదయ సంవేద్యమును, ప్రకృతము లగు సకల పదార్థములకు జీవిత భూతమైనదియు నగు ఒకానొక వక్రత్వము ప్రత్యేకముగా కానవచ్చుచున్నది.

కావున-వస్తువుల స్వభావ సౌకుమార్యమును వర్ణించుట యందు గాని, శృంగారాది రసముల స్వరూపము యొక్క సమున్మీలనము నందు గాని, వివిధాలంకారముల విన్యాసమునందు విచ్ఛిత్తిని రచించుట యందు గాని (వాక్య వక్రతా సంపాదిత మగు) గొప్ప పరిపోషణాతిశయమే సహృదయాహ్లాదకర మగుచున్నది. పదమునందు గాని వాక్యైక దేశమునందు గాని ఉండెడు వక్రతా ప్రకారము లన్నింటికిని కవి కౌశలమే మూలకారణముగ నున్నది. ఏలయన, కల్పాది నుండియు కేవలము తమ తమ నియత స్వరూపములతో వ్యవస్థితములై యున్న స్వభావాలంకార రూపము లగు వక్రతా ప్రకారముల నవనవ మగు ఉల్లేఖముచే విలక్షణ మైన చేతన చమత్కార కారి యగు ఒకానొక స్వరూప విశేషము దీని వలననే (కవి కౌశలము వలననే) ఆవిర్భవించుచున్నది.

కావుననే ఈ విధముగ చెప్పియున్నారు—

"అ సంసారం కఇపుంగవేహి పడిదిఅహాగహిఅసారో వి
అజ్జవి అభిన్న ముద్దోవ్వజఅఇవాఅం పరిప్ఫందో"

"ఆ సంసారం కవి పుంగవైః ప్రతి దివస గృహీత సారోఽపి
అద్యాప్య భిన్న ముద్ర ఇవ జయతి వాచాం పరిస్పన్దః"

"సంసార ప్రారంభము నుండియు కవి పుంగవులు సారమును గ్రహించు చున్నను, నేటికిని ముద్ర తెరవనిది వలె ఉన్న వాక్కుల పరిస్పన్దము సర్వోత్కర్షముగ నున్నది."

వ్యా. ఇచట సృష్ట్యారంభము నుండియు, మహా కవులు తమ తమ ప్రతిభా పరిస్పన్ద మహాత్మ్యముచే ప్రతిదివసమునందును సారమును గ్రహించుచునే యున్నను, నేటికి కూడ అనంతము లగు క్రొంగ్రొత్త తళుకుల విజృంభణము కానవచ్చుటచే ఏ వాక్య పరిస్పన్దము అనుద్ఘాటితము వలెనే ఉన్నదో అది సర్వోత్కర్షముతో నున్నది—అనెడు ఈ వాక్యార్థము సుసంగత ముగ కానవచ్చుచున్నను అలౌకిక మగు ఒకానొక కవి కౌశల విలాసము స్ఫురించుచున్నది. ఏలయన (ఏతచ్ఛ్లోక రచయిత) ప్రధానముగ తన యభిమానమును ధ్వనింపజేయుటకై - "సంసార ప్రారంభము నుండియు, ప్రతి దినము నందును. కవి పుంగవులు దీని సారమును గ్రహించుచునే యున్నను ఇది ముద్ర తీయనట్లుగనే యున్నది" అని చెప్పియున్నాడు. ఈ విధముగ తత్త్వమును ఎరుగజాలక పోవుటచే ఏ ఒక్కడును దీనినుండి గ్రహింపజాలక పోయినాడు. కావున ఇపుడు నా ప్రతిభ ఇందలి పరమార్థమును ఉద్ఘాటితము చేయుచున్నది గాన దీని ముద్ర (సీలు) విడగొట్టబడ గలదు. ఈ విధముగ (నా ప్రతిభా బలముచే) లోకోత్తర మగు తమ (వాక్కుల) పరిస్పన్దము సఫలము కానున్నది గాన, వాక్య పరిస్పన్దము సర్వోత్కృష్టముగ నున్నది అని సంబంధము.

రసమునకును, స్వభావమునకును అలంకారములకును వీని కన్నింటికిని కవి కౌశలమే జీవితము. ఐనను, వర్ణింపబడుచున్న వస్తువునకు భూషణముగ నుండవలె నని అభిమత మైనదియు, కేవలము స్వరూపము తోడనే స్ఫురించు చున్నదియు, యథార్థరూపమున (ఉన్నది ఉన్నట్లుగ) కూర్చబడుచున్నదియు నగు అలంకారము ప్రత్యేకముగ కవి కౌశలానుగ్రహము లేనిచో తద్విదాహ్లాద కారి కాజాలదు గాన (అట్టి కవి కౌశలాననుగృహీత మగు అలంకారమున) కొంచె మైనను వైచిత్ర్యమును ఊహింపజాలము; ఏలయన-అట్టి అలంకారము

ప్రచుర మగు ప్రవాహములో కొట్టుకొని వచ్చిన ఇతర పదార్థముల వలనే నిస్సారముగ ప్రతిభాసించును.

ఎట్లనగా—

"దూర్వాకాండమివ శ్యామా తన్వీ శ్యామాలతా యథా" 17

"దూర్వాకాండము వలె శ్యామ యగు (శ్యామవర్ణము కలది లేదా యౌవన మధ్యస్థ యని యర్థము) ఈ తన్వి శ్యామాలత (ప్రియంగు లత వలె) నున్నది".

వి. ఇచట కవి కౌశలము లేకపోవుటచే కేవల సాదృశ్య వర్ణనము సహృదయ హృదయాహ్లాదకముగ లేదు.

వ్యా. నూతనోల్లేఖముచే మనోహర మగు ఇదియే (అలంకారమే) లోకోత్తర మగు విన్యాస విచ్ఛిత్తిచే శోభాతిశయము పెంపొందింప బడినపుడు వర్ణింప రాని విధమున సహృదయాహ్లాద కారిగ నుండును.

ఎట్లనగా—

"అస్యాః సర్గవిధౌ" మొ. 18 (చూ-III-12)

ఇంకను ఎట్లనగా—

"కిం తారుణ్యతరోః" ఇత్యాది. 19 (చూ-II-92)

ఈ విధముగ ఇది (అలంకార వక్రత్వము) భిన్నరూపముననే యున్నను (కవి కౌశలము లేనిచో దానికి స్థితి లేదు గాన) కవి కౌశలాధీన స్థితిత్వరూప మగు వాక్య వక్రతయందే దానికి గూడ అంతర్భావము చెప్పుట యుక్తి యుక్తముగ నుండును.

కావుననే—

"వాక్యస్య వక్రభావోఽన్యో భిద్యతే యః సహస్రధా
యత్రాలంకార వర్గోఽసౌ సర్వోఽప్యన్తర్భవిష్యతి" 20

"(పదాది వక్రత కంటె) భిన్న మగు వాక్య వక్రత యున్నది. అది సహస్రభేద భిన్నము. ఈ అలంకార సముదాయ మంతయు దానియందే అంతర్భూత మగును.'' అని చెప్పి యున్నాము. (చూ-1-కా, 20)

వి. రసస్వభావాలంకారము లన్నింటికిని కవి కౌశలమే జీవిత మని చెప్పి అలంకారమునకు ఉదాహరణము చూపి యున్నాడు. ఇపుడు స్వభావ రసములకు ఉదాహరణములను చూపుచున్నాడు—

స్వభావమునకు (స్వభావము కవి కౌశలోజ్జీవిత మగుటకు).

ఉదాహరణము ఎట్లనగా—

"తేషాం గోప వధూ విలాస సుహృదాం రాధారహః సాక్షిణాం
క్షేమం భద్ర కళిన్దశైల తనయాతీరే లతావేశ్మనామ్.
విచ్ఛిన్నే స్మరతల్ప కల్పన మృదుచ్ఛేదోప యోగేఽధునా
తే మన్యే జరఠీ భవన్తి విగలన్నీలత్విషః పల్లవాః" 21

"భద్రా! (ఉద్ధవా!) గోపికల విలాసములకు మిత్రములును, రాధ యొక్క రహస్యక్రీడలకు సాక్షిభూతములును అగు యమునాతీర లతాగృహ ములు క్షేమముగ నున్నవా! ఇపుడు లేత చిగురుటాకులను స్మరతల్పముగ ఉపయోగించుట నిలచిపోయినది గాన నీలిరంగు కాంతి తగ్గిపోయిన ఆ చిగుళ్ళు ముదిరిపోవుచున్న వని తలచెదను".

వ్యా. ఇచట సహృదయమాత్ర సంవేద్యమును వస్తువునందు యథార్థ మొగ నున్నదియు నగు స్వభావమే వర్ణింపబడినది. అయినను, అనుత్తానముగ నున్న (అనగా సర్వజనగ్రాహ్యముగలేని) [ఉత్తాన మనగా తిరగవేసియున్నది; అందుచే స్పష్టముగ నున్నది. అని యర్థము. తద్భిన్నము అనుత్తానము.] దీనికి సంబంధించిన విరళముగ కానవచ్చు విదగ్ధహృదయులకు మాత్రమే గోచరించు నదియు, నూతన కల్పనలచే మనోహర మైనదియు పదార్థాంతర్లీన మైనదియు, సూక్ష్మమును, సుందరమును, అగు ఎట్టి స్వరూపము ఉన్మీలిత మైన దనగా-దీనిచే వాక్యవక్రతారూప మగు కవికౌశలము ఒకానొక అత్యున్నతస్థితిని అధిరో హించినది..ఏలయన-[ఈ శ్లోకమున] కవికౌశల వ్యతిరిక్త మగు మరియొక్క అర్థాతిశయమేదియు కానవచ్చుట లేదు.

రసమునకు ఉదాహరణ మెట్లనగా

"లోకో యాదృశమాహ" మొ—22 [చూ-1—47]

ఇచట—తగిన ఆలంబన విభావరూప మగు (ఇచట శ్రీరాముడు ఆలంబన విభావము) విషయమునందలి సౌందర్యాతిశయమును, [ఇచట పరాక్రమాతిశయము] శ్లాఘించుటయందు శ్రద్ధాళువై విజిగీషు వగు రావణుడు చేయు వైదగ్ధ్యముతో కూడిన భంగీభణితి వైచిత్ర్యముచే ఉత్సాహరూపమగు స్థాయిభావము అధికమగు ఈ పరిపుష్టమైన రసత్వస్థితిని పొందింప బడుచు వాక్యవక్రత్వరూప మగు అపూర్వమైన కవి కౌశలమును సూచించుచున్నది. సహృదయులు, పూర్వప్రకరణమున [వాచ్యవక్రతా నిరూపణ ప్రకరణమున] చూపిన ఉదాహరణములందు గూడ ప్రత్యేకముగ ఆవిధముగ చెప్పుటయే జీవితముగాగల వక్రత్వమును స్వయముగనే ఊహించుకొనవలెను.

శ్లో॥ వక్రతాయాః ప్రకారాణామౌచిత్యగుణశాలినామ్
ఏతదుత్తేజనాయాలం స్వస్పన్దమహాతామపి. 23

"ఇది (కవికౌశలము) ఔచిత్యగుణముతో ఒప్పారుచు స్వాభావిక మగు మహత్త్వము కలవే యైన వక్రతాప్రకారములను గూడ ఉత్తేజితములుగ చేయుటకు సమర్థము".

శ్లో॥ రసస్వభావాలంకారా ఆసంసారమపి స్థితాః
అనేన నవతాం యాన్తి తద్విదాహ్లాదదాయినీమ్. 24.

"సంసార ప్రారంభమునుండియు ఉన్నవే యైనను, రసస్వభావాలంకారములు, దీనిచే తద్విదాహ్లాదకారి యగు క్రొత్తదనమును పొందును".

ఇవి అంతరశ్లోకములు

ఈ విధముగ (ఇంతవరకును) శబ్దము, అర్థము, అర్థబోధన పద్ధతి (వక్రతాయుక్తకథన పద్ధతి) అనెడు కావ్యోపయుక్తము లగు త్రయముయొక్క స్వరూపమును తెలిపి, (ఇపుడు) వర్ణనీయవస్తువునకు సంబంధించిన విషయ విభాగమును చేయుచున్నాడు.

కా. భావానా మపరిమ్లాన స్వభావౌచిత్య సున్దరమ్
చేతనానాం జడానాం చ స్వరూపం ద్వివిధం స్మృతమ్ ॥5॥

"చేతనములును, అచేతనములును అగు పదార్థముల వని వాదని స్వభావముయొక్క ఔచిత్యముచే సుందర మగు స్వరూపము (చైతన్యజడత్వరూపమున) రెండు విధములైనదని చెప్పబడినది".

వ్యా. భావానాం = వర్ణ్యమానము లగు పదార్థముల, స్వరూపం = స్వభావము. ఎట్టిది? 'ద్వివిధమ్' రెండు,విధే = ప్రకారములు, దేనికోఅట్టిది?, స్మృతం = పండితులచే చెప్పబడినది ఏపదార్థములయొక్క? 'చేతనానాం జడానాం 'చ' చేతనానాం = జ్ఞానము కలవానియొక్క ప్రాణుఃయొక్క అని తాత్పర్యము. జడానాం = తద్భిన్నము లగు చైతన్య శూన్యము లైన పదార్థములయొక్క. ఈ ధర్మద్వైవిధ్యమే ధర్మిద్వైవిధ్యమునకు కారణము. ఎట్టి స్వరూపము? "అపరిమ్లాన స్వభావౌచిత్యసున్దరమ్". అపరిమ్లానః = క్రొత్తదియు పోషణముచే సుందరమైనదియు నగు, ఏ స్వభావః = పారమార్థిక మగు ధర్మము కలదో, దానియొక్క ఏ ఔచిత్యం=ఉచితత్వము ప్రకరణోపయోగియగు దోషదుష్టత్వ రాహిత్యము కలదో, దానిచే, సుందరం = సుకుమారమైనది అనగాసహృదయాహ్లాదక మని యర్థము.

ఈ ద్వైవిధ్యమునే విభజించి విచారించుచున్నారు—

కా. తత్ర పూర్వం ప్రకారాభ్యాం ద్వాభ్యామేవ విభిద్యతే
సురాది సింహ ప్రభృతి ప్రాధాన్యేతర యోగతః 6

"వాటిలో మొదటిది (చైతన్యము) సురాదులు మొదలు సింహాదులు వరకును గల ప్రాణుల ప్రాధాన్యా ప్రాధాన్యములతో యోగము వలన, రెండు ప్రకారములచే భిన్న మగుచున్నది." 6

వ్యా. తత్ర = ఆ రెండు స్వరూపముల నడుమ, పూర్వం = చేతనపదార్థ సంబంధి యగు మొదటిది. మరి యొక భేదము లేదు గాన రెండు ప్రకారముల చేత మాత్రమే. విభిద్యతే = భేదమును పొందుచున్నది. రెండు విధములుగ మాత్రమే అగుచున్నది దేనివలన? 'సురాది సింహ ప్రభృతి ప్రాధాన్యేతరయోగతః'— సురాది = దేవతలు మొదలైన ఏచేతనులు సురాసురసిద్ధ విద్యాధర గంధర్వాదులు గలరో, వారియొక్కయు, ఇతరమైన,ఏ, సింహప్రభృతయః = సింహము మొదలైనవి కలవో వాటియొక్కయు, ఏ, ప్రాధాన్యం = ముఖ్యత్వము

ఇతరత్ = అప్రాధాన్యమును గలదో, వాటితో యథాసంఖ్యముగ ప్రత్యేకముగ ఏ, యోగః = సంబంధము కలదో, ఆ కారణము వలన—

వి. అనగా సురాదులలో చేతనధర్మమను జ్ఞానము అధికముగ నుండును గాన, వారి యందలి చేతనత్వము ప్రధానము. సింహదులతో చేతన ధర్మ మగు జ్ఞానము, అల్పముగ నుండును గాన వాటి చేతనత్వము గౌణము.

ఈ విధముగ కవుల వర్ణనకు గోచర మైన సురాదిముఖ్యచేతన పదార్థ ముల స్వరూపము మొదటిది, సింహాది అముఖ్యచేతనముల అనగా పశు మృగ పక్షిసర్పాదుల స్వరూపము రెండవది అను ఈ విషయమునే విశేషముగ వివరించుచున్నాడు-

కా. ముఖ్య మక్లిష్ట రత్యాది పరిపోషమనోహరమ్
స్వజాత్యుచిత హేవాక సముల్లేఖోజ్జ్వలం పరమ్. 7

'ముఖ్యమగు చేతనస్వరూపము సుకుమారము లగు రత్యాదుల పరిపోష ముచే మనోహర మైనది. అముఖ్యమగు చేతనస్వరూపమ్ము స్వజాతికి ఉచితమగు స్వభావముయొక్క వర్ణనముచే మిగుల ఉజ్జ్వల మైనది."

వ్యా ముఖ్యం = చేతనము లగు సురాసురాదులకు సంబంధించిన ఏ ప్రధాన స్వరూపము కలదో అది ఈ (క్రింద చెప్పు) విధమున సత్కవుల వర్ణనకు గోచర మగును; అనగా మహా కవుల కావ్యనిర్మాణరూప స్వవ్యాపార మునకు గోచరము అగును. ఎట్టిది? "అక్లిష్టరత్యాది పరిపోష మనోహరమ్"— అక్లిష్టః = (శ్రమపడి కూర్చుట యనెడు) దూషణము లేనిదియు, నూతనత్వముచే మనోహరమును అగు ఏ రత్యాది స్థాయిభావము కలదో దానియొక్క, పరిపోషః = శృంగారాది రసత్వ స్థితిని పొందించుట, "స్థాయియే రసమగును" అని నియమము. దానిచే, మనోహరం = హృదయహారి యగునది-విక్రమోర్వ శీయమునందలి చతుర్థాంకమున విప్రలంభ శృంగార ఘట్టమున ఉన్మత్తు డగు పురూరవుని ప్రలాపములు ఇందుకు ఉదాహరణములు. ఎట్లనగా—

అవ. హఠాత్తుగ అంతర్ధానము చెందిన ఊర్వశిని కానజాలక పురూరవుడు ఆమెను గూర్చి అనేక విధముల ఆలోచించుచు మరల తానే సమాధానము చెప్పుకొనుచు తలపోయు విధమును వర్ణించు శ్లోక మిది—

"తిష్ఠేత్ కోపవశాత్ ప్రభావపిహితా దీర్ఘం న సా కుప్యతి
స్వర్గాయోత్పతితా భవేన్మయి పునర్భావార్ద్రమస్యా మనః.
తాం హర్తుం విబుధద్విషోఽపి న చ మే శక్తాః పురోవర్తినీం
సా చాత్యన్త మగోచరం నయనయోర్యాతేతి కోఽయం విధిః" 25

"ఆమె (ఊర్వశి) కోపవశమున ప్రభావముచే (తిరస్కరిణీ విద్యచే) కప్పబడినదై యుండునా! (అట్లు కాజాలదు; ఏలయన) ఆమె చాల సేపు కోపగించదు. స్వర్గలోకమునకు ఎగిరిపోయి యుండునా! ఆమె మనస్సు నాపై ప్రేమతో ఆర్ద్రమైనది. నా ఎదుట నుండగా ఆమెను హరించుటకు రాక్షసులు కూడ సమర్థులు కారు. కాని ఆమె పూర్తిగ కండ్లకు కనబడకుండగ పోయినదే, ఇది ఏమి విధి!"

వ్యా. ఇచట-వల్లభ యొక్క విరహమువలన కలిగిన కష్టదశలో ప్రవేశించుటచే వివశ మగు మనోవృత్తి కలవాడును, ఆమె కానరాకుండుటకు కారణమును తెలియజాలని వాడును, మున్ముందుగనే స్వాభావిక సౌకుమార్యముచే ఊహించబడినదియు, పిదప తగు ఆలోచనచే తొలగింపబడు ఉపపత్తి కలదియు నగు ఒకానొక తాత్కాలిక మగు వికల్పముచే వర్ణింపబడుచున్న అదర్శన కారణమును ఉత్ప్రేక్షించుచున్న రాజు, ఆమె లభించుటకు అవకాశ మేమియు సంభావ్యము కాకుండుట వలన కల్గిన నైరాశ్య నిశ్చయముచే విమూఢమగు మానసము కలవాడగుటచే రసము అత్యధికము పరిపుష్టిని పొందింపబడినది. మరియు ఇదియే (విప్రలంభ శృంగారమే) వాక్యాంతరములచే ఉద్దీపిత మైనది.

ఎట్లనగా—

"పద్భ్యాం స్పృశేద్వసుమతీం యది సా మృగాక్షీ
మేఘాభివృష్ట సికతాసు వనస్థలీషు.
పశ్చాన్నతా గురునితంబతయా తతోఽస్యా
దృశ్యేత చారుపదపంక్తి రలక్తకాంకా" 26

"మృగాక్షి యగు ఆమె మేఘము వర్షించిన ఇసుకతిన్నెలు గల వనస్థలులపై పాదములతో భూమిని స్పృశించినచో అపుడు ఆమె గురువైన నితంబము కలదిగాన వెనుక భాగమున నేలపై దిగినదియు లత్తుకచే చిహ్నితమును అగు పదపంక్తి కనబడెడిది." 26

వ్యా. ఇచట–'పాదములచే ఒక వేళ భూమిని స్పృశించినచో' అని ఊహించుటచే ఆమెయొక్క ప్రాప్తి సంభావ్యము కావచ్చును. ఏలయన:– ఆమె గురునితంబ యగుటచే మేఘముయొక్క జలసేకముచే సుకుమార మగు ఇసుక గల వనస్థలుల యందు వెనుక భాగమున లోతుగ నుండుటచే బాగుగ ముద్రపడిన ఆకారము కలదియు, రంగుచే రంజిత మగుటచే సుందర మైనదియు నగు అడుగుల పంక్తి చూడబడి యుండెడిది– (అట్టి పదపంక్తి కానవచ్చుట లేదు గాన, ఆమె భూమిపై దిగలేదు.) కావున నైరాశ్య నిశ్చయమే ఇచట అత్యధికముగ విజృంభించినది. అదియే తరువాత వచ్చు వాక్యములలోని ఉన్మత్త ప్రలాపములకు నిమిత్తమైనది.

వ్యా. తాపస వత్సరాజ చరితమునందలి ద్వితీయాంకములోని వత్సరాజ విలాపములు కరుణరసమునకు ఉదాహరణములు.

ఎట్లనగా—

"ధారావేశ్మ విలోక్య దీనవదనో భ్రాన్త్వా చ లీలాగృహాన్
నిఃశ్వస్యాయతమాశు కేసరలతావీథీషు కృత్వాదృశః.
కిం మే పార్శ్వముపైషి పుత్రక కృతైః కిం చాటుభిః క్రూరయా
మాత్రా త్వం పరివర్జితః సహ మయా యాన్త్యాతిదీర్ఘాం భువమ్" 27

"ఓ పుత్రకా! (పెంపుడు కొడుకు–ఇచట లేడి) ధారాగృహమును జూచి దీనవదనుడవై, విలాస గృహములలో గూడ తిరిగి, దీర్ఘముగ నిశ్వసించి, శీఘ్రముగా కేసరలతాపంక్తులపై నేత్రములను ప్రసరింపచేసి, నా దగ్గరకు ఏల వచ్చెదవు? చాటువులు చేసినవి చాలును. అతిదీర్ఘ మగు దూరము పోయిన తల్లిచే నాతో పాటు నీవు కూడ విడువబడినావు." 27

వ్యా. ఇచట రసపరిపుష్టికి కారణభూత మగు విభావాది సామగ్రీ సముదాయమును కవి అత్యంతము విజృంభింప చేసినాడు. కావుననే — ఈ వాక్యమునకు (శ్లోకమునకు) అవతారికగా విదూషక వాక్యము ఈ విధముగా ప్రయోగింపబడినది–

"ప్రమాదః; ఏష ఖలు దేవ్యాః పుత్రకృతకో
హారిణపోతో అత్రభవన్తమనుసరతి"

"ఎంత ప్రమాదము! దేవియొక్క పెంపుడు కొడుకైన హరిణ శిశువు తమ వెనుక వచ్చుచున్నది."

వ్యా. దీనిచే (ఈ విధముగ చెప్పుటచే) హరిణ శిశు ధారా గృహాదులు ఎంతయు కరుణరసోద్దీపన విభావములుగ అగుచున్నవి. ఇంకను-

"తథా చాయమపరః క్షతే క్షారాక్షేపః"

''ఇది మరియొకటి—గాయముపై ఉప్పుచల్లుట।'' అని రుమణ్వంతుడు పల్కిన పిమ్మట, ఏ తద్విషయో పోద్బలకముగనే మరియొక వాక్యము కూర్పబడినది.

ఎట్లనగా—

"కర్ణాన్తస్థితపద్మరాగ కలికాం భూయః సమాకర్షతా
చంచ్వా దాడిమబీజమిత్యభిహతా పాదేన గండస్థలీ.
యేనాసౌ తవ తస్య నర్మసుహృదః ఖేదాన్ముహుః క్రన్దతో
నిఃశంకం న శుకస్య కిం ప్రతివచో దేవి త్వయా దీయతే'' 29

"దానిమ్మ పండు గింజ యనెడు నభిప్రాయముతో కర్ణాంతమునందలి పద్మరాగాంకురమును మాటి మాటికిని ముక్కుతో లాగుచున్న ఏ చిలుక పాదముతో ఈ గండస్థలమును కొట్టుచున్నదో, అట్టి నీనర్మ సఖుడగు, అలసటచే మాటి మాటికిని ఆక్రందించుచున్న శుకమునకు, ఓ దేవీ! నిశ్శంకముగ ప్రతి వచనమును ఏల ఈయవు." 29

వ్యా. ఇచట చిలుక ఈ విధముగ గారాబము చేయుచున్న దను విషయము వాల్లభ్య ప్రతిపాదనము కొరకై చెప్పబడినది. 'అసౌ' అను పదము కపోలస్థలమునకు గల స్వానుభవ గోచర మగు సౌకుమార్యోత్కర్షమును పరామర్శించుచున్నది. ఈ విధముగనే ఉద్దీపన విభావైక జీవిత మగు కరుణ రసము అత్యున్నత స్థితిని చేరుటచే కలిగిన రమణీయత్వమును పొందింప బడినది.

విప్రలంభ శృంగార, కరుణరసములు సుకుమారములు గాన ఈవిధముగ ఉదాహరణములను చూపియున్నాము. ఈ విధముగనే ఇతర రసములకు కూడ ఉదాహరణములను ఊహించుకొనవలెను.

వి. ఇంత వరకును ప్రధానచేతను లగు సురాసురాదులకు సంబంధించిన స్వరూపమున, కవుల వర్ణనా విషయ మగు పద్ధతి చూపబడినది. ఇపుడు అప్రధాన చేతను లగు పశుపక్ష్యాదుల విషయమున వారి వర్ణనా పద్ధతి ఎట్లుండునో చెప్పుచున్నాడు —

వ్యా. ఇదే ప్రకారముగ అప్రధాన చేతనాది సంబంధి యగు ఏ రెండవ స్వరూపము గలదో అది ఈ [క్రింది] విధముగ కవుల వర్ణనమునకు ఆస్పద మగును. ఎట్టిది: 'స్వజాత్యుచిత హేవాకసముల్లేఖోజ్జ్వలమ్' స్వా = ప్రత్యేక ముగ ఆయా ప్రాణులకు సంబంధించిన సామాన్య మని (నైయాయికాదులు) చెప్పెడు వస్తుస్వరూపము గల ఏ జాతి కలదో దానియొక్క, సముచిత మగు, ఏ, హేవాకః = స్వభావానుసారి యగు వ్యాపారము కలదో, దానియొక్క, సము ల్లేఖః = బాగుగా వర్ణించుట, అనగా వాస్తవరూపమున కూర్చుట, దానిచేత ఉజ్జ్వలం = ప్రకాశించునది సహృదయాహ్లాదకారి యగునది యని తాత్పర్యము.

ఎట్లనగా —

"కదాచిదేతేన చ పారియాత్ర గుహాగృహే మీలితలోచనేన
వ్యత్యస్తహస్త ద్వితయోపవిష్ట దంష్ట్రాంకురాంచచ్చిబుకం ప్రసుప్తమ్ ౩౦

'ఒకానొకప్పుడు ఈ సింహము పారియాత్ర పర్వత గుహాగృహమునందు కండ్లు మూసికొని ఒకదానిపై ఒకటి ఉంచిన హస్తద్వయముపై కోరల అంకుర ములతో ప్రకాశించు గడ్డము ఉంచి నిద్రించినది". ౩౦

వ్యా. ఇచట గిరిగుహా మధ్యమున నిద్రించుచున్న సింహముయొక్క స్థానకము (Pose) దాని జాతికి సముచిత మగు విధముగ వర్ణింపబడినది.

ఇంకను ఎట్లనగా-

అవ. అభిజ్ఞానశాకుంతలమున భయముతో పారిపోవుచున్న లేడిని దుష్యంతుడు వర్ణించుచున్నాడు.

"గ్రీవాభంగాభిరామం ముహురనుపతతి స్యన్దనే దత్తదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టః శరపతనభయాద్భూయసా పూర్వకాయమ్
శష్పైరర్ధావలీఢైః శ్రమవివృతముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా
పశ్యోదగ్రప్లుతిత్వాద్వియతి బహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి" ౩౧

'మెడను అందముగ వంచి తరుముకొని వచ్చుచున్న రథముపై మాటి మాటికిని దృష్టిని ప్రసరింపచేయుచు, బాణము పడుచున్న దనెడు భయముచే వెనుక భాగమును చాలవరకు శరీర పూర్వభాగమునందు చొనుపుచు, అలసటచే తెరచుకొనిన ముఖము నుండి జారి పడుచున్న సగము నమలిన గడ్డిపరకలను మార్గముపై చల్లుచు, (ఈ లేడి) దీర్ఘమగు గంతులతో ఆకాశమున అత్యధికను గను, భూమిపై తక్కువగను వెళ్లుచున్నది. చూడుము.' 31

ఈ విషయమునే ప్రకారాంతరముచే విశదీకరించుచున్నాడు—

"రసోద్దీపన సామర్థ్య విని బన్ధన బంధురమ్
చేతనానా మముఖ్యానాం జడానాం చాపి భూయసా 8

'చాలవరకు, అముఖ్యచేతనముల యొక్కయు, జడవస్తువులయొక్కయు (స్వరూపము) రసోద్దీపన సామర్థ్యమును కూర్చుటచే మనోహర మగునట్లుగ వర్ణింపబడును.' 8

వ్యా. అముఖ్యానాం=అప్రధానము లగు, చేతనానాం=ప్రాణులయొక్క ఏ స్వరూపము కలదో అది ఈ విధముగ నున్నదై అనగా ప్రస్తుతమునకు అంగముగ ఉపయుక్తమైనదై, వర్ణనీయత్వమును పొందును. (వర్ణింపబడును) ఎట్టిది?— "రసోద్దీపన సామర్థ్య విని బన్ధన బన్ధురమ్"- రసాః=శృంగారాది రసములు, వాటియొక్క ఉద్దీపనం=ప్రకాశింపచేయుట, (అనగా) పరిపోషణము దానియందు, సామర్థ్యం=శక్తి. దీనియొక్క వినిబన్ధనం=నివేశనము, దానిచేత, బన్ధురం=హృదయ హారి యైనది. ఎట్లనగా—

'చూతాంకురాస్వాద కషాయకంఠః
పుంస్కోకిలో యన్మధురంచుకూజ
మనస్వినీ మాన విఘాతదక్షం
తదేవ జాతం వచనం స్మరస్య' 32

"చూతాంకురములను ఆస్వాదించుటచే కషాయ మగు కంఠము గల పుంస్కోకిల మధురముగ కూసెను. అదియే మానవతుల మానమును తొలగించుటకు సమర్థ మగు మన్మథుని వాక్యముగా బనది," 32

వ్యా. "జడానాం చాపి భూయసా" జడానాం అచేతనము లగు సలిలము, తరువులు, వసంత సమయము మొదలగు వాటియొక్క ఈ విధమగు

స్వరూపము రసోద్దీపన సామర్థ్యమును కూర్చుటచే సుందరముగ వర్ణనీయత్వ మును పొందును.

ఎట్లనగా-

"ఇదమసులభవస్తు ప్రార్థనాదుర్నివారం
ప్రథమమపి మనో మేపంచబాణః క్షిణోతి.
కిముత మలయవాతోన్మూలితా పాండుపత్రై
రుపవన సహకారైర్దర్శితేష్వం కురేషు" 33

'అసులభ మగు వస్తువుయొక్క ప్రార్థననుండి నివారింప శక్యము కాని ఈ నా మనస్సును ఇదివరకే మన్మథుడు పీడించుచున్నాడు. మలయ వాయు వుచే తొలగింపబడిన ఎండుటాకులు గల ఉపవనములందలి సహకారములు అంకురములను చూపిన పిమ్మట ఇంక నేమి చెప్పవలెను".

ఇంకను ఎట్లనగా-

"ఉద్భేదాభిముఖాంకురాః కురవకాః శైవాలజాలాకుల
ప్రాన్తం భాన్తి సరాంసి ఫేనపటలైః సీమన్తితాః సిన్ధవః
కిఞ్చాస్మిన్ సమయే కృశాంగి విలసత్కన్దర్పకోదండిక
క్రీడా భాఞ్జి భవన్తి సన్నతలతా కీర్ణాన్యరణ్యాన్యపి" 34

"కురవకముల అంకురములు ఉద్భిన్న మగుటకు అభిముఖముగ నున్నవి. తీరములు నాచుచే వ్యాకులముకాగా సరస్సులు ప్రకాశించుచున్నవి. నదులు నురుగుల సముదాయములచే పాపిడ తీర్చినట్లున్నవి. మరియు ఓ కృ శాంగీ! ఈ సమయమున దట్టమగు లతలతో నిండిన అరణ్యములు కూడ ప్రకా శించుచున్న మన్మథుని కోదండముల క్రీడగలవై అగుచున్నవి." (అరణ్య ములు కోదండమును ధరించిన మన్మథుని క్రీడా స్థానము లైనవని గాని లతలు మన్మథకోదండముల వలె ఉన్నవని గాని అభిప్రాయము) 34.3

వ్యా. ఈ విధముగ స్వాభావిక మగు సుందర వ్యవహారమునకు మూల భూత మగు పదార్థ స్వరూపమును చెప్పి దానిని ఉపసంహరించుచున్నాడు.

కా. శరీర మిదమర్థస్య రామణీయక నిర్భరమ్
ఉపాదేయతయా జ్ఞేయం కవీనాం వర్ణనాస్పదమ్. 9

'రామణీయకముతో నిండినదియు, కవులవర్ణనములకు స్థానభూతమును అగు, వస్తువుయొక్క ఈ శరీరము ఉపాదేయముగా తెలుసుకొనదగినది.' 9

వ్యా. అర్థస్య=వర్ణనీయ మగు వస్తువుయొక్క; ఈ శరీరము, ఉపాదేయతయా=గ్రాహ్యముగా, జ్ఞేయమ్=తెలుసుకొనదగినది. ఎట్టిది? రామణీయక నిర్భరమ్=సౌందర్యముతో నిండినది. అనగా దోషరహిత మగుటచే సహృదయావర్జక మని భావము. ఏలయనగా ఇదియే కవుల, వర్ణనాస్పదమ్=అభిధావ్యాపారమునకు గోచర మైనది. స్వరూప శోభాతిశయముతో ప్రకాశించుచున్న ఈ విధమగు వర్ణనీయ వస్తుశరీరమునకు అలంకారములు శోభాంతరమును (గౌణమగు శోభను) కూర్చును.

ఈ విషయమునే మరియొక ప్రకారముచేగూడ విచారించుచున్నాడు-

కా. ధర్మాది సాధనోపాయ పరిస్పన్ద నిబన్ధనమ్
వ్యవహారోచితాం చాన్యల్లభతే వర్ణనీయతామ్ 10

'ధర్మాదులను సాధించుటకు ఉపాయ మగు స్వభావము మూలకారణముగా కలదై వ్యవహారోచితమగు (చేతనా చేతనముల) మరియొక స్వరూపము గూడ వర్ణనీయత్వమును పొందును'.

వ్యా. చేతనా చేతన పదార్థముల ఈ విధ మగు మరి యొక స్వరూపము గూడ వర్ణనీయము, అనగా కవివ్యాపార విషయము అగును. ఎట్టిది? వ్యవహారోచితమ్=లోకవ్యవహారమునకు యోగ్యమైనది. ఎట్టి దగుచు? "ధర్మాదిసాధనోపాయ పరిస్పన్ద నిబన్ధనమ్"– ధర్మాదేః (ధర్మార్థ కామమోక్షరూప) చతుర్వర్గముయొక్క. సాధనే=సంపాదనమున ఉపాయ మగు ఏ, పరిస్పన్దః=తన విలసితము కలదో అదియే నిబంధనము (కారణముగా) కలదై.

దీని యభిప్రాయ మిది-కావ్యమున వర్ణింపబడు స్వరూపములుగల ప్రధాన చేతనములు మొదలగు సర్వపదార్థములను చతుర్వర్గమును సాధించుటకు ఉపాయభూతము లగు వాటి స్వభావమునకు ప్రాధాన్య మొసగుచు వర్ణింపవలెను. అ ప్రధానచేతనరూపము లగు పదార్థములు గూడ ధర్మాదులకు ఉపాయ

భూతము లగు వాటి స్వభావముల ప్రాధాన్యమును పురస్కరించుకొని మాత్రమే కవులచే వర్ణింపబడుచుండును. ఉదాహరణమునకు—శూద్రకుడు మొదలగు రాజుల యొక్కయు, శకనాసాది మంత్రులయొక్కయు చరితములు చతుర్వర్గానుష్ఠానోపదేశ పరములుగ మాత్రమే (కాదంబర్యాదులందు) వర్ణింపబడుచున్నవి. అప్రధానచేతనములగు హస్తిహరిణాదులస్వభావ సుందర మగు స్వరూపము, యుద్ధము, వేట మొదలగు వాటిలో అంగముగ వర్ణింపబడుట కూడ లక్ష్యములలో (కావ్యములలో) కానవచ్చుచున్నది. కావుననే అట్టి స్వరూపోల్లేఖ ప్రాధాన్యమును పురస్కరించుకొని కావ్యములకును, కావ్యోపకరణములకును, కవులకును, (క్రమముగ) చిత్రములతోడను, చిత్రోపకరణములతోడను, చిత్రకారులతోడను, సామ్యమును మొదటనే ప్రతిపాదించియున్నాము. కావున స్వభావ ప్రాధాన్యము చేతను, రస ప్రాధాన్యముచేతను రెండు ప్రకారములు కలదియు, సహజసౌకుమార్య సరసమును అగు ఈ విధమైన వర్ణనీయవస్తుస్వరూపము, శరీరము, మాత్రమే. (అనగా అలంకారము కాదు). ఇది అలంకార్యముగ మాత్రమే ఉండుటకు తగియున్నది. 9

అందు స్వాభావిక మగు పదార్థస్వరూపము అలంకారము కాజాలదను విషయము వెనుకనే ప్రతిపాదింపబడినది. ఇపుడు ప్రధాన చేతన స్వభావరూపమున వర్ణ్యమాన మగు రసాత్మక పదార్థస్వరూపమునకు ఇతరాలంకారికులంగీకరించిన అలంకారత్వమును నిరాకరించుచున్నాడు—

కా. అలంకారో న రసవత్ పరస్యాప్రతిభాసనాత్.
స్వరూపాదతిరిక్తస్య శబ్దార్థాసంగతే రపి.

అవ. అప్రధానచేతన ప్రధానచేతన పదార్థముల స్వభావ ప్రధాన స్వరూపము, రసప్రధాన స్వరూపము అనునవి కవి వర్ణనావిషయము లగును. వాటిలో పదార్థముల స్వాభావికస్వరూపము సర్వదా అలంకార్యమే కాని అలంకారము కాజాలదని వెనుక చెప్పబడినది. భామహాదులు రసభావాదులు ఇతర రసాదులకు అంగము లైనచో అవి రసవత్ప్రేయ ఊర్జస్విదిత్యాద్యలంకారము లగునని చెప్పి యున్నారు. కాని స్వభావము ఏవిధముగ అలంకారము కాజాలదో అట్లే రసము కూడ అలంకార్యమే కాని అలంకారము కాజాలదని కుంతకుని యభిప్రాయము. ఈ విషయమునే ఈ కారికలో వివరించుచున్నాడు—

'(వర్ణ్యమానవస్తు) స్వరూపముకంటె అతిరిక్తమగు మరి యొకటి ఏదియు భాసింపకపోవుట చేతను శబ్దార్థములకు సంగతి లేకుండుటచేతను, 'రసవత్' అనునది అలంకారము కాజాలదు"

వ్యా. "అలంకారో న రసవత్" 'రసవత్' అని (క్రొత్తగా) కల్పిత మగు ప్రతీతి గల తన్నామక మగు [రసవన్నామక మగు) ఏ అలంకారము కలదో, (ఏ అలంకారము ఉన్నదని చెప్పబడు చున్నదో), అది అలంకారము కాజా లదు. ఏ కారణము వలన? — 'స్వరూపాదతిరిక్తస్య పరస్యా ప్రతి భాసనాత్' వర్ణ్యమాన మగు వస్తువు యొక్క,యే, స్వరూపం = స్వకీయ మగు స్వభావము కలదో, దానికంటె, అతిరిక్తస్య = అత్యధికమగు మరి యొకటి ఏదియు భాసిం చుట లేదు కావున. దీని తాత్పర్యమిది-అలంకృతము లగు సత్కవివాక్యములలో ఇది అలంకారము అను విధమున అపోద్ధారము (విడిదీయుట) చే విహిత మగు భిన్నత్వము అందరి ప్రమాతల మానసము నందును స్ఫురించుచున్నది. ఇందు రసవదలంకార మున్నది, అని చెప్పెడు వాక్యమున, సావధానచిత్తముతో పరిశీ లించినను దానిని (అలకారాలంకార్యవిభాగమును) కొంచెమైనను కనుగొనజాల కున్నాము.

ప్రధానముగ వర్ణింపబడు శృంగారాదికమే అలంకార్య మన్నచో అపుడు తద్భిన్న మగు మరి యొక అలంకార మేదియో ఉండవలెను. లేదా వాటి (ప్రధానముగ వర్ణ్యమానములగు శృంగారాదుల) స్వరూపమే సహృదయాహ్లాద కారి యగుటచే అలంకార మని చెప్పినచో, అట్లైనను తద్భిన్న మగు మరి యొకటి ఏది యైనను అలంకార్యముగ చూపవలసి యుండును. కావున ప్రాచీనా లంకారికులకు అభిమత మగు రసవదలంకార లక్షణోదాహరణ భాగమున ఈ విధమగు వివేక మేదియు కొంచె మైనను చూడబడుటలేదు.

వి. భామహుడు 'రసవద్దర్శిత స్పష్ట శృంగారాది రసం యథా-' అనియు (III-6); ఉద్భటుడు 'రసవద్దర్శిత స్పష్ట శృంగారాది రసోదయమ్' (IV-4) అనియు, లక్షణములను చెప్పి యున్నారు. ఈ లక్షణములలో 'రసవద్దర్శిత స్పష్ట శృంగారాది' అను భాగము సమానము గాన కుంతకుడు ఈ ఇరువురి లక్షణములను ఖండించుచున్నా డని చెప్పవచ్చును. 'దర్శిత స్పష్ట' అను పాఠమునకు బదులు 'దర్శిత స్పృష్ట' అను పాఠము కూడ కుంతకునకు లభ్య

మగుటచే కాబోలు ఈ రెండు పాఠములను మనస్సులో నుంచుకొని ఈ వాక్యమునకు ఏ ఏ విధముల అర్థము చెప్పుటకు అవకాశ ముండునో వాటి నన్నిటిని కల్పించుకొని ఖండించుచున్నాడు.

వ్యా. "రసవద్దర్శిత స్పష్ట శృంగారాది" అని కదా రసవల్లక్షణము? ఇచట "చూపబడినవియు, స్పృశింపబడినవియు" నగు లేదా స్పష్టముగ చూపబడిన శృంగారాదులు దేనియందో అది (రసవత్) అని (విగ్రహము చెప్పి) వ్యాఖ్యానించినచో ఈ సమాసమునకు అర్థమైన కావ్యభిన్న మగు మరి యొక పదార్థ మేదియు కనబడుట లేదు. కావ్యమే ఈ అలంకారము అని చెప్పినచో అట్లు చెప్పుటలో గూడ సౌష్ఠవము స్పష్టముగ కానవచ్చుట లేదు. ఏలయన-కావ్యావయవము లగు శబ్దార్థములలో వేరు వేరు అలంకారము లున్నవి అని ప్రారంభించి ఇపుడు కావ్యమే అలంకారము అని చెప్పినచో ఉపక్రమోప సంహారములు విషమములగుటచే దోషము వాటిల్లును.

"దర్శితాః స్పష్టం శృంగారాదయః యత్ర" అను విగ్రహమును గాక, "దర్శితాః స్పష్టం శృంగారాదయః యేన" అను విగ్రహము (దేనిచే శృంగారాదులు స్పష్టముగ చూపబడుచున్నవో అది) చెప్పినను అది యేదియో చెప్పవలసి యుండును. అది (శృంగారాదులను స్పష్టముగ చూపునది) ప్రతిపాదన వైచిత్ర్యమే యన్నచో అదియు బాగుగ సమర్థింప వీలైనది గాదు. ఏలయన-ప్రతిపాద్యమాన మగు దాని శోభకు కారణభూత మగు ప్రతిపాదన వైచిత్ర్యము ప్రతిపాద్య మగు దానికంటె భిన్నమైనది గాన అదియే ప్రతిపాద్యము కాజాలదు.

వి. అనగా ప్రతిపాద్య మగునది ఏదియో ఒక వస్తువు. ఈ ప్రతిపాద్యము వేరు, ప్రతిపాదన వైచిత్ర్యము వేరు కావున ప్రతిపాద్యమునందు రసముండుటచే అది రసవత్తు కావచ్చునేమో కాని ప్రతిపాదన వైచిత్ర్యము రసవత్తు ఎట్లగును? దానియందు రసములేదు కదా యని అభిప్రాయము.

వ్యా. రసముల యొక్క స్పష్టముగ చూపబడిన ప్రతిపాదన వైచిత్ర్యమే రసవత్తు అని యన్నచో, అదియును సులభముగ ప్రతిపాదింప శక్య మగు పక్షము గాదు. శృంగారాదులను స్పష్టముగ చూపినచో శృంగారాది స్వరూపము

పరినిష్పన్న మైనట్లు పర్యవసన్న మగును. (అపుడు అది అలంకార మెట్లగును ?)

అవ. ఇపుడు 'రసవదలంకార' అను పదముయొక్క వ్యుత్పత్తిని విచారించుచున్నాడు మరియు రసవంత మగు కావ్యముయొక్క అలంకారము అని చెప్పినచో, ఆ కావ్యము రసవంతమై యుండ ఇది దానికి సంబంధించినది అని చెప్పుటకు ఏదియు కానవచ్చుటలేదు. (అనగా రసభిన్న మైన అలంకార మేదియు కానవచ్చుటలేదు). ఈ అలంకారము చేతనే ఆ కావ్యము రసవంత మైనది అని చెప్పినచో అపుడు ఇది రసవంత మగుదాని అలంకారము (రసవతః అలంకారః) కాక, రసము గల అలంకార మని (రసవాన్ అలంకారః) చెప్పినట్లైనది. అపుడా రసవదలంకార మాహాత్మ్యముచే కావ్యము కూడ 'రసవత్' కావలసివచ్చును.

లేదా "ఈతని కుమారుడు అగ్నిష్టోమయాజి కాగలడు" అని చెప్పినట్లు ఆ అలంకారము ద్వారా మాత్రమే రససంబంధమును పొంది రసవత్ అగు కావ్యముయొక్క అలంకారము గాన దానికి పిమ్మట రసవదలంకార నామధేయము లభించిన దని చెప్పినచో అదియు సరి యగు సమాధానము కాదు.

వి. 'అగ్నిష్టోమయాజీ' అను దానికి అగ్నిష్టోమముచే పూర్వము యాగము చేసినవాడు (అగ్నిష్టోమేన ఇష్టవాన్) అని యర్థము. 'భూతే' అను నధికారమున, 'కరణే యజః' అను సూత్రముచే 'ణిని' ప్రత్యయము చేర్చగా రూపము సిద్ధించినది. కావున పూర్వము అగ్నిష్టోమము చేసియున్న వానినే "అగ్నిష్టోమయాజి' అని యనవలెను గాని ఎప్పుడో భావికాలమున చేయనున్నవానిని అగ్నిష్టోమయాజి అనుటకు వీలులేదు. ఐనను కాల్పనిక భావిసంబంధముచే 'అగ్నిష్టోమయాజీ అస్య పుత్రః భవిష్యతి' ఇత్యాది ప్రయోగములు కానవచ్చుచున్నవి. అట్లే కావ్యము మొదట 'రసవత్' కాక పోయినను, ఈ అలంకార సంబంధముచే దానికి రససంబంధ మేర్పడి రసవత్ అయినది ఇపుడు రసవత్తు అగు కావ్యముయొక్క అలంకారము గాన ఈ అలంకారము రసవదలంకార మైనదని పూర్వపక్షి అభిప్రాయము.

ఏలయన — 'అగ్నిష్టోమయాజి' శబ్దమునకు మొదట భూతలక్షణ మగు విషయాంతరమున (అనగా-భూతకాలమున అగ్నిష్టోమము చేసిన ఒక వ్యక్తి

విషయమున) ఏ విధమగు అడ్డును లేక ప్రసిద్ధి యున్నది. కావున ఈ శబ్దము భవిష్యత్తునందు వాక్యార్థ సంబంధమును పొందుటకు యోగ్యత ఉన్నది గాన అట్టి సంబంధమును పొందుటకు సమర్థ మగుచున్నది. (అనగా ఈతడు మున్ముందు అగ్నిష్టోమయాగము చేసినవాడుగ' కాగలడు అని చెప్పుటలో దోష మేమియును లేదు). ఇచట ఆ విధముగ ప్రయోగించుటకు అవకాశము లేదు. ఏలయన—రసవంత మగు కావ్యముయొక్క అలంకారము అని చెప్పి నపుడు అట్టి కావ్యముతో సంబంధించినది కావుననే ఇది రసవదలంకార మగు చున్నది; ఈ అలంకారముతో సంబంధించుటచే కావ్యము రసవత్తు అగుచున్నది. కావున ఈ అన్యోన్యాశ్రయమును ఎవ్వరు తొలగింపగలరు?

అవ. 'రసవతః అలంకారః రసవదలంకారః' అను విగ్రహమున పూర్వము దోషము చూపబడినది. ఇపుడు 'రసః అస్య అస్తీతి రసవాన్, రస వాంశ్చాసౌ అలంకారశ్చ రసవదలంకారః' అను కర్మధారయము చెప్పవచ్చును కదా యని ఆశంకించి సమాధానము చెప్పుచున్నాడు.

వ్యా. లేదా 'రసము దేని కున్నదో అదియే అలంకార మగు గాక' అని అన్నచో అట్లైనను, అది అలంకారమైనను కావలెను లేదా కావ్యము కావలెను మూడవది మరియొక బేదియు ఇచట లేదు. ఆ రెండు పక్షములును నిరాకరింప బడినవి. ఉదాహరణము గూడ లక్షణముతో సమానమగు యోగక్షేమములు కలదగుటచే వేరుగ వికల్పింపబడుట లేదు. అనగా— లక్షణమున జూపిన దోషములన్నియు ఉదాహరణము నందు గూడ పట్టును గాన దానిని గూర్చి వేరుగ చెప్పుటలేదు. ఎట్లనగా :-

"మృతేతి ప్రేత్య సంగంతుం యయా మే మరణం స్మృతమ్
సైవావన్తీ మయా లబ్ధా కథమత్రైవ జన్మని" 36

"మరణించిన దని తలచి, నేను గూడ మరణించి ఎవ్వతెను కలుసు కొనవలె నని మరణమును స్మరించితినో (కోరితినో) ఆ వాసవదత్త నాకీ జన్మ మునందే ఎట్లు లభించినది?"

(దండి దీనిని కావ్యాదర్శమున రసవదలంకారమునకు ఉదాహరణముగా చూపినాడు. కా॰) ఇచట రతి పరిపుష్టిరూప మగు అనగా శృంగారరసరూప

మగు వర్ణనీయమునకు శరీరమయిన చిత్తవృత్తికంటె భిన్న మగు వస్తువు ఏది యును వేరుగ కానవచ్చుట లేదు. కావున రసాదులకు అలంకార్యత్వమే యుక్తి సంగతముగ నుండును.

అవ. ఉద్భటుడు కావ్యాలంకారసారసంగ్రహమున "రసవద్దర్శిత "స్పష్టశృంగారాది రసోదయమ్"అను రసవదలంకార లక్షణమును చెప్పి, దాని ఉత్తరార్ధమున 'స్వశబ్దస్థాయిసంచారి విభావాభినయాస్పదమ్' అని వ్రాసి యున్నాడు. స్వశబ్దములకును, అనగా శృంగారాది శబ్దములకును, స్థాయిభావ-సంచారిభావ - విభావ – అనుభావములకును గోచరమగునది యని దాని యభి ప్రాయము. దానిని ఖండించుచున్నాడు

వ్యా. కొందరు "స్వశబ్దస్థాయి సంచారి విభావాభినయాస్పదమ్" అనునది వెనుకటి లక్షణమునకే విశేషణముగా ప్రయోగించినారు. అందు రసములు స్వశబ్దవాచ్యము లగుట యనునది మా కిదివరకెన్నడును తెలియని విషయము. రససారముతో నిండిన చిత్తము గల, రసపరమార్థవేత్తలగు ఆ పండితులనే అడుగవలసియున్నది—స్వశబ్దాస్పద మగునవి రసములా లేక రసవదలంకారమా? మొదటి పక్షమున—రసింపబడునవి గాన రసములు; అవి స్వశబ్దాస్పదములై—అనగా—శృంగారాది శబ్దములలోనున్నవై తదభిజ్ఞులచే ఆస్వాదింపబడును. దీని తాత్పర్యమేమనగా—రసములు స్వశబ్దములచే చెప్పబడుచు, శ్రవణపథమున ప్రవేశించి, చేతనులకు చర్వణచమత్కారమును కలిగించును! కావున ఈ న్యాయముచే నేతి మిఠాయి మొదలగు పదార్థములు గూడ, వాటి పేరు చెప్ప గనే వినువారికి ఆస్వాదము కలిగించవలెను; ఈ విధముగ ఉదారచరితులగు వారు (ఉద్భటాదులు) ఎవ్వరైన సుఖోపభోగములను కోరువాడున్నచో వానికి అప్రయత్నముగ, పేరు చెప్పిన మాత్రముననే త్రైలోక్యరాజ్యసంపదవలన కలిగెడు సౌఖ్యసమృద్ధిని సంపాదించిపెట్టినారు; వారికొక నమస్కారము;

అవ. రసము శబ్దాశ్లిష్ట మను విషయమును ఖండించి రసవత్తు శబ్దాస్పదము అను రెండవ మతమును ఖండించుచున్నాడు.

వ్యా. రసవత్తు శబ్దమునకు ఆస్పద మగునని చెప్పుట యుక్తము కాదు. శృంగారాది శబ్దవాచ్యమే యైనను రసమే శబ్దాస్పదము కానిచో తద్భిన్న మగు

రసవత్తు కాదని వేరుగ చెప్పవలెనా? రసవత్తుకు అలంకారత్వము గూడ మొద టనే నిషేధింపబడినది. స్థాయి మొదలగు మిగిలినది గూడ ('స్వశబ్దస్థాయి సంచారి విభావాభినయాస్పదమ్' అను శ్లోకార్ధమున చెప్పినది) పూర్వలక్షణ వాఖ్యామునకు గావున మరల దానిని గూర్చి పర్యాలోచించుట లేదు.

వి. అనగా—'స్వశబ్దస్థాయి' ఇత్యాది శ్లోకార్థమున చెప్పిన రసము స్వశబ్దాస్పద మను విషయము అయుక్తము గాన అది దూషింపబడినది. స్థాయి సంచారి-విభావ-అనుభావాస్పదత్వము పూర్వార్ధోక్తరసలక్షణమే గాన దానిని గూర్చి విస్తృతముగ చెప్పుట లేదని యర్థము.

అవ. కావ్యాదర్శమున రసవదలంకారమునకు 'రసవద్రస పేశలం' అను లక్షణము చెప్పబడినది. ఇచట కుంతకుడు వ్రాయు విధానమును బట్టి చూడగా 'రసవద్రస సంశ్రయాత్' అను పాఠము కూడ ఉన్నట్లు తోచు చున్నది. మొదట రెండవ పాఠమును ఖండించుచున్నాడు.

వ్యా కొందరు 'రసవద్రస సంశ్రయాత్' (రససంశ్రయమువలన రసవ దలంకారము) అను లక్షణమును చెప్పిరి అది కూడ సమర్థనార్హము కాదు. ఏలయన-రసము దేనికి ఆశ్రయమో అది రససంశ్రయము ఆ కారణమువలన ఇది రసవదలంకార మగును. అట్లైనను రసవ్యతిరిక్త మగు ఈ పదార్థ మేదియో చెప్పవలసి యున్నది. అది కావ్యమే యన్నచో అది వెనుకనే నిరాకరింపబడినది. (తన భుజములపై తానే ఎక్కజాలనట్లు) తనయందు తానే క్రియనుచేయుట విరుద్ధము గాన, ఆ కావ్యము (అలంకార్యమగుటచే) అలంకారము కాజాలదు. లేదా 'రసమునకు సంశ్రయము', అనగా రసముచే ఏది ఆశ్రయింపబడునో, అట్టి రససంశ్రయమువలన అని చెప్పినచో అట్లైనను అదియేదియో వేరుగ నున్నట్లు చెప్పవలసి యున్నది. ఈ లక్షణముయొక్క ఉదాహరణసముదాయము గూడ పూర్వోదాహరణములతో సమానయోగక్షేమమే గాన దానిని గూర్చి వేరుగ ఆలోచింప బనిలేదు, "రసపేశలమ్" అను పాఠమును అంగీకరించినను ఇందు విశేషమేదియును లేదు[1]

---

[1] ఇక్కడనుండి అనేక స్థలములలో మూలము త్రుటితమైనది. త్రుటి యున్న చోట్ల అచటి వాక్యములను కేవలము ఊహించుకొని, వీలున్నచోట్ల అనువాద మీయ బడినది

అట్లు కాక... రసప్రతిపాదకములగు వాక్యములలోనున్న పదార్థరూప మగు అలంకార్యము రసస్వరూపానుప్రవేశముచే, తొలగిపోయిన తమ సహజ స్వభావముగల (వృక్షాద) ద్రవ్యముల స్వరూపము (వసంతాగమనాదులచే) వలె సుందరముగ నుండును అన్నచో అదియును యుక్తము కాదు. వాక్యార్థ జీవిత మగునది (రసము,) అలంకారమెట్లగును? ఆ విధముగ అంగీకరించినను ప్రధాన గుణభావమునకు విపర్యాసము (అనగా ప్రధానమగురసమునకు అప్రాధాన్యము, అప్రధాన మగు వాక్యార్థమునకు ప్రాధాన్యము) పర్యవసన్న మగును గాన ఈ మతము నిస్సారము

అవ. 1 వ కారికలోని పూర్వార్థమును వ్యాఖ్యానించి ఇపుడు 'శబ్దార్థా సంగతేరపి' అను పదముల అర్థము వివరించుచున్నాడు.

వ్యా. ఇచటనే మరియొక దోషమును గూడ చెప్పుటకు ఉపక్రమించు చున్నాడు. "శబ్దార్థాసంగతేరపి'. శబ్దార్థయోః = శబ్దార్థములయొక్క, సమన్వ యము గూడ కుదరదు గాన రసవదలంకారోపపత్తి లేదు. ఇచట—"రసః = రసము యస్య = దేనికి విద్యతే = ఉన్నదో" అను నర్థమున మత్ప్రత్యయ మును చేర్చి 'దానియొక్క అలంకారము' అని షష్ఠీసమాసము చేయవలెను. లేదా—'రసవాంశ్చాసౌ అలంకారశ్చ' అను విశేషణపూర్వపదకర్మధారయ సమాసము చెప్పవలెను. అందు మొదటి పక్షమున దేనికి ఇది అలంకారమో అట్టి రసవ్యతిరిక్త మగు మరి యొక పదార్థ మేమి యున్నది? అది కావ్యమే యన్నచో, అట్లు చెప్పినను, రసవదలంకార నామధేయము సావకాశ మగుటకు ఆ పదార్థాంతరమేమి యున్నది? (అనగా రసము కల 'రసవత్తు' కావ్యము. దాని యలంకారము రసవదలంకారము గాన అది యేదియో రసవత్తగు కావ్యము. కంటెను, రసముకంటెను, భిన్నమైన దని అర్థమగుచున్నది. అట్టి పదార్థ మిచట ఏమి యున్నది అని అభిప్రాయము". ('రసవాంశ్చాసౌ అలంకారశ్చ' అను విశేషణ సమాసమును గ్రహించిన పక్షమున గూడ, విశేషము అనగా (రసముకంటె) అతిరిక్త మగు పదార్థ మేదియు కానవచ్చుట లేదు. అట్టి ఏదైన ఉన్ననే కదా అది రసము గల అలంకారము అని చెప్పుటకు అవకాశ ముండుట. ఈ విధముగ, ఈ చెప్పిన మార్గమున, (భామహదండ్యాదులు చెప్పిన మార్గమున) 'రసవదలంకార' శబ్దమున శబ్దార్థసంగతి ఏ మాత్రమున్ను లేదు.

అవ. ధ్వన్యాలోకకారుడు- "వాక్యార్థము ప్రధానముగా నుండి, దానికి రసాదులు అంగముగ నున్నచో అచట రసాద్యలంకారములు" అని చెప్పి మూడు ఉదాహరణములను చూపి యున్నాడు. కుంతకుడు అందు రెండు ఉదాహరణములను చూపుచు, వాటిని పరిశీలించి చూచినను రసవదలంకార మను పేరులో శబ్దార్థసంగతిలేదని చెప్పుచున్నాడు-

వ్యా. మరియొక విధమగు ఉదాహరణమును చూపి దానిని బట్టి ఈ రెండు సమాసములందును శబ్దార్థసంగతి యున్నదని చెప్పినచో; ఎట్లనగా-

"తన్వీ మేఘజలార్ద్రపల్లవతయా ధౌతాధరేవాశ్రుభిః
శూన్యేవాభరణైః స్వకాలవిరహాద్విశ్రాన్తపుష్పోద్గమా.
చిన్తామానమివాస్థితా మధుకృతాం శబ్దైర్వినా లక్ష్యతే
చండీ మామవధూయ పాదపతితం జాతానుతాపేవ సా" 40

"సన్ననైనదియు, మేఘజలములచే తడసిని చిగుళ్ళు కలదగుటచే కన్నీళ్ళచే కడిగి వేయబడిన అధరముకలది వలె నున్నదియు, పుష్పించు కాలము కాకపోవుటచే పుష్పోద్గమరహితయై ఆభరణవిహీన వలె ఉన్నదియు, తుమ్మెదల శబ్దము లేకుండుటచే, చింతచే మౌనము వహించినది వలె ఉన్నదియు నగు ఈ లత పాదములపై బడిన నన్ను తిరస్కరించి పశ్చాత్తప్తయగు, ఆ కోపస్వభావయైన ఊర్వశి వలె నున్నది"

ఇంకను ఎట్లనగా-

"తరంగభ్రూభంగా క్షుభితవిహగశ్రేణిరశనా
వికర్షంతీ ఫేనం వసనమివ సంరంభశిథిలమ్.
యథా విద్ధం యాతి స్ఖలితమభిసన్ధాయ బహుశో
నదీభావేనేయం ధ్రువమసహనా సా పరిణతా". 41

"తరంగము లనెడు కనుబొమ్మల విరుపులు కలదియు, అలజడి చేయుచున్న పక్షిపంక్తులే వడ్డాణము కలదియు, తొందరలో జారిపోయిన వస్త్రమువలె నున్న నురుగును లాగికొని పోవుచున్నదియు అగు ఈ నది తొట్రుపడుచు ప్రయాణము చేయుట చూడగా-, అనేకపర్యాయములు నే చేసిన అపకారములను స్మరించుచు ఆ కోపశీలురాలే తప్పక ఈ నదీరూపమున మారిపోయినది."

ఇచట రసవత్త్వము అలంకారము గూడ స్పష్టముగ భాసించుచున్నవి కావున ఏ విధముననను వాటి భేదము గుర్తింప శక్యము కాకుండుట లేదు. కావున "రసవతః అలంకారః రసవదలంకారః' అను షష్ఠీతత్పురుషపక్షమున శబ్దార్థములకు అసంగతి ఏదియును లేదు.

వి. అనగా పై శ్లోకములలో లతానదీరూపము లగు వస్తువులును, తద్వర్ణనా సంబద్ధ మగు శృంగారమును స్పష్టముగ భాసించుచున్నవి. మొదటి శ్లోకమున నాయికా సాదృశ్య ప్రతిపాదనముచే ఉపమయు, రెండవ శ్లోకమున నాయికాత్వారోపముచే రూపకమును, రసము కంటె వేరుగ కనబడుచున్నవి; కావున రసము గల లతానదీరూపవస్తువులయొక్క అలంకారము అను నర్థమున ఇచట రసవదలంకార మని చెప్పవచ్చును కదా యని యభిప్రాయము.

వ్యా. ఇచట అలంకారము రసపరిపుష్టికై ఉద్దిష్ట మైనది గాన దానిని బట్టి అలంకారము రసవత్తు అనవచ్చును. కావున 'రసవాంశ్చాసౌ అలంకారశ్చ' అను కర్మధారయసమాసము చెప్పినను, (అసంగతత్వ మేదియును లేదు). ఈ విధముగ ఈ రెండు ఉదాహరణమందును లతయు, నదియు ఉద్దీపనవిభావము లగుటచే ప్రేయసీ భావనాభావితాంతః కరణుడై సకల మగు నిశ్చేతన పదార్థమును గూడ ప్రేయసీమయముగ చూచుచున్న నాయకుడు (లతయందు) తత్సామ్యము నారోపించుటయు, (నదియందు) తద్ధర్మముల నారోపించుటయు అనునది ఉపమారూపకము లనెడు కావ్యాలంకారములను కూర్చకుండగ మఱి యే ప్రకారమునను కుదరదు. ఏలయన ఈ వాక్యములు (పై రెండు శ్లోకములును) వాటి (ఉపమారూపకముల) లక్షణములు కలవిగ నున్నవి. (కావున రసవదలంకారమును పై రెండుదాహరణములలో అంగీకరించుటలో దోష మేదియు లేదని యభిప్రాయము).

అవ. ఇప్పుడీ పూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నాడు.

వ్యా. ఇది సత్యమే కాని విశేషణసమాసపక్షమున 'అలంకార' శబ్దము లేకుండగా కేవలము 'రసవాన్' అని ప్రయోగింపవలసి యుండును. (అనగా రసవదలంకారము అని చెప్పినచో రసమునకు ప్రాధాన్యముండదు, అలంకారమునకే ప్రాధాన్యముండును. కావున "రసవత్ కావ్యమ్" అనుట యుక్తము కాని రసవదలంకారము కలది కావ్యము అనుట యుక్తము కాదు). అలంకారము

రసము కలది అను ప్రతీతిని అంగీకరించినచో, అదియు యుక్తము కాదు. (ఇచట గ్రంథపాతముండుటచే సిద్ధాంతి సమాధాన మేదియో తెలియరాదు. ఈ విధముగ మున్ముందు అనేక స్థలములందు గ్రంథపాతములు కనబడుచున్నవి).

"రసవతః అలంకారః"—రసముకలదానియొక్క అలంకారము అనెడు షష్ఠీసమాసమునకు గూడ సమన్వయము స్పష్టముగ కుదరదు. ఏలయన- ఏదైనను కావ్య మని చెప్పవలె నన్నచో దానియందు రసముండవలెను. దాని అతిశయమును బట్టియే ఆ విధమగు సహృదయ హృదయానందకారి యగు కావ్యము రచింపబడుచుండును. కావున ఆ కావ్యముయొక్క అలంకారము అను నర్థమును గ్రహించినచో రూపకాద్యలంకారము లన్నియు రసవదలంకారము లని చెప్పవలసి యుండును. అట్లే అలంకారము లన్నియు రసవంతములే గాన విశేషణసమాసపక్షమునందు గూడ (రసవాంశ్చాసౌ అలంకారశ్చ అని చెప్పుపక్షమున గూడ) ఇదే విషయము (అనగా రూపకాదు లన్నియు రసవదలంకారములు కావలసివచ్చును).

మరియు ఇట్లు (అన్ని అలంకారములును రసవత్తులే అని) అంగీకరించినచో ప్రత్యేకముగ అన్యూనానతిరిక్తము లగు లక్షణములను చెప్పుటచే పరిపుష్టములై సిద్ధించిన అలంకారములకు వాటి వాటికి చెందిన ప్రత్యేకలక్షణములలో చెప్పిన అతిశయముకంటె భిన్న మగు అతిశయ మొకటి దీనిచే (రసవదలంకారత్వముచే) చేర్చబడుచున్నట్లు అంగీకరించినట్లయినది. కావున వాటికి వేరు లక్షణములను చెప్పుట అనావశ్యకమే యగును. (అనగా-అన్ని అలంకారములును రసవదలంకారములే గాన ఆ రసవదలంకార లక్షణము మాత్రమే చెప్పిన చాలును గాన తదితర రూపకోపమాది లక్షణనిర్మాణము అనావశ్యక మని చెప్పవలసి యుండును).

మరియు ఇట్టి విషయమునందు (రూపకాద్యలంకారస్థానమునందు) రసవదలంకార మున్నదని వ్యవహరించుటకు అవకాశము లేదు. అలంకారశాస్త్రజ్ఞులు ఆ విధముగనే (రసవదలంకారము లేని స్థలముగానే) గ్రహించియున్నారు. అట్టి స్థలములలో రూపకాద్యలంకారములే ప్రధానముగనున్నవి. అంతియే కాని రసవదలంకారము కాదు.

అవ. ఉపమాద్యలంకారములకును రసవదలంకారమునకును విషయవిభాగమును ఒక విధముగ చేయవచ్చు, నని ఆశంకించుకొని పరిహరించుచున్నాడు-

లేదా రసవదలంకారము చేతన పదార్థవిషయక మనియు (అనగా చేతన పదార్థములను వర్ణించు స్థలమున రసవదలంకార మనియు) ఉపమాదులు నిశ్చేతనపదార్థవిషయకము లనియు (నిశ్చేతనపదార్థములను వర్ణించునెడ ఉపమాదుల నంగీకరింప వచ్చు ననియు) విషయవిభాగము చేసినచో అదియు విద్వజ్జనావర్జకము కాదు. ఏలయన — అచేతనపదార్థములు కూడ రసోద్దీపనసామర్థ్యముతో సముచితమును సత్కవివర్ణితమును అగు సౌకుమార్యముచే సరసము లగును గాన (అచట గూడ రసవదలంకారమున కవకాశ ముండును గాన) ఉపమాదులకు విషయమే (అవకాశమే) లేకపోవును, లేదా అత్యల్పస్థలములలో మాత్రమే అవకాశముండవలసి వచ్చును. (అచేతన పదార్థములకు ఏ విధముగను రససంబంధము ఉండ దన్నచో) శృంగారాది రసనిష్యందసుందర మగు సత్కవిప్రవాహము అంతయు నీరసము కావలసి వచ్చును. ఈ విషయమును (ఆనందవర్ధనాది) పూర్వపండితులు ప్రతిపాదించియే యున్నారు.

వి. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకద్వితీయోద్ద్యోతమున-"ప్రధానేఽన్యత్ర వాక్యార్థే యత్రాఙ్గంతు రసాదయః కావ్యే తస్మిన్నలఙ్కారో రసాదిరితి మే మతిః" అను కారికావ్యాఖ్యానమున, రసాదులు ప్రధాన వాక్యార్థముగ నున్నపుడు అది రసాదిధ్వని యగును గాన దానికి ఉపమాదులు అలంకారము లగుననియు, వస్త్వాదికము ప్రధాన వాక్యార్థమై రసాదికము అప్రధానమైనపుడు రసాదికమే అలంకార మగుననియు సోపపత్తికముగ నిర్ణయించి, చేతనములు వర్ణితములైనపుడు రసవదాద్యలంకారములును, అచేతనములు వర్ణితములైనపుడు ఉపమాద్యలంకారములును అని అంగీకరింపవచ్చును కదా అని ఆశంకించుకొని పైన చూపిన సమాధానమును చెప్పినాడు. దానినే కుంతకుడు ఇచట "ప్రతిపాదితమేవ పూర్వసూరిభిః" అని ఉట్టంకించినాడు.

అవ. ఇపుడు ధ్వన్యాలోకకారుడు రసవదలంకారమునకు చూపిన లక్ష్యములను పరిశీలించి విమర్శించుచున్నాడు. మరి యొక వాక్యార్థ మేదైన ప్రధానముగ నుండి దానికి రసాదులు అంగములుగ నున్నపుడు రసవదాద్యలంకారము అని చెప్పి, ఆనందవర్ధనుడు, ఈ రసవదాద్యలంకారములు శుద్ధములు గాని లేక

అలంకారాంతరసంకీర్ణములు గాని కావచ్చునని విభజించి, అందు మొదటి భేదమునకు 'కింహాస్యేన' ఇత్యాది శ్లోకమును, సంకీర్ణరసవదలంకారమునకు "క్షిప్తో హస్తా వలగ్నః" ఇత్యాది శ్లోకమును ఉదాహరణముగ చూపెను. ఈ శ్లోకములు చాటురూపములు. చాటు వనగా వర్ణ్యమాన నృపాది ప్రభావాదిరూపముగు, శ్లాఘాస్పదమైన విషయము. వీటిలో వర్ణ్యమాన త్రిపురారి-రాజాదిప్రభావము ప్రధాన వాక్యార్థము గాన రసాదులు దానికి అంగముగ నుండుటచే రసవదలంకార మని అనందవర్ధనుని యభిప్రాయము. కాని కుంతకు డీ యుదాహరణములు కూడ అసంగతములే యని చెప్పుచున్నాడు.

(పూర్వపక్షము) "ఏ కావ్యమునందు ప్రధానముగ నున్న మరియొక వాక్యార్థమున రసాదులు అంగముగ నుండునో ఆ కావ్యమున రసవదాద్యలంకారములు" అని ఆ యభియుక్తులే (అనందవర్ధనుడు) చెప్పిన విధముగ వైచిత్ర్యాంతరముచే రసవదలంకారము మనోహరముగ నుండును అని చెప్పవచ్చును. అనగా ఎచట మరి యొక వాక్యార్థము ప్రధాన మగుటచే అలంకార్యముగ నుండి, దానికి అంగముగ ఉపనిబద్ధ మగు శృంగారాదికము అలంకారముగ నుండునో (అచట రసవదాద్యలంకారములు). ఏలయన ఇట్టిస్థలములలో ఏది అలంకారము, ఏది అలంకార్యము అనెడు విభాగము గుణప్రధానభావమునై ఆధారపడి యుండును కదా? ఎట్లనగా —

'క్షిప్తోహస్తావలగ్నః' మొ. ఇది అమరు శతక ప్రారంభమునందలి మంగళశ్లోకము (చూ.I-60) ఇందు కవి త్రిపురాసురకామినుల సమీపము చేరబోనున్న శంభుబాణనిర్గతాగ్నిని కామునితో పోల్చి వర్ణించుచున్నాడు. 'చేతిని ముట్టినప్పుడు కన్నీళ్లతో నిండిన నేత్రోత్పలములు గల త్రిపుర కామినులచే విదల్చుకొన బడినట్టియు, గట్టిగ విసరికొట్టినను వస్త్రాంతమును గ్రహించునట్టియు, కేశములను గ్రహించునపుడు తొలగించుకొన బడినట్టియు, కాళ్ళమీద పడినపుడు తొందరలో చూడబడనట్టియు, ఆలింగనము చేసికొనబోయి తిరస్కృతమైనదియునగు, క్రొత్తగ అపరాధముచేసిన కాముకుడు వలె నున్న శంభుశరాగ్ని మిమ్ములను రక్షించుగాక".

వి. ఇచట శివుని ప్రభావాతిశయమును వర్ణించుట కవియొక్క ప్రధానాశయము. శంభుశరాగ్నిచే త్రిపురయువతులకు కలిగిన కష్టదశ ఇందు వర్ణిత

మగుటచే కరుణరసము, శ్లేషాలంకారసహిత మగు ఈర్ష్యావిప్రలంభమును శివప్రభావాతిశయపోషకములుగ నున్న వి. కావున అవి అంగములు. ఈ విధముగ నిచట కరుణవిప్రలంభములు వాక్యార్థాంతరమున కంగము లుగ ఉపనిబద్ధములు గాన ఇది రసవదలంకారమున కుదాహరణము. శ్లేష కూడ ఉన్నది గాని ఇది అలంకారాంతరమిశ్రము అని ఆనందవర్ధనుని యభి ప్రాయము.

ఇపుడీ మతమును ఖండించుచు ఇచట ఈర్ష్యావిప్రలంభమునకు ప్రతీతియే లేదని చెప్పుచున్నాడు-

కాముకుడును, శరాగ్నితేజస్సును, సమానశబ్దవాచ్యములైనంత మాత్ర మున విరుద్ధస్వభావములు గల ఆ రెండిటికిని ఏకత్వము గాని, ఆ విధముగ విరుద్ధములగు ఒక దాని ధర్మములను మరి యొకదానియందు అధ్యసించుట (ఆరోపించుట) గాని ఏ విధముగను సమర్థింప శక్యముకాదు. పరమేశ్వరుడు ప్రయత్నించినను వస్తుస్వభావమును మార్చుట శక్యము కాదు కదా! ఆ విధ మగు సమానశబ్దవాచ్యతామాత్రముచే (ఒక్క శబ్దముచే బోధ్యమైనంత మాత్ర మున) సహృదయులకు తదనుభవము (ఐక్యానుభవము) ఇచట కలుగుట లేదు. (అనగా సమాన శబ్దవాచ్యమైనంత మాత్రమున ఇచట కాముకవృత్తాం తానుభవము, ఈర్ష్యావిప్రలంభప్రతీతి కలుగుట లేదు.) అట్లైనచో శబ్దమాత్రము ననే తాదృశానుభవము కలుగు నన్నచో 'ప్రతివిష' మొదలగు దానికి గూడ గుడ ఖండ మని పేరుపెట్టినంతమాత్రమున మాధుర్యాస్వాదము కలుగవలెను. ("ప్రతి విష" అనగా అతివస అను ఒక ఓషధి. ఇది చేదుగా ఉండును. దానికేదియో శబ్దసాధర్మ్యముచే గుడఖండ మని పేరుపెట్టినంతమాత్రమున కటుత్వము పోయి మాధుర్యమెట్లు రాదో ఇచట శబ్దమాత్రముచే ఈర్ష్యా విప్రలంభప్రతీతి కలుగదని గాభిప్రాయము.) ఏమైనను ఈర్ష్యావిప్రలంభప్రతీతి కలుగును అని అంగీకరించినచో రెండురసముల సమావేశము (ఒక శ్లోకమున విరుద్ధము లగు కరుణేర్ష్యావిప్రలంభములను కూర్చుట) అనెడు దోషము అనివార్యమగును.

వ్యా. భగవత్ప్రభావము ముఖ్యవాక్యార్థము గాన దానికి ఈ రెండును (కరుణేర్ష్యావిప్రలంభములు) అంగములుగ నుండి అలంకారము లగుచున్నవి అని చెప్పుట గూడ యుక్తము కాదు. ఏలయన (కామిశరాగ్నులకు సామ్యము

చెప్పవలె నన్నచో దాని) కారణము వాస్తవమై యుండవలెను. (ఈ మూల వాక్యము అసంపూర్ణముగ నున్నట్లు కనబడుచున్నది.) అట్టి కారణమేదియు లేదు కావుననే ఆ రెండింటికిని, భావపదార్థ అభావపదార్థములకు వలె ఏవిధముగను సామ్యము ఉపపన్నము కాదు. ఇక అనుచితవిషయమును చర్వణచేయుటలో చాతుర్యమును చూపుటకై చాపల్యము చాలును.

అవ. "కిం హాస్యేన" ఇత్యాదిశ్లోకమును శుద్ధరసవదలంకారమునకుదాహరణముగ జూపి ఆనందవర్ధనుడు- ఇందు శుద్ధ మగు కరుణరసమురాజస్తుతికి అంగముగాన రసవదలంకార మని లక్షణసమన్వయము చేసినాడు. దీనిని ఖండించుచున్నాడు.

ఈ ("క్షిప్తోహస్తావలగ్నః" ఇత్యాది) ఉదాహరణముతో సంతృప్తి చెందక, తాము చెప్పిన లక్షణమునకు ఉదాహరణమునందు బాగుగ సంగతిని కోరుచు, ఓర్పుతో, (ఆనంద వర్ధనాదులు) రసవదలంకారమునకు మరి యొక ఉదాహరణమును చూపి వ్యాఖ్యానించిరి. ఎట్లనగా-

"కిం హాస్యేన న మే ప్రహాస్యసి పునః ప్రాప్తశ్చిరాద్ దర్శనం
కేయం నిష్కరుణ ప్రవాసరుచితా కేనాసి దూరీకృతః।
స్వప్నాన్తేష్వితి తే వదన్ ప్రియతమవ్యాసక్తకంఠగ్రహో
బుద్ధ్వా రోదితి రిక్తబాహువలయస్తారం రిపుస్త్రీజనః" 44

(ఈ శ్లోకమున కవి రాజును స్తుతించు చున్నాడు. నీవు రణరంగమున శత్రురాజులను సంహరింపగా వారి స్త్రీలు స్వప్నమునందు తమ పతులను జూచి, వారి కంఠములను బాహుపాశములచే బంధించి ఇట్లను చున్నారు.)

"ఓ కరుణా విహీనా! ఏల ఈ విధముగ పరియాచకము లాడెదవు? చాలకాలమునకు నా కంట బడితివి. ఇక నీవెచ్చటికిని పోవలదు? ప్రవాసమునకు పోవుటలో నీ కింత అభిరుచి ఏల? నిన్నీ విధముగ దూరము చేసిన వారెవరు? నీ శత్రుస్త్రీజనము ఈ విధముగ స్వప్నాంతములందు ప్రియతముని కంఠము నందు బాహుపాశముంచి పల్కుచు, మేల్కొని బాహువలయము శూన్యముగ నుండుటచే బిగ్గరగ ఏడ్చుచున్నది".

ఇపుడు కుంతకుడు ఆనందవర్ధనుని యభిప్రాయము అనువదించి ఖండించుచున్నాడు.[1]

ఇచట ప్రధానతాత్పర్యము ననుసరించి- నీ శత్రువిలాసినీ సమూహము నీవు వారి వల్లభులను చంపివేయుటచే శోకావేశము వలన శరణు లేనిదై కరుణ రసపరాకాష్ఠనధిరోహించుటచే నేర్పడిన ఈ విధ మగు దుఃఖము అనుభవించుచున్నది, అని వాక్యార్థము. ఈ వాక్యార్థమునకు అంగముగా కూర్పబడిన ప్రవాసవిప్రలంభ శృంగారము మాత్రము అర్థము- అర్థాత్సిద్ధము. ఇది పరస్పరాన్వితము లగు పదార్థముల సముదాయముచే సమర్పిత మగుచు (అనగా పార్ష్ఠికాన్వయసిద్ధ మగుచు) అప్రధానరూపమున భాసించుట వలన అలంకార మని చెప్పబడుచున్నది. (ఈ విధముగ ప్రవాసవిప్రలంభశృంగారమునకు విషయ మున్నది గాన) అది నిర్విషయము కాదు గాన (తత్ప్రియుక్త మగు) రస వదలంకారమునకు ఆలంబన విభావము మొదలగు స్వకారణ సామగ్రి లేకపోవుటచే ఏర్పడిన లక్షణానుపపత్తి యనునది లేదు.

అవ. "క్షిప్తోహస్తావలగ్నః" ఇత్యాది శ్లోకమున ఈర్ష్యావిప్రలంభకరుణముల సమావేశము దుష్ట మని చెప్పబడినది ఇచటగూడ "నీ శత్రుస్త్రీలు కరుణరస కాష్ఠాధిరూఢికృతమగు ఇట్టి దుఃఖము ననుభవించుచున్నారు" అనునది ప్రధాన వాక్యార్థ మని చెప్పుటచే కరుణరస మున్నట్లును ఇపుడు చెప్పిన విధముగ అర్థ మగు ప్రవాసవిప్రలంభము ఉన్నట్లును తేలినదికదా। కావున ఇచట గూడ రసద్వయసమావేశదోష మున్నది కదా యని ఆశంకించుకొని చెప్పుచున్నాడు-

రెండు (విరుద్ధ) రసముల సమావేశముచే కల్గిన దుష్టత్వము కూడ దూరాపాస్త మైనది. ఈ రెండు రసములకును సంబంధించిన వాస్తవస్వరూపము (వేరువేరుగ) ఉన్నది గాన అవి (స్పష్టముగ) ప్రతీయమానము లగుచున్నపుడు

[1] వాస్తవమున ఆనందవర్ధనుడు ఈ శ్లోకమున- కవిగతరాజవిషయక ప్రీతికి కరుణ రసము అంగము గాన రసవదలంకారము అని అంతమాత్రమే చెప్పినాడు. ప్రవాసవిప్రలంభము కరుణాంగము అని అతని యభిప్రాయము. ఇట్లుండ ఇచట కుంతకుడు చెప్పిన దంతయు స్వకపోల కల్పితమో లేక ధ్వన్యాలోకప్రాచీనప్రతులలో గాని మరి ఇతర గ్రంథములలో గాని ఉన్నదో తెలియదు. లభ్యమగు పాఠము అస్తవ్యస్తముగ నుండుటచే కుంతకుడేమి చెప్పదలచినాడో అను విషయము కూడ స్పష్టముగ తెలియుటలేదు.

విరోధ మేమి ఉన్నది? పరస్పరముతో స్పర్ధ లేదు కదా? ఇచట కరుణరసమే ప్రధానముగ నున్నది అని నిశ్చముగ చెప్పుటకు తగిన ప్రమాణములేదుగాన అది (విప్రలంభశృంగారకృత రసవదలంకారము) గూడ సహృదయాహ్లాదకర విధానసామర్థ్యముచే సుందరముగ నున్నది.

అవ. ఈ శ్లోకమున ప్రవాసవిప్రలంభమే ప్రధాన మనియు, అదియే ప్రథమప్రతీత మగుచున్న దనియు ఏల యంగీకరింపరాదు? అట్లంగీకరించినచో కరుణరసమునకే అవకాశముండదు గాన రసద్వయసమావేశము యుక్తమా అయుక్తమా అనెడు విమర్శ కూడ అనావశ్యక మగును అని ఆశంకించుకొని ఇచట విప్రలంభశృంగారస్థితి యుక్తిసాధ్యము. కరుణ మన్నచో సహజముగ ప్రతీత మగుచున్నది. కావున విప్రలంభమునకు ప్రథమతరప్రతీతి అంగీకరింప శక్యము కాదని చెప్పుచున్నాడు—

వ్యా. ప్రవాసవిప్రలంభము తనకు కారణభూత మైన (వైరి వనితా) వాక్యములలో నున్న (స్వప్నదృష్టప్రియరూప) ఆలంబన విభావముచే సమర్థింపబడుటయు, స్వప్నమునందు మాత్రమే, అది ఆ విధముగ నుండుటయు (అనగా విప్రలంభశృంగారము భాసించుటయు) అనునవి యుక్తిచేతనే సంభావ్యము అగుచున్నవి. దానికి (కరుణరసమునకు) ఆ ఉభయమును (అనగా స్వకారణభూతవాక్యోపారూఢాలంబన విభావాది సమర్ప్యమాణత్వము, శ్రోతలకు వైరిమరణము తెలియును గాన స్వప్నమధ్యమునందు గూడ ప్రతీయమానత్వము అనునవి (సహజముగనే) ఉపపన్నముగ నున్నది కావున అది (ప్రవాసవిప్రలంభము కరుణముకంటె) ముందుగ ఎట్లు ఉద్భవించును?)

వి. అనగా స్వప్నమును చూచునప్పుడు మాత్రమే శత్రుకాంతలకు ప్రియ సమాగమాశ యనునది ఉండుటకు అవకాశమున్నది గాన ఆ సమయమునందు మాత్రమే ప్రవాసవిప్రలంభనమును అంగీకరింప వీలున్నది. కరుణరస మన్ననో ఈ శ్లోకమునందంతటను ప్రధానముగ గోచరించుచునే యున్నది. కావున ఇచట విప్రలంభమునకే ప్రథమతరప్రతీతి యని చెప్పుటకు వీలు లేదని యభిప్రాయము.

ఇట్లు చెప్పినచో అది (ఈ విధముగ రసవదలంకారసమర్థనము) సమంజసము కాదు.

అవ. కుంతకు డిపుడు ఆనందవర్ధనాదుల మతమును ఖండించుటకై — ఈ శ్లోకమున విప్రలంభ శృంగారమునకు గాని కరుణమునకు గాని ప్రాధాన్య మున్నది గాన అవి మరియొకదానికి దేనికో అంగములుగ నుండుటచే రసవద లంకార మని చెప్పుట యుక్తము కాదని చెప్పుచు మొదట ఇచట విప్రలంభ శృంగారము నంగీకరించినను దోషము లేదని ప్రతిపాదించుచున్నాడు.

వి. నాయికా నాయకుల వియోగమును వర్ణించు స్థలములలో వారిరువురును జీవించి యుండి వారికి పునఃసమాగమాశ యున్నచో నది విప్రలంభ శృంగార మనియు, వారిలో ఒకరు మరణింప పునఃసమాగమాశ లేనిచో నది కరుణ మనియు చెప్పుదురు. ఈ శ్లోకమున కరుణరసము నంగీకరించుచున్నా రనగా శత్రుస్త్రీలకు వారి పతుల మరణముచేతనే వియోగము ప్రాప్తించిన దని గ్రహించినట్లు అర్థము కాని భార్యాపతులు దూరదూర దేశములలో నుండుట చేతనే ఈ వియోగము సంభవించిన దని చెప్పుటకు గూడ అవకాశ మున్నది గాన విప్రలంభ శృంగారమునేల యంగీకరింపరాదు అని ప్రశ్నించుచున్నాడు:—

వ్యా. ఏలయన చాటు వాక్యములకు విషయభూతు డగు ఆ మహా పురుషుని ప్రతాపముయొక్క ఆక్రమణముచే భయపడుచున్న చిత్తము గల ఆతని శత్రువులును, వారి ప్రేయసులును ఇటు నటు పారిపోవుటచే గూడ వారు (దూరదూర దేశముల) వేరువేరుగ నుండుట యనునది యుక్తి విరుద్ధము కాదు. (కావున నాయికానాయకు లుభయులును సజీవు లగుటచే పునఃసమాగ మాశ యున్నది గాన ప్రవాస విప్రలంభమును అంగీకరింపవచ్చు నని యభి ప్రాయము)[1].

వాస్తవమున ఇచట సహృదయులకు విప్రలంభాస్వాదముకంటె కరుణా స్వాదమే అధికముగ కలుగుచున్న దని చెప్పుచున్నాడు:—

('నత్యపి' అనుచోట 'అపి' శబ్దము చార్థకము) ఆ విధముగ అవిచ్ఛిన్న మగు పరిపోష దశను అధిష్ఠించుట వలన ఏకాగ్రతచే నిశ్చలమైన మనస్సు కలవారును, అట్లు అభ్యస్త మగు రసవాసనచే అధివాసిత మగు చిత్తము

---

1 ఇచట గ్రంథపాత మున్నది. ఇచట కరుణరసమునకే ఎక్కువ అవకాశమున్న దని కుంతకు డేవియో యుక్తు చెప్పియుండవలెను. అవి గ్రంథపాతమున తెలియ రాకున్నవి.

కలవాడును అగు వానికి (సహృదయునకు) (ఇచట) కరుణరసమును గూర్చిన నిశ్చయము కలుగగా—చాల కాలమునకు స్వప్నసమాగమమును పొంది, పూర్వానుభూతములగు విషయములకు అనుగుణముగ మధురాలాపములు సలుప ప్రారంభించి, ఏ కారణముచేతనో మేల్కొని, మేల్కొనిన వెంటనే పూర్వాపర విషయము లన్నియు స్మృతి పథమునను రాగా, అప్పటి అనుభవ మంతయు సత్యదూర మగుటచే గుండెలు పగిలి నీ శత్రు విలాసినీ సమూహము ఏడ్చుచున్నది, అని చెప్పుటలో పరిపుష్టిని పొందుచున్న కరుణమునకు మాత్రమే అట్టి వ్యభిచారి భావముల ఔచిత్యముచే సౌందర్యము గాని వాటి స్వరూపముతో సంబంధము గాని లభించును. కావున ప్రవాస విప్రలంభము కొరకై వేరుగ వ్యాపారము నంగీకరించినను, ఆ రసము యొక్క గంధమైనను ఎట్లు లభించును? (కావున ఇచట కేవలము కరుణమే ప్రధాన మని యంగీకరింపవలెను గాని కరుణముతో పాటు దాని కంగముగ విప్రలంభము కూడ ఉన్న దని చెప్పుట యుక్తము కాదని యభిప్రాయము.

వేదా ప్రియతరాఖ్యానరూప మగు ప్రేయోలంకారము ప్రధానము గాన దానికి అంగముగ నుండుటచే కరుణరసము అలంకారము (కావున రసవదలంకారము) అని చెప్పినచో అదియు నిర్దుష్టము కాదు. ఏలయన ఈ రెండు ఉదాహరణములందును ('క్షిప్తో హస్తావలగ్నః' 'కిం హాస్యేన' ఇత్యాది శ్లోకద్వయమున) ముఖ్యమగు వాక్యార్థము కరుణరస రూపముననే నిష్పన్న మగునట్లు నిబద్ధమై యున్నది. పర్యాయోక్తి అన్యాపదేశ (అన్యోక్తి) స్థలములందు నిర్ణీతమైన విధమున వాచ్యభిన్న మగు అర్థము ప్రతీయమానమే అగును కావునను, రస మగుటచే వ్యంగ్యము కావలసి యున్న కరుణరసము వాచ్య మగుట అయుక్తము. ఇచట (ప్రధాన) వ్యంగ్యార్థము కరుణరస రూపముననే భాసించుచున్నది గాన ఇది గుణీభూత వ్యంగ్యమునకు గూడ విషయము కాదు. రెండును (కరుణ విప్రలంభములు) వ్యంగ్యము లని చెప్ప వీలులేదు. అట్లైనచో అంగాంగి భావము ఉపపన్నము కాదు. (ఇచట 'ద్వయోః' అనుదానికి ప్రేయోలంకార కరుణము లని యర్థము చెప్పవచ్చును. రెండును [illegible]గనే వ్యంగ్యము లని చెప్పినచో వీటికి అంగాంగి [illegible] [illegible]. ఈ విధముగ యథా సంభవముగ వికల్పము[illegible]యున్నాము. ఇంత మాత్రమే కాదు (ఇంకను దోషములు [illegible] నని యభిప్రాయము.......

మరియు "కావ్యే తస్మిన్నలంకారో రసాదిః" అనునపుడు కేవలరసమునే అలంకార మని చెప్పినట్లైనది. అంతియే కాని 'రసవత్' అనుదానిలోని మతుప్ (వత్) ప్రత్యయమునకు అర్థమేదియు చెప్పినట్లు కాదు. (అనగా 'రసవత్' అను నామధేయము అయుక్త మని యర్థము.) గ్రంథ పాతముతో కూడిన మిగిలిన వాక్యమున కర్థము అస్పష్టముగ నున్నది.

ఈ ఉన్మేషము గ్రంథము కూడ అసమాప్తముగనే యున్నవి శ్రీ యస్. కే. డే. తమకు లభించిన వ్రాతప్రతుల సహాయముతో ఈ గ్రంథ సంపాదనము చేసినారు. గ్రంథము ఇంత వరకును కొద్ది గ్రంథపాతములతో సాఫీగా నడచినది. రాబోవు భాగము కేవల సంకేత రూపమున ఛిన్నాతమై విసంష్ఠుల ముగ నున్నది. కుంతకుడు తాను వ్రాయనున్న గ్రంథమునకు సంకేతరూపమున ఒక ప్రణాళిక వేసికొని పిదప గ్రంథ రచనను ఇంతవరకును సాగించె ననియు అకాల మరణముచేతనో, కారణాంతరము చేతనో, తరువాతి గ్రంథము సంకేత రూపముననే ఉండిపోయె ననియు కొందరి యభిప్రాయము. ఈ సంకేతముల సహాయముతో శ్రీడే, ఆంగ్లమున విషయ ప్రతిపాదనము చేయుచు సంకేతము లను మూలరూపమున చూపి యున్నారు. కుంతకుడు కారికలను వ్యాఖ్యానించు నపుడు ఆకాంక్షా పద్ధతిని అనుసరించినాడు. కావున వృత్తి సాహాయ్యముచే, అనుపలభ్య మానములగు కారికలను గూడ ఊహించి, డే వ్రాసియున్నారు. ఈ విధముగ పునస్సంఘటితము లగు కారికలను కారికలనియు, తద్వ్యాఖ్యా సంకేతములను, గ్రంథచ్యుతి సహిత పాఠములను మూలమనియు, గ్రహించి రాబోవు గ్రంథమునకు వ్యాఖ్య వ్రాయ బడుచున్నది

కుంతకుడు ఇంతవరకును రసవదలంకారమును గూర్చి చర్చించి ఇపుడు రసవదలంకారముతో సన్నిహిత సంబంధము గల ప్రేయోలంకారమును గూర్చి విమర్శించుచు భామహుని ప్రేయోలంకార నిరూపణ విధానమును ఖండించు చున్నాడు:-

దండి "ప్రేయః ప్రియతరాఖ్యానమ్" (కావ్యాదర్శ II-275) (ఒకరికి అత్యంతప్రియ మగు విషయమును చెప్పుట ప్రేయోలంకారము) అని ప్రేయో లంకార లక్షణమును చెప్పెను. కాని భామహుడు ఉదాహరణము చూపుటయే

లక్షణ మని భావించి (ఉదాహరణ మాత్రమేవ లక్షణం మన్యమానః) ఈ యలంకారమునకు ఉదాహరణము మాత్రమే చూపెను గాని లక్షణము నీయలేదు. (కావ్యాలంకారము III-౬). దండి ఈ ఉదాహరణమునే గ్రహించి దానికి మరియొక వాక్యమును-

"ఇత్యాహ యుక్తం విదురో నాన్యతస్తాదృశీధృతిః.
భక్తిమాత్ర సమారాధ్యః సుప్రీతశ్చ తతో హరిః"

అను శ్లోకమును చేర్చినాడు. దానితో లక్ష్యలక్షణ సమన్వయము బాగుగ కుదిరనది. ఈ సందర్భమున కుంతకుడు 'కాలేనైషా భవే త్ప్రీతిః తవైవాగమనాత్ పునః" అను భామహోక్త్యోదాహరణాంశమును చూపినాడు. కుంతకుడు సూచించిన భామహోక్త్యోదాహరణము ఇది:-

"ప్రేయో గృహాగతం కృష్ణమవాదీత్ విదురో యథా
అద్య యా మమ గోవిన్ద జాతా త్వయి గృహాగతే
కాలేనైషా భవేత్ప్రీతిః తవైవాగమనాత్పునః"
(కా. III-౬) 45

"ప్రేయోలంకారము ఎట్లనగా — విదురుడు గృహమునకు వచ్చిన కృష్ణునితో ఇట్లనెను—ఓ గోవిందా! నీవు మా యింటికి వచ్చుటచే నాకు ఎట్టి ఆనందము కలిగినదో అట్టి ఆనందము కాలాంతరమున నీవు మరల మాయింటికి వచ్చునపుడు మాత్రమే కలుగును" అని దీని యర్థము. ఇచట విదురుడు కృష్ణునకు ప్రియమగు మాటలు పల్కెను గాన ఇది ప్రేయోలంకారమున కుదాహరణము. దండి "ప్రేయః ప్రియతరాఖ్యానమ్" అను లక్షణమును మొదటనే చెప్పి దానికి భామహోక్తమగు 'అద్యయా' ఇత్యాద్యుదాహరణమునే చూపి దానికి పిమ్మట పూర్వోక్తమగు 'ఇత్యాహ' ఇత్యాది శ్లోకమును (II-277) చేర్చినాడు "విదురుడు ఈ విధముగ యుక్తముగనే పలికినాడు, ఏలయన ఆతనికి అన్యులవలన అట్టి ఆనందము కలుగదు. ఇట్లు పలుకుటచే భక్తి మాత్రవశ్యుడగు హరి కూడ సంతసించినాడు"అని దాని యర్థము. ఈ విధముగ దండి భామహు లిరువురికిని ప్రేయోలంకారము విషయమున ఒకే యభిప్రాయ మున్నట్లు స్పష్టము. కుంతకుడు వీరి మతమును ఖండించుచున్నాడు:-

వ్యా. ఇది[1]యంతయు నిశితపరిశీలనమునకు నిలచునదికాదు. ఇచట వర్ణింప బడుచున్న విషయము "కాలేనైషా" ఇత్యాదికమే. కావున అది వస్తువుయొక్క స్వభావమే అయి ఉన్నది ఈ విధముగ చెప్పుటయే లక్షణ మన్నచో ఇంక అలంకరింపదగినది ఏదియు మిగలలేదు. ప్రతిపాద్యమానవస్తువునకే అలంకార త్వము అలంకార్యత్వము అనెడు ఉభయమును చెప్పుట యుక్తి యుక్తము కాదు. ఒకే వస్తువు ఒకే సమయమున ఒకే క్రియయందు కర్మగాను కరణము గాను ఉండుట యను నది ఉపపన్నము కాదు.

ఒకే వస్తువునకు కర్మకరణత్వములు రెండును ఉన్నట్లు బోధించు-'నిన్ను నీచేతనే తెలుసుకొనుచున్నావు; నిన్ను నేచేతనే సృష్టించుచున్నావు; సృష్ట్యాది కృత్యములను నెరవిన నీ అత్మతో నీవు నీయందే లీన మగుచున్నావు' ఇత్యాది వాక్యములు కానవచ్చుచున్నవి కదా యని యన్నచో అదియు యుక్తము కాదు. ఏలయన ఇచట (ఈ శ్లోకమున) (పరమేశ్వరజగత్తులకు) వాస్తవమున భేదము లేకున్నను కాల్పనికమును, ఔపచారికమును అగు విభాగమును ఆశ్ర యించి ఆ (భేద) వ్యవహారము ప్రవర్తించుచున్నది. మరియు పరమేశ్వరుడు జగన్మయు డన్నను ప్రపంచము పరమేశ్వరమయ మన్నను ఆ రెండింటికిని పరమార్థమున భేదము లేదు ఐనను (పరమేశ్వరుని) మాహాత్మ్యమును ప్రతిపా దించుటకై, ఆ యా పదార్థములకు చెందిన స్వభావములదే విచిత్ర మగు జగద్విస్తృతిరచనతో సకలప్రమాతల (జీవుల) అనుభవగోచర మగు భేద జ్ఞానమునకు అవకాశము లేకుండుట అనునది ఎన్నటికిని కుదరదు. కావున ఇచట పరమేశ్వరునకే సంబంధించిన ఒక రూపము అతనిచే పొందబడుచుం డుటచే; అది వేదనాద్క్రియలో కర్మగ నుండును; ఒక రూపము ప్రధానసాధన ముగ నుండుటచే అది కరణముగ నుండును. (కావున విరోధము లేదు) కాని ప్రేయోలంకారోదాహరణమునందు అపోద్ధారబుద్ధి యని కల్పించినను (భేదము లేని స్థలమున భేదమును కల్పించినను) ఏ విధముగను గూడ విభాగము సంభా వ్యము కాదు. కావున (రసవదలంకారప్రకరణోక్త మగు) "స్వరూపాతిరిక్త మైన మరియొక వస్తువేదియు భాసింపకుండుటచే" (అలంకారము కాదు) అను

[1] 'కర్తురీప్సితతమం కర్మ' 'సాధకతమం కరణమ్' అను పాణిన్యుక్త కర్మ కరణలక్షణముల ననుసరించి కుంతకుడిచట 'అప్యమానత్వాత్' 'సాధకతమత్వాత్' అని వ్రాసినాడు.

దూషణమును ఇచట గూడ సంబంధింపచేయ వలెను. (ఇచట గ్రంథపాతము) మరియు-'తానే తన భుజము నెక్కడను ఎక్కజాలదు కదా' అని వెనుక (చూ. I. 18) చెప్పినట్లు, ప్రేయోరసవదలంకారస్థానములందు, ఏది అలంకార్యమో అదియే అలంకారము గాన "స్వాత్మని క్రియావిరోధః' (తానే తనకు అలంకారముగా నుండుట) అను దోషము ఉండనే ఉన్నది. (ఇచట గ్రంథ పాతమున్నది)

ప్రేయస్సును అలంకారముగ అంగీకరింపరాదనుటకు మరియొక ఉపపత్తిని గూడ చూపి కుంతకుడు, అట్టి స్థలములు సంసృష్టి సంకరములకు గూడ ఉదాహరణముగ గ్రహింపరాదని ప్రతిపాదించుచు ఈ క్రింది యుదాహరణ మును చూపుచున్నాడు.

ఇన్దోర్లక్ష్మ త్రిపురజయినః కంఠమూలం మురారి
ర్దిఙ్నాగానాం మదజలమసీ భాఞ్జి గణ్డస్థలాని.
అద్యాప్యుర్వీ వలయతిలక శ్యామలిమ్నానులిప్తా
న్యాభాసన్తే వద ధవలితం కిం యశోభి స్త్వదీయైః. 49

'ఓ భూవలయ తిలకమా ! చంద్రుని కళంకము, త్రిపురారియొక్క కంఠము, విష్ణువు, మసివలె నున్న మదోదకముతో కూడిన దిగ్గజముల గండ స్థలములును ఇంకను నలుపుతో పూయబడిన వగుచునే కానవచ్చుచున్నవి. ఇంక నీ కీర్తిచే తెల్లగ చేయబడిన దేమి యున్నది? చెప్పుము"

అవ. భామహాది మతానుయాయులు ఈ శ్లోకమున రాజస్తుతిరూప మగు ప్రేయోలంకారమును, వ్యాజస్తుతియు నున్నవి గాన ఆ రెండింటికిని సంకర మని చెప్పుదురు కాని కుంతకుడు అట్లు చెప్పుట యుక్తముకాదని చెప్పుచున్నాడు.

ఇచట ప్రియవాక్యకథనము అలంకార్యము; వ్యాజస్తుతి అలంకారము. అంతియే కాని రెండును అలంకారములుగ భాసించుటలేదు. అట్లు భాసించినచో అలంకారద్వయ మని గాని, వాటికి సంకర మని గాని చెప్పుటకు అవకాశ ముండెడిది (రెండును అలంకారములేయని చెప్పినచో ఈ రెండింటికంటె భిన్న మగు మూడవవస్తువేదియో అలంకార్యముగ భాసింపవలెను). మూడవ దగు వస్త్వంతరము అలంకార్యముగా భాసించుట లేదుకదా!

(కుంతకుడు ప్రేయోలంకారమునకు సంబంధించిన చర్చను ముగించుచు వ్రాసిన భాగము ఉపకారికాంశవ్యాఖ్యానముగ తోచుచున్నది). అన్యస్మిన్ విషయే = ప్రియతరాఖ్యాన మున్న స్థలముకంటె భిన్న మగు మరి యొక వర్ణనస్థానమునందు, ఉపమాద్యలంకారములవలె ప్రేయస్సును కూడ (మీ యభిప్రాయము ప్రకారము) అలంకారమే గాన కూర్చుటకు అవకాశముండవలెను. ఆ విధముగ కూర్చుట ఎచ్చటను కానరాదు కావున, అన్యత్ర = తద్భిన్నస్థలము లందు కూడ, ప్రేయస్సుకు అలంకారత్వము (త్వాంగీకారము) యుక్తియుక్తము కాదు. రసవదలంకారము ప్రేయోలంకారముతో సమాన మగు యోగక్షేమములు కలది గాన దాని విషయమున గూడ ఇదియే (ఈ యుక్తియే) ప్రవర్తించును.

వి. అనగా ఏదైన ఒక విషయమును చెప్పవలసి యున్నప్పుడు శుద్ధముగ ఆ విషయమును మాత్రమే చెప్పవచ్చును. లేదా అచట ఉపమాద్యలంకారములను గూడ ప్రయోగింపవచ్చును. అట్టి స్థలములలో ఉపమాదులు అలంకారములు. శుద్ధవిషయము అలంకార్యము. కాని ప్రేయోలంకారమును తీసివేసినచో అలంకార్య మగు శుద్ధ విషయ మేదియు కానరాదు కావున ప్రేయస్సు అనునది అన్ని యెడలను అలంకార్యమే కాని అలంకారము కాజాలదు. ఈ యుక్తి రసవదలంకారవిషయమున గూడ ప్రవర్తించును.

వ్యా. ప్రేయస్సునకు వర్ణనీయవస్తువే శరీరము గాన దానికి అలంకారత్వమును నిరాకరించి, ఇపుడు తత్సమాన రూపములగు ఇతరా లంకారములకు గూడ నిరాకరించుచున్నాడు-

కా. ఊర్జస్వ్యుదాత్తాభిధయోః పౌర్వాపర్యప్రణీతయోః
అలంకరణయో స్తద్వద్భూషణత్వం న విద్యతే,

'క్రమముగ ప్రతిపాదితము లగు ఊర్జస్వి-ఉదాత్తాలంకారములకు గూడ వాటికి వలెనే అలంకారత్వము లేదు'.

నవిద్యతే = సంభావ్యము కాదు, ఎట్లు? తద్వత్. తచ్ఛబ్దము అనంతరోక్తము లగు రసవదాద్యలంకారములను పరావర్శించును. రసవదాద్యలంకారములకు వలెనే వాటికి అలంకారత్వము లేదు.

పిమ్మట కుంతకుడు ఊర్జస్వ్యలంకారమునకు భావహోద్భటులు ఇచ్చిన లక్ష్య లక్షణములను విమర్శించుటకై మొదట ఉద్భటుని లక్షణోదాహరణశ్లోకములను పిమ్మట భామహుని శ్లోకమును ఉద్ధరించెను. ఉద్భటుని శ్లోకము లివి-

"అనౌచిత్య ప్రవృత్తానాం కామక్రోధాది కారణాత్
భావానాం చ రసానాం చ బన్ధ ఊర్జస్వి కథ్యతే 50
(కా.సం IV-5)
తథా కామోఽస్య వవృధే యథా హిమవతః సుతామ్
సంగ్రహీతుం ప్రవవృతే హఠేనాపాస్య సత్పథమ్" 51
(IV-6)

'కామక్రోధాది కారణములచే అనౌచిత్యముతో ప్రవర్తించిన భావములను రసములను కూర్చుట ఊర్జస్వి అలంకార మని చెప్పబడును'. 'అతని (శివుని) కామము ఎంత వృద్ధిచెందినదనగా— సన్మార్గమును విడచి పార్వతిని బలాత్కారముగ గ్రహింపవలె నని కూడ అతడు తలచెను' అని వీటి భావము ఇచట కామావేశముచే శృంగారము అనుచితరీతిని ప్రవర్తించి నట్లు వర్ణింపబడినది గాన ఇది ఊర్జస్వికి ఉదాహరణము.

భామహుని శ్లోక మిది:-
"ఊర్జస్వి కర్ణేన యథా పార్థాయ పునరాగతః
ద్విః సన్దధాతి కిం కర్ణః శల్యేత్యహిరపాకృతః. 52
(కా III-7)

"ఊర్జస్వి ఎట్లనగా— ఓ శల్యా! కర్ణుడు! బాణమును రెండు పర్యాయములు సంధించునా! అని పలికి' కర్ణునిచే అర్జునునికొరకై (చంపుటకై) మరల వచ్చిన సర్పము దూరముగ పారవేయబడినది' అని దాని యర్థము. ఇందు కర్ణుని శౌర్యోక్తి కూర్పబడినది గాన ఊర్జస్విఅలంకారము.

వి. భామహుడు చూపిన ఉదాహరణమును పట్టి శౌర్యాద్యుపేతమగు ధీరోక్తి ఊర్జస్వి యని యతని యభిప్రాయ మైనట్లు తోచును.

వి. ఖాండవదహన సమయమున తల్లి చనిపోవుటచే ఒక సర్పము అర్జునిపై పగబట్టి నన్ను బాణముగ ప్రయోగించినచో అర్జునిని చంపెద నని చెప్పి కర్ణుని వద్దకు చేరెను. ఒకమారు కర్ణుడు దానిని అర్జునిపై ప్రయోగింపగా కృష్ణుని ప్రభావముచే అది అర్జునిని చంపజాలక పోయెను. అది మరల కర్ణుని

వద్దకు వచ్చి "ఈ మారు నన్ను ప్రయోగింపుము; అర్జునిని తప్పక చంపెదను" అని పల్కగా కర్ణుడు శల్యునితో పల్కిన శౌర్యోక్తి యిది.

భామహుండు చూపిన ఈ ఉదాహరణమును గూర్చి కుంతకుడు—

"కొందరు ఉదాహరణమే స్పష్టముగ నున్నది గాన లక్షణ మని భావించి దానిని మాత్రమే చూపినారు". అని ఒక వాక్యమును మాత్రము వ్రాసి కావ్యాదర్శనమందు దండి చూపిన ఈ క్రింది ఊర్జస్వ్యుదాహరణమును ఉద్ధరించెను.

"అపకర్తాహమస్మీతి హృది తే మా స్మ భూద్భయమ్
విముఖేషు న మే ఖడ్గః ప్రహర్తుం జాతు వాంఛతి" 53
(కావ్యాద. II-293)

ఇది దాని తరువాతి శ్లోకము.

"ఇతి ముక్తః పరో యుద్ధే నిరుద్ధో దర్పశాలినా
పుంసా కేనాపి తద్ జ్ఞేయ మూర్జస్వీత్యేవమాదికమ్" (II-294)

'నేను ఈతనికి అపకారము చేసి యుంటినే' అని భయపడకుము నా ఖడ్గమెన్నడును వెన్నిచ్చిన వారిని కొట్టుట కుత్సహింపదు' అని పల్కుచు ఒక దర్పశాలి యుద్ధమునందు చేజిక్కిన శత్రుకవును విడిచెను. ఈ విధము గనున్న ఊర్జస్వి అలంకారము' అని ఈ శ్లోకముల యర్థము

ఉద్భటుని లక్షణోదాహరణములను పరిశీలించుచు ఈ విధముగా వ్రాసినారు—

వ్యా. భావము అనౌచిత్యప్రవృత్త మైనచో 'రసభంగమునకు అనౌచిత్యమే ప్రధాన కారణము' అని చెప్పిన విధముగ రసభంగము కలుగును. రసము సముచితముగ నున్నప్పుడు మాత్రమే పరమసౌందర్యమును కల్గించును. (ఈ ఉదాహరణమున) అనౌచిత్యముచే వాడిపోయినదై కామాదికారణకల్పనచే నిరుద్ధ మగు వృత్తి గల ఈ రసము అలంకారత్వాభాసమునైనను ఎట్లు పొందగల్గును?

పిమ్మట కుంతకుడు— 'తథా కామోఽస్య వవృధే' ఇత్యాద్యుద్భటోక్తోదాహరణముతో తుల్యార్థ మగు కాళిదాసశ్లోకము నుద్ధరించి ఇట్టి స్థలములలో రసాభాసము అలంకార్యమే కాని అలంకారము కాదని చెప్పుచున్నాడు.

> "పశుపతి రపి తాన్యహాని కృచ్ఛ్రా
> దగమయ దద్రిసుతా సమాగమోత్కః
> కమపర మవశం న విప్రకుర్యు
> ర్విభుమపి తం యదమీ స్పృశన్తి భావాః. 54
>
> (కుమా. IV.95)

"శివుడు కూడ పార్వతీసమాగమోత్కంఠితుడై ఆ రోజులను అతికష్టముగ గడపెను. ఈ భావములు అట్టి పరమేశ్వరుని కూడ స్పృశించుచున్నవన్నచో ఇతరుల కెవ్వరికి బాధను కలిగించవు?" ఇట్టి స్థలములను భరతశాస్త్ర నిపుణులగు దండి భామహోద్భటాదులు ఊర్జస్వికి ఉదాహరణముగ చూపుటయే ఊర్జితముగ (ఆశ్చర్యజనకముగ) నున్నది. ఇచట నిది ప్రధాన మగు చేతన లక్షణముచే ఉపకృత మైనదియు అతిశయవిశిష్టమును అగు చిత్తవృత్తివిశేష రూప మైన వస్తుస్వభావమే కావున అది ముఖ్యముగ వర్ణింపబడుటచే అలంకార్యమే కాని అలంకారము కాదు. అనగా- చైతన్యవంతుని చిత్తమునందు కలుగు వృత్తినే ఇది వర్ణించుచున్నది గాన ఇది వస్తుస్వభావమునే చెప్పినట్టైనది. కావున ఇది అలంకార్యమే కాని అలంకారము కాదని భావము.

ఈ ఊర్జస్వి అలంకారము రసవదాద్యలంకారముల విషయమున చూపిన దూషణములకు పాత్రము కాకుండ ఉండజాలదు. కావున అచట చెప్పిన దూషణము లన్నియు దీనివిషయమున గూడ సమన్వయింపవలెను.

ఇట్లే ఉభయప్రకార మగు ఉదాత్తమునకు గూడ అలంకార్యత్వమే యుక్తి యుక్తము కాని అలంకారత్వము కాదు. 'సమృద్ధితో కూడిన వస్తువు ఉదాత్తము' (అని కదా ఉద్భటుడు చూపిన ప్రథమభేద లక్షణము?) ఇచట— ఏ వస్తువున్నదో అది ఉదత్తాలంకారము అని యర్థము. అది ఎట్టిది యని ఆకాంక్ష కలుగగా దానికి 'బుద్ధిమత్' అను దానిని విశేషణముగ చేసి— ఏ వస్తువు సంపదుపేతమై, వర్ణ్యమానమై అలంకార్యముగ నున్నదో అదియే అలంకార మని చెప్పినచో తన క్రియను తన విషయముననే ప్రయోగించుట

అనెడు దోషము నివారింపరాని దగును. ఊర్జస్వి విషయమున చెప్పిన విధముగ అలంకార స్వరూపము కంటె భిన్నమైన మరియొక అలంకార్య వస్తు వేదియు ఇచట భాసించుట లేదుకదా!.... అట్లు కాక—సమృద్ధి గల వస్తువు దేనియందు, లేదా దేనికి కలదో (అది ఉదాత్తము) అని వ్యాఖ్యానించినను, 'యస్మిన్', 'యస్య' అను యచ్ఛబ్దముతో సమానార్థత్వమును పొందింపబడిన, అనగా యచ్ఛబ్దప్రతి పాద్యమైన ఆ అన్యపదార్థరూప మగు వస్తు వేదియో చెప్పవలసి యుండును. బుద్ధి మద్వస్తువు దేనియందు లేదా దేనికి ఉన్నదో అట్టిది కావ్యమే కావచ్చును అని యన్నచో అదియు నిస్సారమే. ఏలయన 'కావ్యమునకు అలంకారము' అని ప్రసిద్ధి యున్నది గాని "కావ్యమే అలంకారము" అనెడు ప్రసిద్ధి లేదు కదా! అట్లు కాక బుద్ధి మద్వస్తువు దేనియందు లేదా దేనికి గలదో అది అలంకారమే యన్నచో... వర్ణనీయ వస్తువుకంటె భిన్నమైన అలంకారము వంటి దేదియు ఇచట కానరాదు గాన రెండు విధములచేతను శబ్దార్థసమన్వయము కుదరకుండుట అనెడు దోషమునకు అవకాశమున్నది.

రెండవ ఉదాత్తభేదము కూడ అలంకార్య మని చెప్పుటయే యుక్తము కాని అలంకారమని చెప్పుట యుక్తము కాదు దాని లక్షణ మిది కదా —

"చరితం చ మహాత్మనామ్. ఉపలక్షణతాం
ప్రాప్తం నేతి వృత్తత్వ మాగతమ్".

ప్రధానేతి వృత్త రూపమున నుండక గౌణత్వమును పొందిన మహాత్ముల చరిత్రము కూడ (ఉదాత్తము). ఇచట వాక్యార్థ పరమార్థము (తాత్పర్యము) తెలిసిన వారు ఈ విషయమును ఆలోచింపవలసి యున్నది— ఉపలక్షణము (గౌణము)గా మాత్రమే ఉన్న మహానుభావుల వ్యవహారమునకు ప్రస్తుత వాక్యార్థ మునం దెచట నైనను అన్వయము ఉన్నదాలేదా? మొదటి (ఉన్నదను) పక్షమున, ప్రస్తుత వాక్యార్థమునందు విలీనము కాకుండుటచే వేరుగ వాచ్యముగ నున్నను అది (మహాపురుష చరితము), హస్తాదులు శరీరమునకు అవయవము లుగ నున్న విధమున, పదార్థాంతరముల వలె దాని కవయవముగ మాత్రమే ఉండునని చెప్పవలెను. అంతియే కాని దాని కలంకారముగ కూడ నుండునని చెప్పరాదు. (హస్తాదులు శరీరమునకు అలంకారము లని చెప్పము కదా?) రెండవ పక్షమున (ప్రస్తుత వాక్యార్థముతో అన్వయము లేదు అన్నచో) దానితో

అన్వయమే లేదు గాన, వాక్యాంతరమునం దున్న పదార్థమునకు వలె దీనికి గూడ దానియందు (ప్రస్తుత వాక్యార్థమునందు) స్థితి సంభవింపదు. అట్టిచో అలంకారత్వ మీమాంసయే ఎక్కడిది ? (అనగా వాక్యాంతరమునందలి పదార్థము ఈ వాక్యముతో అన్వయించనట్లు ఈ మహాత్మ చరితము ప్రకృత వాక్యార్థముతో అన్వయింపదు అని యన్న పక్షమున అట్లు అన్వయించనిది దానికి అలంకార మెట్లగును? అని యభిప్రాయము), (దీని తరువాత గ్రంథ పాతము).

ఈ విధముగ సమాహితమునకు గూడ అలంకార్యత్వమే కాని అలంకారత్వము న్యాయ్యము కాదు.

కా. తథా సమాహితస్యాపి ప్రకారద్వయ శోభినః. 13

"ప్రకారద్వయముతో శోభించుచున్న సమాహితమునకు కూడ అట్లే"— అనగా పూర్వకారికలోని 'భూషణత్వం న విద్యతే' అనుదానితో అన్వయము.

తథా = పూర్వోక్త మగు ఆ ప్రకారము చేతనే, సమాహిత మనెడు అలంకారమునకు కూడ అలంకారత్వము, నవిద్యతే = లేదు అని యర్థము.

తరువాత కుంతకుడు రెండు విధములలో మొదటి దగు సమాహిత ప్రకారమును ఖండించుటకై ఉద్భటోక్త మగు లక్షణమును—

"రసభావతదాభాస తత్ప్రశాన్త్యాదిర క్రమః
అన్యానుభావనిః శూన్యరూపో య స్తత్‌సమాహితమ్''

అని అనువదించెను. శ్రీ దే చెప్పినట్లుగ ఇది ఉద్భటుని కావ్యాలంకార సంగ్రహము నందలి శ్లోకముకంటె భిన్నముగ నున్నది. అర్థము కూడ కుదురుట లేదు.

"రసభావతదాభాస వృత్తేః ప్రశమబన్ధనమ్
అన్యానుభావనిః శూన్యరూపం య త్తత్సమాహితమ్''

అనునది నిర్దుష్టపాఠము ''ఇతర రసాద్యుల అనుభావములతో శూన్యమగు రూపము కల రసములయొక్కయు, భావములయొక్కయు, రసాభాస భావాభాసముల

ద్యోక్కయు వృత్తియొక్క ప్రశమమును కూర్చుట సమాహితము'' అని దీని యర్థము దీనిని ఖండించుచు కుంతకుడు ఏ యుక్తులను చూపెనో ఉపలభ్యమాన మగు గ్రంథమున కానరావు.

దండి కావ్యాదర్శమున—

"కించి దారభమాణస్య కార్యం దైవవశాత్పునః
తత్సాధన సమాపత్తిర్యా తదాహుః సమాహితమ్ 58
మానమస్యా నిరాకర్తుం పాదయోర్మే పతిష్యతః
ఉపకారాయ దిష్ట్యేద ముదీర్ణం ఘనగర్జితమ్" 59

(II-298-9)

అను శ్లోకములలో సమాహితమును ప్రతిపాదించెను. "ఒక కార్యమును చేయ నుద్యమించుచుండగా దైవ వశముచే తదనుకూల సాధనము అప్రయత్న ముగ లభించుట సమాహితము. నేను ఆమె కోపమును తొలగించుటకై పాదములపై పడబోవుచుండగా, దైవవశముచే నా కుపకారము చేయుటకై ఈ ఘనగర్జితము బయల్వెడలినది" అని వీటి యర్థము.

దీనిని సమాహితద్వితీయ ప్రకారమునుగా గ్రహించి కుంతకుడు ఖండించి నాడు.

కొందరు ప్రకారాంతరముచే సమాహిత మనెడు అలంకారమును ప్రతిపా దించిరి. దానికి కూడ అలంకారత్వము లేదు. దీనినే 'ప్రకారద్వయశోభినః' అని చెప్పుచున్నాడు. పూర్వోక్తప్రకారము చేతను ఈ మరియొక ప్రకారము చేతను శోభించుచున్న సమాహితత్వము సంభవింపదు. (ద్వితీయ ప్రకార ఖండనమునకు గూడ ఏ యుక్తులు చూపబడినవో తెలియదు).

మొదటి ప్రకారమును గూర్చి ముచ్చటించునపుడు కుంతకు డీ క్రింది శ్లోకమును ఉదాహరణముగ చూపినాడు. ఈ శ్లోకము మాత్రమే లభ్య మగు చున్నది.

"అక్ష్ణోః స్ఫుటాశ్రు కలుషోఽరుణిమా విలీనః
శాన్తం చ సర్వమధర స్ఫురణం భ్రుకుట్యాః.
భావాన్తరస్య తవ గండగతోఽపి కోపో
నోద్గాఢ వాసనతయా ప్రసరం దదాతి" 60

"స్ఫుట మగు అశ్రువులచే కలుష మగు నేత్రములయొక్క అరుణత్వము అణగిపోయినది. అధరస్ఫురణ మంతయు భ్రుకుటితో కూడ శాంతించినది. నీ గండస్థలమునందలి కోపము ప్రబలమగు సంస్కారము కలదగుటచే మరి యొక భావమునకు అవకాశమును ఇచ్చుట లేదు".

ఉద్భటోక్తలక్షణానుసారముగ ఒక రసము గాని భావము గాని తదాభాసములు గాని శమించి ఇతర భావము లేవియు ఆవిర్భవింపని అవస్థకు సమాహిత మని పేరు. ఇచట కోపము శమించినట్లును, ఇతరభావముల కింకను అవకాశము లభించనట్లును వర్ణింప బడినది గాన ఇది ఉద్భటాద్యంగీకృత సమాహితమునకు (ప్రథమభేదమునకు) ఉదాహరణము

ఈ విధముగ చేతనాచేతన పదార్థము లనెడు భేదముచే భిన్నమైనదియు, స్వాభావిక మగు సౌకుమార్యముచే మనోహర మైనదియు నగు వస్తుస్వరూపము ప్రతిపాదింపబడినది. ఇపుడు (అలంకారనిరూపణమున) స్వాభావికసౌకుమార్య మనోహర మగు ఆ వస్తుస్వరూపమే కవిప్రతిభోల్లిఖిత మగు లోకోత్తరాతిశయముతో ప్రకాశించినట్లు నవనిర్మితమై ఏ విధముగ మనోజ్ఞముగ చేయబడునో నిరూపించుచున్నాము అట్టి భూషణవిన్యాసముచే నేర్పడిన సౌందర్యాతిశయము లేనిచో ఒక వస్తువు స్థితిమాత్రముచే (భూతత్వ నిమిత్తభూతం = ఉన్న దని చెప్పుకొనుటకు నిమిత్తమైనంతమాత్రమున) సహృదయాహ్లాదకారి కాజాలదు.

ఇచట "అభిధాయాః ప్రకారౌ స్తః" అను మాటలతో ప్రారంభ మగు రెండు అంతరశ్లోకములను చెప్పి యున్నాడు కాని గ్రంథపాతముచే అవి అస్పష్టముగ నున్నవి.

రసవదలంకారమును స్వాభిప్రాయము ప్రకారము నిరూపించు చున్నాడు:-

కా. యథా స రసవన్నామ సర్వాలంకార జీవితమ్
కావ్యైకరససతాం యాతి తథేదానీం వివిచ్యతే. 14

రసేన వర్తతే తుల్యం రసవత్త్వ విధానతః
యోఽలంకారః స రసవత్ తద్విహ్లాదనిర్మితేః. 15

"(పూర్వప్రత్యాఖ్యాత మగు అలంకారము) సర్వాలంకారములకును జీవితమై ఏ విధముగ కావ్యమున ప్రధానసారముగ అగునో ఆ విధము ఇపుడు వివేచింపబడుచున్నది."

"ఏ అలంకారము (కావ్యమున)రసవంతము చేయుటచే రసముతో తుల్యముగ నుండునో అది సహృదయాహ్లాదకారి యగుటచే 'రసవత్' అగును."

వ్యా. పూర్వము నిరాకరింపబడిన స్థితి గల రసవత్ అనెడు అలంకారము ఏ విధముగా, కావ్యైక సారతాం యాతి = కావ్యముయొక్క ప్రధాన సర్వస్వత్వమును పొందునో, సర్వాలంకార జీవితం = సమస్తమైన ఉపమాద్యలంకారములకు జీవితముగా ఏర్పడునో, తథా = ఆ ప్రకారముచే, వివిచ్యతే = విచారింపబడుచున్నది, లక్షణోదాహరణభేదముచే విస్తరింపబడు చున్నది.

ఆ రసవదలంకారమునకే రసేనేత్యాది కారికచే లక్షణము చెప్పుచున్నారు ఏ అలంకారము కలదో అది రసవత్–అని అన్వయము. ఏ రూపకాద్యలంకారము ఈ విధముగ నుండునో అది రసవత్ అని చెప్పబడును. ఆయలంకారములు స్వరూపముచేతనే అట్లగుచున్నవా? 'రసేన వర్తతే తుల్యమ్' రసేన = శృంగారాదిరసముతో, తుల్యముగ నుండును (బ్రాహ్మణకర్మ చేయుటచే) క్షత్రియుడు ఏ విధముగ బ్రాహ్మణుని వలె నున్నాడని చెప్పుదుమో అట్లే (రసకార్యమును చేయుటచే ఈ యలంకారము కూడ రసవత్‌గ (రసము వలె) నుండును.) సః = ఆ రసవదలంకారము, ఏ కారణము వలన? రసవత్త్వ విధానతః = రసముకలది కావున, రసవత్తుకావ్యము; దానియొక్క భావము (ధర్మము)రసవత్త్వము. దానియొక్క విధానము వలన, అనగా సరవత్త్వమును సంపాదించుట వలన, 'తద్విదాహ్లాదనిర్మితేశ్చ'— తత్ = కావ్యమును, విదన్తి = తెలిసికొందురు గాన, తద్విదః = తద్‌జ్ఞులు; వారికి ఆహ్లాదనిర్మితేః = ఆనందమునుకలిగించుట వలన. రసము-ఏ విధముగ కావ్యమునకు రసవత్త్వమును, కావ్యమర్మజ్ఞుల కానందమును కలిగించునో అట్లే ఉపమాద్యలంకారము కూడ అతిశయమును కలిగించుచు విశిష్టరూప మగు రసవదలంకారముగ నేర్పడును. ఎట్లనగా—

"ఉపోఢరాగేణ విలోలతారకం
తథా గృహీతం శశినా నిశాముఖమ్.
యథా సమస్తం తిమిరాంశుకం తయా
పురోఽపి రాగాద్గలితం న లక్షితమ్[1]" 61

"సాంధ్యరాగమును ధరించిన (కాముక పక్షమున ప్రేమోన్మత్తు డైన) చంద్రునిచే (శశియను నాయకునిచే, చంచలమైన నక్షత్రములు గల(కంటి గ్రుడ్లు కల) రాత్రియొక్క ప్రారంభము (నిశయనెడు నాయికయొక్క మొగము) ఆ విధముగా గ్రహింపబడినది: ఏ విధముగా ననగా, సాంధ్యరాగముచే (ప్రేమావేశముచే) ముందుగనే జారిపోయిన అంశుకము వంటి అంధకారము (నల్లని మేలిముసుగు లేదా వస్త్రము) దానిచే (ఆమెచే) చూచుకొనబడలేదు."

వస్తుసమారోపము ఉన్నప్పుడు రూపకాలంకార మనియు, వ్యవహారసమారోపమున్నపుడు సమాసోక్తి యనియు చెప్పుదురు ఇచట ప్రస్తుత మగు నిశాచంద్రవృత్తాంతమున లింగశ్లేషాది సాహాయ్యముచే అప్రస్తుత నాయికానాయక వృత్తాంత సమారోప మున్నది గాన ఇది సమాసోక్తి. కాని కుంతకుడు వ్యవహారసమారోపమును గూడ రూపకముగా గ్రహించి వ్యాఖ్యానించుచున్నాడు.

ఇచట తమ సమయమునకు ఉచిత మగు సుకుమార స్వరూపము గల నిశాచంద్రుల వర్ణనయందు, ఆరోపిత మగు కాంతవృత్తాంతము (కాంత వృత్తాంత మనగా ఏకశేషచే కాంతాకాంతుల వృత్తాంతము యని యర్థము.) కవిచే కూర్చబడినది. అది శ్లేషచ్ఛాయచే మనోహర మగు విశేషణముల వక్రత్వముచేతను, (శశినిశాశబ్దముల) పిశిష్టలింగ సామర్థ్యము చేతను........కార్యమునకు సరసత్వమును కూర్చుచు, సహృదయహ్లాదమును చేయుచు రసవదలంకారత్వమును స్వయముగనే పొందుచున్నది. (తాను సరస మగు అలంకారముగ ఏర్పడుచున్నది).

రసవదలంకారమునకు అభిజ్ఞానశాకుంతలమునుండి మరి యొక ఉదాహరణమును చూపుచున్నాడు. శకుంతలను బాధించుచున్న భ్రమరమును చూచి దుష్యంతు డన్న మాటలివి.—

1. ఇదిపాణిని విరచితశ్లోకమని సుభాషితావళి, శార్ఙ్గధరపద్ధతి మొదలగు గ్రంథములు చెప్పుచున్నవి.

"చలాపాంగం దృష్టిః స్పృశసి బహుశో వేపథుమతీం
రహస్యాఖ్యాయీవ స్వనసి మృదు కర్ణాంతికచరః.
కరౌవ్యాధున్వత్యాః పిబసి రతిసర్వస్వ మధరం
వయం తత్త్వాన్వేషాన్మధుకర హతాః త్వం ఖలు కృతీ" 62
(అభి.శా. I-24)

"ఓ మధుకరమా! చంచలములగు నేత్రాంతములతో చూడబడుచున్న వాడవై భయముచే వణకుచున్న ఈమెను అనేకపర్యాయములు స్పృశించు చున్నావు. చెవి ప్రక్కతిరుగుచు రహస్యమును చెప్పువాడవు వలె మృదువుగా ధ్వని చేయుచున్నావు. హస్తములను కదల్చుచున్న ఈమెయొక్క రతిసర్వస్వ మైన అధరమును గ్రోలుచున్నావు. (ఈమెను వివాహ మాడవచ్చునా కూడదా అని ఈమెకు సంబంధించిన) యథార్థవృత్తాంతమును అన్వేషించుచు మేము భగ్నాశులమై యుండ నీవు కృతార్థుడ వైతివి కదా!"

ఇచట పరమార్థ మేమనగా— భ్రమరముపై ఆరోపిత మగు కాంత వృత్తాంతరూప మగు రసవదలంకారము ప్రధానరస మగు శృంగారమునకు శోభాతిశయమును కలిగించుచున్నది.

ఇంకను ఎట్లనగా— "కపోలే ప్రతాలీ' ఇత్యాది పూర్వోదాహృత శ్లోక మున. ఇచట మన్మథునందు కాముకత్వవ్యవహారము ఆరోపితమైనదై శృంగార మునకు శోభాతిశయమును కల్పించుచున్నది.

చి. రసవదలంకారము విషయమున ప్రాచీనాచార్యుల మతమునకును కుంతకుని మతమునకును రెండు విధములగు భేదము కనబడుచున్నది. ఇట్టి ఉదాహరణములలో ప్రాచీనాచార్యులు వ్యవహారసమారోపమును పురస్కరించు కొని సమాసోక్తిని అంగీకరింప కుంతకుడు వ్యవహారసమారోపము కూడ వస్తు సమారోపమే యని గ్రహించి, రూపకమును అంగీకరించినాడు. రెండవ భేద మేమనగా— ప్రాచీనాచార్యుల దృష్టి ఇట్టి సమాసోక్తులలో ప్రతీయమానముగ నున్న రసము వైపు పోలేదు. కాని కుంతకుడు ఈ రసమును పట్టియే దీనికి రస వదలంకార మని పేరు పెట్టినాడు అనగా కుంతకుని యభిప్రాయము ప్రకారము రూపకాద్యలంకారములనుండి గూడ ఇట్టి రసప్రతీతి కలిగినచో అవి రసవదలం కారము లగును, కానిచో మామూలు రూపకాద్యలంకారము లగును.

పూర్వపక్షి ఆశంకించుచున్నారు:- ('ఉపోఢ రాగేణ' ఇత్యాది శ్లోకములలో అంగీకరించిన విధమున 'క్షిప్తో హస్తావలగ్నః' ఇత్యాది (పూర్వోదాహృత) శ్లోకమునందు కూడ ఇదే న్యాయముచే రసవదలంకార ప్రత్యాఖ్యానము అయుక్తము కదా? సిద్ధాంతి చెప్పుచున్నాడు:- ఇది సత్యమే. అచట విప్రలంభ శృంగార మున్న దను వాదము మాత్రమే నిరాకరింపబడుచున్నది. ఆ శ్లోకమునం దున్న శ్లేషాలంకారము 'ఉపోఢరాగేణ' ఇత్యాదులలో నున్న రూపకాదులతో తుల్యమైన వృత్తి కలదే గాన దానికి రసవదలంకారత్వము అనివార్యమే.

'ఇందోర్లక్ష్మ' ఇత్యాది శ్లోకవ్యాఖ్యానావసరమున ప్రాచీనోక్త ప్రేయో రసవదాదులతో అలంకారములకు సంకర సంసృష్ట్యాదులు కూడ అంగీకరింప శక్యము కాదని చెప్పబడియున్నది. కాని ఈ రసవదలంకారముతో సంకరసంసృష్ట్యాదు లుండవచ్చు నని చెప్పుచున్నాడు-

వ్యా. మరియు అలంకారాంతర మున్నపుడు ఈ రసవదలంకారమును బట్టి వచ్చిన సంకరసంసృష్ట్యాది నామములను కూడ ప్రత్యాఖ్యానము చేయరాదు. ఎట్లనగా —

"అంగుళీభిరివ కేశసంచయం సంనిగృహ్య తిమిరం మరీచిభిః
కుడ్మలీకృతసరోజలోచనం చుంబతీవ రజనీముఖం శశీ" 65

"చంద్రుడు (నాయక వ్యవహారరూప ప్రతీయమానార్థమున-శశి యను నాయకుడు) వ్రేళ్లతో కేశసముదాయమును వలె తిమిరమును కిరణములతో నిగ్రహించి, ముకులీకృతము లగు సరోజములే నేత్రములుగా గల (ముకులీకృతము లగు సరోజముల వంటి నేత్రములు గల, రాత్రి ప్రారంభసమయమును (రజని యను నాయికయొక్క ముఖమును) చుంబనము చేయుచున్నట్లున్నాడు." (ఇచట అంగుళీభిరివ మరీచిభిః అను చోట ఉపమ 'సరోజ లోచనమ్' అను చోట రూపకము. 'చుమ్బతీవ' అను నపుడు ఉత్ప్రేక్ష.)

ఇచట రసవదలంకారము యొక్కయు, రూపకాదులయొక్కయు కలయిక మిక్కిలి ప్రకాశించుచున్నది. అందు 'చుంబతీవ రజనీముఖం శశీ' అనెడు ఉత్ప్రేక్షారూప మగు రసవదలంకారము ప్రధానముగను ఉపమాదులు తదంగములగను నిబద్ధము లైనవి. ఏలయన కేవల మగు (ఉపమాద్య సహకృత మగు) (ఆ ఉత్ప్రేక్షారూప రసవదలంకారము) ప్రస్తుత (చంద్రోదయవర్ణన) పరిపోషణ

మునకు నిష్పన్నము కాదు (కావున ఇచట రసవత్తుకు ఉపమాదులతో సంకర మని భావము).

రసవదలంకారమునకు ఇతరాలంకారములతో సంకరమునకు మరి యొక ఉదాహరణమును కూడ చూపుచున్నాడు:-

"ఐన్ద్రిం ధనుః పాండుపయోధరేణ శరద్దధానార్ద్రనఖక్షతాభమ్
ప్రసాదయన్తీ సకలఙ్కమిన్దుం తాపం రవేరభ్యధికం చకార" 66

"తెల్లని పయోధరముచే (మేఘము అనియు స్తనమనియు రెండర్థములు) పచ్చిగా నున్న నఖక్షతముతో సమానమైన కాంతి గల ఇంద్రధనుస్సును ధరించుచున్న శరత్తు (శరత్ అను పేరు గల నాయిక యని ప్రతీయమానార్థము) సకలంకు డగు (దుష్టచరిత్రుడని ప్రతీయమానార్థము) చంద్రుని (ఆ పేరు గల మరియొక నాయకుని) ప్రసన్ను డగునట్లు (ఆనందించునట్లు) చేయుచు రవి (ఆ పేరు గల మొదటి నాయకుని) తాపమును (మనస్తాపమును) అధిక మగునట్లు చేసెను".

వి. ఇచట శ్లేషాది సామర్థ్యముచే శరత్తు అనెడు వేశ్య తన ఆర్ద్రనఖక్షతముతో కూడిన పయోధరమును చూపుట ద్వారా తత్కారణభూతు డగు ఒక నాయకునకు ఆనందమును కలిగించుచు మరి యొక ప్రతినాయకునకు మనస్తాపమును కలిగించుచున్న దను అర్థము ప్రతీయమాన మగుచున్నది

"ప్రసన్న మగునట్లు చేయుచు శరత్తు, రవియొక్క తాపమును అధిక మగునట్లు చేసెను" అని శరదృతు సమయమున కల్గెడు పదార్థ స్వభావము. మేఘవాచక మగు 'వారిద' వంటి శబ్దముచే చెప్పకుండగా (అనగా 'వారిద' 'అంబుద' వంటి శబ్దములను ప్రయోగించినచో స్తనప్రతీతి కలుగదు గాన వాటిని ప్రయోగింపక 'పయోధర' అను ద్వ్యర్థకపదమును ప్రయోగించి యని యర్థము) (ప్రసాదింపచేయుచున్నదా అన్నట్లు ఉండి తాపమును అధికము చేసినదా అన్నట్లు ఉన్నది అని) ప్రతీయమానోత్ప్రేక్షారూప మగు రసవదలంకారముచే, కవిచేత ఒకానొక (అపూర్వమగు) సౌందర్యమును ఆరోపింపబడినది. ఏలయన అర్థాంతర ప్రతీతిచే మనోహరము అగు సకలంకం ఇత్యాదులైన శబ్దాదులు (ఆదిపదముచే లింగాదులు) కూర్చబడినవి; 'పాండువైన పయోధరముచే ఆర్ద్రనఖక్షతము వలె నున్న ఇంద్రధనుస్సును ధరించుచున్నది' అని శ్లేషోపమలు

కూడ దానికి అనుగుణముగ కూర్చబడియున్నవి. ఈ విధముగ 'సకలంకుని కూడ సంతోషపెట్టుచు రెండవ వానికి అధిక మగు తాపమును కలిగించెను' అనెడు రూపకాలంకారమును బట్టి వచ్చిన వేశ్యాంగనా వృత్తాంత సమారోపము కూడ మిక్కిలి సమన్వయమును పొందినది ఇచట గూడ ప్రతీయమాన మగు రసవలంకారము పధానము, ఉపమాదులు దానికి అంగములు అననది, వెనుకటి శ్లోకమునందు వలెనే గ్రహింపదగినది.

దీని తరువాత కుంతకుడు ఈ క్రింది కుమారసంభవ శ్లోకమును గూడ ఉదాహరణముగా చూపినాడు:-

"లగ్నద్విరేఫాంజన భక్తి చిత్రం ముఖే మధుశ్రీః తిలకం ప్రకాశ్య
రాగేణ బాలారుణ కోమలేన చూతప్రవాలోష్ఠ మలంచకార" 67

"వసంతలక్ష్మి ప్రారంభమునందే (ముఖమునందు అని అర్థాంతరము) లగ్నమైన ద్విరేఫము లనెడు అంజనము యొక్క రచనచే చిత్రమైన తిలక వృక్షమును (నుదుటి బొట్టును) ప్రకాశింపచేసి బాలారుణకోమల మైన రాగముచే చూతప్రవాళ మనెడు అధరోష్ఠమును అలంకరించెను."

వి. ఇచట గూడ ప్రతీయమానోత్ప్రేక్షారూప మగు రసవదలంకారము నకు ఉపమాదులు అంగములు.

కుంతకుడీవిధముగ రసవదుదాహరణములు చూపి 'ఇది రసవంతములగు అలంకారము లన్నింటిలో చూడామణి వలె ప్రకాశించుచున్నది" అనివ్రాసెను. తరువాత రెండు అంతరశ్లోకముల నుదాహరించి (అవి గ్రంథపాతముచే దుష్టపాతములుగ నున్నవి), రసవదలంకార ప్రకరణమును "ఈ విధముగ నీరసములగు పదార్థములకు సరసత్వమును సంపాదించుటకై రసవదలంకారమును ప్రతిపాదించినాడు"—అని ముగించెను.

ఇపుడు స్వరూపమాత్రము తోడనే ఉన్న వస్తువులకు ఒకానొక అతిశయ మును ఉద్దీపింపచేయుటకై దీపకాలంకారమును ఉపక్రమించుచున్నాడు. ప్రకాశింప చేయబడు పదములను బట్టి అది వాక్యముయొక్క ఆదియందును మధ్యము నందును, అంతమునందును ఉండుటచే, అవి దీపక మనియు, మధ్యదీపక మనియు, అంత్యదీపకమనియు క్రియావదమే దీపకాలంకార మని పూర్వాచార్యులు చెప్పి యున్నారు.

ఇచట కుంతకునిచే నిర్దిష్టు డగు పూర్వాచార్యుడు భామహుడు. భామహుడు దీపకాలంకార లక్షణమును ఈ క్రింది విధముగ ఇచ్చెను—

ఆదిమధ్యాంత విషయం త్రిధా దీపక మిష్యతే
ఏకస్యైవ త్ర్యవస్థత్వాదితి తద్ భిద్యతే త్రిధా
అమూని కుర్వతేఽన్వర్థామస్యాఖ్యా మర్థ దీపనాత్
త్రిభిర్నిదర్శనై శ్చేదం త్రిధా నిర్దిశ్యతే యథా
(II-25, 26)

"దీపకము ఆది విషయ మనియు, మధ్య విషయ మనియు, అంతవిషయ మనియు మూడు విధములుగ అంగీకరింపబడుచున్నది. ఒకే క్రియా పదము మూడు స్థానములలో నుండుటచే అది మూడు విధములుగా నుండును. ఇవి (ఈ క్రియాపదములు) అర్థమును దీపింపచేయుటచే దీనియొక్క (దీపకము యొక్క) నామధేయమును సార్థకమైన దానినిగ చేయుచున్నవి. ఇది మూడు ఉదాహరణములచే మూడు విధములుగ నిర్దేశింపబడుచున్నది" అని వీటి యర్థము.

కుంతకుడు భామహోక్తము లగు ఉదాహరణములను ఈ క్రింది విధముగ చూపి లక్షణ సమన్వయమును చూపుచున్నాడు:-

"మదో జనయతి ప్రీతిం సానఙ్గం మానభఙ్గురమ్
స ప్రియాసఙ్గమోత్కణ్ఠాం సాసహ్యాం మనసః శుచమ్" 68
"మాలినీరంశుక భృతః స్త్రియోఽలంకురుతే మధుః
హారీతశుకవాచశ్చ భూధరాణా ముపత్యకాః" 69
"చీరీమతీ రరణ్యానీః సరితః శుష్యదంభసః
ప్రవాసినాం చ చేతాంసి శుచిర న్తంనినీషతి" 70
(కా. అ. II 27-29)

"మదము ప్రేమను కలిగించుచున్నది. అది మానమును భగ్నమును చేయు (మానం భంగురం యేన సః అని బహువ్రీహికి చెప్పుకొనవలెను) కామమును కలిగించును. అది ప్రియాసంగమోత్కంఠను కలిగించును. అది మనస్సుకు సహింపరాని దుఃఖమును కలిగించును."

"వసంతము మాలలను, సన్నని వస్త్రములను ధరించిన స్త్రీలను అలంక రించుచున్నది. హారీతముల (పక్షివిశేషము) యొక్కయు శుకముల యొక్కయు వాక్కులను అలంకరించుచున్నది. పర్వతముల ఉన్నత ప్రదేశములను కూడ అలంకరించుచున్నది."

"గ్రీష్మము కీచురాళ్ల గల మహారణ్యములను, ఎండిపోవుచున్న ఉదకము గల నదులను, ప్రవాసవంతుల మనస్సులను అంతము పొందింప నభిలషించు చున్నది (అంతము పొందింపనున్నది)."

ఇచట క్రియా పదములకు దీపకత్వము అనగా ప్రకాశకత్వ మున్నది. ఏలయన క్రియాపదముల చేతనే (ఇతర పదార్థములు) ప్రకాశింపచేయబడు చున్నవి (అనగా తమతో (క్రియాపదముతో) సంబంధించునట్లుగా స్థాపింప బడుచున్నవి.

౦ ఈ శ్లోకములలో మొదటిది ఆది దీపకమునకు ఉదాహరణము. ఇందు 'జనయతి' అను క్రియాపదము శ్లోకమునందలి మిగిలిన మూడు పాదములతో సమన్వయించుచున్నది గాన అది దీపకపదము. అది శ్లోకాద్య చరణమున నున్నది గాన ఆది దీపకము. 'అలంకురుతే' అను దీపకపదము శ్లోకమధ్యమున నున్నది గాన రెండవ శ్లోకము మధ్య దీపకమున కుదాహరణము. 'అంతం నినీషతి' అను దీపకపదము శ్లోకాంతమున నున్నది గాన మూడవ శ్లోకము అంత్యదీపకమున కుదాహరణము. దీపన మనగా క్రియాపదము ఇతర పదములను తనతో అన్వయించునట్లు చేయుట; ఇతర పదములు క్రియతో అన్వయించుట యని యర్థము.

కుంతకుడు భామహోక్త మగు దీపకలక్షణమును ఖండించుటకై ఎనిమిది దోషములను చూపుచున్నాడు:-

ఇట్లు చెప్పినచో దీపక మగు క్రియాపదముకంటె భిన్న మగు ఏ క్రియా పదమైనను గూడ ఒకే విధముగ నుండును గాన వివిధములగు దీపకము లుండవలసి వచ్చును.

౨. అనగా ఒక వాక్యములో నున్న క్రియతో కర్త, కర్మ, కరణము మొదలగు నవి ఎన్నియో అన్వయించును గాన వాటి కన్నిటికి ఆ క్రియాపదము

దీపకమే కావున క్రియతో కూడిన ప్రతి ఒక్క వాక్యము కూడ దీపకోదాహరణము కావలసి వచ్చును. ఈ విధముగ దీపకములు బహు సంఖ్యాకములు కావలసి వచ్చును.

మరియు శోభాకరత్వము యుక్తి శూన్యము కావున అలంకారత్వము అనుపపన్నము.

వి దేనికైనను శోభాకారిత్వ మున్ననే కానిఅలంకారత్వ మంగీకరింప రాదు. క్రియ ఆదిమధ్యాంత గతమైనంత మాత్రమునఅది ఇతర క్రియా విలక్షణ మైన శోభాతిశయము నొకదానిని కూర్చుచున్న దని చెప్పవలెను. కాని భామహాదులు, అట్టి క్రియ శోభాతిశయ హేతువుగ నున్నదనుటకు యుక్తుల నేమియు చూపలేదు గాన దీపకమునకు అలంకారత్వము పొసగ దని భావము. ఇది రెండవ దోషము.

మరియు-క్రియాపదము మాట అటుండనిండు. వాక్యములో నున్న ఏపద మైనను తనతో సంబంధించిన పదాంతరమును ప్రకాశింపచేయుట దాని స్వభావమే. వాక్యార్థస్వరూప మనునది పరస్పరాన్వయరూప సంబంధముపై ఆధారపడి యుండును కదా? ఈ విధముగ మరల అనంత దీపకాలంకారములు సంప్రాప్తించును.

వి. వాక్యములో నున్న కర్త, కర్మ, కరణము, వాటి విశేషణములు ఇవన్నియు పరస్పగ సంబద్ధములై అనగా ఒకదాని నొకటి ప్రకాశింప చేసికొనుచునే వాక్యార్థ బోధకములుగ నుండును. ఈ విధముగ మీరు చెప్పిన దీపకత్వము క్రియా పదములకే కాక ఇతర పదములకు గూడ నున్నది గాన అనంత దీపకముల నంగీకరింప వలసి వచ్చును. ఇది మూడవ విప్రతి పత్తి.

ఆది మధ్యాంతముల యందున్న క్రియాపదము ఒకానొక విధ మగు అతిశయమును కూర్చును. దానిచే దానికి అలంకారత్వము లభించును అని యన్నచో-అట్టి వాక్యాదులకు మాత్రమే అట్టి స్వరూపాతిశయము ఏది యున్నది?

వి. అనగా ఆదిమధ్యాంతముల యందు క్రియాపద మున్నచో శోభాతిశయము కలుగుచున్నది, ఇతర పదములు దీపకములుగ నున్న శోభాతిశయము కలుగుట లేదు అని చెప్పుటకు వినిగమక ప్రమాణ మేమి యున్నది? ఇతర

పదములచే గూడ అట్టి శోభ కలుగు నని చెప్పవచ్చును కదా? యని యభిప్రాయము. ఇది చతుర్థదోషము.

క్రియాపదము యొక్క ప్రకార భేదము నిమిత్తముగా గల, వాక్యము యొక్క ఏ ఆది మధ్యాంతము కలదో అది (ఆ ఆది మధ్యాంతము) తదర్థ వాచకములందు కూడ సంభవించును గాన అనంత దీపకములను అంగీకరింప వలసి యుండును.

వి. అనగా వాక్యమునందలి విభిన్న భాగములతో క్రియాపదము అన్వయించు తీరును బట్టి ఆ భాగములను ఆది యనియు, మధ్య మనియు, అంత మనియు చెప్పి దీపకలక్షణమును సమన్వయించుచున్నారు. కాని ఒకే విధమగు క్రియాపదమునకు బదులు ఆది మధ్యాంతములందు సమానార్థకములగు క్రియలను (ఉదా. జనయతి, ఉత్పాదయతి, ఇత్యాది సమానార్థక క్రియలను) ప్రయోగించుటచే దీపక ప్రకారానంత్యము వచ్చును కదా యని యభిప్రాయము. ఇది ఐదవ దోషము.

దీపకాలంకార స్థలమున ప్రయుక్త మగు వాక్యమధ్యము నందున్న క్రియాపదము త్వాదివ్యతిరిక్త మైననే కావ్య విశేష మని చెప్పవలసి యుండును. ఇది ఆరవ అనుపపత్తి.

లేదా-సమానరూపమున (ఆది మధ్యాంతములందు) విభక్తములై యున్న కారణ (క) ములను ఒక క్రియాపదము ప్రకాశింపచేయుచు దీపక మని చెప్పబడినచో, ఆ పక్షమునందు కూడ కావ్య సౌందర్యాతిశయమును కలిగించుటకు కారణ మేమి అను నది చెప్పవలసియే యుండును.

ఈ విధముగ భామహుని దీపక లక్షణమును ఖండించి, ఈ లక్షణము కంటె ఉద్భటుని లక్షణము యుక్తయుగ నున్న దని చెప్పుచున్నాడు —

ప్రస్తుతా ప్రస్తుతార్థముల సామర్థ్యముచే సంప్రాప్త మగునదియు, ప్రతీయమానమును అగు సామ్యమే (దీపకము కాని) మరి యేదియును కాదు అని అభియుక్త తరులగు (ఉద్భటాదులు) ప్రతిపాదించియే యున్నారు.

"ఆదిమధ్యాన్త విషయాః ప్రాధాన్యేతర యోగినః
అన్తర్గతోపమాధర్మా యత్ర తద్దీపకం విదుః"

(కా. సా. సం. 1–14)

ఉద్భట లక్షణమున కుదాహరణము చూపుచున్నాడు—

"చంక్రమ్యన్తే కరీన్ద్రాః దిగ్గజ మదగన్ధ హారిత హృదయాః
దుఃఖం వనే చ కవయో భణితి విషమ మహాకవి మార్గే"

"దిగ్గజ మదగంధముచే హరింపబడిన హృదయములు గల కరీంద్రములు వనమునందు దుఃఖముతో మెల్లిమెల్లిగ నడచుచున్నవి. వక్రోక్తి విచిత్ర మగు మహాకవి మార్గమున కవులు కష్టముగ నడచుచున్నారు."

...దిగ్గజముల మదగంధముచే హరింపబడిన మనస్సులు గల కరీంద్రములు కాననమునందు ఏ విధముగ, అతికష్టముగ, సంచరించుచున్నవో, ఆ విధముగ, భణితి విషమే = వక్రోక్తి విచిత్ర మగు మహాకవి మార్గము నందు...కవులు అని 'చ' శబ్దమున కర్థము.

ప్రస్తుతా పస్తుతముల నడుమ సామ్యము ప్రతీయమానము కాకున్నచో దీపకము కాజాలదు గాన 'అంతర్గతోపమా ధర్మాః' అను విశేషణమును లక్షణము నందు చేర్చుట ఆవశ్యకమే యని ప్రతిపాదించి కుంతకుడు స్వాభీష్ట మగు దీపక లక్షణమును చూపుచున్నాడు:-

కా. ఔచిత్యావహమమ్లానం తద్విదాహ్లాద కారణమ్
అశక్తం ధర్మ మర్థానాం దీపయద్వస్తు దీపకమ్. 16

"ఔచిత్యమును కలిగించునదియు, వసివాడనిదియు, కావ్యజ్ఞుల కానంద జనకమును, పదార్థముల అప్రకట మగు ధర్మమును ప్రకాశింపచేయునదియు అగు వస్తువు దీపకము"

ఇపుడు మరి యొక విధముగ అలంకరించుటకు కారణభూత మగు దీపకమును గ్రహించి, అపూర్వ మగు కావ్యరామణీయకమును సంపాదించుటకై మరి యొక ప్రకారమున ఔచిత్యావహమిత్యాదికారికతో ఉపక్రమించుచున్నాడు. వస్తు దీపకమ్ = సిద్ధరూపమగు వస్తువు అలంకరణముగ, మరియొక క్రియ లేదు గాన (ఆధ్యాహృతమగు) 'భవతి' అను దానితో సంబంధము. అట్లైనచో ప్రతి యొక్క వస్తువునకును దీపకత్వము వచ్చును కదా యని యాశంకించుకొని చెప్పుచున్నాడు— దీపయత్ = ప్రకాశింప చేయుచు, అలంకారముగ అగును. ఏది

దేనికి (అలంకారమగును) అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు— ధర్మం = స్వభావవిశేషమును, అర్థానామ్ = వర్ణనీయములగు అర్థములయొక్క. ఎట్టి ధర్మము? అశక్తమ్ = అప్రకటమైనది. ఏలయనన- (ఆ ధర్మము) దానిచేతనే (దీపకము చేతనే) ప్రకాశింపచేయబడుచున్నది కదా? ఎట్టి స్వరూపము కలది? ఔచిత్యావహమ్ = ఔచిత్యం = ఔదార్యమును, ఏది కల్పించునో అది. ఇంకను ఎట్టిది? అమ్లానమ్ = నూతనమైనది; ఇంతకు పూర్వము ఎన్నడును ఆస్వాదింప బడనిది. ఇట్టి స్వరూపము కలదగుటచే, తద్విదాహ్లాదకారణమ్ = కావ్యవేత్తల ఆనందమునకు నిమిత్తమైనది.

ఇచట గ్రంథపాతముండుటచే కుంతకుడు దీపకాలంకారమును ఏవిధముగ విభజించెనో స్పష్టముగ తెలియుటలేదు. ఐనను వృత్తిసాహాయ్యముచే కారిక ఈ విధముగ ఊహింపబడుచున్నది-

కా. ఏకం ప్రకాశకం సన్తి భూయాంసి భూయసాం క్వచిత్
కేవలం పంక్తిసంస్థం వా ద్వివిధం పరిదృశ్యతే. 17

'(ఒక్కచో) ఒక్కటియే దీపకము ఉండును. మరికొన్నియెడల అనేకములు అనేకములకు ప్రకాశములుగ నుండును. ఈ విధముగ కేవలము గాని, పంక్తిసంస్థము గాని రెండు విధములుగ కనబడుచున్నది',

దీని భేదములనే చూపుచున్నాడు— ద్వివిధం పరిదృశ్యతే = రెండు ప్రకారములు కలదిగ చూడబడుచున్నది, లక్ష్యమునందుకానవచ్చుచున్నది. ఎట్లు? కేవలం = అసహాయమైనది గాను (ఇతరములైన దీపకపదములు లేనిది గాను), పంక్తిసంస్థం వా = లేదా పంక్తియందు ఉన్న అది (అదీపకము). అనగా సమాన స్వభావముగల సహాయాంతరములచే (ఇతర దీపకపదములచే) ఏర్పడిన పంక్తి యందు ఉన్నది. ఎట్లు? ఏకమ్. అనేక పదార్థములకు ఒక్కటి మాత్రమే ప్రకాశకముగ నున్నచో అది కేవలదీపక మని చెప్పబడును. ఎట్లనగా- (ప్రథమోన్మేషోదాహృత మగు) "అసారం సంసారం" ఇత్యాది శ్లోకము ఉదాహరణము. ఇచట 'చేయుటకు ఉద్యుక్తుడైనాడు' అను కర్తృవాచకము, సంసారాదులకు అసారత్వము మొదలగు ధర్మములను ప్రకాశింపచేయును (ఇది ఒక్కటియే కావున కేవల) దీపకాలంకార మైనది.

పంక్తిసంస్థము— భూయాంసి = దీపకములగు అనేక వస్తువులు, భూయసాం=అనేకమైన వర్ణనీయములకు, సన్తివాక్వచిత్=కొన్ని విషయములలో నున్నచో (అది పంక్తిసంస్థము) (ఇతరాలంకార గ్రంథములలో దీనికే మాలాదీపక మని పేరు.) ఎట్లనగా—

కవికేసరీ వచనానాం మౌక్తికరత్నానాం ఆదివైకటికః
స్థానాస్థానం జానాతి కుసుమానాం చ జీర్ణమాలాకారః.

"కవి సింహము పదములయొక్కయు, పురాణరత్నపరీక్షకుడు మౌక్తిక రత్నములయొక్కయు, వృద్ధమాలాకారుడు పుష్పములయొక్కయు, స్థానాస్థానములను (ఏది దేనికి తగిన స్థానము; తగని స్థానము అను విషయమును) తెలిసికొనగల్గుచున్నాడు."

ఇచట 'స్థానాస్థానం జానాతి' అనెడు అనేకపద సముదాయము మూడు పాదములలో నున్న అనేకపదార్థములకు ప్రకాశకముగ నున్నది గాన ఇది పంక్తి సంస్థదీపకమునకు ఉదాహరణము. ఇదియే ఇతరాలంకారికుల మాలాదీపకము

చంద్రమయూఖైర్నిశా, నలినీ కమలైః కుసుమగుచ్ఛైర్లతా
హంసైః శారదశోభా, కావ్యకథా సజ్జనైః క్రియతే గుర్వీ

"చంద్రకిరణములచే రాత్రియు, కమలముచే కమలినియు, పుష్పగుచ్ఛములచే లతయు, హంసలచే శరదృతుశోభయు, సజ్జనులచే కావ్యకథయు గొప్పదిగ చేయబడుచున్నది."

ఇచట 'కియతే గుర్వీ' అనెడు అనేకపదములు నిశ మొదలగు అనేక వస్తువులకు దీపకములుగ నున్నవి గాన ఇది గూడ పంక్తిదీపకమునకు ఉదాహరణము.

దీని తరువాత లక్ష్యమగు వృత్తిని బట్టి పంక్తిదీపకము మూడువిధములుగ విభక్తమైనట్లు తెలియుచున్నది. కాని కారికాపాఠము దురూహ్యముగ నున్నది.

పంక్తిసంస్థ మనెడు రెండవది.........కారణమువలన మూడు విధములైనది. మూడు ప్రకారములు దేనికో అది యని విగ్రహము. అందు మొదటి ప్రకారము 'భూయాంసి భూయసాం క్వచిద్ భవన్తి' అని ఇంతకు పూర్వమే చెప్పబడినది.

రెండవది– మరి యొకచోట మరియొక దీపకమును దీపింప చేయునది. మరియొకదానికి అతిశయమును కలిగించుట ద్వారా దీపకము. (ఈ రెండవ భేదమునకు దీపకదీపక మను పేరు కుంతకు డిచ్చి యుండును.).

దీపితమై కర్మగా నున్న దేనిని, కర్తగా నున్న మరియొక ఏ దీపకము దీపింప చేయుచున్నచో అది ఒక దీపకము మరియొకదానిని దీపింపచేయు చున్నదగాన (దీపితదీపకము). ద్వితీయ దీపకమునకు (దీపకదీపకమునకు) ఉదా హరణమెట్లనగా–

"క్షోణీమండల మండనం నృపతయః తేషాం శ్రియో భూషణం
తాః శోభాం గమయత్యచాపలమిదం ప్రాగల్భ్యతో రాజతే.
తద్భూష్యం నయవర్త్మనః తదపిచేచ్ఛౌ[1]ర్యక్రియాలంకృతం
బిభ్రాణో యది యత్తయా త్రిభువనం ఛేత్తుం వ్యవస్యేదపి" 76

"భూమండలమునకు రాజులు అలంకారము. వారికి లక్ష్మి అలంకారము. లక్ష్మికి స్థిరత్వము అలంకారముగ నుండును. అది ప్రాగల్భ్యముచే ప్రకాశించును. దానిని అలంకరించునది నీతిమార్గము, అదిగూడ శౌర్యక్రియచే అలంకరింపబడి నచో అట్టిదానిని (నయమార్గమును) అవలంబించినవాడు ఈ త్రిభువనమును గూడ ఇది ఇంతమాత్రమే అని పరిచ్ఛేదముచేయుటకు గూడ ఉద్యుక్తుడు కా వచ్చును".

ఇచట ఉత్తరోత్తర పదార్థములు (రాజు, లక్ష్మి మొదలగునవి) పూర్వ పూర్వపదములకు (క్షోణీమండల నృపత్యాదులకు) దీపకము లగు విధమున, ఒక మాలలో కవిచే కూర్చబడినవి.

---

1 ఈ శ్లోకమున లభ్యమాన మగు ఉత్తరార్థపాఠము విసంష్ఠులముగా నున్నది. దే లిఖితప్రతిలో నున్న ''దూష్యం'' అనుదానిని 'భూష్యం' అనియు, 'ఇయత్తదా' అను దానిని 'ఇయత్తయా' అనియు మార్చి, అపుడుకూడ అర్థము కుదరకపోవుటచే 'శౌర్య క్రియా' అను పాఠమును ''చేచ్ఛౌర్య'' అని మార్చి 'ఇయత్తదా' అను పాఠమును యథాస్థితముగానే ఉంచిన బాగుండునేమో అని వ్రాసినాడు. అట్లైనను అర్థము కుదురుట లేదుగాన 'విభ్రాణం' అను పాఠము 'విభ్రాణః' అని ఇచట మార్చ బడినది.

ఇంకను ఎట్లనగా-

"శుచి భూషయతి శ్రుతం వపుః ప్రశమ స్తస్య భవత్యలంక్రియా
ప్రశమాభరణం పరాక్రమః స నయాపాదితసిద్ధిభూషణః" 77
(కిరా. II-32)

శుద్ధ మగు శాస్త్రాభ్యాసము శరీరమును అలంకరించును. దానికి ప్రశమము అలంకార మగును. ప్రశమమునకు అలంకారము పరాక్రమము, అది నీతిచే సంపాదింపబడిన అలంకారము గలది"

ఇచట శ్రుత ప్రశమాద్యు త్తరోత్తరపదార్థములు వపుఃశ్రుతాది పూర్వపూర్వపదార్థములను అలంకరించునవిగ మాలారూపమున కూర్పబడినవి గాన ఇది పంక్తిసంస్థదీపక ప్రథమ భేదమునకు ఉదాహరణము.

ఇంకను ఎట్లనగా- (పూర్వోదాహృత మగు) 'చారుతా వపురభూషయ దాసామ్' ఇత్యాదికము.

ఈ శ్లోకార్థము నందే (కారికార్థమునందే) 'దీపక' అనుదాని స్థానమున "దీపిత" అను పాఠాంతరమును చేసి మూడవ ప్రకారమును కూడ వ్యాఖ్యానింపవలెను.

(దీనిని పట్టి పైన మూలమునం దున్న "దీపకం దీపయత్యన్యత్తాన్యత్' అనునది కారికాభాగ మని తెలియుచున్నది. దీనిలో "దీపకం" అనుదానికి బదులు "దీపితం" అని చేర్చి 'దీపితం దీపయత్యన్య తాన్యత్' అని పఠించవలెనని యర్థము.)

దీనియర్థ మిది- దీపితం=మరియొక దానిచే ఉత్పాదిత మగు అతిశయము గలదిగ చేయబడిన ఏ వస్తువు కలదో, దానిని కర్త యగు మరియొకటి దీపింపచేయుచు ఉత్తేజితము చేయును..................ఎట్లనగా-

భామహోదాహృత మగు "మదో జనయతి ప్రీతిమ్" ఇత్యాది శ్లోకము.

"మదము ప్రీతిని కలిగించుచున్నది' ప్రీతి మానభంగురమగు అనంగభావమును కలిగించుచున్నది' అది ప్రియాసమాగమోత్కంఠను కలిగించుచున్నది' అనునపుడు ప్రియాసమాగమోత్కంఠను కలిగించుట అనునది 'మానభంగురం' అనెడు విశేషణముచే దీపిత మగు ప్రీతి అనుదానిని దీపింపచేయుచున్నది గాన ఇది దీపితదీపకమున కుదాహరణము.

పూర్వపక్షి ప్రశ్నించుచున్నాడు- వెనుక పూర్వాచార్యులు గూడ దీనినే ఉదాహరించినారు కదా? మొదట దానిని నిరాకరించి ఇపుడదియే సరిగ నున్నట్లు చూపబడినది? (సమాధానము) నిజమే పల్కితివి. ఇదిగో అభిప్రాయము చెప్పు చున్నాను. ఒక్క క్రియాపదము మాత్రమే దీపక మని వారి తాత్పర్యము. కాని మా అభిప్రాయ మేమనగా- కర్తృపదాదులను బట్టి ఏర్పడు దీపకములు అనేక విధములుగ సంభావ్యములు అని.

కా. యథాయోగిక్రియాపదం మనఃసంవాది తద్విదామ్
వర్ణనీయస్య విచ్ఛిత్తేః కారణం వస్తుదీపకమ్. 18

"తనతో అనుకూల మగు విధమున సంబంధించు క్రియాపదము కలదియు, కావ్యజ్ఞుల మనస్సుతో సంవదించునదియు, వర్ణనీయ మగు విషయము యొక్క శోభకు కారణభూతమును అగు వస్తువు దీపకము."

'యథాయోగి క్రియాపదమ్' ఇత్యాది కారికచే ఈ విషయమును ఉపసంహరించుచున్నాడు. యథా = ఏ ప్రకారముచే, యుజ్యతే = యుక్తమగునో అట్టి యథాయోగి యగు క్రియాపదము దేనికో అది యథాయోగి క్రియాపదము. దీపకమున క్రియ ఒక వస్తువుతో ఏ విధముగ సంబంధమును అనుభవించుటకు శక్తమగునో (అ విధముగ కూర్పబడును.) ఇంకను ఎట్టిది? 'మనః సంవాది తద్విదామ్'. తద్విదామ్ = కావ్యజ్ఞుల, మనసి సంవదతి = చిత్తమునందు ఏది ప్రతిఫలించునో అది. ఇంకను ఎట్టిది? 'వర్ణనీయస్య విచ్ఛిత్తేః కారణమ్'. వర్ణనీయస్య = ప్రస్తుత మగు పదార్థముయొక్క, విచ్ఛిత్తేః = శోభకు, కారణమ్ = నిమిత్త మైనది.

దీపకాలంకారము తరువాత కుంతకుడు రూపకాలంకారమును నిబంధించు చున్నాడు. ఏకదేశ వృత్తిత్వము, అనేక దేశ వృత్తిత్వము, అనునవి దీపక రూపములకు రెండింటికి తుల్యములే గావున దీపకాలంకారము తరువాత రూపక నిరూపణ మని కుంతకుడే "ఏకదేశ వృత్తిత్వ మనేక దేశ వృత్తిత్వం చ రూపకస్య దీపకేన సమానత్వమితి తదనన్తరమస్యో పనిబన్ధనమ్" అను వాక్యమున చెప్పెనని దే గారు అధః సూచికలో తెలిపియున్నారు.

'యస్మాలా సరసోల్లేఖా' (II-14)అను కారికలో రూపకమునకు ఉపచార వక్రతయే జీవిత మని కుంతకుడు చెప్పియున్నాడు—(యస్మాదుపచార వక్రతా

జీవితమేతదలంకరణం ప్రథమమేవ సమాఖ్యాతమ్-'యస్మాలా సరసోల్లేఖా రూపకాది రలంకృతిః' ఇతి) ఇవుడు రూపక భేదములను చెప్పుచున్నాడు (ఏవం చ రూపకాది సామాన్యలక్షణముల్లిఖ్య ప్రకార పర్యాలోచనేన తమే (దే)వోన్మీలయతి-ఈ విధముగ రూపకాది సామాన్య లక్షణము చెప్పి ప్రకార భేద నిరూపణముచే దానినే విశదీకరించుచున్నాడు). భామహుడు అంగీకరించిన, సమస్తవస్తు విషయము, ఏకదేశ వివర్తి యను భేదద్వయమును కుంతకుడు కూడ అంగీకరించినాడు. కాని లిఖిత ప్రతిలోని పత్రములు అస్తవ్యస్తము లగుటవలన కాబోలు రూపకాలంకార లక్షణము ఇచట వచ్చుటకు బదులు పర్యాయోక్తాలంకారము తరువాత వచ్చినది. ఆ లక్షణాదికమునకు ఇది యుక్తస్థాన మగుటచే అది ఇచటనే చూపబడుచున్నది.

కా. ఉపచారైక సర్వస్వం యత్ర తత్ సామ్యముద్వహత్
యదర్పయతి రూపం స్వం వస్తు తద్రూపకం మతమ్. 19

"ఎచట, ఉపచారమునకు ప్రధాన జీవిత మగు ఆ (లోకప్రసిద్ధ మగు) సామ్యమును వహించుచున్నదై ఏ వస్తువు తన స్వరూపమును అర్పించునో అది రూపక మని చెప్పుదురు."

ఉపచారేత్యాది శ్లోకముచే రూపకమును వివరించుచున్నాడు. 'వస్తు తద్రూపకం విదుః'-ఆ, వస్తు=పదార్థ స్వరూపమును రూపక మనెడు పేరు గల అలంకారమునుగా తెలిసికొనుచున్నారు. 'జనాః' అనునది అధ్యాహారము. ఎట్టిది? 'యదర్పయతి' మొ. యత్ = కర్తయగు ఏది, అర్పయతి=అర్పించుచున్నదో. దేనిని? స్వం=తన సంబంధమైన, రూపమును-అనగా వాచకాత్మక మగు వాక్య స్వభావమును. ఇది అలంకార ప్రస్తావ మగుట వలనను, స్వసంబంధి యగునది అలంకారమే అగుట వలనను (అలంకార మగు ఆరోప్యమాణ వస్తువు తన స్వరూపమును ఉపమేయమునకు సమర్పించుచున్నది అని యర్థము). ఏమి చేయుచు? 'సామ్యముద్వహత్'—సమత్వమును ధరించుచు. అంతియే కాని జన్యత్వము ప్రమేయత్వము మొదలగు సామాన్య ధర్మము కాదు ఏలయన పూర్వోక్త లక్షణ మగు సామ్యముచే వర్ణనీయ మగు వస్తువు సహృదయ హారిత్వమును పొందును. 'ఉపచారైక సర్వస్వమ్'—ఉపచారః = తత్త్వము యొక్క (అన్య వస్తుత్వము యొక్క-అనగా ఉపమేయమునందు ఉపమానత్వము

యొక్క) ఆరోపము, దానికి, ఏకం సర్వస్వమ్ = కేవలమే అయిన జీవితము. ఏలయన ఉపచార ప్రవృత్తి సామ్యమును బట్టి ఏర్పడును కదా? ఏలయన— 'యన్మూలా సరసోల్లేఖా రూపకాది రలంకృతిః' అను కారికార్థమున (చూ. పై. II-14) ఈ రూపకాలంకారమునకు ఉపచార వక్రతయే జీవిత మని మొదటనే ప్రతిపాదింపబడినది. కావుననే, సహృదయ హృదయ సంవాదమును బట్టి కేవలము 'ముఖమే చంద్రుడు' ఇత్యాదులందే కాక పూర్వోదాహృత మగు 'కిం తారుణ్య తరోః' ఇత్యాది శ్లోకమునందు గూడ (చూ. పై. I-192). రూపకాలంకారము ఉన్నది. కావుననే ఉపమానముకంటె న్యూనముగ గాని అధికముగ గాని ఉన్న సామ్యము దానికి (రూపకమునకు) నిమిత్తము కాదని చెప్పుటలో సహృదయులే ప్రమాణము.

ఈ విధముగ రూపకాలంకార సామాన్య లక్షణమును చెప్పి దానికి సంబంధించిన భేదములను చెప్పుచు దానినే వివరించుచున్నాడు—

కా. సమస్త వస్తు విషయ మేకదేశవివర్తి చ.

ఇది సమస్త వస్తు విషయ మనియు, ఏకదేశవివర్తి యనియు రెండు విధములు.

సమస్త మగు వస్తువు దేనికి విషయమో అది సమస్త వస్తు విషయము. దీని యర్థ మిది-ప్రధానముగ వాచ్యములై సకల వాక్యమునకును సంబంధించిన అన్ని అభిధేయములును అలంకార్యములుగ నుండి, సుందర మగు తన (ఉపమానము యొక్క) రూప స్వభావమును సమర్పించుటచే రూపాంతరమును పొందింపబడినవై దేనికి గోచర మగునో (అది సమస్త వస్తు విషయము). (అనగా ఒక వాక్యమునందలి ప్రధాన పదార్థము లన్నింటి యందును ఉపమానత్వారోప మున్నచో అది సమస్త వస్తు విషయ రూపకము).

ఎట్లనగా—

''మృదుతనులతావసన్తః సుందరవదనేందు బింబసిత పక్షః
మన్మథ మాతంగమదో జయత్యహో తరుణతారంభః'' 80

''మృదు వగు తనులతకు వసంతమును, సుందర మగు ముఖ చంద్ర బింబమునకు శుక్ల పక్షమును, మన్మథ గజమునకు మదమును అగు యౌవనారంభము సర్వోత్కృష్టముగ నున్నది.''

ఇచట తనువునందు లతాత్వారోపము, ముఖమునందు చంద్రబింబత్వా రోపము, మన్మథుని యందు మాతంగత్వారోపము చేయబడినవి. పిమ్మట తను లతాది సంబంధమును అనుసరించి యౌవనారంభమునకు వసంతత్వ, శుక్ల పక్షత్వ, మదత్వారోపము చేయబడినది. ఈ విధముగ వాక్యమునందలి ప్రధాన పదార్థము లన్నింటి యందును రూపక మున్నది గాన ఇది సమస్త వస్తు విషయము.

ఇపుడు ఏకదేశవివర్తి రూపకమును వివరించుచున్నాడు—

వి. భామహుడు సమస్త వస్తు విషయము, ఏకదేశవివర్తి అను రెండు రూపక భేదముల నంగీకరించి మొదటి భేదమునకు—

"శీకరాంభోమదసృజస్తుఙ్గా జలదదన్తినః
నిర్యాన్తో మదయన్తీమే శక్రకార్ముక వారణాః"

అను శ్లోకమును, రెండవ భేదమునకు 'తడిద్వలయకక్ష్యాణామ్' ఇత్యాదిశ్లోకము నుదాహరణముగ చూపెను. 'ఏకదేశవివర్తి' అనుదాని యర్థమును గాని ఉదా హరణమునందు తత్సమన్వయమును గాని అతడు చూపి యుండలేదు. కాని తద్వ్యాఖ్యాత యగు ఉద్భటుడో, మరి అన్యులెవ్వరో చేసిన వ్యాఖ్యానమును దృష్టిలో నుంచుకొని కుంతకు డిచట వ్రాయుచున్నట్లు తోచును.

ఇచట పూర్వాచార్యులు 'ఏకదేశముచే, వివర్తతే = విఘటిత మగుచున్నది లేదా విశేషరూపమున ఉన్నది కావున ఏకదేశవివర్తి' అని వ్యాఖ్యానించి యున్నారు. (అనగా—వాక్యమునందలి ఒక భాగమున రూపణము న్యూనముగ ఉన్నచో లేదా వాక్యమునందలి ఒక భాగమునందు విశేషరూపమున రూపణ మున్నచో అది ఏకదేశవివర్తి యని వారి యభిప్రాయము). ఈ రెండు విధము లగు వ్యాఖ్యయు అయుక్తమే. (న్యూనాధిక్యములను చేర్చక ఈ విధముగ అర్థము చెప్పవలెను) వాక్యమునందలి ఒక భాగమునందు మాత్రమే ఏది తన స్వభావమును సమర్పించుట యను రూపణమును కూర్చునో అది ఒకదేశము నందు మాత్రమే ఉండుటను బట్టి ఏకదేశవివర్తి యని చెప్పబడును. ఎట్లనగా

"తడిద్వలయ కక్ష్యాణాం వలాకా మాల భారిణామ్
పయోముచాం ధ్వనిర్ధీరో దునోతి మమ తాం ప్రియామ్"

"మెరుపుల వంపులే కక్ష్యలుగా (నడుమునకు చుట్టిన అలంకారములుగా) కలిగి, బలాకాపంక్తు లనెడు మాలలను ధరించుచున్న మేఘములయొక్క ధీర మగు ధ్వని నా ప్రియురాలిని పీడించుచున్నది".

ఇచట విద్యుద్వలయములను కక్ష్యలుగను, బలాకలను మాలలుగను రూపణము చేయుట జరిగినది; కాని మేఘములను మాత్రము ఏనుగులుగ రూపింప లేదు గాన ఇది ఏకదేశవివర్తిరూపకాలంకారము. ఇది ఎంతయు యుక్తి యుక్త ముగ నున్నది. ఏలయన అలంకార్యమునందు శోభాతిశయమును కూర్చుటయే అలంకారప్రయోజనము ఇంతకు మించి మరియొక ప్రయోజన మేదియును లేదు. (కావున ఇచట వాక్యైకదేశమునందున్న రూపకము గూడ శోభాదాయకముగ నున్నది గాన ఇది అలంకార మని యర్థము).

అవ. ఇపుడు ఒకభాగమున ఆధిక్యము లేదా ఒక భాగమున న్యూన త్వము ఉన్నచో అది ఏకదేశవివర్తి యని చెప్పిన పక్షద్వయమునందును దోష మును చూపుచున్నాడు.

వ్యా. మీరు చెప్పిన విధముగా— దీనిచే (ఏకదేశవివర్తిరూపకముచే) రూపకాపేక్షయా భిన్న మగు ఏదియో యొక వైలక్షణ్యము సంపాదింపబడు చున్నది అని అంగీకరించినచో అపుడు ఇది రూపకాలంకారభేదములలో నొకటి అని చెప్పుటకు అవకాశ ముండదు; (అలంకారాంతర మని చెప్పవలెను) దాని మాట అటుండ— (ఏకదేశేన వివర్తతే విఘటతే యని అర్థము చెప్పినచో) కక్ష్యాది నిమిత్తముల (రూపకనిమిత్తము లగు ఉపమానముల) ఆరోపణమునకు ఉచిత మగు ముఖ్యవస్తు విషయమున (గజవిషయమున) విఘటిత మగుటచే (అనగా ముఖ్య మగు గజత్వారోపణము లేకుండుటచే) అలంకారదోషత్వము దుర్నివార మగును. కావున వేరొక విధముగ సమాధానము చెప్పవలసి యున్నది. రూపకాలంకారముయొక్క యథార్థస్వరూప మేమనగా— వర్ణనీయ మగు ప్రకృత వస్తువునకు (ఉపమేయమునకు) ప్రసిద్ధసౌందర్యాతిశయము గల పదార్థము (ఉపమానము) యొక్క సౌకుమార్యమును ఆధారముగ గొనినదియు, సామ్య కృతమును, విసంవాదరహితమును అగు స్వరూపసమర్పణగ్రహణసామర్థ్యము— (అనగా ఉపమానముచే సమర్పిత మగు దాని స్వరూపమును గ్రహింపగలిగిన సామర్థ్యము). కావున 'ముఖము చంద్రుడు' అనునపుడు ముఖమే చంద్రుడుగ

అగుచున్నది. అనగా చంద్రరూపమున కానబడుచున్నది. కావున ఈ అలంకారము ఈ విధముగ నుండును.

దీని తరువాత కుంతకుడు మరి యొక ఉదాహరణమును చూపుచున్నాడు

"హిమాచలసుతావల్లి గాఢాలింగిత మూర్తయే
సంసారమరుమార్గైక కల్పవృక్షాయ తే నమః". 83

"హిమాచలసుత యనెడు లతచే గాఢముగ ఆలింగిత మగు శరీరము కలిగి, సంసార మనెడు మరుమార్గమునందు ఏకైక కల్పవృక్షముగ నున్న నీకు నమస్కారము".

ఇచట పార్వతియందు లతాత్వారోపము, సంసారమునందు మరుమార్గత్వారోపము, ఈశ్వరునియందు కల్పవృక్షత్వారోపము చేయబడినది గాన ఇది సమస్తవస్తువిషయరూపకమున కుదాహరణము.

ఇంకను ఎట్లనగా- 'ఉపోఢరాగేణ' ఇత్యాది పూర్వోక్తోదాహరణము (చూ. రసవదలంకారోదాహరణము). ఇచట గూడ రక్తవర్ణ నక్షత్రాదులందు అనురాగత్వ కనీనికాత్వాద్యారోప మున్నది గాన రూపకాలంకారము.

ప్రతీయమాన రూపకమున కుదాహరణ మెట్లనగా-

లావణ్యకాన్తి పరిపూరిత దిఙ్ముఖేఽస్మిన్
స్మేరేధునా తవ ముఖే సరసాయతాక్షి.
క్షోభం యదేతి న మనాగపి తేన మన్యే
సువ్యక్తమేవ జలరాశిరయం పయోధిః. (ధ్వన్యా. II.) 84

'ఓ సుందరములును విశాలములును అగు నేత్రములు కలదానా! లావణ్యకాంతిచే నింపబడిన దిగంతములు గల నీముఖ మిపుడు చిరునవ్వుతో కూడి యున్నను, ఈ సముద్రము కొంచెమైనను క్షోభను చెందుట లేదనగా దీనిని పట్టి ఇది జలరాశియే యని (లడయోరభేదః కావున 'జడరాశి'యే యని) స్పష్ట మగుచున్నది".

ఇచట సముద్రుడు క్షోభింపవలసి యున్నను క్షోభించుట లేదు అని చెప్పుటచే ప్రియాముఖమునందు చంద్రత్వారోపము గమ్య మగుచున్నది.

కా. నయన్తి కవయః కాంచిద్వక్రభావరహస్యతామ్
అలంకారాన్తరోల్లేఖసహాయం ప్రతిభావశాత్, 20

"కవులు తమ ప్రతిభచే ఇతరాలంకారములను గూడ సహాయముగ చేర్చి ఈ రూపకమునకు ఒకానొక వక్రభావరహస్యత్వమును కూర్చుచుందురు".

దానినే మరియొక శోభను పురస్కరించుకొని విశిష్టరూపమున వివరించుచున్నాడు. ఈ రూపకాలంకారమునే, కాంచిత్ = అలౌకిక మగు, వక్రభావరహస్యతామ్ = వక్రతాపరమార్థత్వమును, నయన్తి = పొందించుదురు. వక్రతావిచ్ఛిత్తి సంపర్కముచే కలిగిన రామణీయకముచే అదియే మరియొక విధముగ భాసించునట్లు కూర్చుచుందురు. ఎట్టిది? అలంకారాన్తరోల్లేఖసహాయమ్ = అలంకారాన్తరస్య = ససందేహము, ఉత్ప్రేక్ష మొదలగు మరి యొక అలంకారముయొక్క, ఉల్లేఖః = వికాసము, సహాయః = కావ్యశోభాతిశయమును కల్గించుటలో సహకారి, దేనికో అది దేనివలన పొందింతురు? ప్రతిభావశాత్ = తమ శక్తికి లొంగియుండుట వలన. అట్టి లోకాతిక్రాంతగోచర మగు విషయమున దానియొక్క కూర్పు చేయబడును. ఆ విధముగ ప్రసిద్ధి లేకపోవుటచే, ఎచట, సిద్ధవ్యవహారావతరణము (అనగా ప్రసిద్ధోపమానరూపత్వాధ్యారోపము) సాహసకార్యము వలె కన్పట్టునో, అచటనే మరి యొక అలంకారమనెడు సహాయమును పైమెరుగుగా కూర్చుటచే, సహృదయహృదయసంవాదముచే సుందర మగు గొప్ప ప్రౌఢి ఉత్పన్న మగును.

దీని తరవాత కుంతకుడు పూర్వోదాహృత మగు 'కిం తారుణ్యతరోః' 85 (చూ. I-92)

అను శ్లోకమును, వ్రాతప్రతిలో దురూహ్యరూపమున నున్న మరియొక శ్లోకమును ఉదాహరణముగ చూపెను.

'కిం తారుణ్యతరోః' ఇత్యాదిశ్లోకమున వాక్యాలంకారముగ నున్న రూపకాలంకారమునకు ససందేహాలంకారము శోభాతిశయజనక మగు విధమున కూర్పబడినది అని కుంతకుడే ఆ శ్లోకము క్రింద చెప్పియున్నాడు.

కా. అప్రస్తుతోऽపి విచ్ఛిత్తిం ప్రస్తుతస్యావతారయన్
యత్ర తత్సామ్యమాశ్రిత్య సంబంధాన్తరమేవ వా 21

వాక్యార్థోఽసత్యభూతో వా ప్రాప్యతే వర్ణనీయతామ్
అప్రస్తుత ప్రశంసేతి కథితాసావలంకృతిః 22

"ఎచట, దానికి (రూపకమునకు) సంబంధించిన సామ్యముగాని, మరి యొక సంబంధమున గాని ఆశ్రయించి, వాక్యార్థము గాని, అసత్య మగు పదార్థము గాని, అప్రస్తుతమే యైనను, ప్రస్తుతమునకు శోభను కూర్చుచు వర్ణనీయత్వమును పొందునో అది అప్రస్తుతప్రశంసాలంకారముగ చెప్పబడినది".

ఈ విధముగ రూపకమును గూర్చి విచారించి దానియొక్క దర్శన సంపద—అనగా రూపకమునందు కానవచ్చెడు సామ్యము ఆధారముగా గల అప్రస్తుత ప్రశంసను గూర్చి 'అప్రస్తుతోఽపి' ఇత్యాదిచే ప్రస్తావించుచున్నారు. 'అప్రస్తుత ప్రశంసేతి కథితాసావలంకృతిః'—అది ఆలంకార వేత్తలచే అప్రస్తుత ప్రశంస యనెడు పేరుతో చెప్పబడినది. ఎట్టిది ? యత్ర = దేనియందు, అప్రస్తుతోఽపి = వివక్షితము కాకున్నను పదార్థము, వర్ణనీయతాం (ప్రతి) ప్రాప్యతే = వర్ణనా విషయముగా చేయబడునో. ఏమి చేయుచున్నదై ? ప్రస్తుతస్య = వివక్షితార్థము యొక్క, విచ్ఛిత్తిం = శోభను, అవతారయన్ = ఉల్లసింపచేయుచు. ప్రస్తుత పదార్థము రెండు విధములుగ ఉండవచ్చును; వాక్యాంతర్భూత మగు పదమాత్రమునకు సంబంధించినది (అనగా పదమాత్ర బోధ్య మగునది) మొదటిది, సకల వాక్యమునందును వ్యాపక మగు కార్యముగ నుండి (ఇచట కార్య మనగా ప్రతిపాద్య మని యర్థము) వివిధము లగు స్వభావాతిశయములతో కూడినదై ప్రాధాన్యముతో నున్నది రెండవది. కవులు రెండు విధములగు ఆ ప్రస్తుతార్థమును ప్రతీయమాన మగు విధమున మనస్సులో నుంచుకొని, దానికి విచ్ఛిత్తి విశేషమును కలిగించుటకై అప్రస్తుత మగు మరి యొక పదార్థమును ఈ అలంకారమున వర్ణించుచుందురు. ఏమి చేసి ? తత్సామ్య మాశ్రిత్య- తత్ = అనంతరోక్త మగు రూపకాలంకారమునందలి, సామ్యం = సమత్వమును నిమిత్తముగ చేసికొని, సంబంధాంతరమేవ వా = లేదా నిమిత్తత్వము (కార్యకారణ భావము) మొదలగు మరి యొక సంబంధమును ఆశ్రయించి, వాక్యార్థముగాని, అనగా పరస్పరాన్విత పదసముదాయ రూప సకల వాక్యార్థము గాని, లేదా అసత్యమగు పదార్థము గాని (వైయాకరణుల

మతమున వాక్యార్థమే సత్యము; పద పదార్థములు అసత్యములు. కావున 'అస త్యభూతః' అనుదానికి 'అసత్యమగు పదము యొక్క అర్థము' అని యర్థము ) అనగా—ఎచట సామ్యమునుగాని, తద్భిన్న మగు మరి యొక సంబంధమును గాని ఆశ్రయించి అప్రస్తుతమును ప్రస్తుత శోభకై కూర్తురో (అచట అప్రస్తుత ప్రశంసాలంకార మని యర్థము).

సామ్య సమాశ్రయముచే వాక్యాన్తర్భూత మగు ప్రస్తుత పదార్థ ప్రశంస ఎట్లనగా—

"లావణ్య సింధురపరైవ హి కేయమత్ర
యత్రోత్పలాని శశినా సహ సంప్లవన్తే.
ఉన్మజ్జతి ద్విరద కుంభతటీ చ యత్ర
యత్రాపరే కదలికాండ మృణాల దండాః" 86 (ధ్వన్యా).

"ఈ లావణ్య నది యేదియో అపూర్వముగ నున్నదే! ఇచట కలువలు చంద్రునితో పాటు తేలిపోవుచున్నవి. గజకుంభద్వయము పైకి తేలుచున్నది. ఇంకను అరటి స్తంభములు తామర తూడులును గూడ తేలియాడుచున్నవి."

ఇచట తరుణీ కటాక్షచ్ఛటా-ముఖ-కుచ యుగ-ఊరు యుగ-బాహు యుగములకు ఉత్పలాదులతో గల సాదృశ్యము నాధారముగ గొని అప్రస్తుతో త్పలాది వర్ణనము చేయుటచే ప్రస్తుత తరుణీ నయనాదుల ప్రశంస చేయబడు చున్నది. ఇది సకల వాక్యాం తర్భూతము. కావున వాక్యాంతర్భూత పదార్థ ప్రశంసారూప మగు అప్రస్తుత ప్రశంసకు ఉదాహరణము

వ్యా. సామ్యమును ఆశ్రయించుటచే నకలవాక్య వ్యాపక మగు ప్రస్తుత పదార్థ ప్రశంస ఎట్లనగా—

"ఛాయా నాత్మన ఏవ యా కథమసావన్యస్య నిగ్రహః
గ్రీష్మోష్మాపది శీతల స్తలభువి స్పర్శోఽనిలాదేః కుతః.
వార్తా వర్ష శతే గతే కిల ఫలం భావీతి వాన్త్రైవ సా
ద్రాఘిమ్నా ముషితాః కియచ్చిరమహో తాలేన బాలా వయమ్" 87
(సుభాషితావలీ)

"తనకే ఎందుకును అక్కరకు రాని నీడ నిరాఘాటముగ ఇతరుల కుపయుక్త మగుననుట ఎట్లు? గ్రీష్మ సంబంధ మగు వేడిమిచే కష్టము కలుగు నపుడు, దాని క్రింద చల్లని వాయుస్పర్శాదిక మెట్లు? నూరు సంవత్సరములు దాటిన తరువాత ఫలము లభించును అనెడు వార్త వార్తామాత్రమే. అహా, తెలివి తక్కువ వారమై మేము తాలవృక్షమును చూచి, దాని దీర్ఘత్వముచే ఎంత కాలము మోసపోయితిమో కదా!"

ఇచట వృథాసేవిత మగు లుబ్ధ ధనికునకును, తాలవృక్షమునకును గల సామ్యమును మనస్సులో నుంచుకొని చేసిన తాలవృక్ష వృత్తాంత వర్ణనముచే ప్రస్తుత లుబ్ధ ధనిక వృత్తాంతము గమ్యమగుచున్నది. కావున నిది సకలవాక్య వ్యాపక ప్రస్తుత పదార్థ ప్రశంసారూప మగు అప్రస్తుత ప్రశంసకు ఉదాహరణము.

దీని పిమ్మట కుంతకుడు సాదృశ్య భిన్న సంబంధమును పురస్కరించు కొని యున్న వాక్యాంతర్భూత ప్రస్తుత పదార్థ ప్రశంసకు ఉదాహరణమును చూపుచున్నాడు:-

సంబంధాంతరము నాశ్రయించుటచే వాక్యాంతర్భూత మగు ప్రస్తుతార్థ ప్రశంస ఎట్లనగా—

"ఇందుర్లిప్త ఇవాంజనేన జడితా దృష్టిర్మృగీణా మివ
ప్రమ్లానారుణిమేవ విద్రుమలతా శ్యామేవ హేమ ప్రభా.
కార్కశ్యం కలయా చ కోకిల వధూ కంఠేష్వివ ప్రస్తుతం
సీతాయాః పురతశ్చ హన్త శిఖినాం బర్హాః సగర్హా ఇవ" 88

(బాలరా. I-42)

"సీత ఎదుట-చంద్రుడు మసిపూసి నట్లున్నాడు. ఆడ లేళ్ళ దృష్టి జడమైనట్లున్నది. పొగడముల తీగయొక్క ఎరుపు వసివాడిపోయి నష్టమైనది. బంగారు కాంతి నల్లబడినట్లున్నది. కోకిల వధూ కంఠముల యందు కొంచెముగ కర్కశత్వము ప్రారంభమైనట్లున్నది. నెమలి పింఛములు నింద్యములు వలె నున్నవి."

ఇచట 'చంద్రునకు మసిపూసినట్లున్నది' ఇత్యాది విధమున వర్ణించుటచే, విపరీతలక్షణచే, సీతా ముఖము చంద్రశోభాతిశాయి సౌందర్యముతో నొప్పు చున్నది ఇత్యాది రూపమున అర్థ ప్రతీతి కలుగుటచే నిది సాదృశ్యభిన్న సంబంధాశ్రయణముచే వాక్యాంతర్భూత ప్రస్తుత పదార్థ ప్రశంసారూపా ప్రస్తుత ప్రశంసకు ఉదాహరణము.

సంబంధాంతరమును ఆశ్రయించుటచే సకలవాక్య వ్యాపక మగు ప్రస్తుత ప్రశంస ఎట్లనగా—

పరామృశతి సాయకం క్షిపతి లోచనం కార్ముకే
విలోకయతి వల్లభాం స్మిత సుధార్ద్రవక్త్రం స్మరః.
మధోః కిమపి భాషతే భువన నిర్జయాగ్ర్యావనిం.
గతోఽహ మితి హర్షితః స్పృశతి గోత్రలేఖా మహో. 89

"మన్మథుడు బాణమును స్పృశించుచున్నాడు. ధనుస్సుపై నేత్రములను ప్రసరింపచేయుచున్నాడు స్మితామృతముతో ఆర్ద్ర మగు ముఖము కలుగు నట్లుగా ప్రియురాలి వైపు చూచుచున్నాడు. వసంతునితో ఏమేమియో చెప్పు చున్నాడు. నేనిపుడు భువన విజయాగ్ర స్థానమును పొందితిని అని సంతసించుచు గోత్రలేఖను స్పృశించుచున్నాడు! ఏమి ఆశ్చర్యము!"

'గోత్రలేఖా' అనగా నేనీ ఘనకార్యమును సాధించితిని అని తన పేరును వ్రాసికొనెడు పత్రమని అర్థము కావచ్చును. లేదా 'చూడు మన్మథుని ప్రతాపం' అనుచు తన పేరు ఉదాహరించుట కావచ్చును.

ఇచట మన్మథ చేష్టాతిశయము అప్రస్తుతము తరుణీ తారుణ్య ప్రారంభము ప్రస్తుతము

అప్రస్తుత మన్మథ చేష్టావర్ణనముచే ప్రస్తుత తరుణీతారుణ్య నవావతారము ప్రతీత మగుచున్నది గాన ఇది అప్రస్తుత ప్రశంస. ఇందు సాదృశ్యము కాక కార్యకారణ భావరూప సంబంధము (తారుణ్యావతారము కారణము. స్మరచేష్ట కార్యము) ఆశ్రయింపబడినది.

దీని పిమ్మట కుంతకుడు అసత్యభూత వాక్యార్థ తాత్పర్యా ప్రస్తుత ప్రశంసకు ఉదాహరణముగ ప్రాకృత శ్లోకము నొకదానిని ఉదాహరణముగ

చూపియున్నాడు గాని దాని స్వరూపము గ్రంథ పాతముచే దుర్జ్ఞేయముగ నున్నది.

ఈ విధముగ కవులలో ప్రస్తుత ప్రశంసా వ్యవహారము అతి విస్తృత రూపమున కాన నగుచున్నది కావున దానిని సహృదయులు స్వయముగనే ఊహించుకొనవలెను

('అప్రస్తుత ప్రశంసా' శబ్దమునందలి) 'ప్రశంసా' శబ్దము 'అర్థ ప్రకాశః' మొదలగు శబ్దముల వలె విపరీత లక్షణచే ప్రవర్తించును.

అనగా—ఘటాదులు అచేతనము లగుటచే అవి స్వతః ప్రకాశ స్వరూపములు కావు. కాని వాని, జ్ఞానము కలుగు సమయమున, ప్రకాశ స్వరూప మగు ఆత్మతో సంబంధము కలుగుటచే అవి కూడ ప్రకాశించుచున్న వని చెప్పుదుము. అట్లే అప్రస్తుత ప్రశంసా స్థలము లందు వాస్తవమున ప్రశంస ప్రస్తుతములకే జరుగుచున్నది కాని అప్రస్తుతములకు కాదు.

కా. యద్వాక్యాన్తరవక్తవ్యం తదన్యేన సమర్థ్యతే
యేనోపశోభానిష్పత్త్యై పర్యాయోక్తం తదుచ్యతే. 28

"విచ్ఛిత్తి విశేషమును సంపాదించుటకై ఎచట, ఒక వాక్యముచే ప్రతిపాదింపబడవలసిన యర్థము మరియొక వాక్యముచే ప్రతిపాదింపబడునో అది పర్యాయోక్తాలంకారముగా చెప్పబడుచున్నది"

ఈ విధముగా అప్రస్తుత ప్రశంసను విచారించి, వివక్షిత మగు అర్థమును ప్రతిపాదించుటకు మరియొక ప్రకారముచే చెప్పుట అనునది ఉండుటచే, దీనితో (అప్రస్తుత ప్రశంసతో) చాల సామ్యము గల పర్యాయోక్తమును యద్వాక్యాన్తరేత్యాది కారికచే విచారించుచున్నాడు. పర్యాయోక్తం తదుచ్యతే = అది పర్యాయోక్త మనెడు అలంకారముగా చెప్పబడుచున్నది. ఎట్టిది? వాక్యాంతరముచే చెప్పదగిన వాక్యార్థరూప మగు ఏ వస్తువు ఏ వాక్యాంతరముచే ప్రతిపాదింపబడుచున్నదో (అది). ఎందులకు? ఉపశోభానిష్పత్త్యై = విచ్ఛిత్తిని సంపాదించుటకు. అది పర్యాయోక్త మని యర్థము.

పర్యాయ వక్రత్వము కంటె దీనియందు విశేష మేమి యున్నది? పర్యాయ వక్రత్వమున పదార్థము మాత్రమే వాచ్య మగుచు విషయ మగు

చున్నది. పర్యాయోక్తమునకు వాక్యార్థము గూడ అంగమగుచున్నది. కావున అది వేరుగ ప్రతిపాదింపబడుచున్నది.

ఉదాహరణము ఎట్లనగా—

'చక్రాభిఘాత ప్రసభాజ్ఞయైవ చకార యో రాహువధూజనస్య
ఆలింగ నోద్దామ విలాసవంధ్యం రతోత్సవం చుంబనమాత్ర శేషమ్ '86

"ఏ విష్ణువు, చక్రప్రహార మనెడు అనుల్లంఘనీయ మగు ఆజ్ఞచేతనే ఆలింగనప్రధాన మగు విలాసములుగల దగు రాహువధూజనుల రతోత్సవమును చుంబనము మాత్రమే శేషించినదానినిగా చేసినాడో"

ఇచట 'రాహువుయొక్క శిరస్సును ఖండించెను' అను వాక్యార్థము మరియొక వాక్యము ద్వారా తెలుపబడినది గాన ఇది పర్యాయోక్తము.

దీని తరువాత గ్రంథపాతము. తరువాత రూపకాలంకార నిరూపణమునకు సంబంధించిన కొన్ని వాక్యములున్నవి. వాటి పిమ్మట వ్యాజస్తుత్యలంకారమునకు సంబంధించిన ఉదాహరణములు కనబడుచున్నవి. దీనినిబట్టి వ్యాజస్తుత్యలంకారనిరూపణ భాగములు గూడ గ్రంథపాతమున లుప్తమైనట్లు తోచును. ఉపలభ్యమాన మగు వ్యాజస్తుత్యుదాహరణము—

"భూభారోద్వహనాయ శేషశిరసాం సార్ధేన సంనహ్యతే
విశ్వస్య స్థితయే స్వయం స భగవాన్ జాగర్తి దేవో హరిః.
అద్యాప్యత్ర చ నాభిమానమసమం రాజం స్త్వయా తన్వతా
విశ్రాన్తిః క్షణమేక మేవ న తయోర్జాతేతి కోఽయం క్రమః" 91

"భూభారమును వహించుటకై శేషుని శిరఃసముదాయము ఇంకను ప్రయత్నము చేయుచునే యున్నది. భగవంతు డగు ఆ విష్ణువు విశ్వసంరక్షణము కొరకై జాగరూకుడుగనే ఉన్నాడు. ఓ రాజా! "నేనే ఈ భారమునంతను మోయుచున్నాను" అని నీవు అత్యంతాభిమానమును చూపుచున్నను, వారికి ఒక్క క్షణమైనను విశ్రాంతి కలుగుటయే లేదు. ఇది ఏమి పద్ధతి!"

ఈ శ్లోకము తరువాత ఈ గ్రంథముననే పూర్వోదాహృతము లగు 'ఇన్దోర్లక్ష్మ' 92. 'హే హేలాజిత" 93. (చూ. I-90), 'నారూప్యన్య

తరో' 94. (చూ. I-9) అను శ్లోకములు గూడ ఉదాహృతము లైనవి. వ్యాజ స్తుత్యలంకారము తరువాత ఉత్ప్రేక్షాలంకారము ప్రతిపాదిత మైనది. ఉత్ప్రేక్షా లక్షణకారికలు వృత్తిసహాయముచే గ్రథితములైనవి.

కా. సంభావనానుమానేన సాదృశ్యేనోభయేన వా
నిర్వర్ణ్యాతిశయోద్రేక ప్రతిపాదనవాంఛయా 24
వాచ్యవాచక సామర్థ్యాక్షిప్తస్వార్థై రివాదిభిః
తదివేతి తదేవేతి వాదిభిర్వాచకం వినా। 25
సముల్లిఖిత వాక్యార్థవ్యతిరిక్తార్థ యోజనమ్.

"వర్ణనీయ మగు వస్తువునకు అతిశయోద్రేకమును సంపాదింపవలె ననెడు అభిలాషచే, సంభావనాకృత మగు అనుమానమును గాని, సాదృశ్యమునుగాని, అనుమాన సాదృశ్యములు రెండింటిని గాని నిమిత్తముగ గొని, 'ఇది అప్రస్తుతము వలె నున్నది', 'ఇది అప్రస్తుతవస్తురూపముననే' ఉన్నది అని "వా" ('వా' ఇవార్థకము) మొదలగు వాటిచే గాని, లేదా వాచకము లగు ఇవాదులు లేని పక్షమున వాచ్య వాచకముల సామర్థ్యముచే ఆక్షిప్తము లగు స్వార్థము గల (-అనగా గమ్య మానము లగు) ఇవాదులచే గాని, ప్రస్తుత వాక్యార్థముకంటె భిన్నమగు వాక్యార్థమును కూర్చుట ఉత్ప్రేక్ష".

సముల్లిఖితవాక్యార్థముకంటె భిన్న మగు అర్థము యొక్క యోజనము ఉత్ప్రేక్ష. సముల్లిఖితః = బాగుగా ఉల్లిఖిత మగు, అనగా స్వాభావికరూపముతో నుండునట్లు సమర్పించుటకై ప్రస్తుత మగు, వాక్యార్థః = పదసముదాయరూప మగు వాక్యముయొక్క అర్థము, దానికంటె, వ్యతిరిక్తస్య అర్థస్య = వాక్యాన్తర తాత్పర్యరూప మగు భిన్నమైన అర్థముయొక్క, యోజనం = కూర్పు, ఉత్ప్రేక్షా భిధాన మగు అలంకారము. (స్వాభావికముగ చెప్పవలసి యున్న ప్రకృతార్థ మునందు మరియొక వాక్యముయొక్క అర్థమును గూడ కూర్చుట ఉత్ప్రేక్ష యని యభిప్రాయము) "ఉత్ప్రేక్షా" అనుదానికి ఉత్ప్రేక్షణము- అనగా

1 ఈ రెండవ కారిక అర్థము అస్పష్టముగ నున్నది. ఉత్తరార్ధమును పూర్వార్థ ముగ చేసి పఠించిన కొంతవరకు అర్థము సరిపోవును.

ఉత్ప్రేక్షించుట- ఊహించుట యని యర్థము. దేనిని సాధనముగా చేసికొని యని ఆశంకించి చెప్పుచున్నాడు- సంభావనానుమానేన = సంభావనముచే సంభావ్యమానముయొక్క అనుమానమేది కలదో దానిచేత. ఇది ప్రకారాంతరముచేత గూడ కలుగవచ్చును అని 'సాదృశ్యేన' ఇత్యాదికముచే చెప్పుచున్నాడు. సాదృశ్యేన = సామ్యరూప మగు హేతువుచే గూడ, సముల్లిఖితవాక్యార్థ వ్యతిరిక్తార్థ యోజనము ఉత్ప్రేక్షయే యగును. సాదృశ్యము వాస్తవ మనియు, కాల్పనిక మనియు రెండు విధముల నుండవచ్చును. అందు ఉపమాద్యలంకారవిషయ మగు సాదృశ్యము వాస్తవము. ఇచట ( ఉత్ప్రేక్ష యందు ) కాల్పనిక మగు సాదృశ్యము గ్రహింపబడును.

దీని తరువాత కొంత గ్రంథపాతము.

'ఉభయేనవా' ఇత్యాదికముచే దీనికి మరియొక ప్రకారమును ప్రతిపాదించుచున్నాడు—ఉభయేన వా = కలిసి యున్న సంభావనానుమాన రూపము, సాదృశ్యలక్షణమును అగు కారణద్వయముచే, ప్రస్తుతభిన్న మగు అర్థాంతరమును కూర్చుట. ఉత్ప్రేక్షకు సంబంధించిన ఈ మూడు ప్రకారముల కూర్పు ఏ అభిప్రాయముచే జరుగునో చెప్పుచున్నాడు —'నిర్వర్ణ్యాతిశయోద్రేక ప్రతిపాదన వాంఛయా' = వర్ణనీయమగుదానికి ఉత్కర్షాతిశయమును సంపాదింపవలెను అనెడు అభిలాషచే. ఎట్లు? 'తదివ' లేక 'తదేవ' అనెడు రెండు ప్రకారములచేత. తదివ = అప్రస్తుతము వలె దానియందలి అతిశయమును (దీనియందు, ప్రకృతమునందు) సంపాదించుటకై ప్రస్తుతముతోడ సాదృశ్యమును కూర్చుట. 'తదేవ' అనగా అప్రస్తుతమే అని చెప్పి దానియొక్క స్వరూపమును (ప్రకృతమునందు), ప్రసరింపచేయుచు, ప్రస్తుతమునందు (దీని) స్వరూపమును ఆరోపించుట, అనగా ప్రస్తుతమునందు గల ఉత్కర్షధారాతిశయము తెలియుటకై (దానియందు) మరియొక తాత్పర్యమును (అప్రస్తుతవస్తుతాద్రూప్యాదికమును) కూర్చుట. ఉత్ప్రేక్ష ఏ వాక్యములచే (పదములచే) ప్రకాశింపచేయబడునో చెప్పుచున్నాడు—ఇవాదిభిః = అవశ్యకతానుసారముగా ప్రయుక్తములగు ఇవాది శబ్దములచేత.

'న చేత్' (అట్లు కానిచో) అని మరియొక పక్షమును చెప్పుచున్నాడు. (లభ్యమాన మగు కారికలో 'నచేత్' అను నవిలేవు). వాచ్యవాచకముల సామర్థ్య

ముచే ఆక్షిప్త మగు స్వరూపము గల వాటి (ఇవాదుల) చేతనే. అనగా—ప్రయో గింపబడుచున్నను, లేదా ప్రయుక్తములు కాక ప్రతీయమానములుగ నున్నను అని యర్థము.

సంభావనాను మానముచే ఉత్ప్రేక్షకు ఉదాహరణము :-

"ఆపీడలోభాదుపకర్ణ మేత్య ప్రత్యాహితఃపాంశుయుతైర్ద్విరేఫైః
అమర్షణేనేవ మహీపతీనాం సంమోహమన్త్రో మకరధ్వజేన" 95

"(రాజుల, శిరస్సులందలి మాలలపై లోభముచే కర్ణసమీపము చేరి పరా గముతో గూడిన తుమ్మెదల ద్వారా, కుపితు డగు మన్మథునిచే రాజుల విషయ మున సంమోహమంత్రము ప్రయుక్త మైనట్లుండెను".

(ఇచట అమర్షమును సంభావించి తద్ద్వారా సంమోహ మంత్ర ప్రయోగో త్ప్రేక్ష చేయబడినది).

కల్పిత మగు సాదృశ్యమునకు ఉదాహరణ మెట్లనగా-

"రాశీభూతస్త్రి భువనగురోస్త్ర్యం బకస్యాట్టహాసః"

"(ఈ కైలాసము) ప్రతిదినము రాశిగా ఏర్పడిన ఈశ్వరుని అట్టహాసము వలె నున్నది"

(ఇచట ఈశ్వరుని అట్టహాసము రాశిగా అగుటయే కాల్పనికము గాన దానిని బట్టి చేసిన సాదృశ్యము కూడ కాల్పనికమే).

ఇంకను ఎట్లనగా—"నిర్మోకముక్తిరివ గగనోరగస్య" ఇత్యాది.

"ఆకాశ మనెడు సర్పము యొక్క కుబుసమును విడచుట వలె" ఇత్యాది కము. (ఇచట గూడ గగనమునకు ఉరగసాదృశ్యము కాల్పనికము)

దీని పిమ్మట కుంతకుడు వాస్తవసాదృశ్యమునకును, సంభావనాను మాన సాదృశ్యలక్షణోభయమునకును ఉదాహరణములుగ రెండు ప్రాకృత శ్లోకముల నిచ్చెను గాని అవి గ్రంథ పాతముచే అస్పష్టముగ నున్నవి. వాటి తరువాత వాస్తవసాదృశ్యోత్ప్రేక్షోదాహరణముగ ఈ క్రింది శ్లోకము గూడ చూపబడినది :-

"ఉత్ఫుల్ల చారుకుసుమస్తబకేన నమ్రా
యేయం ధుతా రుచిరచూతలతా మృగాక్ష్యాః
శంకే న వా విరహిణీమృదుమర్దనస్య
మారస్య తర్జితమిదం ప్రతి పుష్పచాపమ్''. 98

"వికసించిన సుందరకుసుమస్తబకముచే వంగిన నూతన మగు ఈ రుచిర చూతలత మృగాక్షిచే కదల్పబడుట యనునది విరహిణులను మృదువుగా హింసించెడు మన్మథుని పుష్పధనుస్సును గూర్చి చేసిన తర్జన మని శంకించుచున్నాను".

వి. అనగా ఈ మృగాక్షి 'విరహిణుల నీ విధముగ నీ కుసుమచాపముతో పీడింపరాదు'' అని ఆ కుసుమబాణమును కదిపివేయుచు, మన్మథుని ఝుళిపించుచున్నట్లు ఉన్నది అని యభిప్రాయము. లేదా ఈ విధముగ ఆమె చూతలతికను కదల్చుట చూడగా, మన్మథుడు, పుష్పచాపముతో విరహిణులను ఝళిపించుచున్నట్లున్నాడు అని భావము. ఇచట ఉత్ప్రేక్ష వాస్తవసాదృశ్య మూలకము.

వ్యాఖ్య: 'తదివ' అనునపుడు (అనగా అట్లు ఉన్నది అని చెప్పునపుడు) ఉదాహరణము ఎట్లనగా—

చన్దనాసక్తభుజగనిః శ్వాసానిల మూర్ఛితః
మూర్ఛయత్యేష పథికాన్ మధౌ మలయమారుతః. 99

వసంతమునందు, చందనవృక్షములందు లగ్నములై యున్న సర్పముల నిశ్వాసానిలముచే మూర్ఛిత మగు (వృద్ధి చెందిన. మూర్ఛిల్లిన అని రెండు అర్థములు) మలయమారుతము పాంథులను మూర్ఛింపచేయుచున్నది".

ఇచట నిఃశ్వాసానిలమూర్ఛితము వలె వాయువు మూర్ఛ పొందించుచున్నది అని యర్థము. కాని 'ఇవ' శబ్దము ప్రయుక్తము కాదు కావున ఇచట ఉత్ప్రేక్ష ప్రతీయమానము.

ఇంకను ఎట్లనగా—

'దేవి త్వన్ముఖపంకజేన' ఇత్యాది పూర్వోదాహృత శ్లోకము (చూ. II-44)

ఇచట "వినిర్జితాసీవ విచ్ఛాయతాం గచ్ఛన్తి' అని చెప్పవలసి యుండగా 'ఇవ' శబ్దము ప్రయోగింపబడలేదు.

ఇంకను ఎట్లనగా–

"త్వం రక్షసా భీరు" ఇత్యాది పూర్వోదాహృతశ్లోకము. ఇచట 'అదర్శయన్నివ' అని 'ఇవ' శబ్దమును ప్రయోగింపవలసి యుండ ప్రయోగింపలేదు.

'తదేవ' అనునపుడు-అనగా ఆరోపించునపుడు వాచకము లేకుండుటకు ఉదాహరణ మెట్లనగా–

"ఏకైకం దలమ్" ఇత్యాది పూర్వోదాహృతశ్లోకభాగము (చూ II–80) ఇచట స్వాధ్యాయఃద్ధాననత్వారోప మున్నది గాని తన్వాచక మగు 'ఏవ' శబ్దము ప్రయుక్తము కాలేదు.

దీని పిమ్మట కుంతకుడు ఉత్ప్రేక్షకు సంబంధించిన మరి యొక భేద మును చూపి యున్నాడు. ఇచట నున్న కారిక వృత్తిసాహాయ్యముచే పునఃసంగ్ర థిత మైనది.

కా. ప్రతిభాసాత్తథా బోద్ధుః స్వస్పందమహిమోచితమ్.
వస్తునో నిష్క్రియస్యాపి క్రియాయాం కర్తృతార్పణమ్. 26

"కర్తకు ఆ విధముగ భాసించుటచే, స్వీయస్వభావమహిమకు ఉచిత ముగ నుండు నట్లు నిష్క్రియ మగు వస్తువునకు గూడ క్రియయందు కర్తృత్వ మును కల్పించుట [ఉత్ప్రేక్ష]".

ఉత్ప్రేక్షకు సంబంధించిన మరి యొక ప్రకారము కూడ కనబడుచున్నది. 'ప్రతిభాసాత్' ఇత్యాది. క్రియాయాం = సాధ్యరూప మగు క్రియ యందు, కర్తృతారోపణమ్ = స్వతంత్రత్వమును ఆరోపించుట. దేనికి ? వస్తునః = పదార్థమునకు. నిష్క్రియస్య = క్రియారహిత మైనను. ఎట్టిది? స్వస్పన్ద మహిమోచితమ్—ఆ పదార్థమునకు గల ఏ, స్వస్పంద మహిమా = స్వభావో త్కర్షము గలదో, దానికి, ఉచితం = అనురూపమైనది. ఎందువలన? బోద్ధుః = అనుభవము కలవానికి, తథా = ఆ ప్రకారముచే ప్రతిభాసాద్ = ప్రతిభాసించుట వలన. "నిర్వర్ణ్యాతిశయోద్రేక ప్రతిపాదన వాంఛయా", "తదివేతి తదేవేతి వాదిభిర్వాచకం వినా" అనునవి వెనుకటి వలెనే ఇచట గూడ సంబంధించును

ఉదాహరణము ఎట్లనగా—

"లింపతీవ తమోంగాని వర్షతీవాంజనం నభః"

(కావ్యాద. II-226)

"చీకటి అవయవములను పూయుచున్నట్లున్నది. ఆకాశము కాటుకను వర్షించుచున్నట్లున్నది" (ఇచట తమస్సుకు లేపన కర్తృత్వము, ఆకాశమునకు అంజన వర్షణ కర్తృత్వమును ఆరోపింపబడినవి.) ఇంకను ఎట్లనగా—'తరంతీవ' ఇత్యాది పూర్వోదాహృత శ్లోకము, (చూ. II-91). ఇచట అంగములకు తరణ కర్తృత్వము ఆరోపింపబడినది.

దీని తరువాత ఇచ్చిన మూడవ ఉదాహరణము అస్పష్టముగ నున్నది.

దీని విషయమున దండి విపులముగ చెప్పియున్నాడు గాన మరల చెప్పుటలేదు.

దీని తరువాత కుంతకుడు ఈ క్రింది అంతర శ్లోకముతో ఉత్ప్రేక్షా విమర్శను ముగించుచున్నాడు—

అపహృత్యాన్యా లంకార లావణ్యాతిశయ శ్రియః
ఉత్ప్రేక్షా ప్రథమోల్లేఖ జీవితత్వేన జృమ్భతే. 105

"ఇతరాలంకారముల లావణ్యాతిశయ శోభలను అణచి వేసి ఉత్ప్రేక్షముందుగ (కావ్యగత) వర్ణనా జీవితముగ విజృంభించుచున్నది." ఇది అంతర శ్లోకము.

అతిశయోక్త్యలంకారము

కా. యస్యామతిశయః కోఽపి విచ్ఛిత్త్యా ప్రతిపాద్యతే
వర్ణనీయస్య ధర్మాణాం తద్విదాహ్లాద దాయినామ్. 27

ఈ కారిక వృత్తి సహాయముచే పునర్నిబద్ధ మైనది.

"ఎచట, సహృదయాహ్లాదకము లగు వర్ణనీయమునందలి ధర్మములకు సంబంధించిన ఒకానొక అతిశయము, విచ్ఛిత్తి విశేషముతో ప్రతిపాదింపబడునో (అచట అతిశయోక్త్యలంకారము)."

ఈ విధముగ ఉత్ప్రేక్షను వ్యాఖ్యానించి, సాతిశయత్వ మనెడు సాదృశ్య ముచే ప్రాప్తావసర మగు అతిశయోక్త్యలంకారమును ప్రస్తావించుచున్నారు— యస్యామిత్యాది అది అతిశయోక్త్యలంకార మని చెప్పబడుచున్నది. ఎట్టిది? దేనియందు ప్రసిద్ధ వ్యవహార మార్గమును అతిక్రమించి యున్న ఒకానొక, అతిశయః = ప్రకర్షోన్నతి యొక్క అధిరోహణము, విచిత్ర్యా = వైదగ్ధ్య భంగిచే, ప్రతిపాద్యతే = సమర్పింపబడునో. దేనియొక్క? వర్ణనీయస్య ధర్మాణామ్ = ప్రకృత మగు వస్తువుయొక్క స్వభావముతో సంబంధించిన లక్షణముల యొక్క. ఎట్టివి? తద్విదాహ్లాద దాయినామ్ = కావ్యవేత్తలకు ఆనందమును కల్గించునవి. సహృదయ హృదయాహ్లాదకారి యగు స్వభావముతో సుందరముగ నుండుటయే కదా కావ్యార్థము? అందుచే ఆ కావ్యార్థము యొక్క అతిశయమును పోషించెడు అతిశయోక్త్యలంకారము విషయమున అలంకార వేత్తలు ఆదరమును చూపుచుందురు.

కుంతకుడు అతిశయోక్తికి ఉదాహరణములుగ ఐదు శ్లోకములను చూపి యున్నారు. వాటిలో రెండు శ్లోకములు గ్రంథపాతముచే అస్పష్టములు.

"స్వపుష్పచ్ఛవి హారిణ్యా చంద్రభాసా తిరోహితాః
అన్వమీయన్త భృంగాలీవాచా సప్తచ్ఛదద్రుమాః" 106
(భామహుని కావ్యా. II–82)

"శక్యమోషధి పతేర్నవోదయాః కర్ణపూర రచనాకృతే తవ
అప్రగల్భయవసూచి కోమలాః ఛేత్తు మగ్రనఖ సంపుటైః కరాః" 107

"యస్య ప్రోచ్ఛ్రియతి ప్రతాప తపనే తేజస్వినామిత్యలం
లోకా లోక-ధరాధరా వతి యశః శీతాంశుబింబే ప్రభా.
త్రైలోక్య ప్రథితావదాన మహిమ క్షోణీశ వంశోద్భవా
సూర్యాచంద్రమసౌ స్వయం తు కుశలచ్ఛాయాం సమారోహతః"
108

"తమ పుష్పముల కాంతిని తిరస్కరించెడు చంద్ర కాంతిచే కప్పబడిన ఏడాకుల అరటి చెట్లు తుమ్మెదల సముదాయముల ధ్వనిచే ఊహింపబడినవి."

ఇచట సప్తచ్ఛద వృక్షములు చంద్రకాంతిచే తిరోహితములు కాకున్నను తిరోహితములై నట్లు వర్ణింపబడినది గాన అతిశయోక్త్యలంకారము.

ఇంకను ఎట్లనగా—

"ముదరని యవాగ్రముల వలె కోమలములై నూతనముగ ఉదయించిన చంద్ర కిరణములు, నీకు కర్ణాలంకారములుగ నుంచుటకై; వ్రేళ్ళతో త్రుంచుటకు వీలుగ నున్నవి."

చంద్రోదయమును వర్ణించుచు మహేశ్వరుడు పార్వతితో అన్న వాక్య మిది. ఇచట చంద్ర కిరణముల యందు నఖచ్ఛేద్యత్వము లేకున్నను ఉన్నట్లు వర్ణింపబడినది గాన అతిశయోక్తి.

ఇంకను ఎట్లనగా—

° శ్రీ తృతీయోదాహరణము అస్పష్టార్థముగ నున్నది. కొందరు వ్యాఖ్యాతలు చూపిన అర్థము కూడ సంతృప్తి కరముగ లేదు.

"ఈతని ప్రతాప సూర్యుడును, యశశ్చంద్రుడును లోకాలోక పర్వతమును గూడ దాటి ప్రకాశించుచుండగా అత్యుత్తమ రాజన్య వంశములకు మూల పురుషు లగు సూర్య చంద్రులు నిష్ప్రభులై, కార్యరహితులై యున్నారు" అను అర్థమును స్థూలముగ చెప్పవచ్చును.

## ఉపమాలంకారము

అతిశయోక్త్యలంకారమును నిరూపించిన పిదప కుంతకుడు ఉపమాలంకారమును సవిస్తరముగ ప్రతిపాదించి యున్నాడు గాని, చాల భాగము గ్రంథపాతముచే అస్పష్టముగ నున్నది. శ్రీ దే స్పష్టముగ నున్న కొన్ని భాగములను మాత్రము ఇచ్చి యున్నారు.

కా. వివక్షితపరిస్పన్ద మనోహారిత్వసిద్ధయే
వస్తునః కేన చిత్ సామ్యం తదుత్కర్షవతోపమా. 28

తాం సాధారణధర్మోక్తౌ వాక్యార్థే వా తదన్వయాత్
ఇవాదిరపి విచ్ఛిత్త్యై యత్ర వక్తి క్రియాపదమ్. 29

"వివక్షిత మగు స్వభావమునందలి మనోహరత్వమును ప్రతిపాదించు టకై, ఒకానొక (ప్రకృత) వస్తువునకు మనోహారిత్వోత్కర్షముతో కూడిన మరియొక వస్తువుతో సామ్యమును వర్ణించుట ఉపమ".

"ఆ ఉపమాలంకారస్థలమునందు, సాధారణధర్మమును స్పష్టముగ ప్రతిపాదించినపుడు గాని, (సాధారణధర్మములోపింప) అది వాక్యార్థమున (ఆక్షిప్తమై) అన్వయించినపుడు గాని ఇవాదిపదములు ఆ ఉపమను బోధించును. విచ్ఛిత్తివిశేషముచే క్రియాపదము కూడ బోధించును".

ఇపుడు వివక్షితేత్యాది కారికలచే, సామ్యముతో ప్రకాశించు అలంకారముల విన్యాసవిచ్ఛిత్తిని విచారించుచున్నాడు. యత్ర = దేనియందు, వస్తునః = ప్రకృత వస్తువునకు, కేనచిత్ = అప్రస్తుత మగు మరియొక పదార్థముతో, సామ్యం = సాదృశ్యము కలదో, అది ఉపమా = ఉపమాలంకారరూపముగ చెప్పబడుచున్నది. అప్రస్తుతముతో సామ్యమెందులకో చెప్పుచున్నాడు- 'వివక్షిత పరిస్పన్దమనోహారిత్వసిద్ధయే' వివక్షితః = చెప్పదలచిన ఏ, పరిస్పన్దః = ఒకానొక ధర్మవిశేషము గలదో, దానియొక్క, మనోహారిత్వం = హృదయరంజకత్వము; దానియొక్క సిద్ధిః = నిష్పత్తి, దాని కొరకు. ఎట్టి పదార్థాంతరముతో? తదుత్కర్షవతా. 'తత్' అనుపదము మనోహారిత్వమును పరామర్శించును. దానియొక్క, ఉత్కర్షః = సాతిశయత్వము తదుత్కర్ష మని చెప్పబడును. అది దేనికి ఉన్నదో అట్టి దానితో.

దీని తాత్పర్యమిది—ప్రకృత మగు వర్ణనీయవస్తువునకు, వివక్షిత ధర్మసౌందర్యము సిద్ధించుటకై ప్రస్తుతపదార్థమునందు ఏ ధర్మములు కలవో ఆ ధర్మములు కల మరియొక వస్తువుతో సామ్యము యుక్తియుక్తముగ నుండును. (అనగా ప్రకృతాప్రకృతములందు తుల్యధర్మములు లేకున్నచో ఉపమ కుదర దని భావము) (ధర్మితోడ సామ్య మని చెప్పబడినది గాని) ధర్మముతో సామ్య మని చెప్పబడలేదు ఏలయన ధర్మిసంబద్ధము కాక ధర్మము వేరుగ లభింపదు గదా? ఈ విధముగ, ఉపమయందు, ఉపమానోపమేయ రూపము లగు ధర్ములకు (ధర్మము గల వస్తువులకు) ధర్మమును పురస్కరించుకొని సామ్యము ఉండును. (అనగా ప్రత్యక్ష మగు సామ్యము ధర్మములకే. ధర్ములకు ధర్మములద్వారా సామ్యము).

ఈ విధ మగు ఉపమను ఏది ప్రతిపాదించునో 'క్రియాపదం' ఇత్యాదిచే చెప్పుచున్నాడు క్రియాపద మనగా ధాత్వర్థము. ఇచట వాచ్యమును (ధాత్వర్థమును) బోధించు వాచకము (ధాతువు మాత్రమే) ఇష్టము. అంతియే కాని (ధాత్వర్థమును ప్రధానముగ బోధించు) క్రియాపదము వివక్షితము కాదు. ఏలయన ఎచటనైన అముఖ్యరూపమున నైనను క్రియ యున్నచో అదియు ఉపమా వాచకమే...ఈ విధముగ రెండు విధము లగు (ప్రధానాప్రధానరూప మగు) క్రియాన్వభావము, ఆ ఉపమను, వక్తి = చెప్పును.

ఎట్లు? విచ్ఛిత్త్యా = వైదగ్ధ్యభంగితో. విచ్ఛిత్తిరహిత మగు అభిధానము కావ్యవేత్తలకు ఆనందదాయకము కాజాల దని భావము ఒక్క క్రియాపదము మాత్రమే కాదు, ఇవాదిపదములు గూడ దానిని బోధించును. ఉపమను సమర్పింపగలిగిన సామర్థ్యము గల ఏ శబ్దవిశేషమైనను, ప్రత్యయ మైనను, బహువ్రీహ్యాది సమాసమైనను...విచ్ఛిత్తివిశేషముచే దానిని బోధించును అని 'అపి' శబ్దము తెలుపుచున్నది. ఏది ఉన్నపుడు? "సాధారణధర్మోక్తౌ"—సాధారణః = సమానమైన (అనగా) ఉపమానోపమేయములు రెండింటియందును సంబంధించిన ('అనుయాయీధర్మః' అనుపాఠము యుక్త మని తోచును) ఏ ధర్మము కలదో (దానిని చెప్పినపుడు)...ఎచట? వాక్యార్థమునం దైనను. పరస్పరాన్వయ రూప మగు సంబంధముచే సంబద్ధము లగు పదముల సమూహము వాక్యము. దానిచే బోధింపబడు వస్తువు ఆ ఉపమకు అలంకార్య మగుటచే విషయము. ఎట్లు? తదన్వయాత్-తచ్ఛబ్దము పదార్థమును పరామర్శించును. ఆ పదార్థముల, సమన్వయాత్ = అన్యోన్యసంబంధమువలన వాక్యమునందు అనేకపదార్థములు సంభవించును. వాటియొక్క పరస్పరసంబంధ మాహాత్మ్యమువలన.

ఈ విధముగ వస్తుసామ్యము తుల్యమే యైనను ఉపమావస్తువును, ఉత్ప్రేక్షావస్తువును భిన్నములే యని చెప్పుచున్నాడు-

కా. ఉత్ప్రేక్షావస్తుసామ్యేఽపి తాత్పర్యగోచరో మతః. 30

"ఉత్ప్రేక్షావస్తువుతో సామ్య మున్నను కావ్యవేత్తల అనుభవము (ఉపమయందు) తాత్పర్యగోచర మైనదిగా చెప్పబడుచున్నది."

అనగా సామ్య మనునది ఉపమోత్ప్రేక్షలరెండిటియందును ఉన్నను ఉపమలో నది ముఖ్య తాత్పర్యగోచర మని యర్థము.



'తాత్పర్యగోచరః-తాత్పర్యమ్ = పదార్థముకంటె భిన్న మగు వృత్తి గలదియు వాక్యార్థమునకు జీవితమును అగు వస్త్వంతరము. అదియే, గోచరః విషయము దేనికో అట్టి సహృదయుల అంతరనుభవము. (ఇచట ఈ కారికార్థమునకు అర్థము 'స్థితస్యగతిశ్చింతనీయా' అను న్యాయముచే చూపబడినది).

అముఖ్యమగు క్రియాపదమునకు పదార్థ మగు ఉపమ ఎట్లనగా—

పూర్ణేందో స్తవ సంవాది వదనం వనజేక్షణే
పుష్ణాతి పుష్పచాపస్య జగత్త్రియ జిగీషుతామ్. 109

"ఓ వనజేక్షణా! పూర్ణచంద్రునితో పోలి యున్న నీ వదనము, మన్మథుని జగత్త్రియ విజయాభిలాషను పెంచుచున్నది".

(ఇచట సామ్యము 'సంవాది' అను అప్రధాన క్రియాపదముచే (అనగా తిజంతముగా ప్రయుక్తము కాని ధాతువుచే) బోధింపబడుచున్నది).

ఇవాది పదములచే ప్రతిపాదింపబడెడు పదార్థోపమకు ఉదాహరణ మెట్లనగా-(S. K. సంపాదించిన పుస్తకమున ఇచట 'ఇవాది ప్రతిపాద్య పదార్థోదాహరణం యథా' అని వ్రాసి, పిమ్మట రెండు ఆఖ్యాతప్రతిపాద్యోపమోదాహరణములను జూపి తరువాత 'అప్రతిపాద్యపదార్థోదాహరణం యథా' అనియు, తథావిధవాక్యోపమోదాహరణం యథా' అనియు చెప్పి ఉదాహరణములు చూపబడినవి. కాని ఉదాహరణములు అస్తవ్యస్తములుగ నున్నవి. 'నిపీయమానస్తబకా' ఇత్యాద్యుదాహరణద్వయమున ఉపమ ఇవాదిప్రతిపాద్యముగ లేదు. తరువాతి రెండు ఉదాహరణములలో ఇవాది ప్రతిపాద్యత్వమున్నది. ఈ లోపమును గమనించియే విశ్వేశ్వరుడు మొదటి ఉదాహరణము అప్రతిపాద్యపదార్థోపమోదాహరణమనియు, "చుంబన్" 'పాండ్యః' ఇత్యాద్యుదాహరణద్వయము ఇవాది ప్రతిపాద్యపదార్థోపమావాక్యార్థోపమలకుదాహరణము లనియు గ్రహించి తదనుగుణముగ మార్పులు చేసి యున్నాడు. ఆ మార్పు యుక్తముగ నున్నది).

'నిపీయమానస్తబకా' (చూ. I-119) ఇత్యాది పూర్వోదాహృతశ్లోకమున ఇవాదిప్రయోగము లేదు గాన ఇది ఇవాద్యప్రతిపాద్య పదార్థోపమకు ఉదాహరణము.

ఆఖ్యాతపదప్రతిపాద్యపదార్థోపమకు ఉదాహరణము ఎట్లనగా —

'తతో ఒరుణపరిస్పంద' ఇత్యాది పూర్వోదాహృతశ్లోకము. (చూ. I-19) ఇచట ఉపమ 'దధ్రే' అను ఆఖ్యాతపదముచే ప్రతిపాదింపబడుచున్నది.

అట్టి (అఖ్యాతపదప్రతిపాద్య మగు) వాక్యోపమకుదాహరణము ఎట్లనగా-

"ముఖేన సా కేతకపత్రపాండునా
కృశాంగయష్టిః పరిమేయభూషణా.
స్థితాల్పతారాం తరుణేన్దుమండలాం
విభాతకల్పాం రజనీం వ్యడంబయత్" 109

'కృశించిన శరీరము కలదియు, పరిమితము లగు అలంకారములను ధరించినదియు అగు ఆమె మొగలి రేకువలె తెల్లనైన ముఖముతో, కొంచెము నక్షత్రములు కలదియు, ముదిరిన చంద్రమండలము కలదియునగు తెల్లవార నున్న రాత్రిని అనుకరించెను"

(ఇచట 'వ్యడమ్బయత్' అను ఆఖ్యాతపదముచే ప్రతిపాద్య మగు ఉపమ సకల వాక్యార్థమునకు సంబంధించి యున్నది గాన ఇది ఆఖ్యాత పదప్రతిపాద్య వాక్యోపమకుదాహరణము.

ఇవాది ప్రతిపాద్యపదార్థోపమ కుదాహరణ మెట్లనగా-

చుమ్బన్ కపోలతల ముత్పులకం ప్రియాయాః
స్పర్శోల్లసన్నయన మాముకులీచకార.
ఆవిర్భవన్మధుర నిద్రమివారవింద
మిందుః స్పృశన్ స్తిమితముత్పల ముత్పలిన్యాః. 113

"పాండ్యోఒయమంసార్పితలంబహారః
క్లప్తాంగరాగో హరిచందనేన.
ఆభాతి బాలాతపరక్త సానుః
సనిర్ఝరోద్గార ఇవాద్రిరాజః. 114
(రఘు. VI-60)

"కలువతీగయొక్క నిశ్చలమగు కలువను స్పృశించుచున్న చంద్రుడు ఆవిర్భవించుచున్న మధురనిద్ర గల పద్మమును వలె, (అతడు) బయల్వెడలిన పులకాంకురములు గల ప్రియురాలి కపోలతలమును చుంబించుచు, స్పర్శముచే కదలుచున్న నేత్రమును ముకులింపచేసెను"

అట్టి (ఇవాదిప్రతిపాద్య) వాక్యోపమకు ఉదాహరణ మెట్లనగా-

"భుజమునందు ఉంచబడిన వ్రేలాడుచున్న ముక్తాహారము కలవాడును, హరిచందనమును పూసికొనిన వాడును అగు ఈ పాండ్యరాజు, సెలయేళ్ళ ప్రవాహముతో కూడినదియు నగు తెల్లనైన చరియలు కలిగినట్టియు, నీరుటెండంచే పర్వతరాజము వలె నున్నాడు".

'ఆది' పదమును గ్రహించుటచే ఇవాదిభిన్నము లగు 'యథా' మొదలగు శబ్దాంతరములచే గూడ ఉపమాప్రతీతి కలుగును.

అ వ. ఇవాది భిన్నము లగు సమానసదృశాదిపదములు ఉపమావాచకములుగ నుండుట కుదాహరణములు చూపుచున్నాడు.

"పూర్ణేందుకాంతి వదనా నీలోత్పలవిలోచనా." 115

"యన్త్యా ముహుర్వలితకంధర మాననం త
దావృత్తవృంతశతపత్రనిభం వహన్త్యా.
దిగ్ధోఽమృతేన చ విషేణ చ పక్ష్మలాక్ష్యా
గాఢం నిఖాత ఇవ మే హృదయే కటాక్షః". 116

(మాల I-16)

మాంజిష్ఠీకృతపట్టసూత్రసదృశైః పాదానయం పుంజయన్
యాత్యస్తాచలచుంబినీం పరిణతిం స్వైరం గ్రహగ్రామణీః.
వాత్యావేగవివర్తితాంబుజరజశ్ఛత్రాయమాణః క్షణం
క్షీణజ్యోతిరితోఽప్యయం స భగవానర్ణోనిధౌ మజ్జతి. 117

(బాలరామాయణమ్ III-10)

"పూర్ణచంద్రుని కాంతివంటి కాంతికలదియు, నీలోత్పలముల వంటి నేత్రములు కలదియు-"

(ఇది సమాసప్రతిపాద్యోపమకు ఉదాహరణము) ఇంకను ఎట్లనగా :-

"త్రిప్పబడిన తొడిమి గల పద్మముతో సమానమైన, మాటి మాటికిని త్రిప్పబడిన కంఠము గల ఆ ముఖమును ధరించుచున్న ఆ పక్ష్మలాక్షి అమృతముచేతను, విషముచేతను పూయబడిన కటాక్షమును నా హృదయమున గాఢముగ పాతినట్లుండెను."

(ఇచట 'నిభ' శబ్దము ఉపమాప్రతిపాదకము)

"ఈ గ్రహాధిపతి (సూర్యుడు) మంజిష్ఠారాగము పూసిన పట్టుదారములతో సమానములైన కిరణములను ప్రోగు చేసికొనుచు అస్త్రాద్రిని స్పృశించు పరిణతిని స్వేచ్ఛగా పొందుచున్నాడు. ఇటు భగవంతు డగు సూర్యుడు క్షణకాలము పాటు వాయువేగముచే త్రిప్పబడిన పద్మరాగనిర్మితఛత్రము వలె నుండి, క్షీణించిన కాంతి కలవాడై, సముద్రము నందు మునుగుచున్నాడు "

(ఈ శ్లోకమున కేవలము సూర్యాస్తమయమునే కాక చంద్రోదయమును కూడ కవి వర్ణించుచున్నా డని చెప్పుట యుక్తము గావున పూర్వార్ధమును చంద్రోదయపరముగ సమన్వయించినచో - చంద్రుడు తన కిరణపుంజమును పుంజించుకొని అస్త్రాద్రివరకును వ్యాపించు వర్ణపరిణతిని పొందు చున్నాడు; అని భావము చెప్పవలెను ఏమైనను శ్లోకభావము కొంచెము అస్పష్టముగనే యున్నది )

(ఈ శ్లోకమున 'సదృక్' పదము, 'ఛత్త్రాయమాణః' అనుచో 'క్యఙ్' ప్రత్యయము ఉపమాప్రతిపాదకములుగ నున్నవి).

రామేణ ముగ్ధమనసా వృషలాంఛనస్య
యజ్జర్జరం ధనురభాజి మృణాలభఙ్గమ్.
తేనామునా త్రిజగదర్పిత కీర్తిభారో
రక్షఃపతిర్నను మనాఙ్ న విడంబితోఽభూత్ 118

(బా. రా. 3-80)

మహీభృతః పుత్రవతోఽపి దృష్టి
స్తస్మిన్నపత్యే న జగామ తృప్తిమ్.
అనన్తపుష్పస్య మధోర్హి చూతే
ద్విరేఫమాలా సవిశేషసంగా. 119

(కు. సం.I-27)

(ఇంకను ఎట్లనగా)

"అమాయిక మగు మనస్సు గల రాముడు ఉద్ధర మగు శివధనస్సును తామరతూడును విరచినట్లు విరచినాడు. అట్లు విరచుటచే మూడు లోకము లందును కీర్తిభారమును మోపిన రావణుకు కొంచె మైనను శోభ చెందలేదా?"

ఇచట 'మృణాలభంజమ్' అను పదమున ఉపమ "ణముల్" ప్రత్యయ ప్రతిపాద్యమై యున్నది. 'మృణాలమివ భఙ్క్త్వామృణాలభఙ్జమ్' అని విగ్రహము.

(ఇంకను ఎట్లనగా)–

"ఎందరో పుత్రికాపుత్రులు కలవాడైనను హిమవంతుని దృష్టి ఆ సంతానము (పార్వతి) విషయమున తృప్తిని పొందలేదు. వసంతము అనేకపుష్పములు కలదై యున్నను, తుమ్మెదల పంక్తి చూతవృక్షమునందు అత్యాసక్తి కలదిగా ఉండును కదా?"

ఇచట– మధుకరపంక్తి చూతవృక్షముపై సవిశేషసంగమై యున్నట్లు హిమవంతుని దృష్టి పార్వతిపై సవిశేషసంగమై యున్నదని ఉపమాలంకారము.

ఈ శ్లోకమున అర్థాంతరన్యాసాలంకారభ్రాంతి కూడ కలుగు నని కుంతకుడు చెప్పినాడు. పిమ్మట 'ఇత్యాకర్ణితకాలనేమి వచనో' 'ఇతీద మాకర్ణ్య తపస్వికన్యా" అను శ్లోకద్వయమును గూడ ఉదాహరణముగ చూపి యున్నాడు. కాని ఆ శ్లోకములు గ్రంథపాతమున అస్పష్టములుగ నున్నవి.

## ప్రతివస్తూపమాలంకారము

సమానవస్తున్యాసేన ప్రతివస్తూపమోచ్యతే
యథేవానభిధానేఽపి గుణసామ్యప్రతీతితః. 120

సాధుసాధారణత్వాదిగుణోఽత్ర వ్యతిరిచ్యతే
స సామ్యమాపాదయతి విరోధేఽపి తయోర్యథా. 121

కియన్తః సన్తిగుణినః సాధుసాధారణ శ్రియః
స్వాదుపాకఫలానమ్రాః కియన్తో వాధ్వశాఖినః. 122

(కావ్యాలంకారము II. 34-36)

వ్యా. సమానము లగు వస్తువులను కూర్చుటపై ఆధారపడి యున్న ప్రతివస్తు రూపమును వేరుగ చెప్పవలసిన పని లేదు. ఏలయన దీని ఉదాహరణములు గూడ పూర్వోక్తోదాహరణములతో తుల్యస్వభావములే కదా? (కావున ఇది గూడ ఉపమాంతర్గతమే యని చెప్పుటకై భామహోక్తలక్షణోదాహరణములను చూపు చున్నాడు).

"'యథా', 'ఇవ' మొదలగు పదములను ప్రయోగింపకున్నను, సమాన వస్తువుల విన్యాసముచే గుణముల సామ్యము ప్రతీత మగుచో ప్రతివస్తూపమ యని చెప్పబడుచున్నది "

"ఇచట (రాబోవు ఉదాహరణమున) సాధుసాధారణత్వాదిగుణము భిన్న ముగనే ఉన్నది. అది వాటికి (ఉపమేయోపమానములకు) విరోధ మున్నను, అనగా అవి అత్యంతభిన్నము లైనను, సామ్యమును కలిగించును. ఎట్లనగా-"

'సత్పురుషులకు సాధారణ మగు (అనగా సత్పురుషోపభోగ్య మగు) ఐశ్వర్యము గల గుణవంతులు ఎందరు ఉన్నారు? మధుర మగు పాకము గల ఫలములతో వంగిన మార్గవృక్షములు ఎన్ని యున్నవి?"

ఇచట సమానస్వభావము లగు రెండింటికిని (గుణివృక్షములకు) కవి వివక్షిత మగు విరలత్వరూప మగు సామ్యము కంటె వ్యతిరేకముగ అతిరిక్త మగు మరి యొక మనోహర మగు జీవిత మేదియు కానవచ్చుట లేదు. (కావున ఇది ఉపమయే యని భావము) (వాస్తవమున దండిభామహులు గూడ ప్రతి వస్తూపమను ఉపమాంతర్గతముగనే పరిగణించి నట్లు కానవచ్చుచున్నది)

## ఉపమేయోపమానన్వయ తుల్య యోగితలు

ఈ విధముగ ప్రతివస్తూపమకు ప్రతీయమానోపమయందు అంతర్భావము చెప్పుట యుక్తియుక్తముగ నున్నది గాన, ఇపుడు ఉపమేయోపమాదికమునకు ఉపమలో అంతర్భావము విచారింపబడుచున్నది.

కా. "సామాన్యా...నవ్యతరిక్తా......లక్షణానన్యథాస్థితేః"

ఉపమేయోపమ ఉపమాసామాన్యరూప మైనదే కాని తద్భిన్నము కాదు. ఏలయనగా- 'లక్షణానన్యథాస్థితేః'— లక్షణ మనగా దాని స్వరూపమును

చెప్పుట. దానికి అనన్యథాస్థితేః = భిన్నరూపమున ఉనికి లేకుండుట వలన, ఉపమేయోపమలో ఉపమేయము ఉపమానముగను, ఉపమానము ఉపమేయము గను అగుచున్నది; ఇంతకు మించిన భేద మేదియు లేదు కదా?

ఈ విధముగ ఉపమేయోపమ ఉపమాంతర్గతమే అని ప్రతిపాదించి తుల్యయోగిత కూడ ముఖ్యముగా వర్ణింపవలసి యున్న రెండు వస్తువుల నడుమ సామ్యాతిరేకరూప మగుటచే ఉపమాలంకారమే యని ప్రతిపాదించుచున్నారు.

తుల్యయోగితకు ఉదాహరణములు:-

జనస్య సాకేతనివాసినస్తౌ
ద్వావప్యభూతా మభినంద్య సత్త్వౌ
గురుప్రదే యాధికనిః స్పృహో ఽర్థీ
నృపో ఽర్థికామాదధిక ప్రదశ్చ. 123
(రఘు.V. 31)

ఉభౌ యది వ్యోమ్ని పృథక్ ప్రవాహా
వాకాశగంగా పయసః పతేతామ్.
తేనోపమీయేత తమాలనీల-
మాముక్త ముక్తాలత మస్య వక్షః. 124
(మాఘ- III_8)

'గురువుకు ఈయవలసిన దానికంటె అధిక మగు ధనమునందు ఆశ లేని ఆ యాచకుడును, యాచకుని కోరిక కంటె అధికముగ ఇచ్చు ఆ రాజును, వారిరువురును సాకేతమునందు నివసించు జనముచే అభినందింపతగిన స్వభావము కలవారై అయిరి'.

(ఇచట ప్రకృతవర్ణనీయు లగు రఘుకౌత్సు లిరువురియందును అభినంద్యసత్త్వత్వ మనెడు సామ్యాతిరేక మున్నది గాన ఈ తుల్యయోగిత ఉపమయే యగును.)

'ఆకాశగంగాప్రవాహధారలు రెండు ఆకాశమునందు పడినచో అపుడు ముక్తాహారమును ధరించిన ఆ శ్రీకృష్ణుని వక్షముతో పోల్చుటకు అవకాశ ముండును.'

(ఈ శ్లోకమున తుల్యయోగితను అంగీకరించుటకు అవకాశము కానరాదు. అందుచే ఈ ప్రకరణమున ఈ శ్లోకము లేఖకప్రమాదపతిత మని తోచు చున్నది.)

కాల్పనికోపమానము గల అనన్వయము కూడ ఈ విధముగ ఉపమాం తర్గతమే గాన దానికై భిన్నలక్షణము చెప్ప బని లేదని ప్రతిపాదించి కుంతకుడు ఈ క్రింది యుదాహరణమును చూపినాడు. ఈ శ్లోకము గ్రంథపాతముచే అస్పష్టముగ నున్నది.

"తత్పూర్వానుభవే భవన్తి లఘవో భావాః శశాంకాదయః
తద్వక్త్రోపమితేః పరం పరిణమేచ్ఛేతోరసాయాంబుజాత్.
ఏవం నిశ్చినుతే మనస్తవ ముఖం సౌందర్యసారావధి
బధ్నాతి వ్యవసాయమేతు ముపమోత్కర్షం స్వకాన్త్యా స్వయమ్"

"ఆ ముఖమును ముందుగ చూచినపుడు చంద్రుడు మొదలగు వస్తువులు తేలికయై పోవుచున్నవి. ఆ ముఖోపమితికై వెదకిన చిత్తము పద్మమునుండి కూడ మరలిపోవును. (?) కావున నా మనస్సు ఈ విధముగ నిశ్చయించు కున్నది. సౌందర్యసారావధి యగు నీ ముఖము తాను తన కాంతితోడనే ఉప మాతిశయమును కూర్చుకొనుచున్నది."

(ఇచట ముఖమునకు ముఖముతోడనే సామ్యమును చెప్పుటచే అనన్వ యము.)

కావున ఈ విధముగ అభిధావైచిత్ర్యముచే ఏర్పడిన ప్రకారములకే వైవిధ్యము కాని లక్షణభేదములకు వైవిధ్యము లేదు. (అనగా చెప్పెడు పద్ధ తిలో భేదమే గాని లక్షణములలో విశేష మేదియు లేదు గాన అనన్వయాదులు ఉపమాంతర్గతములే యని భావము.)

ఈ సందర్భమున కుంతకుడు భామహుని తుల్యయోగితాలక్షణోదాహర ణములను చూపి ఆ తుల్యయోగిత కూడ ఉపమాంతర్గతమే యని ప్రతిపాదించి నాడు:-

న్యూనస్యాపి విశిష్టేన గుణసామ్యవివక్షయా
తుల్యకార్యక్రియాయోగా దిత్యుక్తా తుల్యయోగితా. 125

శేషో హిమగిరి_స్త్వం చ మహా న్తో గురవః స్థిరాః
యదలంఘితమర్యాదాశ్చల_న్తీం బిభృధ క్షితిమ్. 126
(కావ్యాలంకార III. 29-27)

"న్యూనమైన ఉపమేయమునకు గూడ విశిష్టమైనదానితో గుణసామ్య మును చెప్పవలె ననెడు అభిలాషచే తుల్య మగు కార్యముతోడను క్రియతో డను యోగమును చెప్పినచో తుల్యయోగితాలంకారము".

"ఆదిశేషుడును హిమగిరియు నీవును గొప్పవారు గౌరవముతో కూడిన వారు, స్థిరులు. ఏలయన అలంఘితమర్యాదులై భూమిని మోయుచున్నారు".

తుల్యయోగితకు, పైన చూపిన లక్షణమును బట్టి, ఉపమయందే అంతర్భావము.

## నిదర్శనాలంకారము

కుంతకుని యభిప్రాయము ప్రకారము నిదర్శన గూడ ఉపమాంతర్గతమే.

యైర్దృష్టా న వా దృష్టా ముషితాః సమమేవ తే
హృతం హృదయమేతేషాం అన్యేషాం చక్షుషః ఫలమ్
యత్కావ్యార్థనిరూపణం ప్రియకథాలాపారహోవస్థితిః
కంఠా_న్తం మృదుగీత మాదృత సుహృద్దుఃఖా_న్తరావేదనమ్.
127

నిదర్శనాలంకారము గూడ ఇట్టిదే. (ఇచట ఈ వాక్యముండుటను బట్టి కుంతకుడు నిదర్శనాలంకారమును గూర్చి చెప్పుచున్నాడని అనుకొనుటకు అవ కాశమున్నది కాని ఉదాహరణమునుబట్టి చూడ ఇది కూడ తుల్యయోగితాలంకార మునకు సంబంధించినదే యన్నట్లు కనబడుచున్నది. కావున ఈ వాక్యము అస్థానపతితమై యుండవలెను )

"ఆమె ఎవరిచే చూడబడినదో, ఎవరిచే చూడబడలేదో వారిరువురును సమముగనే దోచుకొనబడినారు మొదటివారి హృదయము దోచుకొనబడినది. రెండవవారి నేత్రఫలము అపహరింపబడినది"

(ఇచట ముషితత్వము ఉభయసాధారణముగ చెప్పబడినది గాన తుల్య యోగిత. ఇది ఉపమాంతర్గతమే యని భావము)

(దీని తరువాత యుదాహరణము సగము మాత్రమే లభ్యమగుచున్నది. ఉత్తరార్ధము కూడ లభించిననే గాని ఇది దేని కుదాహరణమో చెప్పట కష్టము)

"కావ్యార్థములు నిరూపించుచుండుట, ప్రియము లగు సంభాషణములు, రహస్యస్థలమునందు ఉండుటయు, కంఠము చివరివరకు మాత్రమే వచ్చెడి గీతము, ఆదరపాత్ర మగు స్నేహితునితో కష్టములను చెప్పుకొనుట"

దీని తరువాత భామహుని అనన్వయలక్షణోదహరణములు చూపబడినవి.

యత్ర తేనైవ తస్య స్యాదుపమానోపమేయతా
అసాదృశ్యవివక్షాత స్త మిత్యాహు రనన్వయమ్. 129

తాంబూలరాగవలయం స్ఫురద్దశనదీధితి
ఇన్దీవరాభనయనం తవేవ వదనం తవ. 130

(కావ్యాలం. III 45, 46)

"సదృశవస్త్వంతరము లేదని చెప్పు నభిలాషచే ఎచట ఒక వస్తువునకు ఆ వస్తువుతోడనే ఉపమానత్వోపమేయత్వములు చెప్పబడునో అది అనన్వయ మని చెప్పుదురు".

"తాంబూలరాగమండలము కలదియు ప్రకాశించుచున్న దంతకాంతులు కలదియు, పద్మములవంటి నేత్రములు కలదియు నగు నీ ముఖము నీ ముఖము వలె నే ఉన్నది".

దీని తరువాత గ్రంథపాతము.

తద్వల్గునా యుగపదున్మిషితేన తావత్
సద్యః పరస్పరతులామధిరోహతాం ద్వే.
ప్రస్పన్దమానపరుషేతరతారమ స్త
శ్చక్షు స్తవ ప్రచలితభ్రమరం చ పద్మమ్. (రఘు. V-68) 131

'ఒక్కమారుగా సుందర మగు వికాసముచే, చలించుచున్న కోమలము లగు నల్ల గ్రుడ్లు కలదగు నీ నేత్రము (చలించుచున్న తుమ్మెద గల పద్మము) ఈ రెండును వెంటనే ఒండొంటితో సామ్యమును పొందుగాక.'

(ఈ శ్లోకమున కానచ్చు ఉపమేయోపమ ఉపమాంతర్గతమే యని కుంతకుని యభిప్రాయము.)

దీని తరువాత–

'హేలావభగ్నహరకార్ముక ఏవ సోఽపి'

ఇత్యాదిశ్లోకము అసంపూర్ణముగ లభ్య మగుచున్నది.

## పరివృత్త్యలంకారము

ఈ న్యాయముచే పరివృత్త్యలంకారము గూడ వేరుగా లేదని నిరూపింప బడుచున్నది.

కా. వినివర్తనమేకస్య యత్తదన్యస్యవర్తనమ్
న పరివర్తమానత్వాదుభయోరత్రపూర్వవత్. 32

"ఒకదానిని మరల్చుట, మరియొక దానిని ప్రవర్తింపచేయుట అను రూపము గల పరివృత్తి అలంకారము కాదు. ఏలయన పూర్వమునందు వలె రెండును ప్రధానముగ చెప్పబడుచున్నవి కదా?"

'వినివర్తనమ్' ఇత్యాది కారికచే పరివృత్తి కూడ అలంకారము కాజాల దని చెప్పుచున్నాడు. ఒక పదార్థము యొక్క, ఏ, వినివర్తనం = తొలగించుటయు తదన్యస్య = తద్భిన్న మగు మరియొకదాని యొక్క, వర్తనం = కూర్చుటయు, కలదో అది అలంకారము కాదు. ఎందువలన? రెండును, పరివర్తమానత్వాత్ = ముఖ్య రూపమున చెప్పబడుట వలన. ఎట్లు? పూర్వవత్, పూర్వము (ఉపమేయోపమాదులందు) ప్రతియొక్కటియు ప్రధాన మగుటచేతను, నియమ నిశ్చయము లేకుండుట చేతను, ఏ విధముగ, ఏదియు దేనికిని అలంకారము కాదో అట్లే ఇక్కడను తావన్మాత్రముచే పరస్పరము అలంకార్యాలంకారభావ మని చెప్పరాదు. (అలంకార్యత్వము నంగీకరించినచో) ప్రాధాన్య ముండదు కదా? రెండు వస్తువులకును రూపభేదముచే భేదముండి, సామ్య మున్నచో ఆ ఉపమితి పూర్వమునందు వలె (ఉపమేయోపమాదులందు వలె) ఉపమాలంకారమే యనుట సముచితము.

ఎట్లనగా —

సదయం బుభుజే మహా భుజః
సహసోద్వేగ మియం వ్రజేదితి.
అచిరోపనతాం స మేదినీం
నవపాణి గ్రహణాం వధూమివ. 182

(రఘు. VIII-7)

"ఆ మహా భుజుడు, తొందరపడినచో ఈమె వెరపు చెందునని శంకించి, క్రొత్తగా లభించిన భూమిని, నవపరిణీత యగు వధువును వలె సదయముగ అనుభవించెను."

ఇచట నవపరిణీత వధువుకు సంబంధించిన సదయోప భోగము భూమి విషయమున ప్రవృత్త మైనది గాన పరివృత్తి యని కుంతకుని యభిప్రాయము. కాని దానిని స్వతంత్రాలంకారముగ అంగీకరింప బని లేదు. ఇదియు ఉపమయే యని అతని మతము.

కుంతకుడు పరివృత్త్యలంకారమున విషయాంతర పరివర్తనము, ధర్మాంతర పరివర్తనము అనెడు రెండు విధము లగు పరివర్తనముల నంగీకరించి ఈ క్రింది ఉదాహరణములను చూపెను.

"స్వల్పం జల్ప బృహస్పతే సురగురో నైషా సభావజ్రిణః"

విసృష్టరాగా దధరాన్ని వర్తితః
స్తనాంగ రాగారుణితాచ్చ కందుకాత్.
కుశాంకురాదాన పరిక్షతాంగుళిః
కృతోఽక్షసూత్ర ప్రణయీ తయా కరః. 183

(కు. V. 16)

"ఓ! సురగురువగు బృహస్పతీ స్వల్పముగ మాటలాడుము. ఇది దేవేంద్రుని సభ కాదు."

ఇచట దేవేంద్ర సభ కాక రావణ సభ యని చెప్పబడినది గాన సభారూప విషయ పరివృత్తి.

౮. ఇవి రావణుని పరిచారకులు ఆయా దేవతలతో పల్కిన మాటలు. పూర్తి శ్లోక మిది—

బ్రహ్మన్నధ్యయనస్య నైష సమయః తూష్ణీం బహిః స్థీయతాం
స్వల్పం జల్ప బృహస్పతే జడమతే నైషా సభా వజ్రిణః.
వీణాం సంహర నారద స్తుతికథాలాపై రలం తుంబురో
సీతారల్లక భల్ల విద్ధ హృదయః స్వస్థో న లంకేశ్వరః.

ధర్మాంతర పరివర్తనమునకు ఉదాహరణము :-

"విడువబడిన రాగము గల అధరము నుండియు, స్తనాంగరాగముచే ఎఱ్ఱగా చేయబడిన బంతినుండియు మరల్చబడి నట్టియు, దర్భాంకురములను కోయుటచే తెగిన వ్రేళ్ళు గలదియు నగు హస్తము ఆమెచే అక్షసూత్రముపై ప్రణయము కలదిగ చేయబడినది."

ఇచట గౌరీ కరకమల మనెడు ధర్మము పరివర్తిత మైనది.

కొన్ని చోట్ల ఒకే ధర్మికి సంబంధించిన సముచితమును అనుభూతమును అగు ధర్మము తొలగగనే మరి యొక ధర్మము పరివృత్త మగును. ఎట్లనగా—

'ధృతం' ఇత్యాది శ్లోకము. పూర్తి శ్లోక మిది:—

"కిమిత్యపాస్యా భరణాని యౌవనే
ధృతం త్వయా వార్ధకశోభి వల్కలమ్.
వద ప్రదోషే స్ఫుటచంద్ర తారకా
విభావరీ యద్యరుణాయ కల్పతే" (కు. V-44)

"యౌవనమున ఆభరణములను విడచి వార్ధకమునందు మాత్రమే శోభించు నారచీర ఏల ధరింపబడినది? సాయం సమయమున స్ఫుటముగ ప్రకాశించు చంద్ర నక్షత్రాదులు గల రాత్రి అరుణునకు అనుకూలముగ నుండునా? చెప్పుము."

ఇచట అలంకారరూప ధర్మ ముండవలసిన చోట వల్కల మున్నట్లు వర్ణింపబడినది.

కొన్ని యెడల పోటీ పడుచున్న అనేక ధర్మలకు సంబంధించిన పూర్వోక్తములు (ధర్మములు) అన్నియు విపరివృత్తిని చెందును. కావుననే

లక్షణకారుడు (దండి) ఇచట (పరివృత్త్యలంకార ఘట్టమున) ఉదాహరణము చూపియున్నాడు:-

'శస్త్ర ప్రహారం దదతా భుజేన తవ భూభుజామ్
చిరార్జితం హ్రృతం తేషాం యశః కుముద పాండురమ్"
(కావ్యాదర్శ II-356)

"రాజులకు శస్త్ర ప్రహారము నిచ్చుచున్న నీ భుజము, చిరకాలము నుండి సంపాదింప బడిన కలువల వలె తెల్లనైన, వారి కీర్తిని హరించినది."

ఇచట ఒక్క భుజము ఇచ్చిన శస్త్ర ప్రహారమునకు అనేక భూపతుల కీర్తితో పరివృత్తి వర్ణింపబడినది.

"నిర్దిష్టాం కులపతినా స పర్ణశాలా
మధ్యాస్య ప్రయత పరిగ్రహా ద్వితీయః.
తచ్ఛిష్యాధ్యయన నివేదితావసానాం
సంవిష్టః కుశ శయనే నిశాం నినాయ" 184
(రఘు. II-95)

"గృహీత నియమ యగు భార్యతో కూడిన ఆ దిలీపుడు కులపతి చూపిన పర్ణశాలలో నివసించి, కుశ శయనముపై శయనించి, ఆతని శిష్యుల వేదాధ్యయనముచే సూచిత మగు అంతము గల రాత్రిని గడపెను"

వి. ఇచట కుంతకుడు పరివర్తనీయము లగు పదార్థములు ప్రతీయమాన మగుచున్నవి అను విషయమును విచారించెను. అనగా రాజ ప్రాసాదము నధిష్ఠించుటకు బదులు పర్ణశాల నధిష్ఠించుట, మంత్రి సామంతాది సహాయు డగుటకు బదులు, భార్యా మాత్ర ద్వితీయు డగుట హంస తూలికా తల్పాదులకు బదులు కుశాసనముపై శయనించుట, వందిమాగధుల స్తోత్ర పాఠముచే రాత్రి సమాప్తిని దెలిసికొనుటకు బదులు వసిష్ఠశిష్య వేదాధ్యయనముచే దానిని తెలిసి కొనుట ఈ విధముగ పరివర్తనీయము లగు ప్రాసాదాదులు గమ్యముగ నున్న వని కుంతకుని యభిప్రాయమై యుండును.

పరివృత్త్యలంకార విమర్శానంతరమున గల గ్రంథము చాల అస్పష్టముగ నున్నది. ఇందు నిదర్శనాలంకారమునకు సంబంధించిన విచారణ మున్నది.

దీనిని పట్టి చూడగా వెనుక తుల్యయోగితాలంకార విమర్శ తరువాత చూపిన "నిదర్శన మప్యేవంప్రాయ మేవ" అను వాక్యము ఇచట యుండుట యుక్తము.

"క్రియయైవ విశిష్టస్య తదర్థస్యోపదర్శనాత్
జ్ఞేయా నిదర్శనా నామ యథేవ వతిభిర్వినా. 136

అయం మన్దద్యుతిర్భాస్వా నస్తం ప్రతి యియాసతి
ఉదయః పతనాయేతి శ్రీమతో బోధయన్నరాన్. 137

(కావ్యాలంకార III-33, 34)

నిదర్శనాలంకారము కూడ ఇట్టిదే. (అనగా ఉపమాంతర్గతమే). ముందుగ భామహోక్తలక్షణోదాహరణములు చూపుచున్నాడు—

"'యథా' 'ఇవ' 'వతి' అన నవి లేకుండగ క్రియయే విశిష్టప్రయోజనమును (అర్థమును) బోధించినచో నిదర్శనాలంకారము."

"ఈ భాస్వంతుడు (సూర్యుడు) మందకాంతికలవాడై, 'పైకిలేచుట పతనము కొరకే' అని శ్రీమంతులగు నరులకు బోధించుచు అస్తాద్రిని (అస్తమును) పొందనున్నాడు'.

ఇచట 'బోధయన్నివ' అని 'ఇవ' శబ్దమును ప్రయోగింపకున్నను క్రియయే ఆ అర్థవిశేషమును బోధించుచున్నది.

ఈ కారికలకు సంబంధించిన వృత్తివివరణాదికము గ్రంథపాతమున అస్పష్టముగ నున్నది. ఈ వివరణమున కుంతకుడు ఈ క్రింది శ్లోకముల నుదాహరించినాడు—

"తతః ప్రతస్థే కౌబేరీం భాస్వానివ రఘుర్దిశమ్
శరైరుస్రైరివోదీచ్యానుద్ధరిష్యన్ రసానివ". 138

(రఘు. IV-66)

"నిర్యాయ విద్యాథ దినాదిరమ్యా
ద్బింబాదివార్కస్య ముఖాన్మహర్షేః.
పార్థాననం వహ్నికణావదాతా
దీప్తిః స్ఫురత్పద్మమివ ప్రపేదే". 139

(కిరా. III-25)

'అటువిమ్మట, కిరణములచేత వలె బాణములచేత, రసములను వలె, ఉదీచ్యరాజులను ఉద్ధరింప నున్నవాడై, రఘుమహారాజు, సూర్యుడు వలె ఉత్తరదిక్కును గూర్చి ప్రమాణ మాయెను'.

"అనంతరము వహ్నికణము వలె స్వచ్ఛ మగు ఆ విద్య దివసప్రారంభ మున సుందర మగు సూర్యబింబమునుండి వలె వ్యాసమహర్షిముఖమునుండి బయ ల్వెడలి, కాంతి ప్రకాశించుచున్న పద్మమును వలె అర్జునుని ముఖమును ప్రవే శించెను".

కుంతకు డీ శ్లోకములు రెండింటిని ఏ ప్రసంగమున ఉదాహరించినాడో తెలియదు. ఆచార్య విశ్వేశ్వరుడు ఈ శ్లోకములు కూడ శ్లేషాలంకారమునకు సంబంధించిన వని గ్రహించి తదనుగుణముగ సమన్వయము చేసినాడు. భామ హుని ప్రకారము- గుణ—క్రియా–నామముల ద్వారా ఉపమానముతో ఉపమేయ మునకు తాదాత్మ్యమును సాధించినచో శ్లేషాలంకారము

"ఉపమానేన యత్తత్త్వముపమేయస్య సాధ్యతే
గుణక్రియాభ్యాం నామ్నా చ శ్లిష్టం తదభిధీయతే". 140
(కావ్యాలం. III-14)

పై ఉదాహరణములలో మొదటిదానిలో 'ఉద్ధరిష్యన్' అనుచోట క్రియా శ్లేష యనియు, రెండవ ఉదాహరణమున 'వహ్నికణావదాతా' అనుచోట గుణ శ్లేషయనియు, 'స్వాభిప్రాయ' ఇత్యాది (రాటోవు) శ్లోకమున 'విలోకితం" "వచః' అనుచోట్ల నామపదశ్లేష యనియు భామహుని యభిప్రాయము ఇది యంతయు ఇంకను పరిశీలింపవలసి యున్నది.

### శ్లే షా లం కా ర ము

శ్లేషాలంకారమునకు సంబంధించిన భాగము పూర్తిగ అస్పష్టముగ నున్నది. కాని కుంతకుడు ఉద్భటు ననుసరించి శ్లేషను అర్థశ్లేష, శబ్దశ్లేష, శబ్దా ర్థోభయ శ్లేషయని మూడు విధములుగ విభజించినట్లు కనబడుచున్నది ఈ క్రింది శ్లోకము అర్థశ్లేషోదాహరణము. ఉపలభ్యమాన మగు గ్రంథభాగమున ఇట్టి నామధేయాదిక మేదియు, స్పష్టముగ లేకున్నను ఇది అంతయు శ్రీదే ఊహించినది.

"స్వాభిప్రాయసమర్పణ ప్రవణయా మాధుర్యముద్రాఙ్కయా
విచ్ఛిత్త్యా హృదయేఽఖిజాతమనసామన్తః కిమప్యుల్లిఖత్.
అరూఢం రసవాసనాపరిణతేః కాష్ఠాం కవీనాం పరాం
కాన్తానాం చ విలోకితం విజయతే వైదగ్ధ్యవక్రం వచః" 141

'స్వాభిప్రాయమును తెలుపుటయందు అసక్తమైనదియు మాధుర్య ముద్రాంకితమును అగు విచ్ఛిత్తిచే అభిజాతుల మానసములందు ఏమేమియో వ్రాయుచున్నదియు, రసానుభూతిపరిణతియొక్క పరాకాష్ఠను పొందినదియు అగు, వైదగ్ధ్యముచే వక్ర మగు కవుల వాక్కును, కాంతల విలోకనమును సర్వోత్కర్షముగ నున్నవి'.

(ఇచట స్వాభిప్రాయ ఇత్యాదిశబ్దములకు కవివచః కాంతాకటాక్షముల పక్షమున అర్థము ఒకటియే యైనను తాత్పర్యమున భేదమున్నది గాన ఇది అర్థశ్లేష కుదాహరణము )

శబ్దశ్లేషోదాహరణము—

యేన ధ్వస్తమనోభవేన బలిజిత్కాయః పురాస్త్రీకృతః
యశ్చోద్వృత్తభుజంగహారవలయో గంగాం చ యోఽధారయత్.
యస్యాహుః శశిమచ్ఛిరోహర ఇతి స్తుత్యం చ నామామరాః
పాయాత్స స్వయమన్ధకక్షయకరస్త్వాం సర్వదో మాధవః. 142

ఈ శ్లోకము విష్ణుశివోభయస్తుతిపరము. విష్ణుపక్షమున అర్థము:—

(యేన + ధ్వసం + అనః + అభవేన) జన్మరహితు డగు ఎవనిచే శకటము (శకటాసురుడు) నశింపచేయబడెనో, పూర్వము, బలిని జయించిన తన శరీరము స్త్రీగా (మోహినిగా) చేయబడెనో, ఎవ్వడు అవినీతు డగు సర్పమును (కాళియుని) మర్దించెనో, ఎవనియందు ధ్వనికి అనగాశబ్దమునకు లయము కలుగునో, ఎవ్వడు పర్వతమును (గోవర్ధనమును) భూమిని (వరాహావతారమున) ధరించెనో, దేవతలు శశినిమథించినవాని (పీడించిన రాహువుయొక్క) శిరస్సును హరించినవాడని స్తుత్య మగు ఎవని నామధేయమును చెప్పుచుందురో, అట్టి అంధకులకు (యాదవులకు) క్షయమును (ద్వారకయందు నివాసమును) కల్పించినట్టియు సర్వఫలదాతయు అగు మాధవుడు నిన్ను రక్షించుగాక.

శివ పక్షమున అర్థము

"నశింపచేయబడిన మన్మథుడు గల ఎవనిచే పూర్వము విష్ణుశరీరము అస్త్రముగ (త్రిపురదాహసమయమున బాణముగ) చేయబడెనో, ఎవ్వాడు తిరుగాడుచున్న సర్పరూపహారవలయములు కలవాడో, ఎవ్వాడు గంగను ధరించెనో, "శశితో కూడిన శిరస్సు కలవాడు," 'హరుడు' అని ఎవని స్తుత్య మగు నామధేయమును ఉచ్చరించుచుందురో, స్వయముగ అంధకాసురిని సంహరించిన ఆ ఉమాధవుడు (మహేశ్వరుడు) నిన్ను ఎల్లవేళల రక్షించుగాక".

ఇచట శ్లేష శబ్దాశ్రితము గాన ఇది శబ్దశ్లేషకు ఉదాహరణము.

శబ్దార్థోభయశ్లేషకు ఉదాహరణము. ఇది గ్రంథపాతముచే అస్పష్టార్థముగ నున్నది.

"మాలాముత్పలకందలైః ప్రతికచం స్వాయోజితాం బిభ్రతీ
నేత్రేణాసమ దృష్టిపాత సుభగేనోద్దీపయన్తీ స్మరమ్.
కాంచీదామ నిబద్ధబంగి దధతీ వ్యాలంబినా వాససా
మూర్తిః కామరిపోః సితాంబరధరా పాయాచ్చ కామస్త్రియః" 143

వి. ఈ శ్లోకమున కామరిపు వగు శివుని పరముగను, కాముని భార్య యగు రతిపరముగను రెండు అర్థము లున్నవి. ఈశ్వరపర మగు అర్థము—

"కపాలములచే (ఉత్పల = మాంసములేని, కందల = కపోలములు) జటాజూటమునందు బాగుగ కూర్చబడిన మాలికను ధరించుచున్నదియు, విషమ దృష్టి ప్రసారముచే సుందర మగు నేత్రముచే (తృతీయ నేత్రముచే) మన్మథుని దహింపచేయునదియు, (వ్యాలం + వినా) వస్త్రము లేకుండగ మొలనూలుగా కట్టబడిన ఆకారము గల సర్పమును ధరించుచున్నదియు, తెల్లనైనదియు, ఆకాశమును ధరించిన (దిగంబర మగునదియు) నగు కామరిపు వగు ఈశ్వరుని మూర్తియు', (కామస్త్రీ పరమగు అర్థము) :-

'కేశపాశమునందు కలువమొగ్గలచే కూర్చబడిని మాలను ధరించుచున్నదియు కుటిలదృష్టి ప్రసారములచే సుందర మగు నేత్రముతో మన్మథుని ఉద్దీపింపచేయునదియు వ్రేలాడుచున్న వస్త్రముతో వడ్డాణముచే నేర్పరువబడిన భంగు

లను (కుచ్చిళ్ళను) ధరించుచున్నదియు, తెల్లని వస్త్రమును ధరించినదియు, అగు కాముని భార్య యగు రతీదేవి యొక్క మూర్తియు రక్షించుగాక."

ఈ శ్లోకమున 'ఉత్సుం కందలైః' ఇత్యాది పదములు వేరు వేరు అర్థములను (రెండేసి అర్థములను) బోధించుచున్నవి గాన వానియందు శబ్దశ్లేష. 'ప్రతికచం' 'స్మరం' ఇత్యాది పదములు రెండు పక్షములందును ఒకే యర్థమును బోధించు చున్నను తాత్పర్యభేద మున్నది గాన వాటియందు అర్థశ్లేషము.

దీని తరువాత కుంతకుడు అసత్యభూత శ్లేషకు ఉదాహరణముగ ఈ క్రింది శ్లోకమును ఉదాహరించినాడు. కాని దీనిని అసత్యభూతశ్లేష యనుటలో అతని యభిప్రాయ మేమియో స్పష్టము కాదు. సత్యమును కప్పి పుచ్చుటకై ప్రయుక్త మగు శ్లేషగాన దాని కాపేరు పెట్టి యుండును.

"దృష్ట్యా కేశవ గోపరాగహృతయా కించిన్న దృష్టం మయా
తేనైవ స్ఖలితాస్మి నాథ పతితాం కిం నామ నాలంబసే.
ఏ కస్త్వం విషమేషు ఖిన్న మనసాం సర్వాబలానాం గతిః
గోప్యైవం గదితః సలేశ మవతాత్ గోష్ఠే హరిర్వశ్చిరమ్. 144

వి. ఒక గోప వనిత కృష్ణునితో పలికిన ఈ మాటలలో రెండర్థము లున్నవి. బాహ్యార్థ మిది—

"ఓ శ్రీకృష్ణా! గోధూళిచే కప్పివేయబడిన దృష్టి కలదాననై ఏమియు చూడజాలక పోతిని. అందు చేతనే ఈ విధముగా తొట్రుపడితిని ఓ ప్రభూ! పడిపోయిన నాకు చేయూత ఏల ఈయవు? ఎగుడు దిగుడుగా నున్న స్థలములలో బాధపడుచున్న మనస్సు గల బలహీనుల అందరికిని నీ వొక్కడివే గతి. ఈ విధముగ గోశాలలో ఒక గోపికచే గూఢార్థము వచ్చునట్లు పల్కబడిన హరి మిమ్ములను చిరకాలము రక్షించుగాక."

మొదటి మూడు పాదములలోని నిగూఢార్థ మిది—

"ఓ కేశవా! గోపాలుని యందు (నీయందు) అనురాగము దృష్టిని కప్పివేయగా నేనేమియు చూడజాలక పోతిని. అందుచేతనే ఈ విధముగ స్ఖాలిత్యమును పొందితిని (పొరబడితిని). ఓ నాథా! నీవు (నా విషయమున)

పరిత్వమును ఏల అవలంబింపవు? విషమ బాణునిచే పీడింప బడిన మనస్సు గల సకల స్త్రీలకును నీ వొక్కడవే గతివి."

### వ్యతిరేకాలంకారము

కా. సతి తచ్ఛబ్ద వాచ్యత్వే ధర్మసామ్యేఽన్యథాస్థితేః
వ్యతిరేచన మన్యస్మాత్ ప్రస్తుతోత్కర్ష సిద్ధయే.
శాబ్దః ప్రతీయమానో వా వ్యతిరేకోఽభి ధీయతే. 33

ఈ కారిక వృత్తి సహాయముచే పునః సంగ్రథిత మైనది.

"శ్లేషకు నిమిత్తభూత మగు శబ్దముచే వాచ్యములై యుండి, ధర్మ సామ్యము కలిగి యున్నను, మరి యొక విధముగ నుండుటచే, ప్రస్తుత మగు పదార్థమునకు ఉత్కర్షము లభించుటకై మరి యొక దానికంటె (అప్రస్తుతము కంటె) భిన్నముగా నున్నదని చెప్పుట వ్యతిరేకాలంకారము అది శబ్దవాచ్యము కావచ్చును లేదా ప్రతీయ మానము కావచ్చును."

ఈ విధముగ శ్లేషమును చెప్పి ఇపుడు సతీత్యాది కారికచే, సామ్యమూలక మగుట వలన, ఉక్తరూప మగు శ్లేష కారణముగా గల వ్యతిరేకమును చెప్పు చున్నారు—

'తచ్ఛబ్దవాచ్యత్వే'–స 'దాసౌ శబ్దశ్చ అసి' విగ్రహ వాక్యమును చెప్పగా, 'తచ్ఛబ్ద' శబ్దము యొక్క శక్తిచే శ్లేషకు నిమిత్త మగు శబ్దము గ్రహింప బడును. దానిచే (శ్లేషకు నిమిత్త మగు శబ్దముచే), వాచ్యత్వే = అభిధీయ మాన మగుట, సతి = ఉండగా, ధర్మసామ్యే సత్యపి = పరస్పర ధర్మ సాదృశ్యము ఉన్నను...అట్టి శబ్దములచే బోధింప బడుటయు, ధర్మసామ్యము ఉభయ నిష్ఠము కావునను, రెండును ప్రకృతములే యగుట చేతను, ప్రస్తుతా ప్రస్తుతము లగు ఆ రెండింటిలో ఒకటి ధర్మముకంటె (భిన్న మగు), (కవి యొక్క) రుచిని అనుసరించి వివక్షిత మగు ఒకానొక ధర్మాంతరముచే, అన్యథాస్థితేః = మరియొక విధమున ఉండుట వలన, వ్యతిరేచనం = వేరుగా చేయుట. (అనగా రెండింటి యందును తుల్యముగ నున్న ధర్మముకంటె భిన్న మగు మరి యొక ధర్మమును పురస్కరించుకొని, ఒక దానిని ప్రస్తుతముగ పరిగణించి, దానిని రెండవదాని నుండి వేరుచేయుట యని యర్థము).

అన్యస్మాత్-ఉపమేయమును ఉపమానము నుండి లేదా ఉపమానమును ఉపమేయము నుండి. అది వ్యతిరేక మనెడు అలంకారముగ చెప్పబడుచున్నది. ఎందులకు? 'ప్రస్తుతోత్కర్ష సిద్ధయే'-ప్రస్తుతస్య=వర్ణింపబడుచున్న దాని యొక్క, కాంత్యతిశయము సిద్ధించుట కొరకు. అది (వ్యతిరేకము) రెండు విధముల నుండవచ్చును-శబ్ద వాచ్యము లేదా ప్రతీయమానము. కవి సంప్రదాయ ప్రసిద్ధమై, దానిని (వ్యతిరేకమును) బోధించుటకు సమర్థ మగు శబ్దముచే బోధింపబడునది శాబ్దము. వాక్యార్థము యొక్క సామర్థ్యము మాత్రము చేతనే బోధింపదగినది ప్రతీయమానము.

ఇచట కుంతకుడు మూడు శ్లోకములను ఉదాహరించెను. కాని మొదటి రెండును (ఒక సంస్కృత శ్లోకము ఒక ప్రాకృత శ్లోకము) గ్రంథపాతము చే అస్పష్టముగ నున్నవి. ఈ క్రింది శ్లోకము (మూడవది) ప్రతీయమాన వ్యతిరేక మున కుదాహరణముగ చూపబడినది.

"ప్రాప్తశ్రీ రేష కస్మాత్ పునరపి మయి తం మంథఖేదం విదధ్యాత్
నిద్రామప్యస్య పూర్వామనలసమనసో నైవ సంభావయామి।
సేతుం బధ్నాతి భూయః కిమితి చ సకల ద్వీపనాథానుయాత
స్త్వయ్యాయాతే వితర్కానితి దధత ఇవాభాతి కంపః పయోధేః" 145

"(ఇదివరకే) పొందబడిన లక్ష్మిగల ఈతడు నాకు మరల ఆ మథన క్లేశమును ఏల కలుగ చేయును? మాంద్యరహిత మగు మనస్సు గల ఈతనికి వెనుకటి వలె నిద్ర యున్నదని గూడ భావించను. (అందుచే ఈతడు నాపై నిద్రించుటకై వచ్చిన మహావిష్ణు వనుకొనుటకు వీలు లేదు). సకల ద్వీపాధి రాజులచే అనుసరింపబడిన ఈతడు మరల సేతువును ఏల కట్టునో? ఈ విధముగ, నీవు దరిజేరగనే, ఊహాలలో పడినవాడు వలె నున్న సముద్రుని కంపము ప్రకాశించుచున్నది."

వి. ఇచట విష్ణువుకంటె రాజునకు ఆధిక్యము సూచింప బడుచున్నది. విష్ణువునకు సముద్రము మథించిన పిమ్మటనే లక్ష్మి లభించినది. ఈతనికి పూర్వమే లభించినది. అతనికి నిద్ర యున్నది; ఈతడెప్పుడును అనలసుడే. కావున ఇచట ప్రతీయమాన వ్యతిరేక మని కుంతకుని యభిప్రాయము. కాని

ఆనందవర్ధ నాదుల యభిప్రాయము ప్రకారము ఇచట ప్రతీయమాన రూపక మని చెప్పుచున్నాడు—

ఇచట విష్ణుత్వారోపము (గమ్యముగా) ఉన్నది గాన రూపకాలంకారమే ప్రతీయమానముగ నున్న దని ప్రాచీన పండితులు చెప్పినారు.

ఈ సందర్భమున కుంతకుడు ధ్వనికారుడు చెప్పిన—

"యత్రార్థః శబ్దో వా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ
వ్యంక్తః కావ్యవిశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః 146
(ధ్వన్యా. 1-13)

"ఎచట అర్థము గాని శబ్దము గాని (వరుసగ) తనను, తన యర్థమును అప్రధానము చేసి ఆ వ్యంగ్యార్థమును వ్యంజింపచేయునో అది ధ్వని యని పండితులచే చెప్పబడినది' ఇత్యాది ధ్వనిలక్షణమును ఉదాహరించి ప్రతీయ మానత్వ మన ఏమో వివరించినాడు.

దీని తరువాత ఈ క్రింది శ్లోకమును శ్లేషవ్యతిరేకమున కుదాహరణముగ చూపినాడు—

"శ్లాఘ్యాశేషతనుం సుదర్శనకరః, సర్వాంగలీలాజిత
త్రైలోక్యాం, చరణారవిందలలితేనాక్రాంతలోకో హరిః.
బిభ్రాణం ముఖమిందురూపమఖిలం చంద్రాత్మచక్షుర్దధత్
స్థానే యాం స్వతనోరపశ్యదధికాం సా రుక్మిణీ వోఽవతాత్". 147

"సుదర్శనకరుడును (సుదర్శనము హస్తమునందు కలవాడు, అందమైన కరములు కలవాడు అని రెండర్థములు), చరణారవిందముయొక్క సౌందర్యముచే (అందమగు కదలికచే అని రెండవ అర్థము ) ఆకమింపబడిన లోకము కలవాడును, చంద్రరూప మగు నేత్రమును ధరించువాడును అగు హరి, శ్లాఘింపదగిన సకలశరీరము కలదియు, సర్వావయవశోభచే జయింపబడిన మూడు లోకములు కలదియు, చంద్రుని వంటి రూపము గల (చంద్రరూప మగు) సకల ముఖమును ధరించుచున్నదియు అగు ఏ రుక్మిణిని ఈమె నాకంటె అధికురాలే' యని యుక్తముగ జూచెనో అట్టి రుక్మిణి మిమ్ములను రక్షించుగాక.'

(ఇచట వ్యతిరేకము శ్లేషసహాయముచే కూర్చబడినది గాన ఇది శ్లేష వ్యతిరేకము.)

(దీని తరువాత కుంతకుడు వ్యతిరేకమునకు చెందిన మూడవ భేదమును గూడ ప్రతిపాదించెను. దాని కారిక ఈ క్రిందివిధముగ పునఃసంగ్రథిత మైనది.)

కా. లోకప్రసిద్ధసామాన్యపరిస్పన్దా ద్విశేషతః
వ్యతిరేకో యదేకస్య స పర స్తద్వివక్షయా. 34

"లోకప్రసిద్ధమును, సర్వసాధారణమును అగు వ్యాపారము కంటె ఒకానొక విశేష ముండుట వలన, ఉపమాదుల పరమార్థమును చెప్పవలె ననెడు ఇచ్ఛచే, ఒకదానిని వేరుగా చెప్పుట మరి యొకవిధ మగు వ్యతిరేకము."

లోకప్రసిద్ధేత్యాది కారికచే దీనికే సంబంధించిన మరి యొక ప్రకారమును చెప్పుచున్నాడు. పరః = మరియొక, సః = ఆ వ్యతిరేకాలంకారము. ఎట్టిది? ఏకస్య = ఏదియో ఒకానొక వస్తువుయొక్క, వ్యతిరేకః = వేరుగా చేయుట. ఎందువలన? 'లోకప్రసిద్ధసామాన్యపరిస్పన్దాత్'- లోకప్రసిద్ధః = జగత్ప్రసిద్ధ మగు, సామాన్యభూతః = సర్వసాధారణ మైన, ఏ, పరిస్పన్దః = వ్యాపారము గలదో దానివలన, ఏ హేతువు వలన? విశేషతః = ఒకానొక అతిశయమువలన. ఎట్లు? తద్వివక్షయా, 'తద్' అనగా ఉపమాదుల యథార్థస్వరూపములు. వాటియొక్క వివక్షచేత, అవి వివక్షితము లగుటచే కూర్చబడినది.

దీనికి ఉదాహరణముగ చూపిన శ్లోకము అశుద్ధిభూయిష్ఠమై యున్నది.

'చాపం పుష్పితభూతలం సురచితా మౌర్వీ ద్విరేఫావలిః
పూర్ణేన్దోరుదయోఽభియోగసమయః పుష్పాకరోఽప్యాసరః.
శస్త్రాణ్యుత్పలకేతకీసువనసో యోగ్యాత్మనః కామినాం
త్రైలోక్యే మదనస్య సాపి లలితోల్లేఖా జిగీషా గ్రహః (హాహా)' 148

'పుష్పించిన భూతలము ధనస్సు తుమ్మెదల పంక్తి బాగుగా కూర్చబడిన అల్లెత్రాడు. పూర్ణేందూదయము యుద్ధయాత్రాసమయము. వసంతము యుద్ధసహాయకర్త. ఉత్పలములు, కేతకీపుష్పములు ఆయుధములు. (ఈ విధ

మగ) మల్లోకములలోని కాముకులను జయించవలె నని మన్మథునికి గల సుందరరూప మగు అభిలాషకూడ ఆతనికి యోగ్యముగనే యున్నది. అహా!"

ఇచట- సకలలోకప్రసిద్ధ మగు శస్త్రాద్యుపకరణ కలాపము గల జిగీషావ్యవహారముకంటె, మన్మథుడు సుకుమారోపకరణములు కలవా డగుటచే, భిన్నమగు జిగీషా... .. (వ్యవహారమును చూపినట్లు వర్ణింపబడినది.) (ప్రశ్న) ఇచట భూతలాదులను చాపాదిరూపమున రూపించుటచే ఇది రూపకవ్యతిరేకము కాదా? (సమాధానము) అది కాదు. రూపకవ్యతిరేకాలంకారమున (మొదట) రూపకమును విధించి, దాని నాధారముగ గొని భిన్నత్వము ప్రతిపాదింపబడును. ఇచట నైతే సకలలోక ప్రసిద్ధ మగు సామాన్యవ్యవహారతాత్పర్యమును మనస్సులో నుంచుకొని వ్యతిరేకము ప్రతిపాదింపబడును. (ఇచటనున్న) భూతలాదులకు చాపాదిరూపణము కేవలము మరి యొక విశేషమునకు నిమిత్తముగ మాత్రమే చేయ్యబడిన దని గ్రహింపవలెను

వి. (వాస్తవమున) ఇచట వ్యతిరేకము రూపకముపైనే ఆధారపడి యున్నది గాన కుంతకుని సమాధానము అంతగా సంతృప్తిజనకముగ లేదు).

అనంతరము కుంతకుడు సర్వదా శ్లేషమిశ్రమగుటచే విరోధము స్వతంత్రాలంకారము కాజాల దని సూచించి ("శ్లేషేణాభిసంభిన్నత్వాత్"), శోభాశూన్య మగుటచే సమాసోక్తిని గూడ అలంకారవిశేషముగ అంగీకరింపరాదని భామహోక్తలక్షణోదాహరణ ప్రదర్శనపూర్వకముగ ప్రతిపాదించినాడు.

"యత్రోక్తే గమ్యతేఽన్యోఽర్థస్తత్సమాన విశేషణః
సాసమాసోక్తిరుద్దిష్టా సంక్షిప్తార్థతయా; యథా." 149
"స్కన్ధవానృజురవ్యాలః స్థిరోఽనేకమహాఫలః
జాతస్తరురయం చోచ్చైః పాతితశ్చ నభస్వతా" 150
(కావ్యాలం. III-79-80)

.......శోభాశూన్య మగుటచే ఇది అలంకారాంతరమని ... .... ...
(అంగీకరింపరాదు.)

"ఎక్కడ ఒక అర్థమును చెప్పగనే దానితో సమానము మగు విశేషణములు గల మరి యొక అర్థము కూడ గమ్యమగునో, అది, సంక్షిప్త మగు

అర్థమును (మరి యొక అర్థమును గూడ) బోధించుటచే సమాసోక్తి యని చెప్ప బడును. ఎట్లనగా"-

'ప్రమాను కలదియు (మంచి భుజములు కలవాడును), వంకర లేనిదియు (ఋజుస్వభావుడును), సర్పాది రహితమును (అక్రూరుడును) స్థిరమైన దియు, (స్థిరస్వభావుడును) అనేకమహాఫలములు కలదియు (అనేకములగు గొప్ప లాభములను) కూర్చువాడును, అగు ఈ వృక్షము చాల ఎత్తుగా కూడ అయినది. కాని గాలిచే పడగొట్టబడినది".

(ఇచట తరువర్ణనముచే మహాపురుషప్రతీతి కలుగుచున్నది గాన సమాసోక్తి యను భామహుని అభిప్రాయమును ఖండించు చున్నాడు —

ఇచట- వృక్షము, మహాపురుషుడు ఈ రెండును వాచ్యములే యైనచో, మహాపురుష పక్షమున విశేష్యము లున్నవి గాన విశేష్యబోధక మగు మరి యొక పదమును చెప్పవలసియున్నది. (విశేష్యము లేని విశేషణము లుండవు గాన) విశేషణాన్యథానుపపత్తిచే విశేష్యము ప్రతీత మగును అని కల్పించినచో, ఇట్టి కల్పనమునకు ఆధార మేదియు లేదుగాన శోభాశూన్యత్వము స్పష్టమే.

దీని తరువాత కుంతకుడు ధ్వన్యాలోకాద్యుదాహృత మగు—

"అనురాగవతీ సంధ్యా దివసస్తత్పురస్సరః
అహో దైవగతిశ్చిత్రా తథాపి న సమాగమః" 151

('సంధ్య అనురాగము కలదై యున్నది. దివసము దాని ఎదుటనే నడచు చున్నది. అయినను సమాగమము జరుగుట లేదు; దైవగతి ఎంత విచిత్రము!') అను శ్లోకమును గూర్చి చర్చించెను. భామహాదుల యభిప్రాయము ప్రకారము— ఈ శ్లోకమున అప్రస్తుత కామినీకాముకవృత్తాంతము ప్రతీయమానము గాన సమాసోక్తి. కుంతకుడీ విషయమున ఏమి చెప్పెనో తెలియదు. ఈ శ్లోకమున భామహుని మతము ప్రకారము సమాసోక్తి యనియు, వామనుని మతము ప్రకారము ఆక్షేప మనియు లోచనకారుడు వ్రాసియున్నాడు.

## సహోక్త్యలంకారము

కుంతకుడు భామహుని సహోక్త్యలంకారలక్షణోదాహరణములు చూపి, ఆ సహోక్తి ఉపమాంతర్గతమే యగునని ప్రతిపాదించుచున్నాడు:-

తుల్యకాలే క్రియే యత్ర వస్తుద్వయసమాశ్రయే
పదేనైకేన కథ్యేతే సహోక్తిః సా మతా: యథా. 152
హిమపాతావిలదిశో గాఢాలింగనహేతవః
వృద్ధిమాయాన్తి యామిన్యః కామినాం ప్రీతిభిః సహ. 153
(కావ్యాలంకార. III. 39-40)

"ఎచట రెండు వస్తువులను ఆశ్రయించి యున్నవియు, సమానకాలమున జరిగినవియు అగు రెండు క్రియలు ఒక పదముచే చెప్పబడునో అది సహోక్తి యని చెప్పబడును. ఎట్లనగా—"

"హిమపాతముచే వ్యాకులమైన దిక్కులు కలగినవియు, గాఢా లింగనములకు హేతు భూతములును అగు రాత్రులు కాముకుల ప్రేమలతో గూడ వృద్ధి బొందుచున్నవి."

ఇచట (రాత్రులకును, కాముకుల ప్రేమలకును) పరస్పర సామ్య సమన్వయమే మనోహారిత్వమునకు కారణము గాన ఇది ఉపమయే (సహోక్తి కాదు).

ఈ విధముగ భామహోక్త లక్షణోదాహరణములను నిరాకరించి తన కభీష్టము లగు లక్షణోదాహరణములను చూపుచున్నాడు. కుంతకుని సహోక్తి నిరూపణము నూతన పద్ధతిలో నడచినది. ఇతరు లెవ్వరును ఇట్టి లక్షణాదులను చూపలేదు. ఈ క్రింది కారిక వృత్తి సహాయముచే పునః సంద్బృబ్ధమైనది.

కా. యత్రైకేనైవ వాక్యేన వర్ణనీయార్థ సిద్ధయే
ఉక్తిర్యుగపదర్థానాం సా సహోక్తిః సతాం మతా. 35

"ప్రధానముగ వర్ణింపదగిన అర్థము యొక్క సిద్ధి కొరకు, ఎచట, ఒకే వాక్యముచే, ఒక్క మారుగ అనేకము లగు అర్థములు (విషయములు) చెప్పబడునో అది సహోక్తి యని సత్పురుషులకు నంగీకార్యమైనది."

ఇపుడు ప్రమాణోపపన్న మగు సహోక్తి స్వరూపమును యత్రేత్యాది కారికచే ప్రతిపాదించుచున్నాడు:- సా = అది, సహోక్తి అను అలంకారముగా, మతా = తోచినది; సతాం = దాని స్వరూపము నెరింగినవార్లకు. చెప్పబడినది

యని యర్థము. ఎట్టిది? యత్ర = దేనియందు, ఏకేనైవ వాక్యేన = భిన్నము కాని పదసమూహము చేతనే, అర్థానాం = వాక్యార్థతాత్పర్య రూపములగు వస్తువులకు, యుగపత్ = తుల్యసముయమునసే, ఉక్తిః = చెప్పుట (కలదో). ఎందులకు? వర్ణనీయార్థ సిద్ధయే-వర్ణనీయస్య = ప్రధానరూపమున వివక్షిత మగు, అర్థస్య = వస్తువుయొక్క, సంపత్తి కొరకు. ఇది చెప్పినట్లైనది— ఎచట, మరి యొక వాక్యమును ప్రయోగించి చెప్పవలసిన విషయమును గూడ, ప్రస్తుతార్థము సులభముగ నిష్పన్న మగుటకై, విచ్ఛిత్తి విశేషముచే, ఆ వాక్యము చేతనే చెప్పుదురో (అచట సహోక్త్యలంకారము).

ఎట్లనగా—

"హే హస్త దక్షిణ మృతస్య శిశోర్ద్విజస్య
జీవాతవే విస్పృజ శూద్రమునౌ కృపాణమ్.
రామస్య పాణిరసి నిర్భర గర్భఖిన్న
దేవీ ప్రవాసన పటోః కరుణా కుతస్తే" 154

(ఉత్తర రా. II-10)

"ఓ దక్షిణహస్తమా మృతు డగు బ్రాహ్మణ కుమారుని జీవనముకొరకై శూద్రమునిపై ఖడ్గమును విసురుము. నిండు గర్భముచే అలసట చెందిన భార్యను ప్రవాసము పంపగల్గిన రాముని హస్తము కదా నీవు. నీకు కరుణ ఎట్లుండును?"

ఇచట శూద్రమునిపై శస్త్రప్రయోగము నిర్విఘ్నముగ జరుగు నని సూచించుటకై, ఒకే వాక్యమున సీతా ప్రవాస వృత్తాంతము కూడ కూర్పబడినది గాన ఇది సహోక్తికి ఉదాహరణము.

"ఉచ్యతాం స వచనీయ మశేషం నేశ్వరే పరుషతా సఖి సాధ్వీ.
ఆనయైన మనునీయ కథం వా విప్రియాణి జనయన్ననునేయః" 155

(కిరా. IX-39)

"కిం గతేన న హి యుక్తముపైతుం కః ప్రియే సుభగమానిని మానః
యోషితామితి కథాసు సమేతైః కామిభిర్బహురసా ధృతిరూహే" 156 (కిరా. IX-40)

సర్వక్షితి భృతాం నాథ దృష్టా సర్వాంగ సుందరీ
రామా రమ్యే వనోద్దేశే మయా విరహితా త్వయా. 157
(విక్రమో. IV-51)

ఇంకను ఎట్లనగా— (ఇది నాయికకును సఖికిని నడుమ జరిగిన సంభాషణము).

(నాయిక) అతనిని ఎన్ని తిట్లు తిట్టవలెనో అన్నియు తిట్టి రమ్ము (సఖి) ఓ సఖీ! భర్త విషయమున ఈ విధ మగు పారుష్యము యుక్తము కాదు (నా) అయినచో ఆతనిని తీసికొని రమ్ము. (సఖి) ఈ విధముగ విప్రియములు చేయుచున్న వానిని బ్రతిమాలుకొనుట ఎట్లు? (నా) ఐతే, ఆతని దగ్గరకు వెళ్ళి మాత్రము ఏమి ప్రయోజనము? వెళ్లుట యుక్తము కాదు. (సఖి) ఓ సౌభాగ్య గర్వము కలదానా! ప్రియుని విషయమున మానమేమిటి? ఈ విధముగ స్త్రీల యొక్క కథలను వినుటకై చేరి యున్న కాముకులు బహు రసములు గల ఆనందమును పొందిరి"

(ఇచట విప్రలంభ శృంగార పరిపుష్టికై మానమును చేయుట, మానమును చేయకుండుట అనునవి రెండును వర్ణింపబడినవి గాన సహోక్త్యలంకారము.) (ఇంకను ఎట్లనగా) - (ఉర్వశి నన్వేషించుచున్న పురూరవుడు హిమవత్పర్వతమును జూచి నా ప్రియురాలిని చూచినావా అని యడుగుచున్నపు డన్న మాటలివి:-)

"సర్వపర్వతములకును నాథుడ వగు ఓ హిమవంతుడా! రమ్య మగు వనోద్దేశమునందు, సర్వాంగ సుందరియు, నాతో విరహమును పొందినదియు అగు వనిత నీచే చూడబడినదా?"

ఇది హిమవంతు నుద్దేశించి పురూరవుడు పల్కిన ప్రశ్నార్థక మగు వాక్యము. కాని ఈ వాక్యమే హిమవత్కందరములందు ప్రతి ధ్వనించి రాజునకు వినబడుటచే అది రాజునకు హిమవంతుని ప్రత్యుత్తరముగా దోచెను. అపుడు— ఓ సర్వరాజాధిరాజా! నీతో విరహిత యగు రామ నాచే చూడబడిన దని యర్థము.

ఇచట ప్రధాన మగు విప్రలంభ శృంగార రసమునకు పరిపుష్టి కలుగుటకై వాక్యార్థ ద్వయము కూర్చబడినది.

దీని తరువాత కుంతకుడు ఇట్టి సహోక్తి స్థలములలో శ్లేషాలంకారము నంగీకరించిన చాలదా యని యాశంకించి సమాధానము చెప్పినాడు. ఈ భాగము గ్రంథపాత దుష్టముగ నున్నది గాని కుంతకుని యభిప్రాయమును కొంతవరకు తెలిసికొనుటకు ఉపకరించు చున్నది.

(ప్రశ్న) అనేకము లగు అర్థములు సంభవించు నపుడు ఇచట సహోక్తికి శ్లేషాను ప్రవేశ మేల చెప్పరాదు? (సమాధానము). కారణము చెప్పుచున్నాము. ఏలయన అచట (శ్లేష స్థలమునందు) రెండింటికి గాని ఒక్కదానికి గాని ముఖ్యత్వ మున్నపుడు శ్లేష...దాని యందైతే (సహోక్తి యందైతే) అట్టి విధము లేదు. (దానియందు) అనేకములు గాని, రెండు గాని, అన్నియు గాని ప్రధానార్థ పరములుగ సిద్ధితము లగుటచే అప్రధానముగనే ఉండును. (అనగా శ్లేషయందు ఒక విషయము గాని, రెండు విషయములు గాని ప్రధానముగ నుండును. సహోక్తియందు అన్నియు అప్రధానములుగనే ఉండును).

ఇంకొక విషయ మేమనగా–దానియందు (శ్లేషయందు) ఒకే శబ్దము, ఒక్కమారుగ, దీప ప్రకాశము వలె, అర్థద్వయమును ప్రకాశింప చేయును, లేదా శబ్దార్థములు రెండింటిని ప్రకాశింప చేయును కావున శబ్ద మచట (అర్థద్వయ) సాధారణముగ నుండును. కాని సహోక్తి స్థలము నందు (ఆ వాక్యమున అట్టి అర్థద్వయ ప్రతిపాదక శబ్ద రూప మగు) స్వాంగ మేదియు లేకుండుటచే, వాక్యమే మరల మరల ఆవృత్తమై అర్థాంతరమును బోధించును. కావున ఇచట (సహోక్తి స్థలమున) ఆవృత్తి శబ్దన్యాయ్యముగ నుండును.

(ప్రశ్న) (మొత్తము శ్లోకము మాట ఎటులున్నను) "సర్వక్షితిభృతాం నాథ' అను వాక్యాంశమున శ్లేషాను ప్రవేశము సంభవించును గదా? సమాధానము చెప్పుచున్నాము. ఈ వాక్య భాగమున శ్లేష అంగముగా నున్నది. ముఖ్యము మాత్రము సహోక్తియే.

(పశ్న) ఈ విధముగ వాక్యమును ఆవృత్తి చేయుటచే అర్థాంతరబోధ కల్గు నన్నచో (రెండర్థములును ఒకదాని తరువాత ఒకటి బోధ్యము లగుచున్నవి గాన) ఈ సహోక్తిలో సహభావము (రెండు అర్థములును ఒకమాటు బోధింప బడుట) లేదు గాన "సహోక్తి అనుపదమున అర్థాన్వయము (సార్థకత్వము) లేదు కదా? (సమాధానము) ఈ దోషములేదు. 'సహోక్తి' అని యన్నాము గాని

'సహప్రతిపత్తి' (అర్థజ్ఞానము ఒక్క మారుగ కలుగుట) అని యనలేదు. కావున (రెండర్థములను) మిక్కిలి దగ్గరగా కలిపి (ఒక్క వాక్యముచే) చెప్పుటయే (ఇచట) ప్రతిపాద్య మగుదాని ఉత్కర్షను బోధించును గాన (సహోక్తి యను పేరులో) అసంబద్ధత్వ మేమియును లేదు.

శ్లో. కైశ్చిదేషా సమాసోక్తిః సహోక్తిః కైశ్చిదుచ్యతే
అర్థాన్వయాచ్చ విద్వద్భిరన్యైరన్యత్వ మేతయోః. 158

"కొందరు దీనిని సమాసోక్తి యందురు. కొందరు సహోక్తియందురు. మరికొందరుపండితులు (సమాసేన=సంగ్రహేణఉక్తిః సమాసోక్తిః, సహఉక్తిః సహోక్తిః) అను అర్థసార్థక్యమును పురస్కరించుకొని ఈ రెంటిను వేరు వేరు అలంకారము లని చెప్పుదురు'.

దృష్టాంతాలంకారము

కా. వస్తుసామ్యం సమాశ్రిత్య యదన్యస్య ప్రదర్శనమ్. 36

(ఈకారికాభాగము వృత్తిసాహాయ్యముచే పునఃసంధ్బద్ధమైనది).

"వస్తుసామ్యమును ఆశ్రయించి (ఆధారముగ గొని) పదార్థాంతరమును చూపుట దృష్టాంతాలంకారము".

వస్తుసామ్యేత్యాది కారికచే దృష్టాంతాలంకారమును నిరూపించుచున్నాడు. అన్యస్య= వర్ణ్యమాన మగు ప్రస్తుతవస్తువుకంటె భిన్న మగు మరియొక పదార్థముయొక్క, ఏ, ప్రదర్శనం = కూర్చుట గలదో, అది దృష్టాంత మనెడు అలంకారముగా చెప్పఁబడుచున్నది. ఎట్లు? 'వస్తుసామ్యం సమాశ్రిత్య'- వస్తునోః =దృష్టాంతదార్ష్టాంతికము లగు పదార్థములయొక్క, సామ్యం=సాదృశ్యమును, సమాశ్రిత్య=నిమిత్తముగా చేసికొని. లింగము సంఖ్య, విభక్తిమొద లగు వాటిచే నేర్పడిన సామ్యముతో పని లేదని సూచించుటకై 'వస్తు' అని చెప్పినాడు.

సరసిజమను విద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి.
ఇయమధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివ హి మధురాణాం మండనం నాకృతీనామ్. 159

[అ.శా. 1-20]

(ఉదాహరణ మెట్లనగా)-

"నాచు చుట్టుకొని యున్నను పద్మము రమ్యముగనే యుండును. చంద్రుని కళంకము మలినముగా నున్నను శోభను కూర్చును. ఈ తన్వి వల్కలముతో గూడ అధికమనోహరముగ నున్నది. సుందర మగు అకారములకు అలంకారము కాని దేది?"

(ఈ శ్లోకములోని) నాల్గవపాదములో మరి యొక అలంకారము (అర్థాంతరన్యాసము) నకు అవకాశ మున్నది గాన మొదటి మూడు పాదములు మాత్రమే ఉదాహరణము.

## అర్థాంతరన్యాసాలంకారము

కా. వాక్యార్థాన్తరవిన్యాసో ముఖ్యతాత్పర్య సామ్యతః
జ్ఞేయః సోఽర్థాన్తరన్యాసః యః సమర్పకతయా హితః. 87

(ఈ కారిక వృత్తిసాహాయ్యము చే కూర్పబడినది).

''ప్రధానవస్తువుయొక్క తాత్పర్యముతో సామ్యముండుట వలన, తత్సమర్థకముగ చేయబడిన మరి యొక వాక్యార్థముయొక్క విన్యాసము అర్థాన్తరన్యాసముగ తెలియదగినది".

వాక్యార్థేత్యాదికారికచే అర్థాంతరన్యాసమును చెప్పుచున్నాడు. ''జ్ఞేయః సోఽర్థాన్తరన్యాసః"— అది అర్థాంతరన్యాస మనెడు అలంకారముగా తెలియదగినది. ఏది? యః = ఏ, వాక్యార్థాంతరవిన్యాసః = పరస్పరాన్వితము లగు పదముల సముదాయముచే బోధింపదగిన వస్తువు వాక్యార్థము. దానికంటె భిన్నమైనది; అనగా ప్రకృతము గావున ప్రస్తుతమైనదానికంటె వ్యతిరిక్త మైనది వాక్యార్థాంతరము. దానియొక్క, విన్యాసః = విశిష్టమగు న్యసనము, అనగా, సహృదయులకు ఆహ్లాదమును కలిగించు విధమున కూర్చుట. ఏ కారణమువలన? ముఖ్యతాత్పర్యసామ్యతః, ముఖ్యం = ప్రకృతమున చెప్పబడుచున్నది గాన ప్రధాన మగు వస్తువు. దానియొక్క, తాత్పర్యం = దేని ప్రధానముగ ఉద్దేశించి ......(చెప్పుచున్నారో అది) దానియొక్క (ఆ తాత్పర్యము యొక్క) సామ్యతః = సాదృశ్యము వలన. ఎట్లు? సమర్పకతయాహితః = సమర్పకమగునట్లు కూర్చబడినది. అ యా ఉపపత్తులను చెప్పుట చేత అని భావము,

"సరసిజమనువిద్ధం" ఇత్యాది 160

అసంశయం క్షత్రపరిగ్రహక్షమా
యదార్యమస్యామభిలాషి మే మనః।
సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణమన్తఃకరణప్రవృత్తయః. 161

(అ.శా.1. 22)

(ఉదాహరణ మెట్లనగా)-

"రసిజమనువిద్ధం" ఇత్యాది పూర్వాలంకారోదాహృతశ్లోకము నందలి నాల్గవచరణము.

(ఇంకను ఎట్లనగా-)

"పూజ్య మగు నా మనస్సునకు ఈమెయందు అభిలాష కలిగినది గాన ఈమె నిస్సంశయముగ క్షత్రియుడు భార్యగా స్వీకరించుటకు తగినదే. సందేహాస్పదము లగు విషయములందు సత్పురుషులకు వారి అంతఃకరణప్రవృత్తులే ప్రమాణము కదా!"

## ఆ క్షే పా లం కా ర ము

కా. నిషేధచ్ఛాయయాక్షేపః కాన్తిం ప్రథయితుం పరామ్
ఆక్షేప ఇతి స జ్ఞేయః ప్రస్తుతస్యైవ వస్తునః. 38

"ఉత్కృష్ట మగు కాంతిని వృద్ధి పొందించుటకు, నిషేధము యొక్క విచ్ఛిత్తిచే ప్రస్తుతవస్తువునే నిషేధించుట ఆక్షేప మని తెలియదగినది".

'నిషేధచ్ఛాయయా' ఇత్యాది కారికచే ఆక్షేపాలంకారమును చెప్పుచున్నాడు. 'ఆక్షేప ఇతి స జ్ఞేయః'=అది ఆక్షేపాలంకార మని తెలియదగినది. అది ఎట్టిది? ప్రస్తుతస్యైవ వస్తునః = ప్రకృత మగు అర్థమునకే, ఆక్షేపః = క్షేపమును (నిరాకరణమును) చేయునది. ఇష్టమైన వస్తువును గూడ నిరాకరించుట యని యర్థము. ఎట్లు? నిషేధచ్ఛాయయా = ప్రతిషేధముచే కలుగు విచ్ఛిత్తిచేత. ఎందులకు? కాన్తిం ప్రథయితుం పరాం= ప్రకృష్టమగు శోభను వృద్ధిపొందించుటకు.

దీని కుదాహరణముగ ఒక ప్రాకృతశ్లోకము చూపబడినది. కాని అది చాల అస్పష్టముగ నున్నది.

విభావనాలంకారము

కా. వర్ణనీయస్య కేనాపి విశేషేణ విభావనా
స్వకారణ పరిత్యాగపూర్వకం కాన్తిసిద్ధయే. 39

(ఈ కారిక వృత్తిసాహాయ్యముచే పునఃసంగ్రథితమైనది. కాని వృత్తిలోని ప్రతీకను పట్టి చూడ పూర్వార్థోత్తరార్ధములు తారుమారైనట్లున్నవి)

'వర్ణనీయ మగు వస్తువునకు, కాంతి సిద్ధించుటకై, ఏదియో మరియొక విశేషమును, స్వకారణమును విడచి భావించుట విభావనాలంకారము"

ప్రతిషేధవైచిత్ర్యముచే ఛాయాతిశయము గల ఈ రూపమగు అలంకారమును చెప్పి, స్వకారణేత్యాదికారికచే కారణమును నిషేధించుటచే వృద్ధిపొందింపబడిన అతిశయము గల అలంకారమును చెప్పుచున్నాడు—

వర్ణనీయస్య = ప్రస్తుత మగు అర్థమునకు, విశేషేణ = ఒకానొక అలౌకిక మగు రూపాంతరముచేత, విభావన యను అలంకారము చెప్పబడును.... ఎట్లు? స్వకారణ పరిత్యాగపూర్వకం = ఆ విశేషముయొక్క, స్వం = ఆత్మీయ మగు, కారణం ఏ నిమిత్తము గలదో, దానియొక్క పరిత్యాగః = విడచుట, పూర్వం = ముందుగా దేనియందో. దానిని (పరిత్యాగమును) చేసి యని యర్థము. ఎందులకు? కాన్తి సిద్ధయే = శోభనిష్పన్న మగుటకు. దేచే లోకోత్తర విశేషము కలిగియుండుట వర్ణింపబడునో అది యని చెప్పినట్లైనది.

అసంభృతం మండనమంగయష్టే
రనాసవాఖ్యం కరణం మదస్య.
కామస్య పుష్పవ్యతిరిక్తమస్త్రం
బాల్యాత్పరం సాథ వయః ప్రపేదే. 162

(కు.మా 1. 31)

ఎట్లనగా—

"శరీరమునకు ప్రయత్నపూర్వకముగ కూర్పబడని అలంకారమైనట్టియు, మద్యమను పేరు లేని మదసాధన మైనట్టియు, పుష్పభిన్న మగు మన్మథబాణమైనదియు నగు, బాల్యము కంటె పర మగు వయస్సును ఆమె పొందినది."

ఇచట కృత్రిమములగు కారణములను విడచి లోకోత్తర మగు సహజవిశేషమును కలిగియుండుట (వర్ణించుట) అనునది కవికి ఇష్టమైనది. (అనగా ప్రకృత మగు సౌందర్యమున అప్రకృతమగు అలంకారత్వము ఆరోపింపబడుచున్నది. కాని వానికి కారణములుగ ప్రసిద్ధము లగు సంభృతత్వాదులు నిరాకరింపబడినవి. గాన ఇది విభావనాలంకారము).

## ససందేహాలంకారము

కా. యస్మిన్నుత్ప్రేక్షితం రూపం సందేహమేతి వస్తునః
ఉత్ప్రేక్షాన్తరసద్భావాత్ విచ్ఛిత్త్యైతత్...... 39

"ఎచట మరియొక ఉత్ప్రేక్షకూడ ఉండుటవలన, వస్తువుయొక్క ఉత్ప్రేక్షిత మగు ఒక రూపము, విచ్ఛిత్తివిశేషమునకై సందేహాస్పదముగ నున్నట్లు వర్ణింపబడునో అచట ససందేహాలంకారము".

ఈ విధముగ కారణము ఊహింపరానిదిగా ఉండుటచే ఊహింపరాని స్వభావము కలిగియుండుటను విచారించి, ఇపుడు యస్మిన్నిత్యాది కారికచే, స్వరూపము విచారగోచరము కాకుండుటచే స్వరూపమును గూర్చిన సందేహముచే సమర్పిత మగు అతిశయమును చెప్పుచున్నాడు. ఏ అలంకారమునందు, సంభావనానుమానము, సామ్యసంబంధము ఉండుట వలన, మరి యొక స్వరూపమును ఆరోపించి తద్ద్వారా ఉత్ప్రేక్షింపబడినదియు, ప్రతిభాకల్పితమును అగు పరార్థస్వభావరూప మగు స్వరూపము సందేహమునకు అనగా సంశయమునకు ఆస్పద మగునో అది. ఏ కారణమువలనః "ఉత్ప్రేక్షాన్తరసద్భావాత్" తద్విషయక మగు మరి యొక ఉత్ప్రేక్షాప్రకర్షము గూడ ఉండుటవలన. ఎందులకుః విచ్ఛిత్త్యై = శోభకొరకు. ఈ విధ మగు అభిధావైచిత్ర్యమును సందేహాలంకార మని చెప్పుదురు.

ఎట్లనగా —

రంజితా ను వివిధాస్తరుశైలా
నామితా ను గగనం స్థగితం ను.
పూరితా ను విషమేషు ధరిత్రీ
సంహృతా ను కకుభస్తిమిరేణ. 163

(రాకి. IX-15)

నిమీలదాకేకర లోలచక్షుషాం
ప్రియోపకంఠం కృతిగాత్రవేపథుః.
నిమజ్జతీనాం శ్వసితోద్ధత స్తనః
శ్రమో ను తాసాం మదనో ను పప్రథే. 164

(కిరా. VIII. 53)

"తమస్సుచే వివిధము లగు వృక్షపర్వతములు పూయబడినవో లేక కప్పివేయబడినదో, భూమి విషమప్రదేశములందు నింపివేయబడినదో, దిక్కులు కుందించివేయబడినవో (అన్నట్లున్నది)". "మూసికొని పోవుచున్న కొంచెము వక్రముగా నున్న చపలనేత్రములు కలిగి, జలమున మునుగుచున్న ఆ స్త్రీలకు, ప్రియుల సమీపమున, గాత్రకంపమును కలిగించుచున్నదియు, శ్వాసముచే ఎక్కువగా కదల్పబడిన స్తనములు కలదియు నగు, శ్రమయో లేక రాగమో వృద్ధిచెందెను".

దీని తరువాత చూపిన ప్రాకృతశ్లోకము అస్పష్టముగనున్నది. నాల్గవ ఉదాహరణము ఇది.

కిం సౌందర్యమహార్ఘసంచితజగత్కోశైకరత్నం విధేః
కిం శృంగారసరః సరోరుహమిదం స్యాత్సౌకుమార్యావధిః.
కిం లావణ్యపయోనిధేర భినవం బింబం సుధాదీధితే
ర్వక్తుం కాన్తతమాననం తవ మయా సామ్యం న నిశ్చీయతే 165

"అతి సుందర మగు నీ ముఖము, బ్రహ్మదేవుడు ప్రోగుచేసిన సౌందర్య మనెడు అమూల్యకోశజగత్తుకు సంబంధించిన రత్నమా, సౌకుమార్యమునకు పరమావధియైన, శృంగారసరస్సులోని పద్మమా, లావణ్య సముద్రమునకు సంబంధించిన చంద్రుని నూతనబింబమా? దేనితోడను సామ్యమును నిశ్చయింప జాలకున్నాను''

ససందేహమునకు ఉత్ప్రేక్షయే మూలము గాన ఇది గూడ దాని ప్రకార ములలో నొకటి యని చెప్పవలెను.

## అపహ్నుత్యలంకారము

కా. అన్యదర్పయితుం రూపం వర్ణనీయస్య వస్తునః
స్వరూపాపహ్నవో యస్యామసా వపహ్నుతిర్మతా. 39

(ఈ కారిక ఊహించి కూర్చబడినది.)

"వర్ణనీయ మగు ప్రకృతవస్తువునకు మరి యొక రూపమును కల్పించుటకై, ఎచట, దాని స్వరూపము మరుగు పరచబడునో అది అపహ్నుతిగా చెప్పబడినది".

ఈ విధముగ స్వరూపమును గూర్చిన సందేహముచే సుందర మగు ససందేహాలంకారమును ప్రతిపాదించి, అన్యదిత్యాదికారికచే, స్వరూపమును మరగు పరచుటచే రమణీయ మగు అపహ్నుత్యలంకారమును చెప్పుచున్నాడు. పూర్వమునందు (సందేహాలంకారమునందు) వలె దీనికి గూడ ఉత్ప్రేక్షామూలత్వమే జీవితము. సంభావనానుమానముచేతను, సాదృశ్యముచేతను, వర్ణనీయస్య వస్తునః = ప్రస్తుత మగు అర్థమునకు, అన్యత్ = అపూర్వ మగు ఒకానొక రూపమును అర్పించుటకు, రూపాంతరమును కల్పించుటకు, స్వరూపాపహ్నవః = స్వభావముయొక్క అపలాపము (కప్పివేయుట లేదా నిషేధము) దేనియందు సంభవించునో, అది, అట్టి వచనమే అపహ్నుతిగా, మతా = తద్విదులకు తోచినది.

దీని తరువాత మూడు ఉదాహరణములు చూపబడినవి. వాటిలో మొదటిది చాల అస్పష్టముగ నున్నది. ఇది రెండవ ఉదాహరణము.

"పూర్ణేన్దోః పరిపోషకా న్తవపుషః స్ఫారప్రభాభాసురం
నేదం మండలమభ్యుదేతి గగనే భాసోజ్జిహీర్షోర్జగత్.
మారస్యోచ్ఛ్రితమాతపత్రమధునా పాండుప్రదోషశ్రియో (తో)
మానో బంధుజనాఖిలాషదలనోఽదోఽద్యోచ్ఛిద్యతే కిం న తే. 166

"పరిపుష్టిచే సుందర మగు శరీరము కలిగినట్టియు, కాంతిచే జగత్తును పైకి లేవదీయనున్న పూర్ణేందుని, అధికకాంతిచే సుందర మగు ఈ మండలము ఉదయించుటలేదు. ఇపుడు మన్మథునియొక్క శ్వేతచ్ఛత్రము పైకి ఎత్తబడినది.

ప్రదోషసమయమున గ్రహింపబడినదియు, బంధుజనము (ప్రియుని) యొక్క అభిలాషకు విఘ్నకరముగా నున్న నీ మానము ఏల తొలగిపోకున్నది?"

ఆ కనబడునది చంద్రబింబము కాదు. మన్మథుని శ్వేతచ్ఛత్రమని చెప్పుటచే ఇది అపహ్నుతి.

"తవ కుసుమశరత్వం శీతరశ్మిత్వమిన్దోః
ద్వయమిదమయథార్థం దృశ్యతే మద్విధేషు.
విసృజతి హిమగర్భైరగ్నిమిన్దుర్మయూఖైః
త్వమపి కుసుమబాణాన్ వజ్రసారీకరోషి" 167
(అ భి. శా. III-55)

"నీవు కుసుమశరుడ వనుటయు, చంద్రుడు శీతకిరణుడనుటయు, ఈ ద్వయమును నావంటివారి విషయమున అయథార్థముగ కానవచ్చుచున్నది. చంద్రుడు మంచు గర్భమునందుగల కిరణములతో అగ్నిని వర్షించుచున్నాడు. నీవు కూడ పుష్పబాణములను వజ్రమువంటి సారముకలవాటినిగా చేయుచున్నావు."

## సంసృష్టి సంకరములు

కుంతకుడు సంసృష్టిసంకరములను గూర్చి వ్రాసిన కారికలు గాని, వాటిపై వృత్తి గాని స్పష్టముగ తెలియుట లేదు సంసృష్ట్యుదాహరణములుగ ఈ క్రింది రెండు పద్యములు పాఠదోషములతో లభించుచున్నవి.

"ఆశ్లిష్టో నవకుంకుమారుణరవివ్యాలోకితైర్వాశ్రితో
లంబాస్తాంబరయా సమేత్య భువనే ధ్వాన్తా$^{1}$న్తరే సంధ్యయా.
చంద్రాంశూత్కరకోరకాకులమల ర్ధ్వాన్త ద్విరేఫోఽధునా
దేవ్యా (స్థా) వాపితదో$^{2}$హదో$^{3}$కురవకో భాతి ప్రదోషాగమః" 168

(దీనియర్థము అస్పష్టముగానున్నది. కురవకము చిగర్చుటకు స్త్రీసమాలింగనము దోహదము కావున సంధ్యాకాంతచే ఆశ్లిష్టమై చంద్రాంశుకోరకాదులతో

1. మతిధ్వాన్త, 2. దోహదః, 3. కురవకః అనురీతిని పాఠములున్న బాగుండునని తోచును.

నిండిన ఈ ప్రదోషాగమము, దేవిచే కల్పిత మగు దోహదము గల కురవకము వలె ప్రకాశించుచున్న దని దీనితాత్పర్యమై యుండును.)

"అంబరాంతమునందు వ్రేలాడుచున్న (వ్రేలాడుచున్న చీర చెరగుగల) సంధ్యచే భువనమంతయు ధ్యానమధ్యముననుండగా (చూచుచుండగా) కౌగిలించు కొనబడినదియు, నవకుంకుమమువలె అరుణ మగు సూర్యకాంతులచే ఆశ్రయింప బడినదియు, (రవికిరణ సంపర్కము- స్త్రీ సమాలింగనముచే సంక్రమించిన కుంకుమము వలె నున్న దని యభిప్రాయము). చంద్రకిరణసముదాయ మనెడు క్షారకములచే వ్యాకులములైన మతి గల చీకటి యనెడు తుమ్మెదలు గల ప్రదోషసమయము ఇపుడు దేవిచే కల్పిత మగు దోహదము గల కురవకము వలె నున్నది".

భామహుని యభిప్రాయము ప్రకారము (III -49) ఒక వాక్యమున అనేకము లగు అలంకారము లుండుట సంసృష్టి. తదనుసారముగ ఈ శ్లోకమున శ్లేషరూపకాద్యలంకారము లున్నవి గాన ఇది సంసృష్టికి ఉదాహరణము

రెండవ ఉదాహరణము

"మ్లానిం వాన్తవిషానలేన నయనవ్యాపారలబ్ధాత్మనా
నీతా రాజభుజంగ పల్లవమృదురమ్లానం లతేయం త్వయా.
అస్మిన్నీశ్వర శేఖరేన్దుకిరణస్మేరస్థలీ లాంఛితే
కైలాసోపవనే యథా సుగహానే నైతి ప్రరోహం పునః" 169

"ఓ భుజంగరాజా! చూపుల ద్వారా ప్రసరించిన, వెదజిమ్మబడిన విషాగ్నిచే, నీవు పల్లవములతో మృదువైన ఈ లతను అంతగా వాడిపోవునట్లు చేసినావు; ఎంతగా ననగా ఈశ్వరుని శిరోభూషణముగా నున్న చంద్రుని కిరణములచే వికసించిన స్థలముచే అలంకృత మగు, ప్రవేశింప రాని ఈ కైలాసోద్యానమునందు గూడ మరల అంకురింపజాలదు."

ఈ క్రిందిపద్యము సంకీర్ణమునకు (సంకరమునకు) ఉదాహరణముగ చూపబడినది.

"రూఢా జాల్మై ర్జటానా మురగపతిఫణై స్తత్ర పాతాలకుక్షౌ
ప్రోద్యద్బాలాంకుర శ్రీర్దిశి దిశి దశనై రేఖిరాశాగజానామ్.

అస్మిన్నాకాశదేశే వికసితకుసుమా రాశిభిస్తారకాణాం
నాథ! త్వత్కీర్తివల్లీ ఫలతి ఫలమిదం బిమ్బమిన్దోః సురాద్రేః" 170

"ఆ పాతాలమధ్యమునందు ఆదిశేషుని పడగలచే వ్రేళ్ళతో పాదుకొన్నదియు (పాతాలము నందలి ఉరగపతి యొక్క పడగలు ఈ లతయొక్క వేళ్లు అని భావము; ఇట్లే ముందును) ప్రతి దిక్కునందు దిగ్గజముల ఈ దంతములచే బయల్వెడలుచున్న బాలాంకురములు కలదియు, ఈ ఆకాశ ప్రదేశమున నక్షత్ర రాశులచే వికసించిన పుష్పములు కలదియు నగు ఈ కీర్తి లత, ఓ రాజా! మేరు పర్వతము నుండి, ఈ చంద్రబింబ మనెడు ఫలమును ఫలించుచున్నది."

(ఇచట ఉరగపతి ఫణాదుల యందు జటాత్వా ద్యారోపము కీర్తియందు లతాత్వారోపముపై నాధారపడి యున్నది గాన అనుగ్రాహ్యానుగ్రాహకరూప మగు సంకరము)

ఇంకను ఎట్లనగా—

'నిర్మోకముక్తిరివ గగనోరగస్య'

'అస్యాః సర్గవిధౌ' ఇత్యాది పూర్వ ప్రదర్శితోదాహరణములు (చూ. III-12).

కుంతకు డీ విధముగ కొన్ని యలంకారములను ప్రతిపాదించి,తద్భిన్నము లగు అలంకారములలో కొన్ని లక్షితము లగు అలంకారములలో అంతర్గతములు కావునను, మరికొన్ని సౌందర్యరహితము లగుట చేతను వాటిని వేరుగ పేర్కొన బని లేదని చెప్పినాడు. ఈ సందర్భమున అను మీయమాన మగు కారిక ఈ విధముగ నున్నది—

కా. భూషణాన్తర భావేన శోభాశూన్యతయా తథా
అలంకారాస్తు యే కేచి న్నాలంకారతయా మతాః. 39

"మిగిలిన ఏ అలంకారములు కలవో, అవి పూర్వోక్తాలంకారములతో అంతర్గతము లగుట చేతను, కొన్ని శోభాశూన్యము లగుట చేతను కొంచెమైనను అలంకారములుగ అంగీకార్యములు కావు".

ఈ విధముగ ఉపపత్త్యనుసారముగ అలంకారముల లక్షణములను చెప్పి, కొన్నింటి లక్షణములను చెప్పకపోవుటచే లక్షణమునకు అవ్యాప్తి దోషము కలుగును కదా యను దోషమును పరిహరించుటకై, భూషణేత్యాది కారికచే ఉపక్రమించుచున్నాడు. పూర్వోక్తాలంకారముల కంటె భిన్నము లగు ఏ అలంకారములు గలవో అవి, కొంచెమైనను అలంకారములుగా అంగీకరింప బడలేదు. ఏ కారణముచేత? 'భూషణాన్తర భావేన'—వాటి కంటె వ్యతిరిక్త మగు భూషణము భూషణాంతరము. ఆ భూషణాంతరము యొక్క స్వభావము కలవగుటచేత. అనగా పూర్వోక్తాలంకారములలోనే చేరినవగుటచేత అని యర్థము. "శోభా శూన్యతయా తథా" — శోభ = కాంతి. దానితో శూన్యమైనది శోభా శూన్యము. దానియొక్క ధర్మము శోభా శూన్యత్వము. హేతుభూత మగు దానిచేత...కావున వాటికి అలంకారత్వము యుక్తము కాదు.

ం యథా సంఖ్యము అలంకారముగా పూర్వులచే అంగీకృతమైనను (పూర్వై రామ్నాతః) అది సౌందర్యవిహీన మగుటచే అలంకారము కాజాల దని కుంతకుడు భామహ లక్షణోదాహరణ దర్శన పూర్వకముగ ప్రతిపాదించినాడు.

భూయసాముపదిష్టానా మర్థానా మసధర్మణామ్
క్రమశో యోఽను నిర్దేశో యథాసంఖ్యం తదుచ్యతే. 173
పద్మేందు భృంగమాతంగ పుంస్కోకిల కలాపినః
వక్త్రకాన్తీక్షణగతి వాణీ బాలై స్త్వయా జితాః. 174
(కావ్యాలంకార II-89, 90)

"సమాన ధర్మములు కాని, చెప్పబడిన అనేక విషయములను క్రమముగ అనుసరించి నిర్దేశించుట యథా సంఖ్యా లంకారము."

"పద్మము, చంద్రుడు, తుమ్మెద, ఏనుగ, పుంస్కోకిల, నెమలి, వీటిని నీవు ముఖము, కాంతి, నేత్రములు, నడక, మాట, కేశములు వీటిచేత జయించితివి."

ఇచట ఉక్తి వైచిత్ర్య మేదియు లేదు గాన కాంతి ఏదియును లేదు.

ఆశీర లంకారము యొక్క లక్షణోదాహరణములను ఇచట చెప్పుట లేదు. ఆ ఉదాహరణములలో కోరదగియున్న పదార్థమే ప్రధానముగ

వర్ణింపబడుచున్నది గాన అది అలంకార్యమే యగును. కావున ప్రేయోలంకారము విషయమున చూపిన దూషణము లన్నియు ఇచట గూడ ప్రవర్తించును.

విశేషోక్తి కూడ, పూర్వోక్తాలంకారములలో నొకదానియందు అంతర్గత మగుట చేతను, అలంకార్య మగుట చేతను, అలంకారము కాజాలదు.

"ఏక దేశస్య విగమే యా గుణాన్తర సంస్థితిః
విశేష ప్రథనాయాసౌ విశేషోక్తిర్మతా యథా" 175
స ఏక స్త్రీణి జయతి జగన్తి కుసుమాయుధః
హరతాపి తనుం యస్య శంభునా న హృతం బలమ్. 176

(కావ్యాలంకార III-23, 24)

''ఒక యంశము లోపించినను, ఒకానొక విశేషమును ప్రతిపాదించుటకు, మరియొక గుణము యొక్క ఉనికిని వర్ణించుట విశేషోక్తి. ఎట్లనగా"—

''ఈశ్వరుడు ఎవని శరీరమును హరించినను బలమును హరించలేదో అట్టి కుసుమా యుధుడు ఒక్కడే మూడు లోకములను జయించుచున్నాడు.''

ఇచట సకలలోక ప్రసిద్ధ మగు జయిత్వము కంటె భిన్న మగు మన్మథుని స్వభావము మాత్రమే వాక్యార్థము. (కావున ఇది అలంకార్యమే గాని అలంకారము కాదని భావము).

పిమ్మట కుంతకుడు భామహుని మతమును అనుసరించుచు, హేతు సూక్ష్మ లేశములకు అలంకారత్వమును నిరాకరించినాడు.

హేతుశ్చ సూక్ష్మ లేశోఽథ నాలంకారతయా మతః.
సముదాయా భిధానస్య వక్రోక్త్య నభిధానతః 175

(కావ్యాలం. II-86)

సంకేతకాల మనసం విటం జ్ఞాత్వా విదగ్ధయా
హాసన్నేత్రార్పితా కూతం లీలాపద్మం నిమీలితమ్. 176
రాజ కన్యాను రక్తం మాం రోమోద్భేదేన రక్షకాః
అవగచ్ఛేయు రాజ్ఞాత మహో శీతానిలం వనమ్. 177

(కావ్యాదర్శ. II-266)

అయమాందోలిత ప్రౌఢ చందనద్రుమ పల్లవః
ఉత్పాదయతి సర్వస్య ప్రీతిం మలయ మారుతః. 178

"హేతువు, సూక్ష్మము, లేశము అనునవి, వాటి సాముదాయికార్థమున వక్రోక్తి (ఉక్తి వైచిత్ర్యము) లేనందున, అలంకారములుగా అంగీకార్యములు కావు".

ఇవి అలంకారములు కావని నిరూపించుటకై కుంతకుడు వాటి యుదాహరణములను చూపినాడు. అందు మొదటిది ధ్వన్యాలోకములో ప్రసంగాంతరమున ఉదాహృత మైనది. ఇది సూక్ష్మమున కుదాహరణము. 'రాజకన్యాను రక్తం' ఇత్యాది శ్లోకము లేశమునకును, 'అయమాదోలిత' ఇత్యాది శ్లోకము హేతువుకును ఉదాహరణముగ కావ్యాదర్శనమున దండిచే చూపబడినవి. శ్రీ దే ఇవి వరుసగ హేతు, సూక్ష్మ, లేశముల కుదాహరణములని వ్రాయుట ప్రామాదిక మని తోచుచున్నది.

దండి కావ్యాదర్శమున సూక్ష్మాలంకారమునకు ఈ క్రింది లక్షణోదాహరణముల నిచ్చెను:-

"ఇంగితాకారలక్ష్యోఽర్థః సౌక్ష్మ్యాత్ సూక్ష్మ ఇతి స్మృతః
'కదా నౌ సంగమో భావీత్యాకీర్ణే వక్తుమక్షమమ్
అవేత్య కాన్తమబలా లీలాపద్మం న్యమీలయత్'

"సూక్ష్మముగ నుండుట వలన ఇంగితాకారములచే తెలియదగిన విషయమునకు సూక్ష్మమని పేరు.' "జనాకీర్ణప్రదేశమున — మనకు (తామిరువురకు) సంగమెపుడు కలుగునో చెప్పుటకు వీలు లేని కాంతుని చూచి, అబల, లీలాపద్మమును మూసికొనునట్లుచేసెను." అని దీనియర్థము. ఇచట పద్మసంమీలన సమయమున, సాయంకాలమున, మన సంగమము జరుగగల దని దీని భావము.

ఇచట కుంతకుడు ధ్వన్యాలోకమునుండి గ్రహించి ఉదాహరించిన శ్లోకమునకు గూడ ఇదియే భావము.

'సంకేతకాలమును గూర్చి తెలిసికొనవలె నని మనస్సు గల విటుని చూచి, ఆ జాణ వికసించిన నేత్రముల ద్వారా అభిప్రాయమును సూచించుచు లీలాపద్మమును ముకుళీభవింపజేసెను". ఇది సూక్ష్మమున కుదాహరణము.

రెండవ శ్లోకము లేశమున కుదాహరణము—

'లేశో లేశేన నిర్భిన్నవస్తురూప నిగూహనమ్' అని దండి చూపిన లక్షణము. "స్వల్పరూపమున ప్రకట మైన వస్తువుయొక్క స్వరూపమును కప్పి పుచ్చుట లేశము".

'రోమాంచమును బట్టి, నేను రాజకన్యయందు అనురక్తుడ నని రాజభటులు తెలిసికొందురే! ఆ ఉపాయము తెలిసినది. అహా! గాలి ఎంత చల్లగా నున్నది'. ఇచట ఒక కాముకుడు రోమాంచోద్గమము ద్వారా లేశముగ తన యనురాగము ప్రకటమగు చుండగా దానిని శీతవాయురూపనిమిత్తముచే కప్పి పుచ్చెను గాన లేశాలంకారము.

ఒకదానికి కారణమును (నిమిత్తమును) కూర్చినచో అది హేత్వలంకారము. ఉదా:- "కదల్చబడిన, ముదిరిన చందన వృక్షపల్లవములు గల్గ ఈ మలయమారుతము అందరికిని ప్రీతిని కలిగించుచున్నది". ఇచట మలయమారుతము ప్రీతి జనక మగుటకు హేతువుగ, ఆందోలితప్రౌఢచందనద్రుమ పల్లవత్వము చూపబడినది గాన ఇది హేత్వలంకారము. ఈ విధముగ సూక్ష్మలేశహేత్వలంకారములను దండి అంగీకరించెను. కాని ఇవి అలంకారములు కావని కుంతకుడు చెప్పుచున్నాడు.— 'ఈ ఉదాహరణములలో స్వభావము మాత్రమే రమణీయముగ నున్నది". అనగా ఇచట వస్తువు అలంకార్యమే గాని అలంకారము కాదని యభిప్రాయము.

కొందరు (భామహుడు) ఉపమారూపకము అలంకార మని అంగీకరింతురు.

'సమగ్రగగనాభోగ మానదండో రథాంగినః
పాదో జయతి సిద్ధస్త్రీముఖేన్దు నవదర్పణః' 179 (ఇతి)

భామహుడు దీనికి ఈ క్రింది లక్షణోదాహరణములను చూపెను.

'ఉపమానేన తద్భావ ముపమేయస్య సాధయన్
యాం వదత్యుపమామేత దుపమారూపకం విదుః'

'ఉపమేయమునకు ఉపమానముతో తాదాత్మ్యమును సాధించుచు చెప్పిన ఉపమ ఉపమారూపకము". 'సమగ్ర' ఇత్యాది శ్లోకము ఉదాహరణము. సమస్త

మగు గగన వైశాల్యమును కొలచెడు దండ మైనదియు, సిద్ధస్త్రీల ముఖచంద్రు లకు క్రొత్త దర్పణమును అగు విష్ణుపాదము సర్వోత్కర్షతో నున్నది." కుంత కుడు నిరాకరించుచున్నాడు— అది యుక్తము కాదు. దీనికి అలంకారత్వము ఉపపన్నము కాదు. అనగా రూపకముకంటె ఇందు వైశిష్ట్య మేదియు లేదని భావము.

వస్తువక్రతయొక్క స్వరూపమును నిరూపించుచున్నాడు:-

కా. లావణ్యాది గుణోజ్జ్వలా ప్రతిపదన్యాసైర్విలాసాంచితా
విచ్ఛిత్త్యారచితై ర్విభూషణభరై ర ల్పైర్మనోహారిణీ.
అత్యర్థం రసవత్తయార్ద్రహృదయా......ఉదారాభిధా
వాక్...మనోహర్తుం యథా నాయికా. 40

'లావణ్యాదిగుణములతో ప్రకాశించునదియు, ప్రతి ఒక్క పదన్యాసము నందును విలాసతో కూడినదియు, శోభాదృష్టితో కూర్పబడిన అత్యల్పసంఖ్యా కము లగు అలంకారములచే మనోహర మైనదియు, మిక్కిలి సరస మగుటచే ఆర్ద్రమైన హృదయము కలదియు, ఉదారమైన అభిధ (పేరు అని అర్థాంతరము) కలదియు నగు వాక్కు నాయికవలె మనస్సును హరించుటకు సమర్థమై యున్నది'.

ఇచటి విశేషణములు కావ్యపక్షమునందును, నాయికాపక్షమునందును తుల్యముగ సమన్వయించును.

కుంతకుడు రచించిన వక్రోక్తిజీవితమునకు
పుల్లెలోపాహ్వ శ్రీరామచంద్రవిరచిత మగు
ఆంధ్రానువాదమున తృతీయోన్మేషము

సమాప్తము

# చతుర్థోన్మేషము

## ప్రకరణ వక్రత

ఈ విధముగ సకలసాహిత్యమునకు సర్వస్వమువంటిదైన వాక్యవక్రతను నిరూపించిన పిమ్మట క్రమప్రాప్తమగు ప్రకరణ వక్రతను ప్రస్తావించుచున్నాడు.

కా. యత్ర నిర్యన్త్రణోత్సాహ పరిస్పన్దోపశోభినీ
వ్యావృత్తిర్వ్యవహర్తౄణాం స్వాశయోల్లేఖ శాలినీ. 1
అప్యామూలా దనాశంక్య సముత్థానే మనోరథే
కాప్యున్మీలతి నిస్సీమా సా ప్రబంధస్య వక్రతా. 2

"ప్రారంభమునుండియు మనోరథము (కథాగతికి సంబంధించిన కవుల అభిప్రాయము ) యొక్క వికాసము ఊహింపరానిదై యుండ, అడ్డు లేని ఉత్సాహ విజృంభణముచే శోభించునదియు, తమ యభిప్రాయమును చిత్రించుటచే ప్రకాశించునదియు, నగు వ్యవహర్తల (ప్రబంధ వక్రతను ప్రయోగించు రచయితల) ఒకానొక ప్రవృత్తి ఎచట నుండునో అచట అనంతరూప మగు ప్రబంధవక్రత ఉండును. (అనగా కవుల అట్టి ప్రవృత్తియే ప్రబంధవక్రత.)

వక్రతా = వక్రత్వము అగును అని సంబంధము. ఎట్టిది? నిఃసీమా = అవధి లేనిది. యత్ర = దేనియందు, వ్యవహర్తౄణాం = ఆ వ్యాపారమును పరిగ్రహించుటకై ఆసక్తి కలవారి, వ్యావృత్తిః = ప్రవృత్తి, కాపి = అలౌకికమైనది. ఉన్మీలతి = ఉద్భిన్న మగునో: ఎట్టి వైశిష్ట్యము కలది? 'నిర్యన్త్రణోత్సాహ పరిస్పన్దోపశోభినీ' = నిరర్గల మగు, ప్రయత్నముచే ప్రకాశించుచున్న అత్యధిక మగు శోభ కలది. కావుననే, స్వాశయోల్లేఖశాలినీ = నిరుపమాన మగు తన హృదయముచే ప్రకాశిత మగు అలంకారములు కలది (మూలమున 'హృదయోల్లసిత' అను పాఠము యుక్తము. అపుడు దీని యర్థము- "నిరుపమాన మగు నిజహృదయోల్లాసమే అలంకారముగా కలది). ఏది ఉండగా?

"అప్యామూలాదనాశంక్య సముత్థానే"—ప్రారంభమునుండియు (కవియొక్క) అభిలాష ఊహింపరాని వికాసము కందై యుదంగా. దీని తాత్పర్య మేమనగా...

దీని తరువాత అభిజాతజానకి యను నాటకములోని, సేతుబంధనామధేయ మగు తృతీయాంకమునుండి ప్రకరణవక్రతకు ఉదాహరణములు చూపబడినవి.

శైలాస్సన్తి సహస్రశః ప్రతిదిశం వల్మీకకల్పా ఇమే
దోర్దండాశ్చ కఠోరవిక్రమరసక్రీడా సముత్కంఠకాః.
కర్ణాస్వాదిత కుంభసంభవకథాః కిన్నామ కల్లోలినీ
ప్రాయో గోష్పదపూరణేఽపి కపయః కౌతూహలం నాస్తి వః. 1

ఆన్దోల్యన్తే కతి న గిరయః కన్దుకానన్ద ముద్రాం
వ్యాతన్వానాః కరపరిసరే కౌతుకోత్కర్ష హర్షే.
లోపాముద్రాపరివృఢ కథాభిజ్ఞతాప్యస్తి కిన్తు
వ్రీడావేశః పవన తనయోచ్ఛిష్ట సంస్పర్శనేన. 2

అనంకురిత నిస్సీమమనోరథరుహేష్వపి
కృతినస్తుల్యసంరంభ మారభన్తే జయన్తి చ.

సేనాపతి యగు నీలుని వాక్యము

"ప్రతి దిక్కునందును చీమలపుట్టల వలె ఎన్నో పర్వతములు వేలకొలది ఉన్నవి. మీ బాహు దండములు కూడ కఠోర మగు పరాక్రమ రసముతో కూడిన క్రీడయందు వేడుక గలవి. కర్ణములచే ఆస్వాదింప బడిన కుంభవ సంభవుని (అగస్త్యుని) కథలు (సముద్రపాన వృత్తాంతము) గల ఓ కపులారా! మీకు గోష్పదమునైన నింపుటకు (గొవ్పదము వంటి ఈసముద్రమును నింపుటకు) వేడుక లేదా?" ('కిన్నామ కల్లోలినీ' అనునదిఈ శ్లోకమునసరిగ అన్వయించుట లేదు).

వానరుల ప్రత్యుత్తరము; నేపథ్యమున మరి యొక కలకలము.

"బంతులచే కలుగు ఆనంద ముద్రను కల్గించు నవియు, కౌతుకోత్కర్ష మును, హర్షమును హస్తాగ్రమున కూర్చునవియు నగు పర్వతములు ఎని?

ఎగురవేయబడుట లేదు. అగస్త్య కథా జ్ఞానము కూడ లేకపోలేదు. కాని పవన తనయునిచే ఉచ్ఛిష్ట మగు (ఆతనిచే దాటబడుటచే తదుచ్ఛిష్ట సదృశ మగు) ఈ సముద్రమును స్పృశించుట చేత సిగ్గు కలుగుచున్నది."

...(రామునిచే ప్రశ్నింపబడిన జాంబవంతుని వాక్యము)-"అంకురిత మైనను కాని అనంతములగు మనోరథములను ఆరోహించు విషయమున గూడ, సమర్థులు (సఫల మనోరథ విషయములతో) సమాన మగు సంరంభముతో ఉపక్రమింతురు; విజయమును కూడ పొందుదురు." (దీని భావమంత స్పష్టముగ లేదు).

ఆ నాటకము నుండియే ఈ విధమైన, నూతనమును అద్భుత మైనదియు, ఆస్వాద విశేష సుందరమును అగు, ఇతర మైన సుభాషిత సర్వస్వము గూడ ఊహింపదగినది.

ప్రకరణ వక్రతకు ఉదాహరణముగ కుంతకుడు రఘువంశ పంచమ సర్గములోని కౌత్స వృత్తాంత ఘట్టము నందలి కొన్ని శ్లోకములను చూపినాడు:-

పతావదుక్త్వా ప్రతియాతు కామం
శిష్యం మహర్షేర్నృపతిర్నిషిధ్య.
కిం వస్తు విద్వన్ గురవే ప్రదేయం
త్వయా కియద్వేతి తమన్వయుక్త. 4 (ర. V-18)

గుర్వర్థమర్థీ శ్రుతపారదృశ్వా
రఘోః సకాశాదన వాప్య కామమ్.
గతో వదాన్యాన్తర మిత్యయం మే
మాభూత్పరీ వాద నవావతారః. 5 (రఘు. V-24)

తం భూపతిర్భాసుర హేమ రాశిం
లబ్ధం కుబేరాద భియాస్యమానాత్.
దిదేశ కౌత్సాయ సమస్తమేవ
పాదం సుమేరో రివ వజ్రభిన్నమ్. 6 (రఘు. V-30)

జనస్య సాకేత నివాసిన స్తౌ
ద్వావప్య భూతామ భినన్ద్య సత్త్వౌ.
గురు ప్రదేయాధిక నిఃస్పృహోఽర్థీ
నృపోఽర్థి కామాదధిక ప్రదశ్చ. 7 (రఘు. V-31)

"ఇంత మాత్రము పలికి మరలిపోనున్న మహర్షి శిష్యుని అపి, "ఓ విద్వాంసుడా నీవు గురువునకు ఏమి ఈయవలెను? ఎంత ఈయవలెను?" అని ప్రశ్నించెను."

"గురువు కొరకై ధనమును యాచింప వచ్చిన ఒక సకల విద్యా పారంగతుడు, రఘువు దగ్గర తన కోరికను సఫలము చేసికొన జాలక మరి యొక దాత దగ్గరకు వెళ్ళినాడు అనెడు ఈ క్రొత్త అపవాదము నాకు కలుగ కుండుగాక."

"రఘు మహారాజు, తాను దండెత్త వలసి యున్న కుబేరుని నుండి లభించిన, వజ్రముచే భేదింపబడిన మేరు పర్వత భాగము వలె నున్న, ప్రకాశించుచున్న ఆ బంగారపు రాశిని అంతను కౌత్సునకు ఇచ్చివేసెను".

"గురువునకు ఈయవలసిన దాని కంటె అధిక మగు దానియందు ఆసక్తి లేని ఆ యాచకుడు, యాచకునికి కోరిన దానికంటె అధికముగ నిచ్చు ఆ రాజు, ఇరువురును సాకేతమున నివసించు జనులచే శ్లాఘింపబడిన మానసికౌన్నత్యము కలవారైరి".

కుబేరుని ఒక సామంత రాజుగ భావించి వానిపై దండెత్తి వెళ్ళుటకు నిర్ణయించుట అనునది అపూర్వ మగు సహృదయ హృదయాహ్లాదమును కలిగించు చున్నది...మరియు, 'జనస్య సాకేత' ఇత్యాది శ్లోకమున గురువునకీయవలసి యున్న దక్షిణకు మించిన బంగారమును ప్రతిగ్రహింపని కౌత్సుని యొక్కయు, ప్రార్థించిన దానికి నూరురెట్లు లేదా వేయిరెట్లు ఇచ్చుచున్న రఘువు యొక్కయు నిరవధి యగు నిఃస్పృహత్వ మనెడు ఔదార్యము యొక్క సంపద, సాకేతమున నివసించు జనము నాశ్రయించి ఒకానొక అపూర్వ మగు మహోత్సవ ముద్రను విస్తరింప చేసెను. ఈ విధముగ మహా కవుల ప్రబంధములలో నున్న ఈ రసము చిప్పిరిల్లు ప్రకరణ వక్రతా సౌందర్యమును సహృదయులు స్వయముగ ఊహించుకొనవలెను.

దీనినే మరి యొక విధముగ వివరించుచున్నాడు:-

కా. ఇతివృత్త ప్రయుక్తేఽపి కథా వైచిత్ర్య వర్త్మని
ఉత్పాద్యలవ లావణ్యాదన్యా భవతి వక్రతా. 3

తథా యథా ప్రబంధస్య సకలస్యాపి జీవితమ్
భాతి ప్రకరణం కాష్ఠాధి రూఢరస నిర్భరమ్. 4

("ప్రసిద్ధ మగు) ఇతి వృత్తమునందు ప్రయుక్త మగు కథా వైచిత్ర్య మార్గమునందు గూడ ఉత్పాద్య (కల్పిత) కథా లేశము యొక్క లావణ్యముచే ఒకానొక వక్రత కల్గును. దానిచే ఆ ప్రకరణము పరాకాష్ఠ నధిరోహించిన రసముతో నిండినదై ప్రబంధమున కంతకును జీవితము వలె అగును".

'తథా ఉత్పాద్య లవలావణ్యాదన్యా భవతి వక్రతా' = ఆ ప్రకారముచే, కృత్రిమ మగు ఏర్పాటుచే కల్గిన సౌందర్యము గల అలౌకిక మగు వక్రభావ భంగి సముజ్జృంభించును, అనగా సహృదయులను ఆకర్షించును. ఎక్కడ? కథా వైచిత్ర్య వర్త్మని = కావ్యము యొక్క వైచిత్ర్య మార్గమున. ఎట్టిది? ఇతివృత్త ప్రవృత్తేఽపి = ఇతిహాస పరిగృహీత మైనను. 'తథా' అనునది 'యథా' అను దాని ప్రయోగమును అపేక్షించును గాన చెప్పుచున్నాడు— 'యథా ప్రబన్ధస్య సకలస్యాపి జీవితం భాతి ప్రకరణమ్'-ఏ ప్రకారముచే సంపూర్ణ మగు సర్గబంధాది రూపకావ్యమునకు అంగము (అంగ మగు ప్రకరణము) ప్రాణమువంటిదై (ప్రకాశించునో). ఎట్టిది? కాష్ఠాధి రూఢరస నిర్భరమ్-ఉత్తమ స్థానమును అధిష్ఠించిన శృంగారాది రసములతో పూర్ణమైనది.

దీనికి ఉదాహరణముగ అభిజ్ఞాన శాకుంతలమున కాలిదాస కల్పిత మగు దుర్వాసః శాపవృత్తాంతమును గూర్చి చర్చించి, దానివలన రాజు మనస్సున కలిగిన మార్పును చూపుచు నాలుగు శ్లోకములను కూడ ఉదాహరించినాడు:-

"విచిన్తయన్తీ యమనన్య మానసా
తపోధనం వేత్సి న మాముపస్థితమ్.
స్మరిష్యతి త్వాం న స బోధితోఽపి సన్
కథాం ప్రమత్తః ప్రథమం కృతామివ" 8. (అ.శా. IV-87)

"అన్యాన్య మనస్కారాలవై ఎవనిని గూర్చి ఆలోచించుచు, ఇంటికి వచ్చిన తపోధనుడ నగు నన్ను గుర్తింపజాలకున్నావో, ఆతడు, ఎంత బోధించినను, మదించినవాడు తాను మొదట చేసిన కథను వలె నిన్ను స్మరింపడు.''

ఇది దూర్వాసుడు శకుంతల కిచ్చిన శాపము. ఇది మూల కథలో లేదు; కాలిదాసు కల్పించినది.

శాపోపహతమనస్కు డగు రాజు ఒక మధుర సంగీత ధ్వని వినగనే అతని మానసమున చెప్పరాని కలవర మొకటి కలిగెను. ఆ సందర్భమున రాజు ఈ విధముగ పల్కెను.

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జన్తుః.
తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం
భావస్థిరాణి జననాన్తర సౌహృదాని" 9 (అ. శా. V-4)

''రమ్యము లగు వస్తువులను చూచినపుడును, మధురము లగు శబ్దములను వినినపుడును, సుఖవంతు డగు ప్రాణి కూడ కలవరము చెందుచుండు ననగా తనకు తెలియకుండగనే మనస్సులో స్థిరముగా నుండి పోయిన జన్మాంతర సంబంధములను, మనస్సున స్మరించునని చెప్పవలసి యుండును."

"ప్రత్యాదిష్ట విశేష మండన విధిః వామప్రకోష్ఠార్పితం
బిభ్రత్కాంచన మేక మేవ వలయం శ్వాసోపరక్తా ధరః.
చిన్తాజాగరణ ప్రతాన్త నయన స్తేజోగుణాదాత్మనః
సంస్కారోల్లిఖితో మహామణిరివ క్షీణోఽపి నాలక్ష్యతే 10
(అ. శా. VI-6)

ఇది షష్ఠాంకమున విరహ పీడితు డగు దుష్యంతుని వర్ణనము.

"అధికాలంకరణమును నిరాకరించి, ఎడ[illegible] ఒక్క బంగారు కంకణమును మాత్రమే ధరి[illegible] [illegible]చే వాడిపోయిన అధరము కలవాడై, చింతాకృత మగు జాగ[illegible]ముచే [illegible] [illegible]లని పోయిన



39941

కనులు కలవాడై ఈతడు, కృశించినను, తన తేజో విశేషముచే, మెరుగు పెట్టుటకై సానబట్టిన మణి వలె, దిక్కినట్టు కనబడుట లేదు.''

"అక్లిష్టబాలతరు పల్లవలోభనీయం
పీతం మయా సదయమేవ రతోత్సవేషు.
బిమ్బాధరం దశసి చేత్ భ్రమర ప్రియాయాః
త్వాం కారయామి కమలోదరబన్ధనస్థమ్." 11

(అ.శా. 6.20)

(చిత్తరువులో శకుంతలాముఖముపై వ్రాలనున్న తుమ్మెదను జూచి, అది యంతయు నిజ మని భ్రాంతి చెంది దుష్యంతుడు పలుకు మాటలివి )

"ఓ తుమ్మెదా! నలగని లేచిగురాకు వలె మనస్సును ఆకర్షించునట్టి, రతోత్సవములయందు నేను మెల్లగనే అనిన ప్రియురాలి బింబాధరమును కొరికెదవేని నిన్ను పద్మగర్భబంధమున బంధింతును".

(ఈ శ్లోకములన్నిటిని ఉదాహరించుటలో, ఏవంవిధవర్ణనము లన్నియు కాళిదాస కల్పిత మగు దూర్వాసఃశాపవృత్తాంతమును బట్టి సాధ్యమైన వని చెప్పుట కుంతకుని యుద్దేశ్యము )

('ఉత్పాద్యలవలావణ్యాత్' అనుదానిని రెండు విధములుగ వ్యాఖానించ వచ్చును. కొన్ని యెడల (మూలకథలో) లేనిదే కల్పించబడును. లేదా క్రొత్తగ తెచ్చి చేర్చబడును. (అభిజ్ఞానశాకుంతలము లోని దూర్వాసఃశాప మిందులకుదాహరణము). కొన్ని యెడల (మూలకథలో నున్నది) ఔచిత్య దృష్టితో విడువ బడినను, సహృదయహృదయాహ్లాదమునకై ,మరి యొక విధముగ కూర్పబడును. ఉదాత్తరాఘవమున మారీచవధవృత్తాంతము ఇందుల కుదాహరణము. ఈ విషయము (ప్రథమోన్మేషమున) వెనుకనే చెప్పబడి యున్నది. ఈ విధముగ ఈ ప్రబంధవక్రతావిచ్ఛిత్తికి మరి కొన్ని ఉదాహరణములను గూడ మహాకవిప్రబంధములలో స్వయముగ ఊహించుకొనవలెను.

శ్లో. "నిరన్తర రసోద్గారగర్భసన్దర్భనిర్భరాః
గిరః కవీనాం జీవన్తి న కథామాత్రమాశ్రితాః"

"కవుల వాక్కులు నిరంతర మగు రసనిష్యందము గర్భమునందు గల కూర్పులతో నిండినవై జీవించును. అంతియే కాని కథామాత్రము నాశ్రయించుకొని జీవించవు".

ఇది అంతరశ్లోకము.

మరియొక ప్రకరణవక్రతా ప్రకారమును విశదీకరించుచున్నాడు:—

ప్రబన్ధస్యైకదేశానాం ఫలబన్ధానుబన్ధవాన్
ఉపకార్యోపకర్తృత్వ పరిస్పన్దః పరిస్ఫురన్. 5

అసామాన్యసముల్లేఖి ప్రతిభాప్రతిభాసినః
సూతే నూతన వక్రత్వరహస్యం కస్యచిత్కవేః. 6

"ప్రధానకార్యముయొక్క ఫలబంధముతో సంబంధము కలిగి స్ఫురించుచున్నదియు, ప్రబంధైకదేశములకు (ప్రకరణములకు) సంబంధించినదియు నగు ఉపకార్యోపకారకభావరూప మగు స్వభావము, అసాధారణ మగు వికాసము గల ప్రతిభతో ప్రకాశించు ఏ ఒక్క కవియందో మాత్రమే కానవచ్చుచు నూతన వక్రతయొక్క రహస్యమును ఆవిర్భవింపజేయును."

సూతే=వికసింప చేయును. దేనిని? నూతనవక్రత్వ రహస్యమ్ = నూతన మగు వక్రభావముయొక్క ఉపనిషత్తును. కస్యచిత్ = ఏ ఒకనికో సంబంధించినది గాని అందరు కవులకు సంబంధించినది కాదు. ప్రస్తుతౌచిత్యముతో సుందర మగు రచనయందు నేర్పు గల కవికి అని భావము. ఏమిటి? ఉపకార్యోపకర్తృత్వపరిస్పన్దః = అనుగ్రాహ్యానుగ్రాహకత్వము యొక్క గొప్పతనము. ఏమిచేయుచు? పరిస్ఫురన్ = సమాన (రూపమున) వికాసమును చెందుచు. దేనితోకూడినది? ఫలబన్ధానుబన్ధవాన్ = ప్రధానకార్యముయొక్క అనుసంధానము గలది; అనగా ప్రధానకార్యముతో (ప్రకరణకార్యమును) కలుపుటకు నేర్పు గలది. ఇట్టిది ఎవనికి ఉండునో చెప్పుచున్నాడు— 'అసామాన్యసముల్లేఖప్రతిభాప్రతిభాసినః'=సాటి లేని రీతిగా వికసించిన శక్తియొక్క ప్రభావముచే ప్రకాశించువానికి. వేటియొక్క? ప్రబన్ధస్య ఏకదేశానాం = ప్రబంధావయవము లగు ప్రకరణముల యొక్క.

దీని తాత్పర్యమేమనగా-......నేర్పరియు, వక్రతాచమత్కారము కల వాడును అగు ఒకానొక కవియొక్క స్వభావసుందర మగు ప్రతిభచే ప్రకాశింప చేయబడుచున్నదియు, అంద మగు కూర్పుచే ప్రకాశించుచున్న ప్రబంధావయవముల (ప్రకరణముల) కు ప్రధానకార్యఫలముతో గల సంబంధముపై ఆధారపడి యున్నదియు నగు అనుగ్రాహ్యానుగ్రాహక భావము, అలౌకిక మగు వక్రతోల్లేఖ కృత మగు లావణ్యమును ఉద్దీపింపచేయును (అనగా ప్రబంధావయవములు (ప్రకరణములు) ప్రధానకార్యముయొక్క ఫలముతో సంబంధించినట్లు కూర్చవలెను. అపుడు ప్రధానకార్యఫలము అనుగ్రాహ్య మగును, ప్రకరణములు అనుగ్రాహకములగును. ఇట్టి అనుగ్రాహ్యానుగ్రాహకభావమును కూర్చుటచే వక్రతా లావణ్యము ఇనుమడించు నని యభిప్రాయము.)

ఇచట గ్రంథపాత మధికముగ నుండుటచే అర్థము అస్పష్టముగ నున్నది. పుష్పదూషితము ప్రకరణమై యుండును; ఇది లక్ష్యము కాదు. కుంతకుడు దీనిని ఈ ఉన్మేషమునందే ఇంకను రెండు స్థానములలో పేర్కొనినాడు. అతడు వ్రాసినదానిని బట్టి ఈ ప్రకరణమునందలి కథ ఈ క్రింది విధముగ నుండి యుండు నని ఊహించుట కవకాశమున్నది.

ఇందలి నాయకుడు సార్థవాహుడైన సాగరదత్తుని కుమారుడు సముద్రదత్తుడు. అతడు నయదత్తుని కుమార్తెను వివాహమాడెను. వివాహమైన కొలది నాళ్ళకే, సముద్రదత్తుడు, తన కిష్టము లేకున్నను, తండ్రికి భయపడి, వ్యాపారముపై దేశాంతరము వెళ్ళవలసివచ్చెను. ఆ రోజులలో వర్తకులు గుంపులు గుంపులుగ బయలుదేరి స్థలజలమార్గముల ద్వారా దేశయాత్రలు చేయుచు వ్యాపారము సలుపు చుండెడివారు. అట్టి వర్తకుల గుంపుకు సార్థ మని పేరు. సముద్రదత్తుడు అట్టి సార్థముతో కలిసి సముద్రతీరమును చేరెను. ఇంక నౌక నెక్కవలసియున్నది. కాని అతడు నవపరిణీత యగు భార్య విరహమును భరింపజాలక అచటి నుండితిరిగి వచ్చి ఎవ్వరికిని తెలియకుండ ఆమెను కలియవలె నని ప్రయత్నించెను. ద్వారమున కావలి యున్న కువలయునకు తన ఉంగరమును లంచమిచ్చి ఉద్యానమున రహస్యముగ తన భార్యను కలిసికొనెను. రహస్యముగ కొన్నాళ్ళుండి వ్యాపార నిమిత్తము వెడలి పోయెను. కొంత కాలమునకు గర్భలక్షణములు కనబడిన కోడలి శీలమును శంకించి సాగరదత్తుడు ఆమెను ఇంటి

నుండి వెడలగొట్టెను. ఆమె సచ్ఛీలమును గూర్చి సాక్ష్య మీయ దగినవాడు ఒక్క కువలయుఁడే. ఆ సమయమున అతడు మధురకు వెళ్ళియుండెను. అతడు తిరిగి వచ్చి, సాగరదత్తునకు సముద్రదత్తుని యుంగరమునుజూపి, జరిగిన విషయ మాతని కెరింగిచెను. సాగరదత్తుడు కోడలిని శంకించి వెడదగొట్టిన పాపమునకు ప్రాయశ్చిత్తము చేసికొనుటకై తీర్థయాత్రల కేగెను. సముద్రదత్తుడు వ్యాపారము ముగించుకొని తిరిగివచ్చుచు మార్గమధ్యమున, దైవవశముచే, తన భార్యను, ఆమె తండ్రియగు నయదత్తుని, తన తండ్రి యగు సాగరదత్తుని కలుసుకొనెను. అందరును సంతసించిరి.సముద్రదత్తుడు భార్యాసమేతుడై ఇంటికి వచ్చెను. సాగరదత్తుడు తీర్థయాత్రలకై వెళ్ళెను.

కుంతకుని వ్రాతలను బట్టి ఈ ప్రకరణమున ఆరు అంకము లున్నట్లు కనబడుచున్నది.

ప్రథమాంకము :- సముద్రతీరమున.సముద్రదత్తుని తీవ్రవిరహ వేదనా వర్ణనము.

ద్వితీయాంకము:- అతడు ఇంటికి తిరిగి వచ్చి, ద్వారపాలునకు లంచ మిచ్చి, ఉద్యానమున భార్యతో నుండుట.

తృతీయాంకము:- గర్భచిహ్నములను జూచి సాగరదత్తుడు ఆమెను ఇంటినుండి వెడలగొట్టుట.

చతుర్థాంకము:- మధురనుండి తిరిగి వచ్చిన కువలయుని ద్వారా తన కోడలు నిర్దోష యని తెలిసికొని, తాను చేసిన పాపమునకు ప్రాయశ్చిత్తము చేసికొనుటకై సాగరదత్తుడు తీర్థయాత్రకు వెడలుట.

పంచమాంకము : సముద్ర దత్తుడు తిరిగి వచ్చుచుండుట.

షష్ఠాంకము : మార్గ మధ్యమున అతడు భార్యను, మామగారిని, తండ్రిని కలియుట.

ఇపుడు కుంతకుడు ఒక ప్రబంధములోని రెండు ప్రకరణములు పరస్పరము ఎట్లు అనుగ్రాహ్యాను గ్రాహకములుగ నుండునో చూపుటకు ఈ రూపకము నుండి ఉదాహరణముగ ఒక భాగమును చూపుచున్నాడు—

ఎట్లనగా : పుష్పదూషితకము నందలి ద్వితీయాంకమున - ప్రయాణము నుండి తిరిగి వచ్చి, తన ఉత్తమ గృహమును ప్రవేశించిన, అత్యధిక మదనాతురు డగు సముద్ర దత్తుడు ప్రకంపా వేగముచే వికలమును అలసమును అగు శరీరము కలిగి యుండుటచే నిద్రాపరవశు డగు, ద్వార దేశమున పండుకొని యున్న కువలయునకు లంచముగా తన చేత అంగులీయకమును ఇచ్చెను. ఆ అంగులీయకమే, చతుర్థాంకమున–మథుర నుండి తిరిగి వచ్చిన ఆతడు బయటకు వచ్చి (రహస్యమును భేదించి) సముద్ర దత్తుని వృత్తాంతమును తెలుపగనే, కులమునకు కలంకము వచ్చినదే యని బాధ బడుచున్న సార్థవాహు డగు సాగర దత్తునకు, తన కుమారినితోడ మాత్రమే సంపర్కమును పొందిన కోడలి శీలము విశుద్ధ మైనదే యను విషయమును స్పష్టము చేయుచు ఉపకారక మగు చున్నది. (అనగా ద్వితీయాంకము నందలి అంగులీయక దానమునకును, చతుర్థాంకము నందలి సాగరదత్త భ్రాంత్యపనయనమునకును అనుగ్రాహ్యాను గ్రాహకభావసంబంధ మున్న దని యర్థము).

ఇంకను ఎట్లనగా:- ఉత్తర రామ చరితమున అధిక గర్భభారముచే అలసట చెందిన దేహము గల సీతాదేవి వినోదమునకై ప్రాచీన రాజ చరిత్రమును చిత్రించిన చిత్తరవులందు అసక్తిని చూపుచున్న శ్రీరాముడు, సహజముగ విజయ స్వభావము గల విజృంభించుచున్న జృంభకాస్త్రముల నుద్దేశించి సీతతో– 'ఇవి తప్పక నీ సంతానమును చేరగలవు' అని పల్కెను. ఆ పలుకు పంచ మాంకమున, మహావీరులు అనుసరించు మార్గమున నేర్పుగల చంద్ర కేతువుతో క్షణకాలము పాటు యుద్ధ క్రీడ చేయవలె ననెడు అభిలాషచే, దానికి అంతరాయముగ కలకలాడంబరము చేయుచున్న సేనలను జయింపవలె నని సహజ మగు ఉత్కంఠచే ప్రకాశించు లవుడు జృంభకాస్త్రములను ప్రయోగించు టచే ఉపకారమును కలిగించుచున్నది.

లవః—భవతు; జృంభకాస్త్రేణ తావత్సైన్యాని స్తంభయామి.

సుమన్త్రః—(ససంభ్రమమ్)-వత్స! కుమారేణానేన జృంభకాస్త్రమభి మన్త్రితమ్.

చంద్రకేతుః—అత్ర కః సన్దేహః ?

వ్యతికర ఇవ భీమో వైద్యుతస్తామసశ్చ
ప్రణిహితమపి చక్షుర్గ్రస్తముక్తం హినస్తి.
అభిలిఖిత మివైతత్సైన్య మస్పన్ద మాస్తే
నియత మజిత వీర్యం జృంభతే జృంభకాస్త్రమ్. 12

ఆశ్చర్యమ్!
పాతాలోదర కుంజపుంజిత తమః శ్యామైర్నభో జృంభకై
ర న్తః ప్రస్ఫురదారకూట కపిల జ్యోతిర్జ్వల ద్దీప్తిభిః.
కల్పాక్షేప కఠోరభైరవ మరుద్వ్యస్తైరవస్తీర్యతే
నీలాంభోద తడిత్కడార కుహరై ర్వింధ్యాద్రి కూటైరివ. 13

అచట (ఉత్తరరామచరిత చతుర్థాంకమున) ఆ విధముగనే ఉన్నది-

లవుడు:- కానిమ్ము; జృంభకాస్త్రమును ప్రయోగించి సైన్యములను స్తంభింప జేసెదను.

సుమంత్రుడు:- (తొందరతో) వత్సా ఈ పిల్లవాడు జృంభకాస్త్రమును ప్రయోగించినాడు.

చంద్రకేతువు:- ఆర్యా సందేహ మేమి?

"మెరుపుల యొక్కయు, చీకట్ల యొక్కయు భయంకర మగు కలయిక వలె (మెరుపులు మెరిసి వెంటనే పెను చీకట్లు కమ్మినట్లు) ప్రయత్న పూర్వకముగ ప్రసరింప చేయబడిన దైనను చూపును ఆక్రమించుచు, విడచుచు, హింసించు చున్నది. ఈ సైన్యము చిత్రరువులో చిత్రింపబడినది వలె నిశ్చలముగ నున్నది. జయింప రాని వీర్యము గల జృంభకాస్త్రము విజృంభించుచున్నది. సంశయము లేదు."

ఏమి ఆశ్చర్యము!

"పాతాల మధ్యమునందలి పొదలలో ప్రోగుపడిన చీకట్ల వలె నల్లగా నున్నట్టియు, మధ్యలో ప్రకాశించున్న, ఇత్తడి వలె కపిల వర్ణముగా నున్న కాంతులతో జ్వలించు చున్న మంటలు కలిగి నట్టియు, కల్పాంతమునందు వలె తీవ్రము లైన, భయంకరము లగు వాయువులచే చిమ్మబడినట్టియు, నల్లని మేఘముల చేతను మెరుపుల చేతను విచిత్రవర్ణము లగు గుహలు గల వింధ్యాద్రి

కూటముల వలె నున్నవియు నగు జృంభకములచే ఆకాశము కప్పివేయబడు చున్నది." ఇత్యాదిక మగు ఇది యంతయు దాని (ఉత్తరరామ చరితము) నుండియే. 'ఏకదేశానామ్' అని, కారికలో బహువచన మున్నది. ఈ ఉదాహరణ మున రెండింటికే (ఉపకార్యోపకారక భావము). రెండింటి కంటె అధిక సంఖ్యాక ములకు ఉపకార్యోపకార కత్వమును స్వయముగ ఊహించు కొనవలెను.

దీనికే సంబంధించిన మరి యొక ప్రకారమును విశదీకరించు చున్నాడు:-

కా. ప్రతిప్రకరణం ప్రౌఢప్రతిభా భోగయోజితః
ఏక ఏవాభిధేయాత్మా బధ్యమానః పునః పునః. 7

అన్యూన నూతనోల్లేఖ రసాలంకరణోజ్జ్వలః
బధ్నాతి వక్రతోద్భేద భంగీ ముత్పాదితాద్భుతామ్. 8

'ప్రౌఢ మగు ప్రతిభా వైశాల్యముచే కూర్చబడినదియు, ప్రతి ప్రకరణము నందును మాటి మాటికి నిబంధింపబడునదియు, అన్యూనమును నూతనమును అగు ఉల్లాసము గల రసముచేతను అలంకారముల చేతను ప్రకాశించునదియు అగు ఒకే వస్తు స్వరూపము, ఆశ్చర్యజనక మగు వక్రతా వికాస భంగిని ఏర్పరచును.'

'బధ్నాతి' అనగా ఇచట, మిక్కుటముగ నుండునట్లు చేయుచున్న దని యర్థము. దేనిని? వక్రతోద్భేద భంగీమ్ = వక్రత్వము ఆవిర్భవించుటవలన కలుగు శోభను. అది ఎట్టిది? ఉత్పాదితాద్భుతమ్ = కుతూహలమును అంకురి తము చేయునది ఏమి చేయబడును? బధ్యమానః = ప్రస్తుతౌచిత్యముచే సుందర మగు రచనకు గోచర మగునట్లు చేయబడును. ఎట్లు? పునఃపునః = మాటి మాటికి, ఎచట? ప్రతిప్రకరణమ్ = ప్రతిప్రకరణమునందును, ప్రతిస్థానము నందును అని యభిప్రాయము. అట్లైనచో ఇది పునరుక్తి దోషమునకు పాత్రము కాదా యని శంకించి చెప్పుచున్నాడు— అన్యూననూతనోల్లేఖ రసాలంకర ణోజ్జ్వలః = లోప మేమియు లేనివియు నూతనోల్లాసముతో కూడినవియు నగు శృంగారాది రసములయొక్కయు రూపకాద్యలంకార్యములయొక్కయు పరిస్పంద ముచే ప్రకాశించునది. ఏ:యనగా-ప్రౌఢప్రతిభాభోగయోజితః = అతిప్రగల్భ మగు ప్రజ్ఞాతిశయముచే ప్రకాశిత మైనది.

ఇందలి పరమార్థ మేమనగా— వివిధప్రకరణములయందును, సకల చంద్రోదయాదిక మగు అదే (ఒకే) వస్తువు ప్రస్తుత కథాసంవిధానమును అనుసరించి మాటిమాటికిని కూర్చబడినదై పరిపూర్ణములును, పూర్వవిలక్షణములును అగు రూపకాద్యలంకారముల సౌందర్యముతో నిండినయెడల, అపుడు సౌందర్యపరాకాష్ఠ యగు ఒకానొక వక్రతను కలిగించును. (కథాసంవిధానమునకు అనుగుణముగ ఒకే విషయమును అనేకప్రకరణములయందు వర్ణించినను, అందులో గూడ ఒక విధమగు వక్రత ఉండు నని యభిప్రాయము).

ఈ ప్రకరణవక్రతకు ఉదాహరణముగ హర్షచరిత్రమునుండి కొన్ని ఘట్టములను చూపి (ఏ ఘట్టములను చూపినాడో తెలియదు.) కుంతకుడు తాపసవత్సరాజచరితము నుండి గూడ కొన్ని యుదాహరణములను చూపెను. ద్వితీయాంకమందలి రాజవాక్యములలోని కరుణరసమును వర్ణించుచు ఉదాహరించిన మూడు శ్లోకములలో, మొదటి శ్లోకమున, పూర్వార్ధము మాత్రమే పఠనయోగ్యముగా నున్నది.

(ఎట్లనగా తాపసవత్సరాజచరితమున:-)

కురవకతరుర్గాఢాశ్లేషం ముఖాసవలాలనాం
వకులవిటపీ రక్తాశోక స్తథా చరణాహతిమ్. 14

'ధారావేశ్మ విలోక్య' ఇత్యాది (చూ. III.27) 15

"కర్ణాన్తస్థిత పద్మరాగ" ఇత్యాది (చూ. III.29) 16

"కురవకవృక్షము నీ గాఢాలింగనమును, వకులవృక్షము ముఖాసవసేకమును, రక్తాశోకవృక్షము పాదప్రహారమును (కోరుచున్నవి.)" ఈ శ్లోకము, పూర్వోదాహృతము లగు 'ధారావేశ్మ' 'కర్ణాన్త' ఇత్యాది శ్లోకద్వయము గూడ విరహసంతప్తు డగు వత్సరాజు దుఃఖమును చిత్రించుచున్నవి గాన ద్వితీయాంకమున (ఒక ప్రకరణమున) కరుణరసవర్ణనమున కుదాహరణములు. ఈ ఉదాహరణముల తరువాత కుంతకుని వాక్యములు (గ్రంథపాతముదే అస్పష్టములు).

(మరల తృతీయాంకమున)—

రాజు:— (కన్నీళ్ళతో)-

సర్వత్ర జ్వలితేషు వేశ్మ సుభయాదాలీజనే విద్రుతే
త్రాసోత్కమ్పవిహస్తయా ప్రతిపదం దేవ్యా పతన్త్యా తదా.

హా! నాథేతి ముహుః ప్రలాపవరయా దగ్ధం వరాక్యా తథా
శాన్తేనాపి వయం తు తేన దహనేనాద్యాపి దహ్యామహే. 17

'నలుమూలలా ఇళ్ళు ప్రజ్వలించుచుండగా, సఖీజనము భయముచే చెల్లా చెదరై పోగా, అపుడు భయకృత మగు వణకుచే (నిస్సహాయురాలై) ఐంము తప్పి అడుగడుగున తొట్రుపడుచు, 'హా నాథా!' యని అరచుచు, పాపము! దేవి ఆ విధముగ కాలిపోయినది. ఆ అగ్ని శాంతించినను నన్ను ఇంకను కాల్చి వేయు చున్నది".

ఇచట చతుర్థపాదమునందలి విరోధాలంకారము కరుణరసపోషకముగ నున్న దని కుంతకుని యభిప్రాయము.

(ద్వితీయాంకమున కూర్చిన కరుణరసవర్ణనమునే మరల తృతీయాంక మున, ప్రకరణాంతరమున, కూర్చినాడు కవి.)

చతుర్థాంకమున—

రాజు:- (సకరుణముగా తనలో)

'చతుర్యస్య' మొ. (చూ. I. 50)

పంచమాంకమున ఎట్లనగా:—

భ్రూభంగం రుచిరే లలాటఫలకే తారం సమారోపయన్
బాష్పాంబుప్లుతపీతపత్రరచనాం కుర్యాత్కపోలస్థలీం.
వ్యావృత్తైర్వినిబంధచాటు మహిమామాలోక్యలజ్జానతాం
తిష్ఠేత్ కిం కృతకోపభారకరుణై రాశ్వాసయైనాం ప్రియామ్.

ఈ శ్లోకార్థము అస్పష్టముగ నున్నది. కాని ముద్రిత మగు తాపసవత్స రాజమున ఈ శ్లోకము ఈ క్రింది విధముగ నున్నట్లు శ్రీ రాధేశ్యామమిశ్ర తమ హిందీ వక్రోక్తిజీవితమున వ్రాసి యున్నారు. ఆ మార్పుంతో శ్లోకము అర్థవంత ముగ కనబడుచున్నది.

భ్రూభంగం రుచిరే లలాటఫలకే దూరం సమారోపయేత్
బాష్పాంబుప్లుతపీతపత్రరచనాం కుర్యాత్ కపోలస్థలీమ్.

వ్యావృత్త్యైవ సమాగతే మయి సఖీమాలోక్య లజ్జాతాన
తిష్ఠేత్ కిం కృతకోపచారకరణై రాయాసయేన్మాం ప్రియా"

"ప్రియురాలు సుందరమగు లలాట ఫలకమునందు ఎక్కువగ భ్రూభంగమును పైకెగయునట్లు చేయునో కపోలస్థలిని బాష్పాంబువులచే తడిపి తుడిచి వేయబడిన పత్రరచనలు కలదానినిగా చేయునో, నేను దరికిజేరగనే, వెనుకకు తిరిగి సఖిని చూచి లజ్జావనతయై నిలుచునో, లేదా కృత్రిమములగు ఉపచారములు చేయుటచే నన్ను ఆయాసపరుచునో!"

ఇంకను ఎట్లనగా:—

"కిం ప్రాణా న మయా తవానుగమనం కర్తుం సముత్సాహితాః
బద్ధా కిం న జటా, న వా ప్రరుదితం, భ్రాన్తం వనే నిర్జనే.
త్వత్సంప్రాప్తివిలోభనేన పునర (న్యా) ప్యా నేన పాపేన కిం
కిం కృత్వా కుపితా యదద్య న వచస్త్వం మే దదాసి ప్రియే.

"ఓ! ప్రియా! నీతో అనుగమనము చేయుటకై నేను నా ప్రాణములను ప్రోత్సహింపలేదా: జటను ధరించలేదా: ఏడ్వలేదా: నిన్ను పొందవలెననెడిఆశచే నిర్జన వనమునందు తిరగలేదా: ఇంకను అత్యధిక మగు నా పాపముచేతనా? ఎందు చేకోపించిన దానవై నాకు ప్రత్యుత్తర మిచ్చుట లేదు: (అని ఏడ్చును)' అను నంతవరకును గల భాగముచే కొంచెము ఉన్మాద సంబంధము' కూడ కూర్చబడినదై ఆ కరుణరసమునే ఉద్దీపింపచేయుచున్నది.

షష్ఠాంకమున

రాజు :- హాదేవీ

త్వత్సంప్రాప్తివిలోభనేన సచివైః ప్రాణా మయా ధారితా
స్తన్మత్వాఽత్యజతః శరీరకమిదం నైవాస్తి నిఃస్నేహతా.
ఆసన్నోఽవసరస్తథానుగమనే జాతా ధృతిః కిన్త్వయం
ఖేదో యచ్ఛతథా గతం న హృదయం తద్వత్ క్షణే దారుణే 21

"మంత్రులు నీవు లభింపగల వనెడు లోభమును చూపి నేను ప్రాణములు ధరించు నట్లు చేసినారు. దానిని తలచుకొని (నీవు మరల లభింపగల

వను నాళతో) ఈ శరీరమును నేను విడువలేదన్నచో అందులకు నీపై ప్రేమ లేకుండుట కారణము కాదు. ఇపుడు అనుగమనము చేయుటకు సమయము ఆసన్నమైనది. నిశ్చయము కలిగినది. అంతటి దారుణసమయమున నా హృదయము నూరు వ్రయ్యలు కాలేదు. అనునదియే దుఃఖహేతువుగా నున్నది''

దీని పిమ్మట కుంతకుడు రఘువంశనవమసర్గలోని దశరథుని మృగయావృత్తాంతమును ముచ్చటించి ఈ విధముగ వ్రాసినాడు :

పొరపాటుచే దశరథుడు వృద్ధు లగు అంధతాపసుల కుమారుని వధించె ననెడు విషయమును ఒక్క వాక్యములో చెప్పుటకు వీలున్నను, పరమార్థమున సరససరస్వతికి సర్వస్వము వంటిదైన ప్రతిభను లేశ మాత్రమున చూపుటచే అట్టి సౌందర్యముతో అది స్ఫురించుచు హృదయచమత్కారకారణ మగుచున్నది.

ఈ సందర్భమున కుంతకు రఘువంశనవమసర్గములోని ఈ క్రింది శ్లోకముల నుదాహరించెను.

వ్యాఘ్రానభీరభిముఖోత్పతితాన్ గుహాభ్యః
ఫుల్లాసనాగ్రవిటపానివ వాయురుగ్ణాన్.
శిక్షావిశేషలఘుహస్తతయా నిమేషాత్
తూణీచకార శరపూరితరంధ్రవక్త్రాన్. 22

''నిర్భయస్వభావము గల ఆ దశరథుడు గుహలనుండి బయల్వెడలి ఎదుర్కొన్నట్టియు, గాలికి విరిగిన వికసించిన అసనవృక్షాగ్రముల వలె నున్న వ్యాఘ్రములను, శిక్షావిశేషముచే చురుకైన హస్తము కలవాడగుటచే, క్షణకాలములో, బాణములచే నింపబడిన ముఖరంధ్రములు కలవాటినిగ చేసి, అంబుల పొదులుగ చేసెను.''

అపి తురగసమీపాదుత్పతన్తం మయూరం
న స రుచిరకలాపం బాణలక్ష్యీచకార.
సపది గతమనస్కః చిత్రమాల్యానుకీర్ణే
రతివిగళితబన్ధే కేశపాశే ప్రియాయాః. 23

''అతడు, అంద మగు పింఛము గల మయూరము తురగసమీపమున ఎగురుచున్నను దానిని, వెంటనే మనస్సు, రతియందు జారిపోయిన ముడిగలదై

చిత్రము లగు మాల్యములచే వ్యాప్తమైన ప్రియురాలి కేశపాశముపైకి పోగా, బాణమునకు లక్ష్యముగా చేయలేదు.

లక్ష్యీకృతస్య హరిణస్య హరిప్రభావః
ప్రేక్ష్య స్థితాం సహచరీం వ్యవధాయ దేహమ్.
ఆకర్ణ కృష్టమపి కామితయా స ధన్వీ
బాణం కృపామృదుమనాః ప్రతిసంజహార. 24

"దేవేంద్రునితో సమానమైన ప్రభావము గల ధనర్ధరు డగు ఆతడు, లక్ష్యముగా చేయబడిన హరిణమునకు తన దేహమును అడ్డు పెట్టి నిలచిన దాని సహచరి యగు ఆడులేడిని చూచి, కాముకు డగుటచే కృపచే మృదువగు మనస్సు కలవాడై, కర్ణము వరకు లాగబడిన దైనను బాణమును ఉపసంహరించెను."

స లలితకుసుమ ప్రవాల శయ్యాం
జ్వలితమహౌషధిదీపికా స నాథామ్.
నరపతి రతివాహయాంబభూ వ
క్వచిదసమేత పరిచ్ఛద స్త్రియామామ్. 25

"దూరమైపోయిన పరివారము గల ఆ రాజు, లలితములగు కుసుమ ప్రవాళములు శయ్యగా కలదియు, ప్రజ్వలించుచున్న ఓషధిదీపములతో కూడి నదియు నగు రాత్రిని ఒకానొక చోట గడపెను."

ఇతి విస్మృతాన్య కరణీయ మాత్మనః
సచివావలంబిత ధురం ధరాధిపమ్.
పరివృద్ధరాగ మనుబంధ సేవయా
మృగయా జహార చతురేవ కామినీ. 26

"ఈవిధముగ, వేట, జాణయగు కామినివలె, ఇతరకర్తవ్యముల నన్నింటిని మరచి, రాజ్యభారమును మంత్రులపై విడిచి, నిరంతరసేవచే వృద్ధిపొందిన అనురాగము గల ఆ రాజును, ఆకర్షించెను."

అథ జాతు రురోర్గృహీతవర్త్మా
విపినే పార్శ్వచరైరలక్ష్యమాణః।
శ్రమఫేనముచా తపస్విగాఢాం
తమసాం ప్రాప నదీం తురంగమేణ. 27

"ఒకనాడు అరణ్యమున రురుమృగముయొక్క మార్గమును పట్టిపోయి అనుచరులచే చూడబడనివాడై, అలసటచే కలిగిన నురుగును విడచుచున్న, గుఱ్ఱముతో, తాపసులచే ప్రవేశింపబడెడు తమసానదిని చేరెను."

శాపోఽప్యదృష్టతనయాననపద్మశోభే
సానుగ్రహో భగవతా మయి పాతితోఽయమ్।
కృష్యాం దహన్నపి ఖలు క్షితిమిన్ధనేద్ధో
బీజప్రరోహజననీం జ్వలనః కరోతి. 28

"భగవంతుడ వగు నీవు, (ఇంతవరకు) కుమారుని ముఖపద్మశోభను చూడని నాకు అనుగ్రహముతో గూడిన శాపము నిచ్చినావు. ఇంధనములచే ప్రజ్వలింపచేయబడిన అగ్ని దున్నదగి యున్న భూమిని, కాల్చుచున్నను, విత్తనముల మొలకలను పుట్టించుశక్తి కలదానినిగా చేయునుగదా".

(ఈ విధముగ ఇచట వేటాడుట అనెడు ఒకే విషయమును అనేక శ్లోకములలో వర్ణించినను చమత్కారమేమాత్రమును కుంటువడలేదు గాన ఇది పూర్వోక్తప్రకరణవక్రతాభేదమునకు ఉదాహరణము).

కా. కథావైచిత్ర్యపాత్రం తద్వక్రిమాణం ప్రపద్యతే
యదంగం సర్గబంధాదేః సౌందర్యాయ నిబధ్యతే. 9

"సర్గబంధాదికము (కావ్యాదికము) యొక్క ఏ అంగము (ప్రకరణము) సౌందర్యముకొరకై కూర్పబడునో, అది, కథావైచిత్ర్యమునకు స్థాన మగు వక్రత్వమును పొందును."

ప్రసంగముచే ఈ ప్రకరణవక్రతయొక్కయే మరి యొక ప్రభేదమును విశదీకరించుచున్నాడు. వక్రిమాణం = వక్రత్వమును. దేనితోకూడినదిః కథావైచిత్ర్యపాత్రమ్ = ప్రస్తుత మగు కథయొక్క కూర్పులోని అందమునకు

స్థానమైనది. అది ఏది? "యదంగం సర్గబంధాదేః సౌందర్యాయ నిబధ్యతే'"— జలక్రీడాదిక మగు ఏ ప్రకరణము మహాకావ్యప్రభృతులలో శోభను కూర్చుటకై కూర్చబడుచున్నదో. దీని పరమార్థ మేమనగా— ప్రబంధములలో ఉపక్రాంత మగు కథారచనకు అనుగుణముగ కూర్చబడెడు, జలకేళి, పుష్పావచయము మొదలగు ప్రకరణము సౌందర్యసంపదయొక్క నిధి వలె ఉండును.

ఇందులకు ఉదాహరణముగ రఘువంశమునందలి షోడశసర్గములోని కుశజలక్రీడావృత్తాంతము నుదాహరించి కుంతకుడు ఆ ఘట్టములోని కొన్ని శ్లోకములను గూడ ఉద్ధరించి చూపెను.

అథోర్మి లోలోన్మద రాజహంసే
రోధోలతాపుష్పవహే సరయ్వాః.
విహర్తుమిచ్ఛా వనితాసఖస్య
తస్యాంభసి గ్రీష్మముఖే బభూవ. 29

"అనంతరము, గ్రీష్మఋతుప్రారంభమున, స్త్రీసమేతు డగు ఆ కుశునకు, తరంగములపై తేలియాడుచున్న మదించిన రాజహంసలు కలదియు, తీరమునందలి లతలపుష్పములను తీసికొని పోవుచున్నదియు నగు సరయూనది జలమున విహరించుటకై ఇచ్ఛ కలిగెను."

కుశుడు జలక్రీడలాడుచున్నపుడు, తండ్రి ఇచ్చిన దివ్యాభరణము నీటిలో పడిపోగా, అది కుముదుడను పాతాళనివాసి యగు నాగరాజునకు లభించెను. అతనిపై కుశుడు అస్త్రము ప్రయోగింప సమకట్టెను. అపుడాతడు ఆభరణమును కుశునకు ప్రత్యర్పించి అనుచున్న వాక్యములివి:-

అవైమి కార్యాన్తరమానుషస్య
విష్ణోః సుతాఖ్యామపరాం తనుం త్వామ్.
సోఽహం కథం నామ తవాచరేయ
మారాధనీయస్య ధృతేర్విఘాతమ్. 30

'నీవు, కార్యాంతరముచే మనుష్యుడుగా అవతరించిన విష్ణువుయొక్క కుమారు డనెడు రెండవ మూర్తి వని నేనెరుగుదును. అట్టి నేను, పూజ్యుడ వగు నీయొక్క చిత్తస్థైర్యమునకు విఘాతము నెట్లు చేయుదును?'

కరాభిఘాతోత్థిత కందుకేయ
మాలోక్య బాలాతికుతూహలేన.
హ్రదాత్పతజ్జ్యోతిరివాన్తరిక్షా
దాదత్త జైత్రాభరణం త్వదీయమ్. 31

"చేతితో కొట్టుటచే ఎగిరిన బంతిగల ఈ బాల (నా చెల్లెలైన కుముద్వతి) ఆకాశమునుండి నక్షత్రము వలె, సరస్సునుండి పడుచున్న నీ జైత్రాభరణమును (జయమును కలిగించు అలంకారమును) చూచి, కౌతూహలముతో దానిని గ్రహించెను"

తదేతదాజాను విలంబినా తే
జ్యాఘాతరేఖా కిణలాంఛనేన.
భుజేన రక్షాపరిఘేణ భూమే
రుపైతు యోగం పునరంసలేన. 32

'కావున, ఇది (ఈ ఆభరణము) జానువులవరకును వ్రేలాడుచున్నదియు, నారికాయలచే చిహ్నితమును, భూమిని రక్షించెడు పరిఘయు, నగు అందమైన మూపు గల భుజముతో మరల సంబంధమును పొందుగాక.''

ఇమాం స్వసారం చ యవీయసీం మే
కుముద్వతీం నార్హసి నానుమన్తుమ్.
ఆత్మాపరాధం నుదతీం చిరాయ
శుశ్రూషయా పార్థివ పాదయోస్తే. 33

'ఓ రాజా! చిరకాలము నీపాదశుశ్రూష చేయుటచే తన అపరాధమును తొలగించుకొను దానినిగ, ఈ, నా చిన్నసోదరి యగు కుముద్వతిని నిరాకరించుటకు, తగవు. (అనగా-చిరపాదశుశ్రూషచే అపరాధమును తొలగించుకొనెడు అవకాశము ఈమె కిమ్ము.)

(ఇట్టి జలక్రీడాది వర్ణనలచే కథావైచిత్ర్యము లభించును గాన ఇది పంచమ విధమగు ప్రకరణ వక్రతకు ఉదాహరణము).

కా. యత్రాంగిరస నిష్యన్దనికషః కోఽపి లక్ష్యతే
పూర్వోత్తరైరసంపాద్యః సాంకాదేః కాపి వక్రతా. 10

మరల దానియొక్క (మరియొక) భేదమును నిరూపించుచున్నాడు. 'ఎచట, పూర్వోత్తర ప్రకరణములచే సంపాదింప శక్యము కాని, ఒకానొక, అంగిరస ప్రవాహమునకు గీటురాయి అంకాది ప్రకరణమున చూడ బడునో అది దాని యొక్క వక్రత."

అది అంకాదియొక్క ఒకానొక వక్రత; అనగా అది ప్రకరణముయొక్క ఒకానొక అలౌకిక మగు వక్రతగా అగును అని సంబంధము, "యత్రాంగిరస నిష్యన్దనికషః కోఽపి లక్ష్యతే"- యత్ర = దేనియందు; అంగీ = ప్రాణరూప మగు ఏ రసము గలదో దాని, నిష్యందః = ప్రవాహము. దానియొక్క, బంగారముయొక్క వలె, నికషః = పరీక్షావిషయ మగు, విశేషము, కోఽపి = సాటి లేనిది, కానవచ్చు చున్నది. ఎట్టిది? పూర్వోత్తరైరసంపాద్యః = వెనుక జరిగినవి ముందు జరుగ నున్నవి అగు అంకాదులచే సంపాదింప శక్యము కానిది.

ఎట్లనగా — విక్రమోర్వశీయమున; (విప్రలంభశృంగారము అంగిరసముగా గల) ఉన్మత్తాంకము. దాని ప్రారంభముననే—

రాజు:- (తొందరతో) ఓరీ! దురాత్మా! అగుమాగుము. నా ప్రియతమను తీసికొని ఎచటకు పోవుచున్నావు? (చూచి) ఏమి! శైలశిఖరమునుండి ఆకాశము పైకెగిరి, నాపై బాణములు ప్రయోగించుచున్నాడా! (పరికించి; కన్నీళ్ళతో) ఏమి! మోసపోయితినే!

నవజలధరః సన్నద్ధోఽయం న దృప్తనిశాచరః
సురధనురిదం దూరాకృష్టం న నామ శరాసనమ్.
అయమపి పటుర్ధారాసారో న బాణపరంపరా
కనకనికషస్నిగ్ధా విద్యుత్, ప్రియా న మమోర్వశీ. 34

'ఇది పైకి లేచుచున్న నూతనమేఘము. దృప్తుడైన రాక్షసుడు కాదు. ఇది ఇంద్రధనుస్సు. దూరముగా లాగబడిన ధనుస్సు కాదు. ఇది అధిక మగు ధారా

వృష్టి; బాణపరంపర కాదు. ఇది బంగారు గీటు వలె సుందర మగు మెరుపు, నా ప్రియురా లగు ఊర్వశి కాదు.'

పూర్వోదాహృత మగు 'పద్భ్యాం స్పృశేత్' (చూIII-26) ఇత్యాది శ్లోకము. 'తరంగ భ్రూ భంగా' ఇత్యాది శ్లోకము (చూ. III-41) గూడ చూప బడినవి.

ఇంకను ఎట్లనగా- కిరాతార్జునీయములోని (వీరరస భరిత మగు) బాహుయుద్ధ ప్రకరణము.

మరల దీనినే మరియొక విధముగ విశదీకరించుచున్నాడు:-

కా. ప్రధానవస్తునిష్పత్త్యై వస్త్వన్తరవిచిత్రితా
యత్రోల్లసతి సోల్లేఖా సాపరాప్యస్య వక్రతా. 11

"ప్రధాన వస్తువునందు వక్రత్వమును సంపాదించుటకై కూర్చబడిన, నూతనభంగిసముచిత మగు ఇతరవస్తువైచిత్ర్యము, ఎచట ప్రకాశించునో అది గూడ దీనియొక్క (ప్రకరణముయొక్క) మరి యొక వక్రత".

అస్య = ఈ ప్రకరణము యొక్క, మరి యొక, వక్రతా = వక్రభావము గూడ ఉన్నది అని సంబంధము. ఎచట, ఉల్లసతి = ఉన్మీలిత మగుచున్నదో, సోల్లేఖా = నూతన మగు వికాస భంగిచే ప్రకాశించు...సమాన మగు మరి యొక వస్తువు, దానియొక్క, విచిత్రతా = వైచిత్ర్యము, నూతన మగు చమత్కార మని భావము ఎందులకు ? 'ప్రధానవస్తు నిష్పత్త్యై'-ప్రధానం = అధికృత మగు, ప్రకరణము ఒకానొక వక్రత్వమును ఆక్రమించును. అందుకొరకు,

(ఉదాహరణ మెట్లనగా-ముద్రారాక్షస షష్ఠాకమున) (అటు పిమ్మట త్రాడుచేత బూని పురుషుడు ప్రవేశించును).

షడ్గుణసంయోగదృఢా ఉపాయపరిపాటీఘటిత పాశముఖీ
చాణక్య నీతిరజ్జూ రిపుసంయమనబుజుకా జయతి.

"ఆరు గుణముల (సంధివిగ్రహాది గుణములు, ఆరు త్రాళ్ళు అని శ్లేష) సంయోగముచే దృఢ మైనదియు, ఉపాయ క్రమముచే కూర్చబడిన పాశాగ్రము (లాగవలసిన వస్తువుకు తగల్చుటకు తగిన పాశాంతము) గలదియు, శత్రువులను బంధించుటకు సమర్థమును అగు చాణక్యనీతిరజ్జువు జయించుచున్నది".

ఆర్య చాణక్యుని గూఢచారి యగు ఉందురకుడు చెప్పిన ప్రదేశ మిదియే. ఆర్యచాణక్యుని ఆజ్ఞ ప్రకారము నేనిచటనే యుండి అమాత్యరాక్షసుని చూడవలసి యున్నది ఏమీ! అమాత్యరాక్షసుడు, శిర్షావకుంఠనముతో ఇటు వైపుకే వచ్చుచున్నాడే! కావున, జీర్ణోద్యానము నందలి ఈ వృక్షములచే నా శరీరమును మరుగుపరచి ఈత డెచట కూర్చుండునో చూచెదను. (అని నడచి ఆ విధముగ నుండును). (అంతట పైన చెప్పిన విధముగ శస్త్రధారి యైన రాక్షసుడు ప్రవేశించును).

పురుషుడు:- ఇతడు కూర్చున్నాడు. ఇంక ఆర్య చాణక్యుని ఆజ్ఞను నిర్వహించెదను. (రాక్షసుని చూడని వాడు వలె వాని ఎదుట త్రాడుతో కంఠమునకు ఉరి పోసికొనును).

రాక్షసుడు:- (చూచి. తనలో) అరే ఇతడు ఉరి పోసుకొనుచున్నాడే! పాపము ఈతడు కూడ నావలెనే కష్టములలో నున్నాడు. కానిమ్ము: ఇతనిని అడిగెదను. ఓ! భద్రా! భద్రా! ఇది ఏమిటి చేయుచున్నావు ?

పురుషుడు:- ఆర్యా! ప్రియమిత్రుని వినాశముచే దుఃఖితు డగు నావంటి దరదృష్ట వంతుడు ఏమి చేయునో అది.

రాక్షసుడు:- నీ మిత్రుడు అగ్ని ప్రవేశమునందుటకు కారణమేమి? "ఔషధములకు లొంగని మహా వ్యాధులచే మరణించినాడా ?"

పురుషుడు:- ఆర్యా! కాదు, కాదు.

రాక్షసుడు:- "అగ్ని వంటిదియు, విషము వంటిదియు నగు రాజ క్రోధముచే చంపబడినాడా ?"

పురుషుడు:- పాపము శాంతించుగాక, పాపము శాంతించుగాక! చంద్ర గుప్తుని రాజ్యమున వ్యవహారము క్రౌర్యరహిత మైనది.

రాక్షసుడు:- "అలభ్య యగు పరభార్యను కామించినాడా ?"

పురుషుడు:- ఆర్యా! పాపము శాంతించుగాక, పాపము శాంతించుగాక! ఇది వినయమునకు నిధి వంటి వైశ్యజనము విషయమున అసంభావ్యము కదా! జిష్ణుదాసుని మాట చెప్ప పనియే లేదు.

రాక్షసుడు:- "నాకు వలె ఈతనికి గూడ మిత్ర వినాశమే విషముగా ఐనదా!"

పురుషుడు:- ఆర్యా! ఔను ఔను.

వి. ఇది యంతయు చాణక్యుని పన్నుగడ. రాక్షసుడు తనభార్యా పుత్రాదులను మిత్రు డగు చందనదాసు నొద్ద ఉంచెను ఆ విషయము తెలిసి చాణక్యుడు చందనదాసుని నిర్బంధించి ఆతనికి మరణ దండమును విధించెను. ఈ విషయము రాక్షసునికి తెలియవలె నని ఈ పురుషుని పంపెను. ఈ విషయము తెలిసినచో, రాక్షసుడు తనకై, మిత్రుడగు చందనదాసు మరణించుటకు ఇష్టపడడు గావున సజీవముగ లొంగిపోవు నని చాణక్యుని యభిప్రాయము. చివరకు ఆ విధముగనే జరుగును. ఈ విధముగ ఈ ప్రకరణ మంతయు, రాక్షసుని లొంగదీసికొనవలె ననెడు చాణక్యుని ముఖ్యోద్దేశ్యము సిద్ధించుట కుపయుక్తముగ నున్నది గాన ఇది ఏడవ విధ మగు ప్రకరణ వక్రతకు ఉదాహరణము

మరల భంగ్యంతరముచే (ప్రకరణ వక్రతను) వివరించుచున్నాడు:-

కా. సామాజిక జనాహ్లాద నిర్మాణ నిపుణైర్నటైః
తద్భూమికాం సమాస్థాయ నిర్వర్తిత నటాన్తరమ్ 12

క్వచిత్ప్రకరణస్యాన్తః స్మృతం ప్రకరణాన్తరమ్
సర్వప్రబన్ధ సర్వస్వకలాం పుష్ణాతి వక్రతామ్ 13

"సామాజికులకు ఆనందమును కలిగించుటలో నేర్పు గల నటులు సామాజికుల భూమికను గ్రహించి ఇతర నటులను చూచెడు ఒక ప్రకరణమును మరి యొక ప్రకరణము మధ్య కూర్చినచో అది సకల ప్రబంధమునకును సర్వస్వభూత మగు వక్రతను పోషించును."

సర్వప్రబన్ధ సర్వస్వకలాం పుష్ణాతి వక్రతామ్ = రూపకమున కంతకును ప్రాణము వంటి దగు వక్రత్వమును పోషించును. 'క్వచిత్ప్రకరణస్యాన్తః స్మృతం ప్రకరణాన్తరమ్' = కవి కౌశలోన్మేషముచే ప్రకాశించు ఒకానొక నాటకమునందు — అన్ని నాటకము లందును కాదు—ఒకదాని మధ్య నున్న, అనగా రెండు అంశముల నడుమ ఇమడ్చబడిన దని భావము. ఎట్టిది? నిర్వర్తిత

నటాన్తరమ్ = చూడబడిన ఇతర నటులు కలది. ఎట్టి నటులచేత? సామాజిక జనాహ్లాద నిర్మాణ నిపుణైః = సహృదయుల పరిషత్తును ఆనందింప చేయుట యందు నేర్పరులైన వారు. తద్భూమికాం సమాస్థాయ = సామాజికులుగా అయి.

దీని తాత్పర్య మేమనగా_ఒకానొక నాటకమునందు మాత్రమే, అడ్డు లేని నేర్పు గల నటులు తమ భూమికలను గ్రహించి రంగస్థలమును అలంకరించుచు, ఇతర నర్తకులచే ప్రయోగింపబడు చున్నదియు, ప్రకృత మగు నాటకము యొక్క అర్థమునకు జీవితము వలె నున్నదియు, ఉప్పొంగుచున్న వక్రతా మహిమ కలదియు నగు గర్భాంకమునందు (అంతర్నాటిక యందు) సామాజికు లగుచు, వివిధము లగు భావనా భంగులచేత యథార్థ సామాజికులకు ఒకానొక చమత్కార వైచిత్ర్యము కల్పింతురు. ఎట్లనగా— బాలరామాయణ మునందు చతుర్థాంకమున ప్రహస్త భూమికను ధరించిన నటునిచే అనుసరింప బడుచున్న రావణ భూమికను ధరించిన నటుడు:—

"కర్పూర ఇవ దగ్ధోఽపి శక్తిమాన్ యో జనే జనే
నమః శృంగారబీజాయ తస్మై కుసుమధన్వనే" 88
"శ్రవణైః పేయమనేకైర్దృశ్యం దీర్ఘైశ్చ లోచనైర్బహుభిః
భవదర్థమివనిబద్ధం నాట్యం సీతా స్వయంవరణమ్". 89

వి (ఈ నాటకమున చతుర్థాంకములో ఇపుడు లభ్యమగు నాటకమున తృతీయాంకములో) ప్రహస్తుడు నటులను పిలచి లంకేశ్వరుడు సీతాస్వయంవర నాటకమును చూచుటకు సిద్ధముగా నున్నాడు; కావున దానిని ప్రయోగింపుడు అని ఆజ్ఞాపించును. అపుడు నటుడు సూత్రధారవేషముతో వచ్చి 'కర్పూరఇవ' ఇత్యాది నాందీశ్లోకపఠనముతో అంతర్నాటికా ప్రయోగమును ప్రారంభించుచు. ఈ విధముగ ఆ నటులు ప్రయోగించిన అంతర్నాటికకు రావణప్రహస్త వేష ధారు లగు నటులు సామాజికులైనా రని భావము.

"కాల్చివేయబడినను, ఏ మన్మథుడు, కర్పూరము వలె ప్రతిఒక్క జనుని విషయమునందును శక్తి గలవాడో అట్టి శృంగార బీజభూతు డగు మన్మథు నకునమస్కారము."

(ఇది అంతర్నాటికా నాంది).

"అనేకము లైన శ్రవణములచే త్రాగదగినదియు, దీర్ఘము లగు అనేక నేత్రములచే చూడదగినదియు నగు సీతాస్వయంవరనాట్యము మీకొరకై కూర్చ బడినది".

దీని తరువాత కుంతకుడు ఈ ప్రకరణవక్రతాభేదమునకు ఉదాహరణముగ ఉత్తరరామచరిత సప్తమాంకమున 'హా కుమార!' హా లక్ష్మణ!' ఇత్యాది వాక్యములతో ప్రారంభ మగు అంతర్నాటికను చూపినాడు.

ప్రకరణవక్రతకు చెందిన మరి యొక ప్రకారము గూడ విశదీకరించు చున్నాడు:-

కా. ముఖాది సంధి సంధాయి సంవిధానకబంధురమ్
పూర్వోత్తరాది సాంగత్యాత్ (భం) అంగానాం నివివేశనమ్. 14
నత్వమార్గ గ్రిహాగ్రి స్త గ్రిహ కాండ కదర్థితమ్
వక్రితోల్లేఖ లావణ్య ముల్లాసయతి నూతనమ్. 15

"ముఖాదిసంధులను కూర్చెడు పద్ధతిచే సుందరమైన, పూర్వోత్తరాదులకు సంగతి యుండు నట్లు చేయబడిన అంగముల (ప్రకరణముల) సంనివేశము, అమార్గమున గ్రహించుట (కూర్చుట) అనెడు గ్రహాగ్రస్తత్వముచే నిందితము కానిచో, నూతన మగు వక్రతోల్లేఖలావణ్యమును వికసింపచేయును."

(ఈ కారికలపై వృత్తి గ్రంథపాతముచే అస్పష్టముగ నున్నది. ఒకటి రెండు వాక్యములు మాత్రము పఠనానుకూలముగ నున్నవి. 'భంగానామ్' అను దానికి "ప్రకరణానామ్" అని అర్థము చెప్పబడినది. దానిని బట్టి 'అంగానామ్' అను పాఠము యుక్త మని తోచుచున్నదని శ్రీ డే వ్రాసినారు.)

ఎందువలన? పూర్వోత్తరాది సాంగత్యాత్- పూర్వపూర్వాంగములకు ఉత్తరోత్తరాంగములతో ఏ, సాంగత్యం=ఉపజీవ్యోపజీవకభావలక్షణ మగు (ఒక ప్రకరణముపై మరి యొక ప్రకరణము ఆధారపడి యుండుట అనెడు) అతిశయమగు సంబంధము కలదో దానివలన.

దీని తాత్పర్య మేమనగా— ఉత్తరోత్తర ప్రకరణమునకు సరసముగ సంపాదితము లగు సంధులయొక్క సంవిధానముచే సమర్పింపబడుట యనెడు ప్రాణము గల పూర్వపూర్వప్రకరణము, ప్రౌఢిచే ఉద్భూత మగు వక్రతా నిర్మాణము కలదై ఆనందజనకముగ నుండును. (అనగా పూర్వప్రకరణములకు రాబోవు ప్రకరణములతో సరి యగు సంబంధ ముండుటయే ఈ ప్రకరణ వక్రతయొక్క స్వరూపము).

ఎట్లనగా—

పుష్పదూషితమునందలి అతిదారుణ మగు నూతన (విరహ) వేదనచే ఆనందరహితు డగు, సముద్రతీరమును చేరిన సముద్రగుప్తుడు ఎక్కువ ఉత్కంఠను చెందినాడు; అని వర్ణించు మొదటి ప్రకరణము;

ప్రయాణమును మాని, తిరిగివచ్చి, అర్ధరాత్రివేళ లంచ మిచ్చుటచే కువలయుని మాటలాడకుండచేసి, ఆతడు, కుసుమవాటికలో ఎవ్వనికిని తెలియకుండగ తన ప్రియురాలినికలిసెను అని వర్ణించు రెండవ ప్రకరణము.

ఊహించబడిన (నిశ్చితముకాని) శీలభ్రంశమును గూడ నిమిత్తముగ గొని నయదత్తుని కుమార్తెను (సముద్రదత్తుని భార్యను) ఇంటినుండి వెడల కొట్టుట, ఆమె కష్టములు, వాటి (తాత్కాలిక) నివారణము వీటిని వర్ణించు మూడవ ప్రకరణము,

మథురనుండి తిరిగివచ్చిన కువలయుడు చూపిన అంగులీయకముచే తెలుపబడిన విశుద్ధత్వము కలదియు, కఠోరగర్భభారాలసయు నగు కోడలిని నిష్కారణముగ ఇంటినుండి పంపివేయుటచే తనను మహాపాపినిగా భావించిన, ఆమె జాడ తెలియని సార్థవాహసాగరదత్తుని తీర్థయాత్రలకై పంపిన నాల్గవ ప్రకరణము,

వనమధ్యమున......సముద్రదత్తుని కుశలవార్తలను తెలిపెడు పంచమ ప్రకరణము,

విచిత్రరీతిని ఒక గుంపుగ అందరును కలియుటకు ఉపాయమును కల్పించిన ఆరవప్రకరణము— ఈ విధముగ రసనిష్యందతత్పరము లగు ఈ ప్రకరణముల నన్నింటిని కూర్చిన క్రమము అపూర్వ మగు సౌందర్యసంపదను కలిగించుచున్నది.

ఇంకను ఎట్లనగా—

కుమారసంభవమున- పార్వతీదేవియొక్క మొదటి యౌవనము యొక్క వర్ణనము (1వ సర్గ) ఈశ్వరుని సేవయే దుస్తర మగు తారకాసురకృతపరాభవ పారావారమును దాటుటకు కారణ మని బ్రహ్మ చెప్పుట (2వ సర్గ) వసంత సహాయు డగు మన్మథుడు, ఇంద్రుని అభిప్రాయము ప్రకారము, పార్వతీ సౌందర్యబలమును చూచుకొని, బాణములచే కొట్టగా, అతని హరతృతీయలోచ నాగ్ని భస్మము చేసివేయుటచే (3వ సర్గ) దుఃఖావిష్టురా లగు రతి విలపించుట (4వ సర్గ) వికలమనస్క యగు పార్వతి తపము చేయుట (5వ సర్గ), నిరర్గల మగు (తపో) భారముచే సంతసించిన మనస్సు గల ఈశ్వరుడు చిత్ర శిఖండుల (సప్తర్షుల) ద్వారా (పార్వతి కొరకై) హిమవంతుని కోరుట (6వ సర్గ), వివాహము (7వ సర్గ), అను ప్రకరణములు పౌర్వాపర్యముచే నిర్మిత మగు సుందర మగు కూర్పుచే అందమైనవై, సౌందర్య పరాకాష్ఠను అందు కొనుచున్నవి.

ఈ విధముగనే [ఇతర మహాకవి ప్రబంధములలో గూడ ప్రకరణ వక్రతా వైచిత్ర్యమును స్పష్టముగ చూడవలెను.

దీని తరువాత కుంతకుడు ఏతాదృశప్రబంధ వక్రతకు ఉదాహరణ ముగ ప్రతిముఖసంధ్యంగములతో గూడిన వేణీసంహారద్వితీయాంకమును, (యథావేణీసంహారే ప్రతిముఖసంధ్యంగ భాగిని ద్వితీయేంకే) శిశుపాలవధము లోని ఒకప్రకరణమును చూపి ఈ ఘట్టమును ఒక అంతరశ్లోకముతో పూర్తి చేసినాడు. ఆ అంతరశ్లోకము త్రుటితమైనది.

## ప్రబంధ వక్రత

కా. ఇతివృత్తాన్యథా వృత్త రససంపదు పేక్షయా
రసాన్తరేణ రమ్యేణ యత్ర నిర్వహణం భవేత్. 16

తస్యా ఏవ కథామూర్తేరా మూలోన్మీలితశ్రియః
వినేయానంద నిష్పత్త్యై సా ప్రబంధస్య వక్రతా. 17

'(మూల) ఇతివృత్తమునందుమరి యొక విధముగ నున్న రససంపదను ఉపేక్షించి, ఆ కథాస్వరూపమునే మొదటినుండియు వికసింపచేయబడిన శోభ

కలదానినిగా చేసి, సామాజికాదుల కానందము కలుగుటకై ఆ కథను రమ్య మగు మరి యొక రసముతో నిర్వహించుట ప్రబంధవక్రత."

అది, ప్రబన్ధస్య = నాటక కావ్యాది ప్రబంధము యొక్క, వక్రతా = వక్రత్వముగా, అగును అని 'భవతి' అనుదానితో సంబంధము. యత్ర నిర్వహణం భవేత్ = దేనియందు ఉపసంహరణము జరుగునో; రసాన్తరేణ = మరియొక రమ్య మగు రసముతో, సౌందర్య సంపాదనముతో. దేనిచేతః 'ఇతి వృత్తాన్యథా వృత్త రససంపదుపేక్షయా'—ఇతి వృత్తం = ఇతిహాసము (దానియందు), అన్యథా = మరియొక ప్రకారముచే, వృత్తా = నిర్వహింపబడిన, ఏ, రససంపత్ = శృంగారాది రసభంగి కలదో, తదుపేక్షయా = దాని అనాదరము చేత; దానిని విడచి యని తాత్పర్యము. దేనియొక్కః "తస్యా ఏవ కథామూర్తేః" = ఆ కావ్యశరీరము యొక్కయే. ఎట్టిదిః ఆమూలోన్మీలిత శ్రియః—ఆ మూలం = ప్రారంభము నుండియు, వికసింప చేయబడిన, శ్రీః = వాచ్యవాచకముల రచన యందలి సంపద దేనికో అట్టిది. ఎందులకు, వినే యానంద నిష్పత్త్యై = బోధింపదగిన రాజాదులకు ఆనందమును సంపాదించుటకు.

దీని కుదాహరణముగ, కుంతకుడు, ఉత్తర రామచరిత వేణీసంహారము లను చూపియున్నాడు. రామాయణ మహా భారతములలో శాంతరసము ప్రధాన రసమని పూర్వ పండితులు అంగీకరించినారు. ("రామాయణ మహా భారత యోశ్చ శాన్తాంగిత్వం పూర్వసూరిభిరేవ[1] నిరూపితమ్"). కాని మూలేతి

---

1. 'పూర్వసూరిభిః,' అను పదముచే కుంతకుడు ఆనందవర్ధనుని నిర్దేశించు చున్నట్లున్నది. కాని ఆనంద వర్ధనుడు మహాభారతమున శాంతము ప్రధాన మని యంగీకరించినను, రామాయణమున కరుణము ప్రధాన మని చెప్పినాడు. ఉత్తర రామచరితము నందు గూడ కరుణమే ప్రధాన మని యంగీకరించిన పక్షమున ఇది ప్రబంధ వక్రతకు ఉదాహరణముకాజాలదు. కుంతకుడు మరియొకరి నెవరినైన నిర్దేశించి యుండవలెను లేదా అతనికి తెలిసిన ధ్వన్యాలోకమున శాంతమే రామాయణ ప్రధాన రసముగ అంగీకృతమై యుండవలెను. శ్రీ దే వ్రాసిన దానిని బట్టి ఉత్తర రామచరితమున కుంతకుడు శృంగారము నంగీకరించునట్లు కనబడుచున్నది. అయినను రామాయణమున శాంత రసాంగీకారము ఉపలభ్యమాన ధ్వన్యాలోక పాఠ విరుద్ధము.

వృత్తమునందు ప్రధానముగ నున్న శాంత రసమును విడచి ఉత్తర రామ చరితమున (విప్రలంభ శృంగారము?) కరుణము, వెణీసంహారమున వీరరసము నిర్వహింపబడినవి.కావున ఇది ప్రబంధ వక్రత యని కుంతకుని యభిప్రాయము. దీని తరువాతి అంతర శ్లోకము తృటితమై యున్నది.

కా. త్రైలోక్యాభినవోల్లేఖ నాయకోత్కర్ష పోషిణా
ఇతిహాసైక దేశేన ప్రబన్ధస్య సమాపనమ్ 18

తదుత్తర కథావర్తి విరసత్వ జిహాసయా
కుర్వీత యత్ర సుకవిః సా విచిత్రాస్య వక్రతా. 19

"సుకవి, ఎచట, తరువాత వచ్చు కథలోని విరసత్వమును పరిహరింప వలె ననెడు అభిలాషచే, మూడు లోకములలో అసాధారణ మగు స్ఫురణము గల నాయకుని ఉత్కర్షమును పోషించెడు కథాంశముతో ప్రబంధ సమాప్తిని చేయునో అచట గూడ విచిత్ర మగు ప్రబంధ వక్రత యున్నది.''

అది, విచిత్రా = వివిధ భంగులచే ప్రకాశించు, అస్య = ఈ ప్రబంధము యొక్క, వక్రతా = వక్రత్వముగా, అగును అని సంబంధము. 'కుర్వీత యత్ర సుకవిః'-కుర్వీత = చేయునో, యత్ర = దేనియందు, సుకవిః = ఔచిత్య మార్గ భేదములందు నేర్పరి యగు కవి. 'ప్రబన్ధస్య సమాపనమ్'- ప్రబన్ధస్య = మహాకావ్యాదుల, సమాపనమ్ = ఉపసంహారమును, అంద మగు సమాప్తిని అని యర్థము. ఇతిహాసైక దేశేన = ఇతి వృత్తము కయొక్క అవయవము చేత. ఎట్టిది? త్రైలోక్యాభినవోల్లేఖ నాయకోత్కర్ష పోషిణా = జగత్తులో అసాధారణ మగు ప్రకాశ గల నాయకుని ఉత్కర్షను ప్రకాశింప చేయునది. ఎందులకు? తదుత్తర కథావర్తి విరసత్వ జిహాసయా'-దానికంటె తరువాత నున్న ఏ కథ గలదో, తద్వర్తి = దాని అంతర్గత మగు, ఏ, విరసత్వం = వైరస్యము అనగా అసౌందర్యము కలదో, దానియొక్క, జిహాసయా = పరిహారమునందు ఇచ్ఛ చేత.

దీని తాత్పర్య మేమనగా—ఒకానొక మహా కవి ఇతిహాసమున చెప్పబడిన కథనంతను ప్రారంభించినను, రాబోవు గ్రంథ భాగము నందు సంభావిత మగు నీరసత్వమును హరింపవలె ననెడు అభిలాషచే, త్రైలోక్యము నందును

చమత్కార కారణమగు, సాటి లేని నాయక కీర్త్యుత్కర్షమునకు ఆధిక్యమును కూర్చు ఇతిహాస కథాంశముతోడనే ప్రబంధమును పూర్తి చేసి దానికి సౌందర్య నిధాన మగు వక్రత్వమును సంపాదించుచుండును.

ఏట్లనగా కిరాతార్జునీయ మహా కావ్యమున—

"ద్విషాం విఘాతాయ విధాతుమిచ్ఛతో
రహస్యనుజ్ఞా మధిగమ్య భూభృతః" (I–8)

"రిపుతిమిరముదస్యో దీయమానం దినాదౌ
దినకృతమివ లక్ష్మీ స్త్వాం సమభ్యేతు భూయః" (I-46)

"ఏ తే దురాపం సమవాప్య వీర్య-
మున్మూలితారః కపికేతనేన" (III-22)

"శత్రువుల వినాశము కొరకు ఉపాయమును చేయదలచుచున్న రాజు యొక్క అనుజ్ఞను, రహస్యమునందు, పొంది-(ఆ గూఢచారి యుధిష్ఠిరునితో పల్కెను)".

"శత్రువు లనెడు అంధకారమును తొలగించుకొని ఉదయించుచున్న నిన్ను, ప్రాతః కాలమునందు సూర్యుని వలె, లక్ష్మి మరల చేరుగాక.'' (ఇవి యుధిష్ఠిరునితో ద్రౌపది అన్న మాటలు).

''పొంద శక్యము గాని పరాక్రమమును పొంది, అర్జునునిచే వీరు (భీష్మాదులు) ఉన్మూలింపబడగలరు." (అర్జునునకు మంత్రోపదేశము చేయ వచ్చిన వ్యాసుడు యుధిష్ఠిరునితో అన్న వాక్య మిది)—

ఇత్యాదికముచే దుర్యోధనుని మరణముతో ముగియనున్నదియు, ధర్మ రాజుకు అభ్యుదయమును కలిగించు నదియుఅగు కథనంతను ఉపక్రమించి కవిచే కూర్చబడుట వలన....(అది) ఐశ్వర్యమును కోల్పోయినట్టియు, ద్రుపదాత్మజ చేసిన అత్యధిక మగు అధిక్షేపణచే అత్యధికముగ ఉద్దీపిత మగు కోపము కలిగినట్టియు, కృష్ణ ద్వైపాయనునిచే ఉపదేశింపబడిన మంత్ర విద్యా సంపద కలిగినట్టియు, పాశుపతము మొదలగు దివ్యాస్త్రముల ప్రాప్తికై తపస్సు చేయుచున్నట్టియు, గాండీవమాత్ర సహాయుడైన అర్జునునకు, మధ్య, కిరాత

రాజుతో యుద్ధము సంభవించుట వలన, వికసింపచేయబడిన సాటిలేని విక్రమ విశేషము గల ఒకానొక అభిప్రాయమును ప్రకాశింప చేయుచున్నది.

వి. అనగా ఇచట భారవి రసవద్ఘట్టమును మాత్రమే గ్రహించి, అర్జునుడు పాశుపతాస్త్రమును సంపాదించి తిరిగి వచ్చుట, సోదరులతో కలియుట, తరువాత దుర్యోధనాదులతో రాయభారము మొదలగు కార్యకలాపము ఇది యంతయు అంత రసవంతము కాకుండుటచే దానిని విడచి కావ్యమును పూర్వోక్త కథాంశముతో మాత్రమే ముగించెను గాన ఈ ప్రకరణ వక్రతకు ఉదాహరణ మని కుంతకుని యభిప్రాయము.

దీని తరువాత నున్న వృత్తియు, అంతరశ్లోకమును గ్రంథపాతమున తృటితము లైనవి.

మరల దీనికి మరియొక భేదమును నిరూపించుచున్నాడు:—

కా. ప్రధాన వస్తు సంబంధ తిరోధాన విధాయినా
కార్యాన్త రాన్తరాయేణ విచ్ఛిన్నవిరసా కథా 20
తత్రైవ తస్య నిష్పత్తేః నిర్నిబన్ధ రసోజ్జ్వలామ్
ప్రబన్ధస్యాను బధ్నాతి నవాం కామపి వక్రతామ్ 21

"ప్రధాన కథా వస్తు సంబంధమును కప్పిపుచ్చెడు కార్యాంతరరూప మగు అంతరాయముచే విచ్ఛిన్న మైనదియు విరసమైనదియు నగు కథ, అచటనే (కార్యాంతరమునందే) అది (ప్రధాన వస్తువు) నిష్పన్న మగుటచే, అడ్డులేని రసముచేత ఉజ్జ్వల మగు ఒకానొక నూతనమగు వక్రతను ప్రబంధము నకు కల్పించును."

ప్రబంధస్య = మహా కావ్యాదికమునకు, అను బధ్నాతి = దృఢముగ నుండునట్లు చేయును. నవాం = అపూర్వ శోభ గల, కామపి = సహృదయ వేద్య మగు; అంతియే కాని దాని చమత్కారము అభిధాగోచరము కాదు. అది ఏది? 'కార్యాన్తరాన్తరాయేణ విచ్ఛిన్నవిరసా కథా''—కార్యాన్తరాన్త రాయేణ = మరియొక కార్య మనెడు విఘ్నముచేత, విచ్ఛిన్నవిరసా = విచ్ఛిన్న మైనదియు విరస మైనదియు నగు; అనగా విచ్ఛిద్యమాన మగుటచే మనోహర ముగ లేనిదని యర్థము. ఎట్టిదానిచేత? (ఎట్టి అంతరాయముచేత?), 'ప్రధాన

వస్తు సంబంధతిరోధాన విధాయినా'-ఆధికారిక మగు ఫలము యొక్క సిద్ధికి సాధన మగు ఉపాయమునకు తిరోధానమును కల్గించునది. ఎందువలన? తత్రైవ తస్య నిష్పత్తేః-తత్రైవ = కార్యాంతరానుష్ఠానమునందే: ఈ ఆధికారిక ఫలము యొక్క, నిష్పత్తేః = సిద్ధివలన. కావుననే "నిర్నిబన్ధ రసోజ్జ్వలామ్" = నిర్విఘ్నముగ ఉప్పొంగు అంగిరసము యొక్క కాంతిచే ప్రకాశించునది.

దీని తాత్పర్య మేమనగా-ఏ ఆధికారిక కథ విరుద్ధ మగు కార్యాంతరము యొక్క వ్యవధానము వలన హటాత్తుగా తెగిపోయినదై, అవకాము లేకపోయి నను వికసింప చేయబడుచుండునో అది అప్రస్తుత వ్యాపారము చేతనే ప్రస్తావింపబడిన (కూర్పబడిన) నిష్పన్న మగు, పద్మము వలె శుభ్ర మగు, (సుందర మగు) రసముతో నిండినదై, ప్రబంధమునకు సౌందర్యముచే మనోహర మగు వక్రత్వమును కూర్చును.

దీనికి కుంతకుడు శిశుపాల వధమును ఉదాహరణముగ ఇచ్చెను.

వి.శిశుపాల వధమున ప్రధాన కథ శిశుపాలుని సంహారము. కావుననే కావ్య ప్రారంభనమున నారదుడు శ్రీ కృష్ణుని వద్దకు వచ్చి దేవేంద్రుని ప్రార్థనగా శిశుపాలుని సంహరింపు మని కోరుట, తద్విషయమై శ్రీకృష్ణుడు ఉద్ధవబల రాములతో మంతనము సలుపుట మొదలగు విషయములు కూర్పబడినవి. కాని ఇంతలో రాజసూయ వృత్తాంతమును ప్రవేశ పెట్టుటతో అందులకై శ్రీకృష్ణుడు సపరివారముగా ప్రయాణ మగుట, మొదలగు కార్యాంతరము లెన్నియో వచ్చుటచే ప్రధాన విషయము (శిశుపాల సంహారము) మరుగు పడిపోయినది. కాని కార్యాంతర మగు రాజ సూయముననే, చివరకు, ప్రధాన మగు శిశుపాల వధము కూడ జరిగినది. ఈ విధముగ వర్ణించుటచే ఇది ప్రబంధ వక్రత కుదాహరణ మని కుంతకుని యభిప్రాయమై యుండును.

కా. తత్రైక ఫల సంపత్తి సముద్యుక్తోఽపి నాయకః
ఫలాన్తరేష్వనన్తేషు తత్తుల్య ప్రతిపత్తిషు 22
ధత్తే నిమిత్తతాం స్ఫారయశః సంభార భాజనమ్
స్వమాహాత్మ్య చమత్కారాత్ సాపరాచాస్య వక్రతా. 23

"ఎచట ఒక ఫలమును మాత్రము కూర్చుటకై ఉద్యుక్తు డగు నాయకుడు దానితో సమానము లగు అనంతము లగు ఇతర ఫలములకు గూడ నిమిత్తముగ అగుచు, తన మాహాత్మ్యమునందలి చమత్కారముచే మహాకీర్తి సంభారమునకు పాత్రుడు అగునో అది గూడ మరి యొక ప్రబంధ వక్రత."

ఈ కారికలపై వృత్తి త్రుటిత మైనది.

అది, అపరాపి = మరియొక, వెనుక చెప్పినది కాదు, అస్య = రూపకాది ప్రబంధము యొక్క, వక్రతా = వక్రత్వము 'అగును' అని సంబంధము. 'యత్రైక ఫల సంపత్తి సముద్యుక్తోఽపి నాయకః'—యత్ర = దేనియందు, ఏకఫల సంపత్తి సముద్యుక్తోఽపి = మరియొక అభిమత వస్తువును సాధించుట గొరకై ఉద్యుక్తు డైనను నాయకుడు, 'ఫలాన్తరేష్వనన్తేషు తత్తుల్య ప్రతిపత్తిషు ధత్తే నిమిత్తతామ్'-పలాన్తరేష్వపి = సాధింపదగిన వస్తువులయందు, అనన్తేషు = లెక్కపెట్టబడని, తత్తుల్య ప్రతిపత్తిషు = అధికారిక మగు ఫలముతో సమాన మగు ఉపపత్తి గల, అనగా ప్రస్తుతార్థ సిద్ధివలననే సిద్ధించునవి అని యర్థము.

మిగిలిన వృత్తి త్రుటిత మైనది. దీనికి ఉదాహరణముగా నాగానందము చూపబడినది. దీనికి సంబంధించిన రెండు మూడు పంక్తులు, లిఖితప్రతిలో, పొరబాటుచే 26వ కారిక చివర చేర్చబడినవి. ఆ పంక్తులకు ఇది తగిన స్థానము గాన అవి ఇచట చూపబడుచున్నవి:-

ఎట్లనగా—నాగానందమున. అచట నివారింపరాని వైరము కలవాడైనను గురుత్మంతు డనెడు యముని నుండి ఒక... శంఖచూడుని తన దేహమును సమర్పించి రక్షించిన, సకల కారుణిక చూడామణి యగు జీమూతవాహనుడు కేవలము అతని కులమునే కాదు...

వి॥ శంఖచూడు నొక్కనినే రక్షించుటకై ప్రయత్నించిన జీమూతవాహనుడు, ఆ ఒక్క ప్రయత్నము చేతనే, అతని నొక్కనిని మాత్రమే కాక మృతులును, మరణింపనున్న వారును అగు ఇతర నాగులను, వారి కుటుంబములను గూడ రక్షించి అనంత కీర్తిని గడించెను గాన ఇది ప్రబంధ వక్రతకు దాహరణ మని కుంతకుని అభిప్రాయమై యుండును.

కా. ఆస్తాం వస్తుషు వైదగ్ధ్యం కావ్యే కామపి వక్రతామ్
ప్రధాన సంవిధానాంక నామ్నాపి కురుతే కవిః 24

'ఆస్తాం వస్తుషు వైదగ్ధ్యమ్'- ఆస్తామ్=దూరముగనే ఉండుగాక. వస్తుషు=అభిధేయములందు, అనగా ప్రతిపాద్యములగు ప్రకరణములయందు, వైదగ్ధ్యం=విచ్ఛిత్తి, "కావ్యే కామపి వక్రతాం కురుతే కవిః" – కావ్యే=నాటకమునందును మహాకావ్యాదులందును, ఒకానొక వక్రతను కురుతే=చేయును. కవిః=అత్యద్భుత మగు ప్రతిభాప్రసారముయొక్క ప్రకాశగల కవి. దేని చేతః సంవిధానాంకనామ్నాపి=ప్రధాన ప్రబంధమునకు ప్రాణమువంటి దగు, ఏ, సంవిధానం=కథాయోజనము కలదో, అది అంకః=చిహ్నము, ఉపలక్షణము (గుర్తు) దేనికో అట్టి పేరు...... ......"అపి" శబ్దము ఆశ్చర్యమును సూచించును.

ఉదాహరణ మెట్లనగా-

(ప్రబంధమునందలి ప్రధానవస్తువును సూచించెడు) అభిజ్ఞానశాకుంతలము, ముద్రారాక్షసము, ప్రతిమానిరుద్ధము, మాయాపుష్పకము, కృత్యారావణము, ఛలితరామము, పుష్పదూషికము మొదలగు పేర్లు అంతియే కాని హయగ్రీవవధము, శిశుపాలవధము, పాండవాభ్యుదయము, రామానందము, రామచరితము వంటి పేర్లు కాదు. (ఇట్టి పేర్లలో ఆ వక్రతలేదు)

ప్రబన్ధ వక్రతకు చెందిన మరి యొక ప్రకారమును గూడ చెప్పుచున్నాడు:-

కా. అప్యేకకథ్యయా బద్ధాః కావ్యబన్ధాః కవీశ్వరైః
పుష్ణన్త్యనర్ఘామన్యోన్య వైలక్షణ్యేన వక్రతామ్. 25

"ఒకే కథను ఆధారముగా తీసికొని కవీశ్వరులచే కూర్పబడిన వైనను, కావ్యబంధములు, అన్యోన్యవైలక్షణ్యముచే అమూల్య మగు వక్రతను పోషించును.'

పుష్ణన్తి=ఉల్లసింపచేయును. అనర్ఘాం=ఇంతటి దని విలువ కట్టరానిది. అన్యోన్య వైలక్షణ్యేన=పరస్పరము వైసాదృశ్యముచేత. వక్రతాం=వక్రత్వమును, అవి ఏవిః కావ్యబన్ధాః=రూపకాదులు. ఎట్టివిః అప్యేకకథ్యయా

బద్ధాః = ఒక......కూర్చబడినవి. ఎవరిచేత? కవీశ్వరులచేత. ఒకచోట విస్తీర్ణ మగు కథావస్తువును సంక్షిప్తము చేయువారును, మరియొక చోట సంక్షిప్త మగు దానిని విస్తరింపచేయువారును అగు కవులచేత. అది ఎట్లున్నను, దానికి విచిత్రము లగు వాచ్యవాచకాలంకారములను కూర్చుటచే నూతనత్వమును కల్పించువారు అని యర్థము.

దీని తాత్పర్య మేమనగా— అంకురించుచున్న సౌందర్యము గల ఒకే కథను నిర్వహించు అనేక కవికుంజరులచే కూర్చబడిన అనేక ప్రబంధములు కొంచెమైనను పరస్పర సామ్యమును పొందని, సహృదయహృదయాహ్లాదక మగు ఒకానొక వక్రతను కలిగి యున్నవి. ఎట్లనగా- రామాభ్యుదయము, ఉదాత్తరాఘవము, వీరచరితము, బాలరామాయణము, కృత్యారావణము, మాయాపుష్పకము మొదలగు (ఒకే రామకథను ఆశ్రయించి యున్న ప్రబంధములు). ఆ శేషప్రబంధములు నిరర్గల మగు రసప్రవాహము గర్భమునందు గల ఆ (రామ) కథామార్గముననే, ప్రతిపదమునందును, ప్రతి వాక్యమునందును ప్రకాశించు నూతన భంగిమలతో నిండినవై, సౌందర్యముతో ప్రకాశించుచు, నాయకగుణోత్కర్షమును క్రొత్త క్రొత్తగ వికసింపచేయుచు, అనేక పర్యాయములు ఆస్వాదింపబడుచున్నను ఆ సహృదయులకు ఆనందాతిశయమును కలిగించుచుండును. ఈ విధముగ ఇతరములగు ఉదాహరణములను గూడ ఊహించుకొనవలెను

శ్లో. కథోన్మేషే సమానేఽపి వపుషీవ నిజైర్గుణైః
ప్రబన్ధాః ప్రాణిన ఇవ ప్రభాసన్తే పృథక్ పృథక్"

"శరీరము వలె కథావస్తువు తుల్యమే యైనను, ప్రబంధములు, ప్రాణులు వలె, తమ తమ గుణములచే వేరువేరుగ భాసించును."

ఇది అంతరశ్లోకము.

కా. నూతనోపాయ నిష్పన్న నయవర్త్మోపదేశినామ్
మహాకవిప్రబన్ధానాం సర్వేషామస్తి వక్రతా. 26

'నూతనోపాయములచే సాధ్య మగు నీతిమార్గమును ఉపదేశించెడు మహాకవి ప్రబంధము లన్నింటికిని వక్రత యున్నది."

మహాకవి ప్రబన్ధానామ్ = నవనిర్మాణమునందు నేర్పుచే సాటి లేని కవి శిల్పుల ప్రబంధములకు, సర్వేషాం = అన్నింటికిని, ఉన్నది. వక్రతా = వక్రత్వమువలన లభించు శోభ. ఎట్టివి? 'నూతననోపాయ నిష్పన్ననయవర్త్మోపదేశినామ్'— నూతనాః = నూతనములైన, ఉపాయాః = సామాద్యుపయోగ విధానములు; వాటియందు ప్రవీణులైన వారికి తెలియు ఏ ఉపాయములు గలవో వాటిచే నిష్పన్నం— సిద్ధ మగు,వి, నయవర్త్మ = నీతిమార్గ మున్నదో, దానిని, ఏవి, ఉపదిశన్తి = ఉపదేశించునో అట్టివి.

దీని తాత్పర్య మేమనగా— సకలము లగు ఈ సత్కవిప్రబంధముల యందును, నూతన భంగులను ప్రవేశ పెట్టుటచే సుందర మగు ఒకానొక నీతి ఫలము ప్రతిపాద్యుల (వినేయు లగు రాజపుత్రాదుల) కు ఉపదేశమును ఇచ్చుట ద్వారా ఉపపన్నమై (యుక్తమైనదై) కారణముగ (ప్రబంధ నిర్మాణ కారణముగ) కానవచ్చుచున్నది. ఎట్లనగా— ముద్రారాక్షసమునందు. దాని యందు గొప్ప ప్రజ్ఞాప్రభావముచే ప్రకటిత మగు విచిత్రనీతి వ్యాపారములు స్పష్టముగ చూపబడుచునే యున్నవి తాపసవత్సరాజము కూడ అయాస్థానము లందు (నీతి ఫలప్రదర్శనముగ) వ్యాఖ్యానింపబడినది. ఈ విధముగనే ఇతరము ను గూడ ఊహించుకొనవలెను.

శ్లో. 'వక్రతోల్లేఖ వైకల్య.... లోక్యతే
ప్రబన్ధేషు కవీన్ద్రాణాం కీర్తికన్దేషు కిం పున

ఈ అంతరశ్లోకము త్రుటితముగ నుండుటచే అర్థము అస్పష్టముగ నున్నది.

ఈ అంతరశ్లోకముతో లిఖితప్రతి సమాప్తినందినది దీని చివర 'అసమాప్తోయం గ్రంథః" అని లిఖిత ప్రతిని వ్రాసిన వారు వ్రాసిరి. కాని కుంతకుడు ప్రతిపాదింపవలసిన చివరి విషయము ప్రబంధవక్రతయే గావున ఈ ఉన్మేషమున ఇక రెండు మూడు కారికలు వాని వృత్తి తప్ప అధిక మగు భాగముండుటకు అవకాశము లేదనియు, ఈ ఉన్మేషము తోడనే గ్రంథము కూడ సమాప్తి పొంది యుండవలె ననియు శ్రీదే గారు వ్రాసియున్నారు.

ఇతి శ్రీమత్ పుల్లెలోపాహ్వ శ్రీసత్యవతీ-
శ్రీ సత్యనారాయణశాస్త్రి తనూజ
శ్రీ రామచంద్రరచితా వక్రోక్తి జీవితాం
ధ్రవ్యాఖ్యా సంపూర్ణా.

వక్రోక్తిజీవితస్యేయ మాన్ధ్రీవిద్యార్థినాం ముదే
కృతా శ్రీరామచంద్రేణ వ్యాఖ్యాన్ధ్రీయం పితురాశిషా

యత్కృపాలేశ సంసర్గా ద్వ్యాఖ్యేయం రచితామయా
తస్యైవ జానకీజానేః పదయోరియ మర్ప్యతే

సీతాజానిపదాంభోజాద్గృహీతైవ తత్సుమం మయా
శ్రీమదల్లాడి కుప్పుస్వామ్యార్యాయాద్య సమర్ప్యతే.

శ్రీః శ్రీః శ్రీః

# కారికా సూచి

## ఉదాహృత శ్లోకాది సూచి

39941